# బైబులుభాష్య సంపుటావళి

## ఐదవ సంపుటం

# తండ్రీ, క్రీస్తూ



# బైబులు భాష్య సంపుటావళి

ఐదవ సంపుటం

# తండ్రీ, క్రీస్తూ

ఫాదర్ పి. జోజయ్య, S.J.
ఆంధ్ర లొయోలా కాలేజి
విజయవాడ - 520 008

# విషయసూచిక

# మనవి మాట

బైబులు భాష్యం సంచికలను 1972లో ప్రారంభించాం. ఇప్పటికి 157 సంచికలు ముగిసాయి. వీటినే యిప్పుడు పది బైబులుభాష్యం సంపుటాలనుగా ముద్రించాం. ఈ సంచికల్లో ఓ 60 మాత్రం ఇదివరకే "బైబులు గ్రంథమాల" అనే పేరుతో పుస్తక రూపాన్ని సంతరించుకొని పలు ముద్రణలు పొందాయి.

ప్రస్తుతం ఈ 157 సంచికలను, వీటిల్లో వచ్చే అంశాలనుబట్టి, ఓ క్రమపద్ధతిలో అమర్చాం. ఈ సంపుటాల్లో వుంది ప్రధానంగా బైబులు వివరణలు, దైవశాస్త్ర విషయాలు, ప్రార్థనాంశాలు. మన క్రైస్తవ భక్తివిశ్వాసాలను బలపరచేది ముఖ్యంగా ఈ యంశాలే. ఎందరో వేదపండితుల భావాలు ఈ పుస్తకాల్లోకి వచ్చాయి. ఆ మహానుభావులందరికీ వందనాలు.

ఈ పుస్తకాలు మన క్రైస్తవమత సత్యాలను లోతుగా అర్థంచేసికోవడానికీ, ప్రార్థన జేసికోవడానికీ, ఇతరులకు బోధించడానికీ గూడ ఎంతో వుపయోగపడతాయి. కనుక మన గురువులు, మఠకన్యలు, ఉపదేశులు, గృహస్థులు మొదలైనవాళ్లు ఎవరైనాసరే వీటిని వినియోగించుకొని ఆధ్యాత్మిక లాభాన్ని పొందవచ్చు.

చాల సంవత్సరాల పొడుగున కొనసాగించిన రచనలు కనుక ఈ గ్రంథాల్లో పునరుక్తులు అనివార్యమయ్యాయి. పాఠకులు మన్నింతురుగాక. మొదటవ్రాసిన సంచికలకు తర్వాత వ్రాసిన వాటికీ శైలిలోకూడ భేదం వుంది.

మన క్యాతలిక్ సమాజంలో పఠనాభ్యాసం లేదు. ఇది మనం అవశ్యం సవరించు కోవలసిన ప్రధానలోపాల్లో వొకటి. ఇందుకే ఈ గ్రంథాలను చౌకధరకే విక్రయిస్తున్నాం. ఈ పుస్తకాలు మన సాహిత్యరాశిని పెంచి మన ప్రజల్లో పఠనాభిరుచిని ప్రోదిచేస్తాయని ఆశిస్తున్నాం. అసలు తెలుగులో మనకున్న క్యాతలిక్ సాహిత్యమే చాల తక్కువ.

ఫాదర్ టి.మర్రెడ్డిగారి ఆర్థిక సహాయంలేందే ఈ సంపుటాలు ఇప్పుడు, ఈ రూపంలో వెలుగు చూచేవి కావు. ప్రభువు ఆ మహనీయుని దీవించి ఆయన కృషిని సఫలీకృతం జేయునుగాక. విజయవాడ మేత్రాసనం తరపుననే ఈ పుస్తకాలను ప్రచురిస్తున్నాం.

ఈ సంపుటాల్లో రచయిత 31 ఏండ్ల పొడుగున కొనసాగించిన అవిరళకృషి దాగివుంది. కరుణామయుడైన ప్రభువు యెరూషలేం దేవాలయంలోని సాయంకాలపు ధాన్యబలినివలె ఈ సాహిత్యబలిని గూడ నెనరుతో స్వీకరించునుగాక.

ఈ పుస్తకాలకు పరిచయవాక్యాలు వ్రాసియిచ్చిన విజయవాడ పీఠాధిపతులు, పూజ్యులు, మహోఘనత వహించిన డాక్టరు ఎం.ప్రకాష్‌గారికి నమస్సుమాంజలులు. వీటిని సర్వాంగసుందరంగా ముద్రించిన శ్రీ పి.సాంబిరెడ్డిగారికి వారి సిబ్బందికి, ఓపికతో ప్రూఫులు దిద్దిన శ్రీ వి. గోపాలరెడ్డిగారికి మా కృతజ్ఞతలు.

- గ్రంథకర్త

# ముందుమాట

ఫా. జోజయ్య గారు తమ రచనల ద్వారా ఆంధ్ర శ్రీసభకు సుపరిచితులు. వారి అవిరళకృషి, సేవాతత్పరత, తెలుగులో చక్కని సాహిత్యాన్ని రాయాలనే తపన, దానికితగిన అంకితభావం వేనోళ్ల కొనియాడదగింది. వీరు రచించిన చిన్నచిన్న పుస్తకాలను సంకలనం చేయడం అనే ప్రక్రియ వీరి జీవితకాలంలోనే జరగకపోయినట్లైతే, ఈ గొప్ప సాహిత్యాన్ని కోల్పోయే అపాయం వుండేది. అరుదుగా పాఠకులకు తెలుగులో లభ్యమయ్యే బైబులును మరియు కతోలిక వేదాంతమునకు సంబంధించిన అంశాలను క్షుణ్ణంగా పరిశోధన జరిపి చక్కని భాషలో ఆంధ్ర కతోలిక సంఘానికి గత ముప్పది సంవత్సరాలపైగా అందించారు ఫా. జోజయ్య గారు.

తెలుగు కతోలిక శ్రీసభకు, బైబులును క్రైస్తవ సిద్ధాంతాలను అర్థం చేసుకోవాలన్న కోరిక గల క్రైస్తవేతరులకు ఫా. జోజయ్య గారు గొప్ప వరమని నేను భావిస్తున్నాను. వీరి రచనలు సత్యాన్ని అన్వేషించడం యెడల ఆయనకున్న పట్టుదలకు, అందరికి జ్ఞానోదయాన్ని కలిగించాలన్న తపనకు, మరియు ఆంధ్ర శ్రీసభ పురోభివృద్ధి యెడల ఆయనకున్న తృష్ణకు నిదర్శనాలు. సరళమైన స్వచ్ఛమైన, సామాన్య ప్రజలకు అర్థమయ్యే తెలుగుభాషలో రచింపబడిన ఈ పుస్తకాలను చదివి, ఆధ్యాత్మిక జీవిత వికాసానికి క్రైస్తవ సిద్ధాంతాలను లోతుగా అర్థం చేసికోవటానికి వీటిని వినియోగించుకోవాలని కోరుతున్నాను. ఎంతో నేర్పుతో, క్రమపద్ధతిలో విభజింపబడిన రచనలను "బైబులు భాష్య సంపుటావళి" అన్న పేరుతో పదిసంపుటాలుగా అచ్చు వేస్తున్నందుకు అభినందిస్తున్నాను. ఈ గ్రంథాల ప్రచురణ బాధ్యతను తన భుజాలపై వేసికొని, సమయాన్ని వెచ్చించి, వలసిన ఆర్థిక వనరులను చేకూర్చినందుకు, ఆంధ్ర శ్రీసభకు ఉపయోగకరమైన ఈ సాహిత్యాన్ని ప్రజలకు అందించాలనే మంచికార్యాన్ని చేపట్టి విజయంతంగా పూర్తి చేసినందుకు ఫా. మర్రెడ్డి గారిని నా హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఆణిముత్యాల్లాంటి ఈ రచనలను ఆధ్యాత్మిక సంపత్తిగా అందరూ గుర్తించాలని, కతోలిక క్రైస్తవ సమాజమంతా ముఖ్యంగా మేత్రాణులు, గురువులు, మఠవాసులు అందరు ఈ కృషిని అభినందించాలని, ఆదరించాలని నా ఆకాంక్ష. మన ప్రజల స్తోమతకు తగినట్లుగా వీటి వెల కూడ చాల తగ్గించడమైనది. కావున ప్రతి ఒక్కరు, గ్రంథాలయాలు, ఆశ్రమాలు, మఠాలు, కతోలిక కేంద్రాలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని నా మనవి.

ఫా. జోజయ్య గారు చేసిన ఈ కృషిని మరోసారి అభినందిస్తూ, వారు ఇంకా ఆంధ్ర శ్రీసభకు తమ అమూల్యమైన సేవలను రానున్న కాలంలో అందించాలని మనసారా కోరుకుంటూ, ప్రార్థిస్తూ...

ఇట్లు

మీ జ్ఞానతండ్రి

**+ మల్లవరపు ప్రకాష్**

విజయవాడ పీఠాధిపతులు

# 1. భగవంతునికి ఐదు ఉపమానాలు

బైబులు భాష్యం - 9

## మనవి మాట

యావే మోషే ముఖాన సీనాయి చెంత యూదులతో ఒడంబడిక చేసికొన్నాడు ఈ యొడంబడిక ప్రకారం అతడు వాళ్ల దేవుడయ్యాడు. వాళ్ళు అతని ప్రజలయ్యారు. అతనికీ వాళ్లకూ గాఢ సంబంధం ఏర్పడింది. కనుక ఒడంబడిక పూర్వవేదానికి పునాది.

ఈ యొడంబడిక వలన భగవంతునికీ ప్రజలకూ ఏర్పడిన గాఢసంబంధాన్ని కొన్ని ఉపమానాలతో వర్ణించారు పూర్వవేద రచయితలు.

1) ఆ దేవుడు కాపరిలాంటివాడు. ఆ ప్రజలు గొఱ్ఱెల మందలాంటివాళ్లు. 2) అతడు వరుని లాంటివాడు. ఆ ప్రజలు వధువు లాంటివాళ్లు. 3) అతడు తోటమాలి లాంటివాడు, యిస్రాయేలు తోట లాంటివాళ్లు. 4. యావే తండ్రి లాంటివాడు, యిస్రాయేలు కుమారుని వంటివాడు. 5) యావేభవన నిర్మాత, యిస్రాయేలు అతడు నిర్మించిన భవనం.

ఇక, పూర్వ వేదానికి పునాది సీనాయి నిబంధనమైతే, నూత్నవేదానికి పునాది సిలువ నిబంధనం. ఈ సిలువ నిబంధనం ద్వారా క్రీస్తుకూ నూత్న వేద ప్రజలకూ గాఢ సంబంధం ఏర్పడుతుంది. ఈ సంబంధాన్ని సూచించడానికి నూత్న వేద రచయితలు కూడ పై పూర్వవేద ఉపమానాలనే ఎన్నుకున్నారు. కనుక పై ఐదుపమానాలు బైబులు భగవంతుణ్ణి వర్ణిస్తాయి. ఆ భగవంతునికి బైబులు వాడిన ఉపమానాలు ఇంకా కొన్ని వున్నాయి గాని, ఈ యైదు మాత్రం ప్రధానమైనవి.

ప్రస్తుత సంచికలో ఈ యైదుపమానాలు చెప్పాం. వీని సహాయంతో బైబులు భగవంతుడు ఎలాంటివాడో వివరించి చూపాం. పాఠకులు ఈ యుపమానాలను చక్కగా చదివి భక్తితో మననం జేసికొనడం ద్వారా యిస్రాయేలు దేవుడైన యావేతో, క్రైస్తవుల దేవుడైన క్రీస్తుతో వ్యక్తిగతమైన అనుభవం పెంపొందించుకోవచ్చు.

## 1. కాపరి - మంద

1. యిస్రాయేలుప్రజలు భగవంతునికి వాడిన ఉపమానాలన్నింటిల్లోను "కాపరి" అనే ఉపమానం అతిప్రాచీనమైంది. కాపరి మందకు నాయకుడు, స్నేహితుడు. ఆతడు మందనుగూర్చి ఏలా జాగ్రత్త పడతాడో ప్రభువూ తన ప్రజలను గూర్చి ఆలా జాగ్రత్త పడతాడు. యిస్రాయేలు ప్రజకు సమీపజనులైన ఈజిప్టు, బాబిలోను ప్రజల్లోకూడ ఈ భావం బహుళ ప్రాచరంలో వుండేది. ఈదేశాల రాజులు కాపరులుగా భావింపబడేవాళ్లు. దేవతలే వీళ్లను ప్రజలమీద కాపరులుగా నియమించారు అనుకునేవాళ్లు. క్రీస్తుపూర్వము

19వ శతాబ్దిలో జీవించిన “ఇప్పువేర్” అనే యాజిప్టురాజును గూర్చి ఓ శాసనం “ఈరాజు జనులకు కాపరి. ఇతడు కల్లకపటాలు లేనివాడు. ఇతని మందలు కొద్దిపాటివి. ఐనా దీనమంతా ఇతడు వాటికోసం జాగ్రత్తపడుతుండేవాడు” అని వాకొంటుంది. ఇలాంటివాతావరణానికి చెందిన యిస్రాయేలు ప్రజలుకూడ తమ దేవుణ్ణి కాపరిగా భావించడంలో వింతేలేదుకదా!

ప్రాచీన హీబ్రూప్రజలు గొర్రెల కాపరులు. బహు ప్రాచీన కాలంలోనే ఆ జంతువును మచ్చిక చేసారు. వాళ్ళు స్థిర నివాసమంటూ లేకుండా ఎప్పుడూ అటూయిటూ తిరుగాడుతుండేవాళ్ళు. గొర్రెలమందలనుకూడ తమతో తోలుకొని పోతుండేవాళ్ళు. హేబెలు గొర్రెలకాపరి – ఆది 4,2. యోసేపు సోదరులు ఫరోతో “దొరా! మా పితామహుల్లాగే మేమూ వృత్తిచే గొర్రెల కాపరులం” అంటారు – ఆది 47,3. హీబ్రూప్రజలకు గొర్రె బహువిధాలుగా ఉపయోగపడింది. వాళ్ళు దానిమాంసాన్ని భుజించేవాళ్ళు. పాలుత్రాగేవాళ్ళు. ఉన్నిని బుట్టలకు గుడారాలకు వాడుకునేవాళ్ళు. వ్యాపారంలో గొర్రెమారకపు ధనంగా ఉపయోగపడేది. ఎడారి కాలంలోనైతేనేమి, దేవాలయకాలంలోనైతేనేమి గొర్రెపోతు ప్రభువునకు సమర్పింపబడే బలిపశువుకూడ. పైగా గొర్రె సాధుజంతువు. కల్లకపటం లేకుండ విశ్వాసంతో, స్నేహభావంతో కాపరివెంట నడచిపోతుంటుంది. అతడు తన్ను కాపాడితేనేగాని బ్రతకలేని బలహీనపుజంతువు. ఈ కారణం చేత గొర్రె యిస్రాయేలు ప్రజలకు అనురాగయోగ్యమైన జంతువయింది. కావున ప్రజలు తమ్ము గొర్రెలమందతో బోల్చుకున్నారు. తమ దేవుడైన యావేను కాపరితో బోల్చుకున్నారు.

2. యావే ప్రభువు కాపరిలాంటివాడు అన్నాం. “ప్రభువే నాకు కాపరి, నాకిక యేకొదవలేదు” అంటుంది కీర్తన 23,1, మంచి కాపరి దొరకిన మందకు ముప్పులేదు కదా! “యావే మనదేవుడు, మనం ఆ ప్రభువు పాలించే ప్రజలం. ఆయన మేపే గొర్రెలం” అంటుంది కీర్తన 95,6. అనగా యెడారికాలంలో ప్రభువు యిస్రాయేలీయులను ఓగొర్రెల మందలాగ నడిపించుకొనివచ్చాడని భావం. అటుపిమ్మట యిస్రాయేలీయులు పాపంచేసి ప్రభువునకు కోపం కలిగించారు. ఆవుపెయ్యవలె మొండితనం జూపారు – హోషే 4,16. కనుక ప్రభువు వాళ్లను బాబిలోనుకు ప్రవాసం పంపించాడు. కాని యూదులు బాబిలోను ప్రవాసంనుండి తిరిగి వచ్చేటప్పుడు కూడ యావే కాపరిలాగే వ్యవహరించాడు. “యావే కాపరిలాగే తనమందను మేపుతాడు. గొర్రెపిల్లను చేతులలోనికి దీసికొని రొమ్ముమీద మోపుకుంటాడు. తల్లిగొర్రెలను మెల్లగా అదిలించుకుంటూ వస్తాడు” అంటాడు ప్రవక్త యెషయా – 40,11. ఈ వాక్యంలో, గొర్రెపిల్లలపట్ల, తల్లిగొర్రెలపట్ల ప్రభువు చూపే ఆదరం గమనింపదగ్గది. అతడు మార్దవంతో మందను మేపేవాడు. ఆ ప్రవక్తే మరియొక

తావులో "ప్రభువు తన మందలను నీటిబుగ్గలయొద్దకు తోలుకొని పోతాడు. కనుక ఆకలిదప్పులు ఎండపొడలు ఆ గొర్రెలను బాధింపవు" అని చెప్పాడు. 49,10.

3. యావే కాపరి అన్నాంకదా! యిస్రాయేలీయులు అతడు మేపేమంద. అందుకే కీర్తనకారుడు "ప్రభూ! నీ ప్రజలమూ నీ మందకుచెందిన గొర్రెలమూ ఐనమేము నీకు వందనాలు అర్పించి నిత్యమూ నిన్ను స్తుతిస్తూంటాం" అంటాడు - 79, 13. మరో కీర్తనకారుడు, "యావే ఒక్కడే దేవుడు సుమా! ఆయనే మనలను కలిగించాడు. మనము అతనికి చెందినవాళ్లం. ఆయన ప్రజలం, ఆయన మేపే మందలం" అని నుడివాడు - 100,3. ఈ యావే మందలను మేపడానికి తన సేవకులను నియమించాడు. కీర్తనకారుడు ఎడారికాలాన్ని స్మరించుకుంటూ "మోషే అహరోనులచే నీ ప్రజలను ఓమందలాగ నడిపించావు" అంటాడు - 77,20. మోషే చనిపోవకముందు ప్రభువు ప్రజలకు మరో కాపరిని ప్రసాదించాలని ప్రార్థించాడు "ప్రభూ! నీవు సమస్త ప్రాణులకు దేవుడవు బ్రతికియున్న ప్రాణులన్నిటికీ జీవమిచ్చేవాడవు. ఈ ప్రజలు కాపరిలేని గొర్రెల్లాగ అలమటించకుండ వుండేందుకు వీళ్లకొక నాయకుని ప్రసాదించు" అని మనవి చేసాడు. ఈ మనవి ఆలించి ప్రభు యిస్రాయేలీయులకు యోషువాను నాయకుని జేసాడు - సంఖ్యా 27,17. ఇక యావే తన మందమీద నియమించిన సేవకులలో దావీదు చాలగొప్పవాడు. అందుకే కీర్తనకారుడు "అతడు తన సేవకుడైన దావీదు నెన్నుకున్నాడు. గొర్రెలమందనుండి, గొర్రెపిల్లల చెంతనుండి, అతనిని పిలిపించి యిస్రాయేలీయులకు రాజును చేసాడు. దేవుని ప్రజలకు అతనిని కాపరిగా నియమించాడు" అంటాడు - 78,70.

4. కాని రానురాను యావే నియమించిన యీ కాపరులు ఆ యోగ్యులై పోయారు. మందలను మేపడానికి మారుగా ఆ మందలను మ్రింగివేయటం మొదలెట్టారు. అందుకే ప్రభువు ప్రవక్త యెహెజ్కేలు ద్వారా "కాపరులు గొర్రెలను మేపాలి. కాని వాళ్లు పోతరించిన గొర్రెలను వధించి క్రొవ్వను భుజించి, వాని ఉన్నిని కప్పుకుంటున్నారు. గాని గొర్రెలను మాత్రం మేపడం లేదు" అని అధిక్షేపిస్తాడు - 34, 3. కాపరుల అశ్రద్ధ వలన గొర్రెల మందలు చెదరిపోతాయి - యిర్మీ 23, 1-3. కనుక ప్రభువే వాటికి కాపరి ఔతాడు. వాటిని పచ్చిక బయళ్లకు తోలుకొని పోతాడు - యిర్మీ 50,19. ఆ మందను తన చెంత నుంచుకొని కాచి కాపాడతాడు - యిర్మీ 31,10. గొర్రెల పట్ల ప్రభువు చూపే యీజాగ్రత్త మెచ్చుకోతగ్గది గదా!

5. యావే తన పేరుమీదగా ఓ మంచి కాపరిని పంపిస్తాడు. అతనికి క్రొత్తగా దావీదు అని పేరు. ప్రభువు యిర్మీయా ముఖాన "నాకు నచ్చిన కాపరిని మీ మీద

నియమిస్తాను. అతడు జ్ఞానంతో వివేకంతో మిమ్ము పరిపాలిస్తాడు" అంటాడు - 3,15. ఈ కాపరి గొర్రెల మందకు ఏకైక పాలకుడు. అతని మీద ప్రభువొక్కడే అధికారి. కావున ప్రభువు యెహెజ్కేలు ముఖాన "నా సేవకుడైన దావీదును నా గొర్రెల మీద కాపరినిగా నియమిస్తాను. అతడు వానిని మేపుతాడు. యావేనైన నేను వాటికి దేవుడను. నా సేవకుడైన దావీదు వాటికి పాలకుడు" అని చెప్పాడు - 34, 23. ఈలా తన సేవకుడైన దావీదు ద్వారా ప్రభువే మందను మేపుతాడు - 34, 15. ఈ క్రొత్త దావీదే ప్రభువు పంపనున్న మెస్సీయా. ఇప్పటి నుండి యూదుల భావాలు రానున్న మెస్సీయా మీద కేంద్రీకరింపబడ్డాయి.

6. బాబిలోను ప్రవాసం ముగిసాకగూడ పాలస్తీనాలోని యిస్రాయేలు ప్రజలు నాయకులు దుర్మార్గంగా ప్రవర్తిస్తూ వచ్చారు. అందుచే ప్రవక్తలు వాళ్లను చీవాట్లుపెట్టారు. ప్రభువు నాయకులనబడే కాపరులను శిక్షిస్తాడు అంటాడు ప్రవక్త జెకర్యా - 10,3. కాని ఈ కాపరుల్లో ఒక్కడు మాత్రం చాల యోగ్యుడు. శత్రువులు అతని రొమ్మును పొడిచి తెరుస్తారు. ఏకైక కుమారుణ్ణి కోల్పోయినవాళ్లలాగ, తొలిచూలుబిడ్డను పోగొట్టుకున్న వాళ్లలాగ జనులు అతనికోసం విలపిస్తారు - 12,10. ఈ కాపరి వక్షస్సు వ్రయ్యేలౌతుంది. అతడు దెబ్బలుతిని తన మందను కాపాడతాడు. యెషయా నుడివిన బాధామయ సేవకుని మీదలాగే ఈ కాపరిమీదా ప్రభువు మన అందరి దోషాలను మోపుతాడు - యెష 53,6. ప్రవక్తలు నుడివిన ఈ మహానుభావుమని కోసం యూదులంతా యెదురుచూడ్డం మొదలెట్టారు. ఆ కాపరిని, ఆ క్రొత్త దావీదును, ఆ మెస్సీయాను కన్నులారా చూడాలని ఉబలాటపడ్డారు. వాళ్ల కోరికల ఫలితమో అన్నట్లు పూర్వవేద రచయితలు సూచించిన కాపరి విజయంచేసాడు.

7. మీకా ప్రవచనాన్ననుసరించి క్రీస్తు బేత్లెహేము నగరంలో జన్మించాడు. అతడు యిస్రాయేలు ప్రజలను నడిపించే నాయకుడు లేక కాపరి - మత్త 2,6. కాపరుల బిడ్డడైన క్రీస్తును దర్శించడానికై కాపరులు పరుగుపరుగున వచ్చారు. తొట్టిలో పరుండియున్న శిశువును చూచారు - లూకా 2, 16. శిష్యులు, పాపాత్ములు, సుంకరులతోపాటు ఈ కాపరులుగూడా ప్రభువు చిన్నమందకు చెందినవాళ్ళు. కనుక వాళ్ళు దేవుని రాజ్యాన్ని పొందుతారు - లూకా 12, 32.

8. ఈ ప్రభువు యిస్రాయేలు వంశమున చెదరిపోయిన గొర్రెలకొరకు మాత్రమే వచ్చాడు - మత్త 15,24. క్రీస్తు తర్వాత క్రీస్తుశిష్యులు అతని సువార్తను అన్ని జాతులకు అందిస్తారు. ఈ కాపరి కరుణామయుడు. కనుకనే అతడు తప్పిపోయిన గొర్రెను వెదక్కుంటూ పోతాడు - లూకా 15, 4-7. దిక్కూమొక్కూ లేక అలమటిస్తూ కాపరిలేని గొర్రెల్లా చెదరివున్న ప్రజలను చూడగానే ఆ కరుణామయుని కడుపు తరుగుకొని పోయింది

- మత్త 9,36. పూర్వం మోషే తన తరువాత మందను కాపాడే కాపరి ఈలా కరుణామయుడై వుండాలనే ప్రభువును ప్రార్థించాడు - సంఖ్యా 27, 17.

9. జెకర్యా "గొర్రెలకాపరిని కొట్టండి, మంద చెల్లాచెదరౌతుంది" అని యోగ్యుడైన కాపరిని గూర్చి ప్రవచనం చెప్పాడు - 13,7. యెషయా "యావే మన దోషాలన్నీ అతనిమీద మోపాడు" అని బాధామయ సేవకుణ్ణిగూర్చి ప్రవచనం జెప్పాడు - 53, 6. ఈ ప్రవచనాల కనుగుణంగానే క్రీస్తును సిలువపై కొట్టి చంపారు. ప్రభువు మందకోసం చనిపోయాడు. కాని మందకోసం అసువులు పాయడంవల్లనే అతడు "గొర్రెల గొప్పకాపరి" కాగలిగాడు - హెబ్రె 13,20. మనమంతా గొర్రెల్లాగ త్రోవదప్పిపోయాం. కాని ప్రభువు సిలువపై మరణించాక "కాపరి ఆత్మల రక్షకుడు" నైన ఆ క్రీస్తువైపు మళ్లాం - 1 పేత్రు 2, 25. ఆ ప్రభువువలన పాపపరిహారం పొందాం.

10. చివరిదైన ప్రకటన గ్రంథం క్రీస్తును మోక్షంలో ఓ కాపరిలా చిత్రిస్తుంది. అతడు పుణ్యాత్ముల నందరను జీవజలాల యొద్దకు నడిపించుకొని వెళ్తాడు. అనగా వాళ్లకు సర్వసౌఖ్యాలూ చేకూరుతాయని భావం. దేవుడు ఆ పుణ్యాత్ముల నేత్రాలనుండి కన్నీటి బొట్లను తుడిచివేస్తాడు. అనగా వాళ్లకిక బాధలూ, శ్రమలూ వుండవని భావం- 7, 17. ఈలా క్రీస్తు భూమిమీదను మోక్షంలోను కాపరిలాగే వ్యవహరిస్తాడు.

11. యెహెజ్కేలు తన ప్రవచనం 34వ అధ్యాయంలో యిస్రాయేలు కాపరులను వర్ణించాడు. ఈ యధ్యాయాన్ని ఆధారంగా తీసికొని యోహాను తన సువార్త 10వ అధ్యాయంలో నూత్న వేదపు కాపరిని వర్ణించుకుంటూ పోయాడు. కాపరిని గూర్చిన తొలి మూడు సువార్తల్లోని భావాలకంటె ఇతని భావాలు విలక్షణంగా వుంటాయి. అంచేత వీటిని ప్రత్యేకంగా విచారించి చూడాలి.

క్రీస్తు గొర్రెలను గాసే మంచికాపరి - 10, 11. పూర్వం యావే పేరుమీదుగా ప్రజలను పాలించిన దుష్టరాజులు, నాయకులు చెడ్డ కాపరులు. వాళ్ళు ప్రజలను పీడించారు. ఆలా కాకుండ క్రీస్తు ప్రజలకు మేలు చేస్తాడు. గొర్రెలు పచ్చిక బయళ్లకు వెళ్ళాలంటే ద్వారం క్రీస్తే - 10, 7. దేవునికి నరునికి మధ్య మధ్యవర్తి అతడే. అతని ద్వారాగాని మనం జీవం పొందం. గొర్రెలను బయళ్లకు తోలుకొని పోయేది క్రీస్తే - 10,4. ఈ కాపరికి తన గొర్రెలపేర్లు తెలుసు - 10, 3. అతడు పేరుపెట్టి పిలిస్తేచాలు. వెంటనే గొర్రెలన్నీ అతన్ననుసరిస్తాయి. క్రీస్తు గొర్రెలకోసం తన ప్రాణాన్ని బలిగా సమర్పిస్తాడు- 10,17. అదీ, జకర్యాప్రవక్త సూచించినట్లుగా ఎవరో బలవంతంగా చంపడంగాదు. తనంతట తానే ప్రభువు ప్రాణాలను ధారపోస్తాడు -10, 18 గొర్రెల చెదరిపోకూడదనీ, ఒకే మందగా వుండాలనీ, వాటిని ఒకే కాపరి మేపుతుండాలనీ ఈ ప్రభువు కోరిక

-10, 16. ఈ మందకు ప్రభువు నిత్యజీవం ప్రసాదిస్తాడు- 10,28. ఆదర్శ ప్రాయుడైన కాపరి అంటే యీలాంటివాడు కదా!

12. క్రీస్తు కరుణామయుడైన కాపరి. పూర్వం గొర్రెల కాపరియైన హేబెలు ప్రాణాలర్పించాడు- ఆది 4,8. బాధామయుడైన సేవకుణ్ణి గొర్రెపిల్లలాగ వధ్యస్థానానికి నడిపించుకొనిపోయి వధించారు - యెష 53,7. మందకు మేలుచేయాలనే కోరికగల యోగ్యుడైన కాపరినిబట్టి రొమ్ము పొడిచారు - జెక12,10. వీళ్లంతా పూర్వవేదంలో క్రీస్తుకు సంకేతంగా వుండే సూచకవ్యక్తులు, కరుణామయులు. ఈ మహానుభావుల లక్షణాలన్నీ క్రీస్తునందు ఫలసిద్ధి నందాయి. కావుననే ప్రభువు “నేను గొర్రెలకోసం ప్రాణాలర్పిస్తాను” అన్నాడు- యోహా 10,15. ఈలా స్వీయ మరణంద్వారా మనకు జీవాన్ని చేకూర్చిపెట్టిన త్యాగమూర్తి ప్రభువు. కావున అతనికి ప్రణమిల్లుదాం.

13. ఈ క్రీస్తు కాపరి లక్షణాలు కూడ ఓ మారు స్మరించుకుందాం. 1) కాపరి గొర్రెలను మందకూరుస్తాడు. అలాగే క్రీస్తు కాపరి దేవుని ప్రజలను ఒక్క మందగా ఐక్యపరుస్తాడు - యోహా 10,16. 2) కాపరి గొర్రెలను లెక్కిడి చూస్తాడు. ఏవైనా తప్పిపోతే వెంటనే జాగ్రత్త పడతాడు. క్రీస్తుకూడ తప్పిపోయిన గొర్రెను వెదక్కుంటూ వెళ్తాడు - లూకా 15,3-7. 3) కాపరి మందమీద జాలిచూపుతాడు. అవంటే అతనికి ప్రాణం. కాపరిలేని, మందలాగవున్న ప్రజలను చూచేప్పటికి క్రీస్తుకు కడుపు చెరువౌతుంది - మత్త 9, 36. 4) క్రీస్తు కాపరి చెడు గొర్రెలనుండి మంచి గొర్రెలను వేరుపరుస్తాడు. చెడ్డవానిని దండించి మంచివానిని సంభావిస్తాడు - మత్త 25, 32-46. 5) క్రీస్తు మేతకోసం గొర్రెలను పచ్చిక బయళ్ళకు తోలుకొనిపోతాడు. అక్కడ వన్యమృగాలనుండి వాటిని కాపాడతాడు. వాటికోసం ప్రాణాలుకూడ అర్పిస్తాడు - యోహా 10,4. ఇంతకన్నా కాపరి చేయగలిగిందేముంది?

14. తన గొర్రెలేవో ప్రభువునకు తెలుసు. వాటికి ప్రభువెవరో తెలుసు. అవి అతని స్వరాన్ని వింటాయి. అతన్ననుసరిస్తాయి - 10,27.3. క్రీస్తునకు మనలను గూర్చి తెలుసు. కాని మనకు క్రీస్తునుగూర్చి తెలుసా? అతని స్వరాన్ని మనం గుర్తుపట్టగలమా? భక్తురాలు మరియమగ్దలీన ఆలా గుర్తుపట్టింది. క్రీస్తు “మరియా” అని పిలువగానే ఆమె “ప్రభూ!” అంటూ అతని పాదాలమీద వ్రాలింది - యోహా 20,16. ఈలాగే మనమూ మన హృదయంలోనే ప్రభు స్వరాన్ని వినగలిగి వుండాలి. ప్రభువును అర్థంచేసికోగలిగి వుండాలి. అనుభవ పూర్వకంగా, ప్రేమతో ప్రభువును గూర్చి తెలిసికొని వుండాలి. అలా తెలిసికొని, ఆ ప్రభువు ననుసరించి వెళ్తూండాలి.

# 2. వరుడు - వధువు

15. యిస్రాయేలు ప్రజలు యావేకు వాడిన రెండవ ఉపమానం "వరుడు". యావే వరునిలాంటివాడు, యిస్రాయేలీయులు వధువులాంటివాళ్లు. జీవాత్మ పరమాత్మ వధూవరుల్లాంటివాళ్లనే భావం ప్రాచీన మతాలన్నిటిలోను కన్పిస్తుంది. మన దేశాన వైష్ణవ సంప్రదాయంలో ఈ భావం ప్రచురంగా కన్పిస్తుంది. దీన్నే హిందూ సాధకులు "మధురభక్తి" అంటారు. సీనాయి నిబంధనం ద్వారా యిస్రాయేలుప్రజలు యావే వధువు అయ్యారు. "ఎడారిలో నన్ను వెంబడిస్తూ ఆ యౌవనదశలో నీవు నాపట్ల జూపిన అనురాగాన్ని, వైవాహిక ప్రేమను జ్ఞాపకం జేసికుంటాను" అంటాడు ప్రభువు యిర్మీయా ప్రవచనంలో –2,2. ఇక్కడ యిస్రాయేలు ప్రజ ఓ వధువుగా భావింపబడింది. ఈ వధువు ఈజిప్టునుండి బయలుదేరి వచ్చింది. ఎడారిలో యావేను వెంబడించింది. అప్పుడు వధువు యౌవనదశలో వుంది. ఎడారికాలంలో యిస్రాయేలుప్రజలు ఓ జాతిగా యేర్పడుతువచ్చారు. యావే ప్రజగా రూపొందారు. అందుకే ప్రభువు యౌవనదశను పేర్కొంది. వధువు ఎడారిలో చూపిన అనురాగం వైవాహిక ప్రేమ అని చెప్పబడింది. ఎన్నికద్వారా ఆ ప్రజలు యావే ప్రజలయ్యారు. యావే వధువుగా రూపొందారు. యావేకు ఉద్వాహమయ్యారు. ఆ వధువు కన్యవధువు. యావేను గాఢంగా ప్రేమించింది. అనగా తొలిరోజుల్లో ఆ ప్రజలు ప్రభువుపట్ల గాఢానురక్తిని చూపారని భావం. ఇది యావే – యిస్రాయేలు దాంపత్య గాథలో తొలిదశ.

16 హోషేయా ప్రవక్త యావేకు యిస్రాయేలీయులకు దాంపత్య సంబంధమున్నదని తన జీవితం ద్వారానే బోధించాడు. ఈ ప్రవక్త ఓ యువతిని పెండ్లి చేసికొని ఆమెను మనసార ప్రేమించాడు. కాని ఆ యువతి ప్రవక్తను విడనాడి, దేవదాసి ఐపోయింది. ఐనా ప్రవక్త ఆమెను క్షమించాడు. మళ్లా ఆమెను తీసికొని వచ్చి అనురాగంతో జూచుకున్నాడు. ఇది అతని జీవితంలోని ఓ సంఘటన. ప్రభువు హోషేయాను ఈ సంఘటాన్ని ఆధారంగా తీసికొని ప్రవచనం చెప్పమన్నాడు. కనుక హోషేయా యిస్రాయేలు ప్రజలను కులటతో ఉపమించాడు. యావే నిబంధనం చేసికొనిన ప్రజ, అతడు ప్రేమించిన వధువు యిస్రాయేలు. ఐనా యీ యిస్రాయేలు ప్రభువునకు కట్టువడి యుండక బాలు మొదలైన అన్యదైవాలను ఆరాధించడం మొదలెట్టారు. ఏకైక భగవంతుడైన యావేను గాక అన్యదైవాలను ఆరాధించడాన్ని బైబులు "వ్యభిచారం" అని పిలుస్తుంది. ఈలా తన్ను విడనాడి అన్యదైవాల వద్దకు వెళ్లి వ్యభిచరించినా ప్రభువు ఆ ప్రజలను క్షమించాడు. కులటయైన భార్యను లాగా వాళ్లను మళ్లా తన వద్దకు చేరబిల్చుకున్నాడు. తన ఆరాధకులనుగా జేసికున్నాడు. అతని కరుణయే యిందుకు కారణం.

17. యావే - యిస్రాయేలు దాంపత్య గాథ తొలిదశలో యిస్రాయేలు కన్య వధువు అన్నాం. ఆ వధువును ప్రభువు ఉత్కటంగా ప్రేమించాడన్నాం. కాని రెండవ దశలో యిస్రాయేలు వ్యభిచారిణి. అనగా యీ దశలో ప్రజలు యావేను విడనాడి పరదేవరులను కొలవడం మొదలెట్టారు. ఎన్మిదవ శతాబ్దిలో సోలోమోను పాలనం క్రింద పాలస్తీనా దేశం సమస్త సిరిసంపదలతో తులదూగింది. యూదులకు మదం దిగింది. వాళ్లు యావేను విడనాడి కనానీయుల దైవమైన బాలును ఆరాధించటం మొదలెట్టారు. కనుకనే హోషేయా ప్రవక్త "జనులు యావేను విడనాడి సర్వత్ర వ్యభిచరిస్తున్నారు" అంటాడు -2, 2. పాలస్తీనా దేశం అప్పటికే యూదా, సమరయ అని రెండు రాష్ట్రాలుగా చీలిపోయింది. ఈ రెండు రాష్ట్రాలు ఇద్దరు అక్క చెల్లెళ్లు అన్నాడు యెహెజ్కేలు ప్రవక్త. ఈ యక్కచెల్లెళ్లిద్దరూ ప్రభువును విడనాడి వ్యభిచారానికి పూనుకున్నారు - యెహె 23. ప్రభువు ఈ యిస్రాయేలు వధువుపై కోపంపూని ఆమెను నిశితంగా శిక్షించాడు. "మీరు నా ప్రజలు కాదు, నేను మీ దేవుడను కాను" అని యిస్రాయేలీయులను విడనాడాడు - హోషే 1,9. వాళ్లను బాబిలోను ప్రవాసానికి పంపించాడు. కాని, ప్రభువు చూపిన యీ కోపం మళ్లా వధువును తన చెంతకు రాబట్టుకోవడానికే.

18. దాంపత్య గాథ తొలిదశలో యిస్రాయేలు వధువు కన్య అన్నాం. రెండవదశలో వ్యభిచారిణి అన్నాం. మూడవ దశలో ఆమె క్షమింపబడిన వధువు ఔతుంది. పాపఫలితంగా బాబిలోను ప్రవాసానికి వెళ్లిపోయిన వధువును ప్రభువు మళ్లాపిలిపిస్తాడు యావే హోషేయా ప్రవక్తముఖాన "ఆమెను ఆకర్షించి యెడారికి కొనిపోతాను. అక్కడ ఆమెకు ప్రియంగలిగేలా మాటలాడతాను" అంటాడు - 2,14. ప్రభువు తన వధువును ఎడారికి గొనివస్తాడు. అక్కడ ఏకాంతంగా ఆమెతో సంభాషిస్తాడు. ఆమె హృదయాన్ని మారుస్తాడు. ఆమె ప్రేమను చూరగొంటాడు. అనగా ప్రభువు అనురాగంతో తన ప్రజలను బాబిలోను నుండి ఎడారిగుండ నడిపించుకొనివచ్చి మళ్లా వాగ్దత్త భూమిలో స్థిరపరుస్తాడని ప్రవక్తభావం. ఇలా తిరిగివచ్చిన వధువుతో ప్రభువు మళ్లా ఓ క్రొత్త వొడంబడిక చేసికుంటాడు "నేను నిన్ను ఆదరంతో ప్రధానం జేసికుంటాను. అప్పుడు నీవు యావేనైన నన్ను తెలిసికుంటావు" అంటాడు - హోషే 2, 22.

19. ప్రభువు వ్యభిచారిణియైన తన వధువును క్షమించి ఆమెతో మళ్లా క్రొత్త వొడంబడిక చేసికుంటాడనే భావాన్ని యెషయ ప్రవక్తచాల లలితంగా వర్ణించాడు. "పరిత్యక్త, దుఃఖాక్రాంతురాలు ఐన భార్యను భర్తలాగే యావే తన వధువును మళ్లా రప్పించుకుంటాడు తాను యువకుడుగా వున్నపుడు పెండ్లియాడిన భార్యను - ఆమెయెంత ద్రోహముచేసిన - పురుషుడు విడనాడడు. అలాగే యావేకూడ తన వధువును - ఆమె అవివేకంతో

అన్యదైవాల వెంటబోయినా - విడనాడడు. ప్రభువు తన వధువుపట్ల క్షణకాలం మాత్రమే కోపం జూపుతాడు. కాని ఆదరంతో ఆమెను మళ్లా చేరదీస్తాడు. నిశ్చలమైన పర్వతాలు కదలితే కదలవచ్చుగాక; తిప్పలు పట్టుదప్పుతే తప్పవచ్చుగాక. ప్రభువుకృపమాత్రం తనవధువును విడనాడడు. అతడామెతో చేసికొనిన క్రొత్త యొడంబడిక ఏనాటికి గతింపదు. అతడు తన వధువుపట్ల నిత్యం జాలిజూపుతునే వుంటాడు" -54, 5-10. ఈ వాక్యాలను పూర్వ వేదమనే సముద్రంలో నుండి యేరితీసిన ఆణిముత్యాలనాలి! పాఠకులు ఈ పలుకులను నిదానంగా అవధానంగా మననం చేసికోవాలి.

20. ప్రభువు యెషయా ప్రవక్తద్వారా యింకా యిలా సెలవిచ్చాడు. "యువకుడు కన్యను పెండ్లియాడినట్లే నీదేవుడైన యావేకూడ నిన్ను పరిణయమాడుతాడు. వరుడు వధువును జూచి సంతసించినట్లే ప్రభువుగూడ నిన్నుజూచి సంతసిస్తాడు" 62,5. పరమగీతం గ్రంథం కూడ ఈలాంటి భావాలనే సూచిస్తుంది. ఓ ప్రియుడు, అతని ప్రియురాలు; ప్రియుడు ప్రియరాలిని గాఢంగా ప్రేమిస్తాడు. ప్రియురాలు ప్రియునితో ఇలా అంటుంది "నన్ను నీ హృదయంమీద ముద్రవేసికో. ప్రేమ మరణమంత బలమైంది. దాన్నెవరూ ఆపలేరు. అది అగ్నిలా ప్రజ్వరిల్లుతుంది. నదులు ప్రేమాగ్నిని చల్లార్పలేవు. ప్రవాహాలు ప్రేమజ్వాలను ముంచి వేయలేవు. ఆ ప్రేమను మనం సంపాదింపలేము. నరుడు తన ఆస్తిబాస్తులన్నిటినీ సమర్పించుకొన్నా దాన్ని కొనలేడు. పైగా తిరస్కారాన్నే పొందుతాడు" - 8, 6.8. ఇది మనుష్యప్రేమ. ఈ ప్రేమ దైవప్రేమకు పోలికగా వుంటుంది. నరుడు తన భార్యను ప్రేమించినట్లే ప్రభువు కూడ తన వధువైన యిస్రాయేలును మిక్కిలి అనురాగంతో ఆదరిస్తాడు.

21. జ్ఞానగ్రంథకారులు మరో భావాన్నిగూడ ప్రవేశపెట్టారు. జ్ఞానము దేవుని కూతురు - సామె 8,22. ఈ జ్ఞానం నరులతో వుండిపోవాలని ఉబలాట పడుతుంది. నరునికి భార్య ఔతుంది - సీరా 15,2. ఈ జ్ఞానమనే భార్యను పొందినవాడు దేవుని స్నేహితుడౌతాడు - సొలో జ్ఞా 7, 14. ఉత్తముడైనవాడు ఈ జ్ఞానాన్ని అభిలషించాలి, ప్రేమించాలి, వధువునుగా స్వీకరించాలి - 8,2. ఆమెతో కూడిమాడి వుండాలి - 8,9. దేవుడు మాత్రమే ఆమెను నరుని కియ్యగలడు - 8,21. పరిశుద్ధాత్మతోపాటు ఈ జ్ఞానాన్నికూడ దేవుడు తన భక్తులకు అనుగ్రహిస్తూంటాడు - 9, 17. ఈ జ్ఞానవధువు తాను వరించిన వాళ్లకు మితత్వమూ, వివేకమూ, ధైర్యమూ, మొదలైన పుణ్యాలను ప్రసాదిస్తుంది. నరులకు వీనికంటె లాభదాయకమైన వేవీలేవు- 8,7. ఈలా జ్ఞానం ఓవధువులాగ నరుని వరిస్తుంది అన్నారు జ్ఞానగ్రంథకారులు. పూర్వవేదం పేర్కొనే ఈ జ్ఞానం నూత్నవేదంలో క్రీస్తే. "క్రీస్తు దేవుని శక్తి, దైవజ్ఞానం" అంటాడు పౌలు - 1 కొ 1,24.

సంగ్రహంగా జెప్పాలంటే యిస్రాయేలు ప్రజ ప్రభువును గాఢంగా ప్రేమించినన్నాళ్లు కన్యవధువు. అది తొలిదశ. అన్య దైవాలను ఆరాధించడం మొదలెట్టాక, వ్యభిచారిణి. అది రెండవదశ. ప్రభువు క్షమించాక, మళ్ళా యోగ్యురాలైన వధువు. అది మూడవ దశ.

22. పై మూడు దశలే నూత్నవేద ప్రజలకు కూడ వర్తిస్తాయి. పూర్వ వేద ప్రజలకు యావే యేలాగో నూత్నవేద ప్రజలకు క్రీస్తు ఆలాగు. ఆ ప్రభువు వచ్చాక యిస్రాయేలు ప్రజలకు మారుగా క్రైస్తవ సమాజం ఏర్పడుతుంది. యిస్రాయేలు యావే వధువైనట్లే క్రైస్తవ సమాజం (తిరుసభ) క్రీస్తు వధువౌతుంది.

నూత్న వేదపు సామెతలు ఈ భావాన్నే సూచిస్తాయి. స్నాపక యోహాను శిష్యులు యేసును సమీపించి "మీ శిష్యులు ఉపవాస ముండరేల"? అని ప్రశ్నించారు. ప్రభువు "పెండ్లికొమారుడున్నంతకాలం పెండ్లి విందునకు వచ్చిన అతిథులు చింతింపరుగదా? పెండ్లికొమారుడు ఎడబాసి పోయే కాలం వచ్చినప్పుడు వాళ్లు చింతతో ఉపవాసముంటారు" అన్నాడు - మత్త 9,15. ఇక్కడ క్రీస్తు వరుడు, నూత్న వేదప్రజలు అతని వధువు అని భావం. స్నాపక యోహాను క్రీస్తునుద్దేశించి "పెండ్లి కొమార్తె పెండ్లికొమారుని సొత్తు" అంటాడు - యోహా 3,29. ఇక్కడ గూడ క్రీస్తు వరుడనే భావం. మత్తయి 22,1-14 లో ఓరాజు తన కుమారునికి పెండ్లి చేస్తూ అతిథులనాహ్వానిస్తాడు. ఇక్కడ కూడ పెండ్లి కొమారుడు క్రీస్తే. నూత్నవేద సమాజమే అతని వధువు. మత్తయి 25, 1-15లో పదిమంది కన్యలు ప్రభువు కొరకు వేచివున్నట్లు చెప్పబడింది. ఇక్కడ క్రైస్తవ సమాజం ఓ మంచి వధువులాగ వరుడైన క్రీస్తు రెండవ రాకడకోసం ఎదురుచూస్తుండాలని భావం. కనుక ఈ సామెతలన్ని క్రీస్తుని వరునిగాను క్రీస్తుసమాజాన్ని వధువునుగాను చిత్రిస్తాయి. దేవునికీ ప్రజలకీ మధ్య దాంపత్య సంబంధ ముంటుందనే భావం పూర్వ వేదంనుండి నూత్న వేదంలోనికి జాలువారింది.

23. పూర్వవేద ప్రజలు సీనాయి ఒడంబడిక ద్వారా యావే ప్రభువు ప్రజలూ, అతని వధువూ అయ్యారన్నాం. యూదులకు సీనాయి ఒడంబడిక ఎలాంటిదో క్రైస్తువులమైన మనకు జ్ఞానస్నానం ఆలాంటిది. ఈ జ్ఞానస్నానం ద్వారా మనము క్రీస్తు ప్రజలము, క్రీస్తు వధువులమౌతాం. కనుకనే పౌలు కొరింతు క్రైస్తవసమాజానికి వ్రాసిన రెండవ జాబులో "విశుద్ధురాలైన కన్యనులాగ మిమ్ము ఒకేపురుషుడైన క్రీస్తునకు ప్రధానంచేసాను" అంటాడు - 11,2. పౌలు కొరింతులోని స్త్రీ పురుషులకు జ్ఞానస్నానమిచ్చాడు. అక్కడ ఓ సమాజం ఏర్పరచాడు. ఈ సమాజమే క్రీస్తుకు ప్రధానం చేయబడిన వధువు. జ్ఞానస్నానమే ఈ ప్రధానం. తొలిదశలో, అనగా యెడారి కాలంలో, యిస్రాయేలు కన్యవధువై ప్రభువును గాఢంగా ప్రేమించిందన్నాం. జ్ఞానస్నానకాలంలో క్రైస్తవ సమాజంకూడ కన్యవధువై

ప్రభువును మిక్కుటంగా ప్రేమిస్తుంది. యిస్రాయేలీయులు తొలిదశలాంటిదే మన తొలి దశకూడ.

24. రెండవ దశలో యిస్రాయేలు సమాజం అనే వధువు పాపంచేసి ప్రభువు నిగ్రహానికి గురైందన్నాం. అలాగే క్రైస్తవ సమాజమనే వధువుకూడ పాపం కట్టుకొని ప్రభువు కోపానికి గురౌతుంది. ఐనా ప్రభువామెను కరుణిస్తాడు. ఆ వధువును ప్రేమించి ఆమెకోసం తన్నుతాను సిలువపై సమర్పించుకుంటాడు. ఆమెకు తన రక్షణవార్తను బోధిస్తాడు. ఆ వార్తే ఆమెకు స్నానం. దానివలన ఆమె పరిశుభ్రయై విశుద్ధురాలు ఔతుంది. పరిశుభ్రంగా, నిర్దోషంగా, కళంక రహితంగా తయారై సౌమ్యరూపాన్ని పొందుతుంది. ఈలాంటి వధువుని ప్రభువు మహిమతో తనయెదుట నిలుపుకుంటాడు. పెండ్లిలో పెండ్లి కొమారుడు తనయెదుట నిలువబడిన వధువునుజూచి సంతసించినట్లుగా సంతసిస్తాడు - ఎఫె 5 27. ఈ వధువు క్రైస్తవ సమాజం, ఈ వరుడు క్రీస్తు. ఈలా క్రీస్తు తన వధువు పాపాలను క్షమించి ఆమెను మరల ఆదరిస్తాడు. ఇది రెండవ దశ.

25. మూడవ దశలో యిస్రాయేలు సమాజమనే వధువు ప్రభువు మన్ననకు పాత్రురాలు ఔతుందన్నాం. ఈ మూడవ దశ భావి కాలం. మెస్సీయాకాలం. చివరి రోజుల్లో క్రీస్తు వొచ్చాక సిద్ధించే దశ. ఈ దశలోకూడ క్రైస్తవ సమాజం ఓవధువులా చూపబడుతుంది. దర్శన గ్రంథకర్త ఆమెను ఇలా వర్ణించాడు. "క్రొత్త యెరూషలేమగు పరిశుద్ధ పట్టణం చక్కగా అలంకరించుకొని భర్త చెంతకువచ్చే పెండ్లి కొమార్తెలాగ పరలోకములోని దేవుని చెంతనుండి దిగి వచ్చింది" - 21,2. ఈలా దిగి వచ్చిన వధువును జూపుతూ దేవదూత "ఈలారా! గొర్రెపిల్ల భార్యయైన పెండ్లికొమార్తెను నీకు చూపెడతాను" అంటాడు - 21,9. ఈ వధువు మోక్షవాసులూ, భూలోక విశ్వాసులూను. అనగా పూర్తి క్రైస్తవ సమాజం. ఈ సమాజమంతా ప్రభువు ప్రజ ఔతుంది. ఓ వధువులాగ అతనికి సమర్పిత మౌతుంది. మరణించి మళ్లా ఉత్థానమైన గొర్రెపిల్ల భార్య ఔతుంది. ఈ మూడవ దశను క్రీస్తు ఉత్థానంనుండి లోకాంతం వరకు వచ్చే కాలానికంతటికీ వర్తించుకోవాలి. దీన్నే బైబులు "తుదికాలం" అని పిలుస్తుంది.

26. బైబులు మనుష్య భాషలో మాటలాడుతుంది. మనుష్యులకు స్త్రీ పురుష సంబంధమైన దాంపత్య ప్రేమ చాలయిష్టమైంది. కనుకనే బైబులు దేవునికీ మానవునికీ వుండే సంబంధాన్ని దాంపత్య ప్రేమతో పోల్చి చెప్పింది. యూద సమాజం క్రైస్తవ సమాజం ప్రభువుకి ప్రియపడే వధువు. ఈ ప్రజలు వ్యక్తిగతంగాను, సామాజికంగాను దేవునికి వధువౌతారు.

మనకు వరునిలాంటివాడు భగవంతుడు. ఇక, యీ భగవంతుణ్ణి వర్ణిస్తూ ద్వితీయోపదేశకాండం "యావే దహించే అగ్నిలాంటివాడు. అతడు అసూయాపరుడైన దేవుడు" అంటుంది – 4,24. ఈ లక్షణాలే క్రీస్తుకూ వర్తిస్తాయి. భగవంతుడు దహించే అగ్నిలాంటివాడు. అగ్ని చెట్టుచేమలను కాల్చి నుసి చేస్తుంది. అలాగే భగవంతుడు తన్నెదిరించినవారిని భస్మం చేస్తాడు. అతడు అసూయాపరుడైన దేవుడు. అనగా అన్యదైవతాలను ఆరాధిస్తే సహించేవాడు కాడు. ఇక యీ రెండవ అధ్యాయంలో భక్తుడు ప్రియురాలితో పోల్చబడ్డాడని చెప్పాం. వరుడు వధువు హృదయంలోని అన్య ప్రేమలను సహింపడుగదా! భగవంతుడు గూడ మన హృదయంలో అన్య ప్రేమలుంటే సహింపడు. అతనిపై కాకుండ దేనిమీద దృష్టి పెట్టుకున్నా అది అన్యప్రేమే. ఆ ప్రభువునకు తన పట్ల గాఢభక్తి లేనివారియెడల సంతసం కలుగదు. కనుక క్రైస్తవ ప్రజలమైన మనం విశుద్ధురాలైన వధువులాగ, అనన్యభక్తితో, ఏకాగ్రదృష్టితో, ఆప్రభువును సేవిద్దాం. ప్రేమిద్దాం. అతని కిష్టపడే ప్రియవధువులా ప్రవర్తిద్దాం.

# 3. తోటమాలి – తోట

27. పూర్వవేదం భగవంతుణ్ణి తోటమాలితో ఉపమిస్తుంది. యూదులను ద్రాక్షతోటతో పోలుస్తుంది. గోదుమ, ఓలివు తోటలు, ద్రాక్షతోటలు ఇవిమూడు పాలస్తీనా దేశంలో పండే సామాన్యపంటలు. బైబులు దేశాల్లో ద్రాక్షతోటలను విరివిగా పెంచేవాళ్ళు సుమేరియా, బాబిలోనియా, మొదలైన పాలస్తీనా సమీప దేశాల్లో ద్రాక్షసారాయాన్ని ప్రాణంగా భావించేవాళ్ళు. ఈ సారాయాన్ని సమాధుల్లో క్రుమ్మరించేవాళ్ళు. అది చనిపోయిన వాళ్ళకు అమరత్వాన్నిస్తుందని అభిప్రాయపడేవాళ్ళు. యూదుల భావాల ప్రకారం ద్రాక్షసారాయం ద్రాక్షపండ్ల నెత్తురు! నెత్తురులో ప్రాణముంటుంది. కనుక ద్రాక్షసారాయం జీవాన్నిస్తుంది అన్నారు. కొందరు రబ్బయిలు ఏదెనులోని మంచిసెబ్బరలు తెలియజేసే చెట్టుకూడ ద్రాక్షచెట్టేనని బోధించారు. నూత్నవేదంలో ద్రాక్షసారాయం మెస్సీయా వచ్చిన రోజులను సూచిస్తుంది – మత్త 9,17.

28. మొదట ద్రాక్షతోటను నాటినవాడు నోవా – ఆది 9,20. ఈ ద్రాక్షతోట ద్వారా, జల ప్రళయానికి తప్పి బ్రదికిన జనులను దేవుడు సంతోషచిత్తులను జేసాడు. మెస్సీయా రోజులు వచ్చినపుడు జనులు వారివారి తోటల్లో అత్తిచెట్ల క్రింద, ద్రాక్షతీగల క్రింద విశ్రాంతి తీసుకుంటారని చెప్పబడింది –1 రాజు, 4, 24. అనగా ద్రాక్షతోట విశ్రాంతి చిహ్నం. ఇక వరునికి యింట్లో భార్య యెలాగో, పొలములో ద్రాక్షతోట ఆలాగు – కీర్త 128,3. గృహిణి సంతానవతి ఔతుంది. ద్రాక్షలత ఫలిస్తుంది. ఆహాబు రాజు

దుష్టుడై నాబోతు ద్రాక్షతోటను అపహరించాడు. దానివల్ల అతని భార్యను అపహరించినంత పాపం కట్టుకున్నాడు - 1 రా 21, 1-16. ద్రాక్షసారాయం నరుల హృదయాలను సంతోష పెడుతుంది అంటుంది కీర్తన 104,15.

29. ద్రాక్షతోట యూదుల సంస్కృతితో మిళితమైపోయింది. ఆ ప్రజలు ఓ ద్రాక్షతోట లాంటివాళ్ళు. వాళ్ళు కొలిచే యావే ఆ తోటను పెంచే కాపులాంటివాడు. కాని ప్రజలు దుష్టహృదయంతో ప్రభువును ఆరాధించటం మానివేసారు. అంచేత బీడుపడిన తోటలా పాడయిపోయారు. ఈ యంశాన్నే యెషయా ప్రవక్త తన ప్రవచనం 5వ అధ్యాయంలో మనోహరంగా వర్ణించాడు. ప్రభువు ఓ కొండమీద నేలను త్రవ్వి, రాళ్లను ఏరి, ద్రాక్షతోట నాటించాడు. అది మంచి పండ్లు ఫలిస్తుందని గంపెడాశతో ఎదురు చూచాడు. కాని ఆ తోట చివరకు పిచ్చికాయలు కాసింది. ప్రభువు ఆగ్రహంతో దాని కంచెను నరికివేసాడు. గోడ పడగొట్టాడు. గొడ్డుగోద మొక్కలను త్రొక్కివేసాయి. తోటను మేసిపోయాయి. దానిలో గచ్చపొద లెదిగాయి. ఆ విధంగా ప్రభువు తోట పాడువడింది. ప్రవక్త ఈ యుపమానం వివరించి "యిస్రాయేలు వంశము సైన్యముల కధిపతియైన యావే ద్రాక్షతోట" అని చెప్పి ముగించాడు. యూదుల్లో నీతి నియమాలు అడుగంటి పోవడంవల్ల పాడయిపోయిన ద్రాక్షతోటలాగ తయారయ్యారని భావం - 5,7.

30. యిర్మీయా ప్రవక్తగూడ ఈ వుపమానాన్ని ఎత్తుకున్నాడు. ప్రభువు తన ప్రజనుద్దేశించి "నేను నిన్ను మేలుజాతి ద్రాక్షతీగనుగా నాటానుగదా, కాని నీవు పాడు రకపు తీగగా యేలా తయారయ్యావు?" అని అడుగుతాడు - 22,21. "ఆ తోటను నాశం చేయండి. ఆ చెట్ల కొమ్మలను నరికివేయండి." అంటాడు-5,10. యెహెజ్కేలు ప్రవక్తగూడ ఈ వుపమానాన్ని అందుకున్నాడు. ప్రభువు యిస్రాయేలు నుద్దేశించి "నీ తల్లి నీటిచెంత నాటబడిన ద్రాక్షతీగలాంటిది. అది ఆకుదొడగి కాయలు కాచింది" అంటాడు. కాని యీ చెట్టు సత్ఫలితాన్ని ఈయదు. అంచేత ప్రభువు ఆజ్ఞపై దాన్ని పెరికివేసి నేలమీద పడవేస్తారు. తూర్పుగాలిసోకి దాని ఆకులూ కాయలూ యెండిపోతాయి - 19,10-12. ఈలా యిస్రాయేలు సమాజం యావేను విడనాడడంవల్ల పాడుపడిన తోటలా తయారౌతుంది. ప్రభువు శాపానికి గురై నాశమైపోతుంది.

31. కాని ప్రభువు ద్రాక్షతోట మీద మళ్లా దయజూపుతాడు. తానే స్వయంగా ఆ తోటను కాపాడుతాడు. "యావేనైన నేనే దానికి కాపుగాస్తాను. ఆకులు రాలిపోతాయేమోనని ప్రతి క్షణం దానికి నీరు కడతాను. దివారాత్రులు దానికి కాపలా వుంటాను" అంటాడు - యెష 27,3. ఎనభైయవ కీర్తన వ్రాసిన రచయిత భావాల

ప్రకారం ప్రభువు యిస్రాయేలనే ద్రాక్షతీగను ఐగుప్తునుండి పెకలించుకొని వచ్చాడు. దానిని పాలస్తీనా దేశంలో నాటాడు. అది మూడు పూవులు ఆరు కాయలుగా వర్థిల్లింది. ఆమీద కాపు గాయడం మానివేసింది. అంచేత ప్రభువు ఆ తీగపై కోపపడి దాన్ని నాశంజేయబోతాడు. కీర్తనకారుడు "సైన్యములు కధిపతియైన ప్రభూ! శాంతించు! ఆకాశంనుండి వోమారు యిటుచూడు. ఈ ద్రాక్షతోటను పరికించు. ఈ మొక్కను దర్శించు. నీ కుడి చేతితో నాటిన ఈ తీగను కాపాడు" అని సవినయంగా మనవిచేస్తాడు - 80, 8-16. ఇది చాల సొంపయిన భావం అనాలి.

32. ఇక నూత్నవేదంలో యూద సమాజానికి మారుగా క్రైస్తవ సమాజం దేవునితోట ఔతుంది. యావేపట్ల, అతడు పంపే మెస్సీయాపట్ల భక్తినిజూపే శేషజనాన్ని యెషయా ప్రవక్త యావేనాటిన తోట అని పేర్కొన్నాడు.

33. క్రీస్తుకు కొంచెం పూర్వం వర్థిల్లిన కుమ్రాను సమాజం "మేము యావే శాశ్వతంగా నాటిన తోట" అనుకున్నారు. సువార్తాకారుల భావాల ప్రకారం, ద్రాక్షతోట అంటే మెస్సీయాను అంగీకరించే నూత్నవేద ప్రజల సమాజం. ఇదే దైవరాజ్యం అనబడుతుంది. ఈ తోటకు యావే ప్రభువే కాపు. మార్కు 12, 1-12లో దుర్మార్గులైన తోటకాపుల వుదంతం చెప్పబడింది. వీళ్లు యజమానుని కుమారునిగూడ పట్టుకొని చంపుతారు. కనుక భూస్వామి ద్రాక్షతోటను ఇతరులకు గుత్తకిస్తాడు. ఇక్కడ యీ దుర్మార్గులైన కాపులు యూదప్రజలు. దైవరాజ్య మనబడే తోట వీరినుండి తొలగింపబడుతుంది. క్రొత్త కౌలుదారులకు ఈయబడుతుంది. వాళ్లే క్రైస్తవులు. అనగా మెస్సియా వచ్చాక దైవ రాజ్యం యూదులనుండి క్రైస్తవులకు సంక్రమిస్తుంది అని భావం.

ఈలాగే ద్రాక్షతోటను వర్ణించే సామెతలు ఇంకారెండు ఉన్నాయి. మత్త 20, 1-16 ద్రాక్షతోటకు ఆలస్యంగా వచ్చిన పనివాళ్ళుకూడ మొదటవచ్చిన కూలీలు పొందినంత వేతనం పొందారని చెప్తుంది. ఇక్కడ మొదటవచ్చిన పనివాళ్ళు యూదులు, ఆలస్యంగావచ్చిన పనివాళ్ళు క్రైస్తవులు. ప్రభువు ఆలస్యంగా వచ్చిన కూలివాళ్లను కూడ కరుణతో ఆదరిస్తాడు. అనగా ద్రాక్షతోట అనబడే దైవరాజ్యం క్రైస్తవులకుకూడ దక్కుతుందని భావం.

మత్తయి 21, 28-32 ఇద్దరు కుమారుల ఉదంతం చెప్తుంది. ఒకడు తోటకు వెళ్తానని వెళ్లలేదు. రెండవవాడు వెళ్లనని గూడ చివరకు వెళ్లాడు. యూదులు వెళ్తానని చెప్పి గూడ వెళ్లనివాని లాంటివాళ్లు. క్రైస్తవులు వెళ్లనని చెప్పి పశ్చాత్తాపపడి వెళ్లినవాడి లాంటివాళ్ళు. అనగా నూత్న వేద ప్రజలు దైవరాజ్యమనే తోటలో పనిచేస్తారు. యూదులు పనిచేయరు. ఈలా యీ సామెతలు మూడూ నూత్నవేద ప్రజలు యావే ద్రాక్షతోట అనే భావాన్ని వ్యక్తం చేస్తాయి.

34. పై రెండంశాల్లోను మనం చూచిన భావాలు మొదటి మూడు సువార్తలకు చెందినవి. యూద సమాజమూ క్రైస్తవ సమాజమూ దేవుడు జాగ్రత్తగా పెంచుకునే తోటలాంటివాళ్లని ఈసువార్తల భావం. కాని నాల్గవ సువార్తకారుడైన యోహాను ఓ క్రొత్తభావాన్ని ప్రవేశపెట్టాడు. కనుక అతనిభావాన్ని ప్రత్యేకంగా విచారించి చూడాలి. నాల్గవ సువార్త 15, 1–10 ద్రాక్ష తోటను వర్ణిస్తుంది. ద్రాక్షతీగ ఉపమానంగా తీసికొని యోహాను క్రీస్తునకు క్రైస్తవులకు వుండే ఐక్యభావాన్ని విశదం చేసాడు.

మొదట, క్రీస్తు "నిజమైన ద్రాక్షతీగ". యూదులు చెడ్డతోట లాంటివాళ్ళు, పాడుతీగల్లాంటివాళ్ళు. తండ్రి ఆశించిన నిజమైనతోట, మంచితోట, క్రీస్తు. ఈ తోటకు తండ్రే కాపు. క్రీస్తు అనే తీగలోని పనికిరాని రెమ్మలను తండ్రి కత్తిరిస్తాడు. ఆ మొక్కను చక్కపరుస్తాడు, అప్పుడు ఆ తీగ చక్కగా ఫలిస్తుంది – 15, 1–3. ఇక్కడ క్రీస్తు అనే ద్రాక్షతీగ, లేక తోట, తండ్రి ఆశించినట్లే మంచి ఫలాలిచ్చిందని భావం. పూర్వవేదప్రజలనే తోట యావే కోరినట్లుగా మంచి పండ్లీయలేదని విన్నాంకదా! క్రీస్తు నిజమైన యిస్రాయేలు. తండ్రి స్వయంగా నాటినతోట. యావే సేద్యగాడై స్వయంగా పెంచిన ద్రాక్షతీగ. అతడు ఆ తండ్రి కోరినట్లే సత్ఫలితాన్నిస్తాడు.

35. ఇక, క్రీస్తు ద్రాక్షతీగైతే మనం ఆతీగలోనికి అతుక్కొని పోయిన కొమ్మలం ఎవడు ఆ క్రీస్తులోనికి అతుక్కొనిపోతాడో వాడు చక్కగా ఫలిస్తాడు. తల్లి తీగలోని సారం కొమ్మల్లోనికి వస్తుంది. ఆకులు పూలు కాయలుగా మారిపోతుంది. ఆలాగే క్రైస్తవునిలోనికి గూడ క్రీస్తు సారంవస్తుంది. అదేవరప్రసాదం. దానిద్వారా నరుడు జంతు ప్రవృత్తిని విడనాడి దివ్యజీవితం జీవిస్తాడు. ఈలా క్రీస్తులోనికి అతుక్కొనిపోవడం లేక ఐక్యంగావడమనేది రెండు క్రియల ద్వారా సిద్ధిస్తుంది. మొదటిది, నరుడు క్రీస్తుని విశ్వసించాలి. రెండవది, అతనిలోనికి జ్ఞానస్నానం పొందాలి. ఈ విశ్వాస జ్ఞానస్నానాల ద్వారా మనం క్రీస్తుతో సంబంధం కలిగించుకుంటాం. అతనితో ఐక్యమౌతాం. ఈ యైక్యభావాన్ని వివరించడానికే పౌలు దేహం, అవయవాలు అనే ఉపమానం వాడాడు. యోహాను తీగ – కొమ్మలు అనే ఉపమానం చెప్పాడు. పేత్రు మూలరాయి – దానిమీద కట్టబడే భవనం అనే ఉపమానం ఇచ్చాడు. వీటన్నిటిల్లోను భావం ఒకటే – క్రీస్తుతో ఐక్యంగావడం.

36. క్రీస్తు ద్రాక్షతీగ, మనం ఆ తీగలోనికి అతుక్కొని పోయిన కొమ్మలం అన్నాం. కనుక యిక్కడ ఫలితం రెండు రూపాలుగా వుంటుంది. ఎవడు క్రీస్తులోనికి ఐక్యమౌతాడో వాడు చక్కగా పండ్లు పండుతాడు – 15,5. ఇది సత్ఫలితం. క్రీస్తు అనే తీగతో ఐక్యంగాని కొమ్మ కాయలుకాయదు – 15,3. కనుక ఆలాంటి రెమ్మను నరకి పారవేస్తారు. నిప్పులో

తగుల బెడతారు - 15,6. ఇది దుష్ఫలితం. క్రీస్తులోనికి ఐక్యమై చక్కగా పండ్లు పండేవాళ్ళు తండ్రిని మహిమ పరుస్తారు - 15,8. దీనిద్వారా క్రీస్తు, ఆ క్రీస్తూలోనికి ఐక్యమై అతని శిష్యులైన జనులూ సంతోషిస్తారు. బైబులు రచయితలంతా ద్రాక్షతీగను దేవుని ప్రజకు ఉపమానంగా వాడారు. దేవుడా ప్రజను ఆదరంతో చూస్తాడని చెప్పారు. యోహానుమాత్రం ఈ యుపమానాన్ని క్రీస్తుకూ అతని శిష్యులకూ వుండే ఐక్యతాభావాన్ని సూచించడానికి వాడాడు. ఇది అతని ప్రత్యేకత.

37 ఇక, యీ ద్రాక్షతీగ అనే ఉపమానం చాల ప్రార్థనా భావాలకు ఉపకరిస్తుంది. ద్రాక్ష పండును చిదిమి రసం తీస్తారు. కనుక బైబుల్లో ఈ పండు బాధలనుభవించడాన్ని, నెత్తురు చిందడాన్ని సూచిస్తుంది. యెషయా ప్రవచనంలో యావే తన శత్రువులను గూర్చి మాటలాడుతూ " వాళ్ళను ద్రాక్ష పండ్లను తొట్టిలోపెట్టి త్రొక్కినట్లుగా త్రొక్కాను" అంటాడు- 63,3. ఇక్కడ త్రొక్కిన ద్రాక్షపండ్లు రసాన్ని కార్చినట్లుగా శత్రువులు కూడ నెత్తురు కారుస్తారని భావం. పైగా ద్రాక్షపండు నెత్తురే దాని రసం. ఇదే భావాన్ని నూత్నవేదం క్రీస్తుకు గూడ అన్వయిస్తుంది. "ఈ పాత్రం మీ కొరకు చిందబడే నారక్తంతో ముద్రితమైన నూతన నిబంధనం" అంటాడు ప్రభువు - లూకా 22,20. ఇక్కడ ద్రాక్షపండు నలిగి రసాన్ని చిందించినట్లుగానే క్రీస్తు దెబ్బలవలన నలిగి నెత్తురు చిందిస్తాడనే భావం ధ్వనిస్తుంది. మనము ఈ పాత్రను పుచ్చుకొనేపుడెల్లా ప్రభు బాధలను జ్ఞాపకం జేసికుంటూంటాం. పౌలు ప్రభు వాక్యాలను ఉదాహరిస్తు ఈలా వ్రాసాడు. "ఈ పాత్ర నా రక్తంతో ముద్రితమైన క్రొత్త నిబంధనం. నన్ను జ్ఞాపకం చేసికొనటానికి దీనిని పుచ్చుకొనండి. మీరు ఈ రొట్టెను భుజించి, ఈ పాత్రను పుచ్చుకునేపుడెల్లా ప్రభువు మరల విజయం చేసిందాక ఆయన మరణాన్ని ప్రకటిస్తూంటారు" - 1 కొ 11, 25-26. కనుక మనం ద్రాక్షసారాయపు రూపంలో వున్న ఈ పాత్రద్వారా క్రీస్తు మరణాన్ని స్మరించుకుంటూండాలి. దివ్య పూజద్వారా రోజురోజు ఈ స్మరణాన్ని కొనసాగించుకుంటూండాలి.

38. ద్రాక్షసారాయం బలులకు, నిబంధనకు సూచకంగా గూడ వుంటుంది. బైబులు ప్రజలు బలుల్లో ద్రాక్షసారాయాన్ని వాడేవాళ్లు. బల్యర్పణంలో ఈ సారాయాన్ని బలిపశువు నెత్తుటికి బదులుగానైన వాడేవారు. లేక ఆ నెత్తుటిలో కలిపైనా వాడేవారు. ద్వితీయోపదేశకాండం 32, 38 ఈ యాచారాన్ని పేర్కొంటుంది. క్రీస్తుకూడా క్రొత్త నిబంధన కోసమైన తన సిలువబలిలో సొంత నెత్తురు చిందించాడుగదా! తాను చిందించే ఈ నెత్తుటికి బదులుగానే అతడు కడపటివిందులో ద్రాక్షసారాయాన్ని వాడాడు. అందుకే అతడు పాత్రనందుకొని "ఈ పాత్రం మీ కొరకు చిందబడే నా రక్తంతో ముద్రితమైన నూతన నిబంధనం" అంటాడు - లూకా 22,20. ఇక్కడ పాత్రలోని ద్రాక్ష సారాయం

ప్రభురక్తం. ఈ రక్తాన్ని చిందించడం వలన ప్రభువు నూతన నిబంధనను నెలకొల్పగలిగాడు. పూర్వ నిబంధనం ద్వారా యూదులు యావే ప్రజలైనట్లే, ఈ క్రొత్త నిబంధనం ద్వారా మనం క్రీస్తు ప్రజల మౌతాం. ఈలా ద్రాక్షసారాయం ఈ క్రొత్త నిబంధనను కూడ జ్ఞాపకానికి తెస్తుంది. రోజురోజు మన పీఠాలమీద కొనసాగే పూజబలి ఈ సత్యాన్నే సార్థకం చేస్తుంది.

39, ద్రాక్షసారాయం విందును సూచిస్తుంది. దివ్యసత్ప్రసాదానికి మోక్షానికి సంకేతంగా వుంటుంది. పూర్వవేద ప్రజలకు విందులోని ఓ ప్రధానభాగం ద్రాక్షసారాయం. అందుకే 23వ కీర్తన "నీవు నాకు విందును సిద్ధం చేసావు. నూనెతో నా తల అంటావు. నా పాత్ర నిండి పొర్లుతూవుంది" అంటుంది. ప్రభువు మనలను మోక్షపు విందుకు ఆహ్వానిస్తాడు. ఈ మోక్షపు విందులోకూడ ద్రాక్ష సారాయపు ప్రస్తావనం వుంటుంది. అందుకే క్రీస్తు "ఇది మొదలుకొని మీతోకూడ నా తండ్రి రాజ్యంలో క్రొత్తగా ద్రాక్షసారాయాన్ని పానంజేసిందాకా దానినిక నేను త్రాగను" అంటాడు - మత్త 26,29. ఇక్కడ పేర్కొనబడిన ఈ ద్రాక్ష సారాయము మరేమో కాదు. మోక్ష భాగ్యమే. యూదుల ఆచారాన్ననుసరించి ఇక్కడ ప్రభువు ఈ భావాన్ని వాడాడు అంతే. ఇక, ద్రాక్ష సారాయం దివ్యసత్ప్రసాదానికిగూడ సాంకేతికంగా వుంటుంది. పాత్రను పుచ్చుకున్నపుడు ప్రభురక్తాన్నే పుచ్చుకుంటున్నామని మన విశ్వాసం. ఈ భావంతోనే పౌలు ఎవడు అయోగ్యంగా ప్రభువు రొట్టెను భుజించి, ఆయన పాత్రను పుచ్చుకుంటాడో వాడు ప్రభు శరీరరక్తాలకు వ్యతిరేకంగా అపరాధం చేస్తాడు అని చెప్పాడు - 1 కొ 11,27. ఇలా ద్రాక్షసారాయం మోక్షాన్ని, మోక్షపు విందును, దివ్యసత్ప్రసాదాన్ని సూచిస్తుంది.

40. మన దేశీయులు వైదిక కాలంలో సోమం అనబడే తీగనుండి తయారు చేయబడిన రసాన్ని సేవించేవాళ్లు. దీన్నే సోమరసం అనేవాళ్లు. ఈ సోమరసాన్ని యజ్ఞాల్లో వాడేవాళ్లు. కనుక అది పవిత్రమైంది. కాని యీ దేశీయులు ద్రాక్షసారాయానికి ఎప్పుడూ అలవాటు పడలేదు. అసలిది ద్రాక్షలు సమృద్ధిగా పెరిగే దేశం కానేకాదు. పైగా ద్రాక్ష సారాయం సేవించడం ఈ దేశంలో తప్పుగా భావింపబడుతుంది. ఇలాంటి పరిస్థితుల్లో ఈ పానీయాన్ని గూర్చిన పై బైబులు భావాలనూ, బైబులు సంస్కృతినీ మనం అట్టే మెచ్చుకోలేం. క్రీస్తే ఈ దేశంలో పుట్టిపెరిగినట్లైతే తన రక్తానికి సంకేతంగా ఏ పానీయాన్ని వాడేవాడో మనకు తెలీదు. కాని మన సంస్కృతికి అందుబాటులో వున్నా లేకపోయినా, ద్రాక్ష సారాయాన్ని గూర్చి బైబులు సూచించే సంకేతాలను మాత్రం మనం చక్కగా అర్థం చేసికొనివుండాలి. లేకపోతే ప్రభు జీవితంలోని కొన్ని అంశాలు, విశేషంగా అతడు నెలకొల్పిన నూత్న నిబంధనలోని విశేషార్థం, దురవగాహమే ఔతుంది.

# 4. తండ్రి - కుమారుడు

41. బైబులు భగవంతుణ్ణి తండ్రితో ఉపమిస్తుంది. అతడు తండ్రి ఐతే యిస్రాయేలు పుత్రుడు. ఈజిప్టు నిర్గమంద్వారా యిస్రాయేలీయులు యావేబిడ్డగా రూపొందారు. ప్రభువు మోషేముఖాన "యిస్రాయేలు నా కుమారుడు, నా జ్యేష్ఠపుత్రుడు. నన్ను ఆరాధించడానికి అతన్ని వెడలిపోనీ" అని ఫరోను ఆజ్ఞాపించాడు- నిర్గ 4,22. ప్రభువు తన ప్రజను ఈజిప్టునుండి ఈవలకు గొనివచ్చి తన కుమారునిగా జేసికున్నాడు. అప్పటినుండి యావే యూదులకు పెంపుడు తండ్రి. వారతనికి పెంపుడు బిడ్డ లౌతారు. యావే ఆ ప్రజను రక్షించడంద్వారా వారికి తండ్రి అయ్యాడు. కనుకనే ప్రవక్త యెషయా "అబ్రాహాము మమ్ము ఎరుగక పోయినా, యిస్రాయేలు మమ్ము అంగీకరింపక పోయినా, యావే! నీవే మా తండ్రివి. అనాదికాలం నుండి మా విమోచకుడవని నీకే పేరు" అని ప్రభువును వేడుకొంటాడు- 63, 16. తరువాత యూదులు యావే తమకు ఎలా తండ్రి అయ్యాడా అని దీర్ఘకాలం మననం చేసికొని దాస్యవిముక్తితో పాటు సృష్టి చేయడం ద్వారా కూడ అతడు తమ తండ్రి అయ్యాడని చెప్పుకున్నారు. అందుకే యెషయా ప్రవక్త "ప్రభూ! నీవు మా తండ్రివి. మేము మట్టిమి. నీవు కుమ్మరివి. నీవే మమ్ములను చేసావు" అంటాడు 64,8.

42. రానురాను, భగవంతుని ఆజ్ఞల ప్రకారం జీవించే వాళ్లంతా అతని పుత్రులేననే భావం ప్రచారంలోనికి వచ్చింది. కీర్తనకారుడు "నా తల్లిదండ్రులు నన్ను విడనాడినా యావే నన్ను చేరదీస్తాడు. ప్రభూ! నీ మార్గన్ని నాకు బోధించు" అంటాడు - - 28,10. ఇక్కడ మార్గమంటే ఆయన ఆజ్ఞలే. సామెతల గ్రంథకర్త "నాయనా! యావే శిక్షను తృణీకరింపవద్దు. ఆయన మందలించినపుడు విసుగుకోవద్దు. తండ్రి తన ప్రియకుమారుని చక్కదిద్దినట్లే యావే తన కిష్టుడైన నరుని మందలిస్తాడు" అంటాడు - 3,11 -12. సోలోమోను జ్ఞానంకూడ "నీతిమంతుడే దేవుని కుమారుడైతే యావే అతని పక్షంపూని శత్రువులనుండి కాపాడడా?" అని అడుగుతుంది - 2,18. కనుక ఈ వాక్యాలన్నిటిలోను దేవుని ఆజ్ఞానువర్తియై చరించే నరుడు ఆయనకు బిడ్డలాంటివాడని భావం. కాని పూర్వవేదం ఈ భావాన్ని యిస్రాయేలు ప్రజలకు మాత్రమే వర్తింప జేసింది. యిస్రాయేలీయులు కాని అన్యజాతీయులు కూడ దేవుని బిడ్డలేనని పూర్వ వేదమెక్కడా స్పష్టంగా చెప్పదు.

43. రాజు ప్రత్యేకవిధంగా దేవుని కుమారుడనే భావం కూడ క్రమేణ ప్రచారంలోనికి వచ్చింది. దావీదునకు కలుగబోయే కుమారుడు సొలోమోనునుగూర్చి

యావే "నేనతనికి తండ్రినై యుంటాను, అతడు నాకు కుమారుడై యుంటాడు" అని చెప్తాడు-2 సమూ 7,14. యావే ఈ రాజును ఎన్నుకోవడంద్వారా అతనికి తండ్రి ఔతాడు. రాజు యావేకు విధేయుడై యుండడంద్వారా అతనికి కుమారుడౌతాడు. అలాగే రాజునుగూర్చి నుడివే రెండవకీర్తనలోకూడ యావే "నీవు నా కుమారుడవు నేను నిన్ను కన్నాను" అంటాడు-7,7. ఈ విధంగా యిస్రాయేలు రాజులు యావేకు ప్రత్యేకవిధంగా పుత్రులౌతారు. ఈ రాజుల కోవలోవచ్చినవాడే క్రీస్తు. అతడు మెస్సీయా, రాజు. కనుక రాజుల్లాగే అతడూ యావే పుత్రుడు.

44. క్రీస్తు వచ్చాక శిష్యబృందాన్ని కూర్చుకున్నాడు. ఈ బృందం ఓ సమాజం. ఈసమాజం దేవుణ్ణి "తండ్రీ" అని పిలుస్తుంది. క్రీస్తు రాకముందు యూదులు తమ జాతివాళ్లు మాత్రమే దేవుని బిడ్డలు అనుకున్నారు. పైన మన ముదాహరించిన "తండ్రి తన ప్రియకుమారుని చక్కదిద్దినట్లే యావే తన కిష్టుడైన నరుని మందలిస్తాడు" అనే సామెతల పొత్తంలోని వాక్యానికి అన్వయంచెప్తూ యూదుల రబ్బయులు, యావే కిష్టులైన నరులు యూదులు మాత్రమేనని వ్యాఖ్య చెప్పారు. కాని క్రీస్తు ఈ సంకుచిత మనస్తత్వాన్ని గర్హించి జనులందరు దేవుని బిడ్డలేనని నుడివాడు. "తూర్పు పడమర దేశాలనుండి వచ్చిన అన్యజాతివాళ్లు పరలోక రాజ్యంలో చేరతారు. రాజ్యపు వారసులైన యూదులు మాత్రం చీకటిలోనికి నెట్టబడతారు" అని బోధించాడు- మత్త 8,12.

45. ఇక క్రీస్తు బోధించిన యీ పరలోకపు తండ్రి ఏలాంటివాడు? తన బిడ్డలను వాత్సల్యంతో ఆదరించేవాడు. ఆయన తన పుత్రుల అవసరాలను అడక్కుండానే తెలిసికుంటాడు- మత్త 6,32. వాళ్లకు సెబ్బర వస్తువులనుగాదు, మేలివస్తువులనే యిస్తాడు - 7,11. భూలోకంలోని మన తండ్రులు మనలనెంత ఆదరణతో చూచుకుంటారో ఆ పరలోకంలోని తండ్రి మనలను అంతకన్నా అధికమైన ఆదరంతో చూచుకుంటాడు. ఒకవేళ మనం పొరపాటున త్రోవతప్పి పోయినట్లయితే అతడు మనలను కఠినంగా శిక్షింపడు. తప్పిపోయిన కుర్రవానికొరకు తండ్రి యెదురు చూచినట్లుగా మనకోసం ఎదురు చూస్తాడు. జారిపోయిన గొర్రెలను కాపరి వెదుక్కుంటూ వెళ్లినట్లుగా మనలనువెదుక్కుంటూ వస్తాడు. పడిపోయిన నాణాన్ని గృహిణి గాలించి నట్లుగా మనలనుగూడ గాలిస్తాడు లూకా - 15. వేయేల, అతడు కరుణామయుడైన తండ్రి.

46. నరుడు ఈ తండ్రిని తన తండ్రినిగా అంగీకరించాలి. మత్త 23,9. తన అక్కరల్లో బిడ్డడు తండ్రి నడిగినట్లుగా నమ్మకంతో ఈతండ్రి నడుగుతూండాలి -7, 7-11. కూడుగుడ్డకోసంగూడ ఆ తండ్రిని నమ్మికతో అడగాలి. అతడు ఆకాశపక్షులను ఆహారంతో పోషించేవాడు. లిల్లీపుష్పాలను సొలోమోను వైభవంతో ధరించుకున్న

వస్త్రాలకంటె అందమైన ఉడుపులతో అలంకరించేవాడు. కాకులు పిచ్చుకలు మొదలైన ఆకాశ పక్షులకంటె, లిల్లీమొక్కలు మొదలైన గడ్డిపోచలకంటె నరుడు యోగ్యుడుకాడా? ఈలాంటి నరుణ్ణి దేవుడు ఇంకా అధికంగా ఆదరింపడా?- మత్త 6, 25-34.

47. పరలోకంలోని దేవుణ్ణి "తండ్రీ" అని పిలచే నరులు ఆ తండ్రి గుణాల్లో ఒక్కదాన్ని విశేషంగా అనుకరించాలి. ఆయనలాగే నరులుకూడ సన్మార్గులను దుర్మార్గులను, తమ శత్రువులనుగూడ ప్రేమించాలి - మత్త 5, 44-45. శిష్యులు తమ పగవారిని క్షమిస్తుండాలి - 18, 33. వాళ్లు పరలోకమందున్న తమ తండ్రివలె పరిపూర్ణులై యుండాలి- 5,48 ఏమిటి యీ పరిపూర్ణత్వం? లూకా 6,36ను బట్టి ఈ పరిపూర్ణత్వం శత్రువులనుగూడ కరుణతో క్షమించడమే. దుర్మార్గులను తన్ను ద్వేషించేవాళ్లనుగూడ కనికరంతో క్షమించి ఆదరించడం దేవుని లక్షణం. ఆ దేవునికి బిడ్డయైన నరుని లక్షణంగూడ ఈలాగే వుండాలి. అతడూ తన పగవారిని కనికరంతో క్షమించాలి, ఆదరించాలి.

48. ఇక, యీ క్రీస్తు తండ్రికి సహజకుమారుడు. అతని పుత్రత్వానికి మన పుత్రత్వానికి చాల భేదంవుంది. అందుకే అతడు మరియమగ్దలతో "నాతండ్రి మీతండ్రి అయిన దేవుని యొద్దకు ఆరోహణమై పోతున్నాను" అంటాడు - యోహా 20,18. అతడు పితకు ప్రియకుమారుడు. అనగా ఏకైక కుమారుడు - మార్కు 9,7. అనగా క్రీస్తు దేవునికి సహజకుమారుడు, మనం దత్తపుత్రులము మాత్రమే. అతడు తండ్రితో ఎంత సన్నిహితంగా మెలగుతాడనగా, ఆ తండ్రి రహస్యాలను కూడ తెలిసికోగలడు - మత్త 11,25. అతడు మాత్రమే ఆ ప్రభుని "నాయనా" అని సంబోధింపగలడు - మార్కు 14,36.

49. క్రీస్తు తండ్రికి ఏకైక కుమారుడు అన్నాం - యోహా 1 14. కనుక అతడు తండ్రితో సన్నిహిత సంబంధం కలవాడు. వాళ్లిద్దరూ ఒకే చిత్తం చొప్పున ప్రవర్తిస్తారు - యోహా 5, 30. ఇద్దరూ కలసి పని చేస్తూంటారు- 5,17. తండ్రి యందు కొడుకు, కొడుకునందు తండ్రి నెలకొనివుంటారు - 10,38. వాళ్ళిద్దరూ ఒకరి నొకరు ఎరిగిన వాళ్లు -10, 15. ఒకరినొకరు ప్రేమించేవాళ్లు - 15, 10 ఒకరినొకరు మహిమపరచుకునేవాళ్లు - 17,1. అసలు వాళ్లిద్దరూ ఒకటే. "నేను నా తండ్రీ ఏకమై యున్నాము" అన్నాడు క్రీస్తు -10,30. అందుకే ఆ క్రీస్తుద్వారా తప్పితే ఎవడూ తండ్రిచెంతకు వెళ్లలేడు - 14,6. ఆలాగే తండ్రి ఆకర్షించందే ఎవడూ క్రీస్తునొద్దకు రాలేడు -6, 44. క్రీస్తు తండ్రితో సరిసమానుడు-5, 18. అబ్రాహాముకంటే ముందుగా, అనగా అనాదినుండే వున్నవాడు-8, 58. తండ్రి వక్షస్థలాన నెలకొని వున్నవాడు 1,18. అనగా ఆ తండ్రికి సమీపంగా వున్నవాడు, తండ్రికి తుల్యంగా వున్నవాడు. ఆ కుమారుని లక్షణాలు ఈలాంటివి. ఈ లక్షణాలు కేవలం దత్తపుత్రులమైన మనకు చెల్లవు.

50. ఐనా యీ కుమారుడు మనుష్యావతారంలో తండ్రికి విధేయుడు. క్రీస్తును జీవంతో లేపింది తండ్రే - అచ 2,24. మన రక్షణాన్ని గూర్చి మొదట ఆలోచించిందీ తండ్రే. క్రీస్తు ద్వారా లోకాన్ని తనతో సమాధాన పరచుకోవాలనుకుంది తండ్రే - 2 కొ 5,19. ఆలా అనుకొని ఆయన తన కుమారుణ్ణి పంపాడు- గల 4,4. అతన్ని మన తరపున సమర్పించాడు - రోమ 8,32. అతనికి ఓ పనిని అప్పగించాడు - యోహా 17,4. ఓ మాట చెప్పమని ఆజ్ఞాపించాడు - 12 19. ఓ మానుష జాతిని రక్షింపమని ఆదేశించాడు- 6,39. అన్నింటికీ అదీ అంతమూ ఆతండ్రే-1 కొ 8,6. కుమారుడు ఈ తండ్రిమీద ఆధారపడతాడు - 5, 19. ఆయనకు లోబడతాడు- 1కొ 15,28. తండ్రి ఆ క్రీస్తునకు శిరస్సు లేక నాయకుడు - 1 కొ 11,3. ఈలా మనుష్యావతారంలో క్రీస్తు తండ్రికి బద్ధుడై చరిస్తాడు.

51. మన దైవపుత్రత్వానికి క్రీస్తు పుత్రత్వమే కారణం. అతనిద్వారా మనం దేవుని బిడ్డలమౌతాం. తన్ను అంగీకరించి విశ్వసించిన వాళ్లందరినీ అతడు దేవుని పుత్రులను చేస్తాడు- యోహా 1, 12. ఈ క్రీస్తు తన శిష్యులను ఆలించిన వాళ్ళను తన్ను ఆలించినట్లుగానే భావిస్తాడు- మత్త 18,5. తన శిష్యులను నా సోదరులు అని పేర్కొంటాడు - 28,10 తననూ పుత్రులలో ఒక్కణ్ణిగా భావించుకుంటాడు-17,27. ఈలా క్రీస్తు మన సోదరుడు. అతనిద్వారా మనం బిడ్డలమౌతాం.

52. క్రీస్తు పుత్రత్వానికి మన పుత్రత్వానికి గల సంబంధాన్ని చక్కగా విశదీకరించి చెప్పినవాడు పౌలు. భూలోకంలోని ప్రతి కుటుంబమూ పరలోకంలోని తండ్రినిబట్టే కుటుంబమని పిలువబడుతుంది. అనగా అందరికీ అతడే తండ్రి - ఎఫె 3,14.

ఈ తండ్రికి సహజపుత్రుడు క్రీస్తు అన్నాం. అతడు మనలను కూడ తన తండ్రికి దత్తపుత్రులను చేస్తాడు- గల 4,5. క్రీస్తును నమ్మి అతనిలోనికి జ్ఞానస్నానం పొందడంద్వారా మనం అతని తండ్రికి దత్తపుత్రుల మౌతాం - గల 3,26. క్రీస్తులోనికి ఐక్యమైనపుడు అతడు మన పెద్దన్న ఔతాడు. మనమంతా అతని తమ్ముళ్ళమూ చెల్లెళ్ళమూ ఔతాం. అతడు తన వారసాన్ని మనతో పంచుకుంటాడు- రోమ 8,17.

ఇక, క్రీస్తుద్వారా మనం పరలోకంలోని తండ్రికి దత్తపుత్రుల మయ్యేలా చేసేది ఆ క్రీస్తు ఆత్మయైన పరిశుద్ధాత్మ. ఈయాత్మ మనలోనికివచ్చి, క్రీస్తు తన తండ్రిని నాయనా అని పిలిచినట్లే మనమూ క్రీస్తు తండ్రిని చనువుతో "నాయనా" అని పిలిచేలా చేస్తుంది - గల 4,6. ఈ యాత్మ మనలోవుండి మనం దేవుని బిడ్డలమని మన ఆత్మకు బోధిస్తుంది - రోమ 8, 15-16. మనలను దేవుని కుమారులనుజేసి దేవుని కుమారుల్లాగ మెలిగేలా చేస్తుంది - 8, 14. ఈలా దేవుడు తన కుమారుని ఆత్మనే మనకు ప్రసాదిస్తాడు. ఈ యాత్మ క్రీస్తుతండ్రిని మన తండ్రిని చేస్తుంది. ఆ కుమారునిలాగే మనమూ ఆ తండ్రిని

చనువుతో "నాన్నా" అని పిలిచేలా చేస్తుంది. ఆ కుమారుని వారసమైన మోక్షంలో మనకూ భాగం పంచిపెడుతుంది. దేవుడు తన కుమారునికంటే, తన ఆత్మకంటే అధికంగా మనకు ఏమీయగలడు? దత్తపుత్రులం గావడమంటే ఈ భాగ్యాలన్నీ పొందడమే.

53, క్రీస్తు "తండ్రీ! నీ నామమం పరిశుద్ధపరచబడును గాక" అని తన తండ్రినిగూర్చి ప్రార్థించాడు. మనమూ ఆలాగే ప్రార్థన చేయాలని నేర్పాడు. అనగా తండ్రి క్రీస్తును ఏ చూపున జూస్తాడో మనలనూ ఆ చూపుననే జూస్తాడు. దీనిలో సందియ మేమిలేదు. యోహానుకూడ "మనం దేవుని బిడ్డలమని పిలువబడుతున్నామంటే దేవుడు మనలను నెంతగా ప్రేమించాడో విచారించండి. ఔను, మనం నిజంగా దేవుని బిడ్డలమే" అంటాడు- 1 యోహా 3, 1. అనగా "దేవుని బిడ్డలం" అనేది ఓ బిరుదు మాత్రమేగాదు, మనం యథార్థంగానే దేవుని బిడ్డలం. ఇక, ఎంతచెట్టుకు అంతగాలి. దేవునిబిడ్డలు దేవునిబిడ్డల్లాగే ప్రవర్తించాలి. విశేషంగా అతన్ని తండ్రిలా భావించాలి. అతనిపట్ల బిడ్డ తండ్రిపట్ల మెలగినట్లుగా మెలగాలి. నమ్మికతో అతన్ని 'నాన్నా' అనిపిలిచి ప్రార్థిస్తూండాలి. అతనినుండి సహాయం పొందుతూండాలి. పైగా ఆ దేవునికోసం, ఆదేవుని బిడ్డలే ఐన తోడి ప్రజలను గూడ ఆదరిస్తూండాలి. తండ్రిని ప్రేమించే బిడ్డలు ఆతండ్రి యితర బిడ్డలను ప్రేమించకపోరు- 1 యోహా 5,1. ఈ దైవప్రేమకు గాని సోదరప్రేమకుగాని క్రీస్తే మనకు ఆదర్శం. ఆతనిలాగే మనము మంచి కుమారుల్లాగా, అనగా ప్రేమభావంతో ప్రవర్తిస్తూండాలి. ఈ భాగ్యం కోసం ప్రార్థిద్దాం.

# 5. గృహనిర్మాత - గృహం

54. యూదులు భగవంతుణ్ణి గృహనిర్మాతతో పోల్చారు. అతడు కట్టిన గృహం తామే అనుకున్నారు. బైబులు వాక్యాలు చాలా ఈ వుపమానాన్ని స్మరింపజేస్తూంటాయి. యాకోబు తన కొరక యిల్లు కట్టుకున్నాడు - ఆది 33,17. కయీను తనకోసం ఓ నగరాన్ని నిర్మించుకున్నాడు - 4,17. ఈలా నరులు నిర్మించిన భవనాలను దేవుడు ఆశీర్వదించేవాడు. అతని ఆశీస్సులేందే నరుడు వృద్ధిచెందడు. అతని ప్రయత్నం ఫలింపదు. అందుకే కీర్తన కారుడు" యావే యిల్లుకట్టందే దాన్ని కట్టేవాళ్ళు కృతకృత్యులు కాలేరు" అంటాడు- 127,1. ఈ భగవంతుడు తొలి మానవునికి ఓయిల్లు కట్టిపెట్టాడు. అయిల్లే ఏవ. "యావే నరునినుండి తీసిన ప్రక్కటెముకను స్త్రీనిగా నిర్మించి ఆమెను ఆదామునొద్దకు తోడ్కొనివచ్చాడు" - ఆది 2, 22. ఈ దేవుడే దావీదునకు ఓ యిల్లు కట్టిపెట్టాడు. అయిల్లే దావీదు రాజవంశం, సొలోమోను మొదలైన రాజులు. ప్రవక్త నాతాను యావేమాటగా దావీదుతో "యావే నీకొరకయిల్లు కట్టిపెడతాడు" అంటాడు - 2, సమూ 7,11.

55. కాని యావేప్రభువు నరుని యింటిని కట్టేవాడు, పడగొట్టేవాడు కూడ. కనుకనే అతడు యిర్మీయాతో "నిన్ను పడగొట్టడానికి పెరికివేయడానికి, కట్టడానికి

నాటడానికి నా ప్రవక్తగా నియమించాను" అంటాడు- 1,10. ఇక్కడ ప్రజలు ఓభవనంగాను పొలంగాను ఉపమింప బడ్డారు. ప్రభువు ప్రవక్తద్వారా వాళ్ళను ఓయిల్లులాగా పడగొడతాడు. పొలంలోని పైరులాగా పెరికివేస్తాడు. ఇది ప్రభుశిక్ష. మళ్లా తన ప్రవక్తద్వారానే వాళ్లను ఓయిల్లులాగ కడతాడు. ఓ పొలంలోని పైరులాగ నాటుతాడు. ఇది ప్రభువు సంభావనం. ఐనా ఈ ప్రభువు తన ప్రజలను శిక్షించడానికంటె సంభావించడానికే సంసిద్ధంగా వుంటాడు. అతడు ప్రవక్త యెషయా ముఖాన "నేను సియోనులో ఓ పునాదిరాయి వేస్తున్నాను. అది విలువగల మూలరాయి. సాక్ష్యపురాయి. నన్ను విశ్వసించేవాడు భంగపాటు నొందదు" అంటాడు - 28,16. అనగా యావే యెరూషలేములో ఓయిల్లు కట్టబోతున్నాడు. అతడు కట్టే యిల్లు మరేమోకాదు. మెస్సీయాచుట్టూ కూడే భక్తసమాజం. ఈ యింటికి లేక సమాజానికి మూలరాయి మెస్సీయా. ఈ మెస్సియాను విశ్వసించి అతని సమాజంలో చేరేవాళ్ళకు ముప్పులేదు. ఈ సమాజం యావేపట్ల భయభక్తులతో ప్రవర్తించిన "శేషసమాజం". ఈవిధంగా యావే తన ప్రజలను ఓ భవనంలాగ నిర్మిస్తాడు.

56. కీర్తనకారుడు "ఇల్లుకట్టేవాళ్లు నిరాకరించినరాయే మూలరాయి అయింది" అంటాడు - 118,22. మొదట ఈవాక్యం కీర్తనకారునికే అన్వయించింది. అతడు దిక్కూమొక్కూలేని దీనుడు. అన్యులచే నిరాకరింపబడినవాడు. ఐనా ప్రభువు అతన్ని ఆదరించాడు. అందుకే దైవప్రజల సమాజంలో ముఖ్యుడయ్యాడు. ఇది మొదటిభావం. కాని క్రమేణ ఈవాక్యం మెస్సీయాకు అన్వయింపబడింది. యూదులు మెస్సియాను నిరాకరిస్తారు. కానీ యావే అతన్ని ఎన్నుకొని తనసమాజానికి నాయకుణ్ణి చేసాడు. నూత్నవేదం పై మెస్సీయా ప్రవచనాన్ని, ఈ కీర్తనకారుని ప్రవచనాన్ని క్రీస్తుకు అన్వయించి అతడే మన పునాదిరాయి అని బోధిస్తుంది. పేత్రు యెషయా పేర్కొనిన "విలువగలరాయి" క్రీస్తేనంటాడు - 1 పేత్రు 2,7. పౌలుకూడ ఈ ప్రవచనాలను మనస్సులో పెట్టుకొని "క్రీస్తే మన పునాది" అంటాడు- 1 కొ 3,11. యావే క్రీస్తుని మనకు ఓభవనంగా ప్రసాదించాడు. క్రీస్తేమనయిల్లు, దేవాలయం. క్రీస్తు తన శరీరాలయాన్ని గూర్చే "ఈ యాలయాన్ని పడగొట్టండి, నేను మూడు దినాలల్లో దీన్ని తిరిగి నిర్మిస్తాను." అన్నాడు- యోహా 2,19.

57. ఇక యీక్రీస్తు ఓ భవనాన్ని కడతాడు. అతడు నిర్మించిన భవనం నూత్నవేద సమాజం. తిరుసభ. అతడు పేత్రుతో "పేత్రూ! నీవు రాయివి. ఈరాతిమీద నాసమాజాన్ని నిర్మిస్తాను" అంటాడు - మత్త 16,18. పూర్వవేదంలో యావే తనసమాజాన్ని నిర్మించాడు. అదే యిస్రాయేలు ప్రజ. అలాగే నూత్న వేదంలో క్రీస్తు తన సమాజాన్ని నిర్మిస్తాడు. అదే క్రైస్తవ ప్రజ. యావే పూర్వవేద ప్రజలను అబ్రాహామనే రాతిమీద నిర్మించాడని రబ్బయిలు

బోధించారు. అలాగే క్రీస్తు క్రొత్త యిస్రాయేలయిన నూత్నవేద ప్రజలను పేత్రు అనేరాతిమీద నిర్మించాడు. ఇదే ప్రవక్తలు పేర్కొనిన మెస్సీయా సమాజం, శేషసమాజం, క్రైస్తవసమాజం.

58. ఈ సమాజమనే భవనాన్ని క్రీస్తు నిర్మించాడన్నాం. ఈ భవనానికి పునాది అపోస్తలులు. అపోస్తలులు బోధించిన బోధల వలన ప్రజలు ఈ సమాజంలో చేరతారు. వాళ్లబోధలు ఈ సమాజానికి పునాదిలాంటివి- ఎఫె 2.20, కాని ఈ భవనానికి పునాది రాయిమాత్రం నిత్యం క్రీస్తే - 1కొ 3, 11. క్రీస్తుతో పాటే ఈభవన నిర్మాణంలో అపోస్తలులు గూడ తోడ్పడ్డారు. అందుకే పౌలు "మేము దేవునికి తోడి పనివాళ్లము. మీరు ఆ దేవుని పొలంగా, గృహంగా పరిగణింప బడతారు" అంటాడు- 1 కొ 3,9. తొలినాటి క్రైస్తవ సమాజాలను నిర్మించడానికి పౌలు ఎంతకృషి చేసాడో అతని 14 జాబులు చదివిన వాళ్ళకు బోధపడుతుంది. ఈ కృషినే అతడు దేవునితో కలసి పనిచేయడంగా భావించాడు.

59. ఇక క్రీస్తు అపోస్తలులు మాత్రమే తిరుసభ అనే భవనాన్ని నిర్మిస్తే చాలదు. ఎవరికి వాళ్లే ఈ భవనాన్ని నిర్మించుకుంటూ పోవాలి. అందుకే పేత్రు "మీరుకూడ సజీవశిలల్లాగ ఆధ్యాత్మిక మందిరములోనికి నిర్మింపబడండి" అంటాడు- 1 పేత్రు 2,5 యెరూషలేములో ఓ రాతి దేవాలయముందిగదా! దానితో పోల్చిచూచినట్లైతే క్రైస్తవ సమాజం శిలామందిరం కాదు. ఆధ్యాత్మిక మందిరం. మనం ఈ మందిరములోని సజీవ శిలలం. అనగా వ్యక్తిగతంగా బుద్ధిపూర్వకంగా క్రీస్తుని విశ్వసించాలి, చైతన్యంతో ఈ సమాజంలో పనిచేయాలి. పైగా మనంతటమనమే స్వయంగా ఈ క్రైస్తవ సమాజమనే మందిరంలోనికి నిర్మింపబడాలి.

60 క్రీస్తు నూత్నవేద సమాజమనే భవనాన్ని నిర్మించాడన్నాం. సోదరప్రేమ ఈ భవన నిర్మాణానికి తోడ్పడుతుంది. అంచేత మనం తోడి ప్రజను ప్రేమిస్తూ ఆదరిస్తూండాలి -1 కొ 8,1. అపోస్తలులు బోధించిన సత్యాలు ఈ భవనాభివృద్ధికి తోడ్పడతాయి. కనుక మనం ఈ సత్యాలను చక్కగా నేర్చుకొని ఇతరులకు బోధిస్తూండాలి - కొలో 2,6-7. ప్రార్థనం ఈ భవన నిర్మాణానికి తోడ్పడుతుంది. అంచేత మనం మనకొరకూ ఇతరుల కొరకూ ప్రార్థిస్తూండాలి - యూదా 20. మనల్ని మనం ఈ భవనంలోనికి నిర్మించుకొనడం మాత్రమేగాదు, ఇరుగుపొరుగువాళ్లనుగూడ ఈ భవనం లోనికి నిర్మించడం మన బాధ్యత - రోమ 15,2. కడన, ఈ క్రైస్తవ సమాజమనే భవనం దేవునికి వాసస్థలమని గుర్తించాలి. అనగా ఆ ప్రభువు దేవాలయంలో నెలకొని వున్నట్లుగా ఈ సమాజంలో నెలకొనివుంటాడు. అందుకే పౌలు "ఆ క్రీస్తునందు మీరుకూడ ఇతరులతోపాటు ఓ ఆలయంగా కట్టబడుతూన్నారు. దేవుడు తన ఆత్మతో ఈ యాలయంలో వసిస్తాడు" అని వ్రాసాడు- ఎఫె 2,22 అంచేత మనం ఈ సమాజాన్ని గౌరవంతో చూస్తుండాలి. ఈ సమాజప్రజల్లో దేవుని, అతని క్రీస్తును, అతని ఆత్మను గుర్తిస్తూండాలి.

# ౨. తండ్రి

బైబులు భాష్యం - 139

## విషయ సూచిక

1. దేవుడు క్రీస్తుకి తండ్రి
2. దేవుడు విశ్వాసులకు తండ్రి
3. దేవుని బిడ్డల ప్రవర్తనం
4. దైవ కటాక్షం
5. "అబ్బా" అనుభవం

ప్రభువు మరియ మగ్దలీనతో "నేను నా తండ్రి మీ తండ్రి, నా దేవుడు మీ దేవుడు ఐనవానియొద్దకు ఆరోహణమైపోతున్నానని నీవు నా శిష్యులతో చెప్పు" అన్నాడు- యోహా 20,27. యావే ప్రభువు క్రీస్తుకీ శిష్యులకూ కూడ తండ్రి. పైగా వాళ్లు అతనికి సోదరులు. ఇక్కడ మొదట తండ్రికీ క్రీస్తుకీ వున్న సంబంధాన్ని పరిశీలిద్దాం. ఆ పిమ్మట శిష్యులకూ పితకుమారులకూ గల సంబంధాన్ని విచారిద్దాం.

## 1. దేవుడు క్రీస్తుకి తండ్రి

### 1. క్రీస్తూ తండ్రీ ఒకరియందొకరు నెలకొని వుంటారు.

నేను తండ్రియందు, తండ్రి నాయందు ఉన్నామని మీరు విశ్వసించండి - యోహా 14,11. క్రీస్తుకీ పితకూ వుండే సంబంధం క్రీస్తుకీ శిష్యులకూ వుండే సంబంధం కంటె బలమైంది. పూర్వవేద ప్రజలకూ యావేకూ వుండే సంబంధంకంటె కూడ బలమైంది. కుమారుని జీవానికీ బోధలకూ అద్భుతాలకూ గూడ కేంద్రం పరమపితే - 14,10.

### 2. క్రీస్తూ తండ్రీ ఒకరినొకరు ప్రేమించుకొంటారు.

కుమారుడు తన ప్రాణాలను ధారపోస్తాడు కనుక పిత అతన్ని ప్రేమిస్తాడు - 10,17. కుమారుడు కూడ తండ్రిని ప్రేమించి అతడు ఆజ్ఞాపించిన సిలువ మరణానికి బద్ధుడయ్యాడు - 14,31. తండ్రికి తన పట్ల గల ప్రేమకు లొంగే, ఆ ప్రేమకు బదులు ప్రేమను చూపడానికే, క్రీస్తు సిలువ మరణాన్ని అంగీకరించాడు.

### 3. క్రీస్తు తండ్రి పరస్పర విధేయులు

తండ్రి చిత్తాన్ని నెరవేర్చి అతడు నియమించిన పనిని చేయడమే క్రీస్తుకి ఆహారం - 4,34. తండ్రి యిచ్చిన శ్రమల పాత్రను అతడు పానంజేసి తీరుతాడు- 18,11.

అతడు తన అద్భుతాలను తండ్రి నియమించినట్లుగానే చేసాడు. ఆలాగే అతని బోధలు కూడ తండ్రి బోధలే. తండ్రి నాకు నేర్పిన సంగతులనే నేను మీకు చెప్తున్నాను అన్నాడు క్రీస్తు - 8,28. కొన్ని పర్యాయాలు క్రీస్తు, తండ్రి నా కంటె గొప్పవాడు అని చెప్తాడు. నరావతారుడుగా అతడు దేవుని కంటె తక్కువవాడు. ఇదికూడ అతని విధేయతనే సూచిస్తుంది.

కుమారుడు అడిగినదంతా పిత ప్రేమతో చేస్తాడు. అతడు అడిగినంతనే జనకుడు పవిత్రాత్మను పంపుతాడు - 14,16. లాజరును జీవంతో లేపుతాడు - 11,41. దేవుడు అబ్రాహాము మోషేలాంటి మహా భక్తులు కోరినట్లుగా చేసాడని పూర్వవేదం చెప్తుంది. ఈ భక్తులు దేవుని చిత్తప్రకారం జీవించారు. కనుక అతడుకూడ వాళ్ల చెప్పినట్లు చేసాడు. క్రీస్తుకూడ తండ్రి చిత్తప్రకారం జీవించాడు కనుక, తండ్రి అతడు కోరినట్లు చేసాడు అనుకోవాలి. సుతుడు ఎల్లప్పుడు తండ్రికి ప్రీతి కచిగించే పనులు మాత్రమే చేసేవాడు- 8,29. కనుకనే జనకుడు అతనికి విధేయుడై అతనికి ప్రీతి కలిగించే పనులు చేసాడు.

## 4. పితసుతులకు ఒకరికొకరు తెలుసు

నన్ను నా తండ్రి యెరిగినట్లుగా నేనూ నా తండ్రిని ఎరుగుదును అన్నాడు ప్రభువు - 10,15. వాళ్లిద్దరికి పరస్పర జ్ఞానం వుంది. మనకుకూడ తండ్రీకుమారులు కొంతవరకు తెలుసు. కాని మన జ్ఞానం వేరు. ఆ తండ్రీ కుమారుల పరస్పర జ్ఞానం వేరు. అందుకే సమానాంతర సువిశేషాలు తండ్రి తప్ప ఎవరు కుమారుని ఎరుగరు. కుమారుడు తప్ప మరెవ్వరు తండ్రిని ఎరుగరు అని చెప్తాయి - మత్త 11,27. లూకా 10,22. దైవవ్యక్తులను గూర్చి దైవవ్యక్తులకే తెలుసుకాని నరమాత్రులమైన మనకేమి తెలుస్తుంది?

## 5. పితసుతులు ఒకరినొకరు మహిమపరచుకొంటారు.

క్రీస్తు "తండ్రీ! గడియ వచ్చినది. నీ కుమారుడు నిన్ను మహిమ పరచడానికి నీవు నీ కుమారుని మహిమ పరచు" అని ప్రార్థించాడు - 17, సిలువ మరణమూ ఉత్థానం ద్వారా కుమారుడు తండ్రిని మహిమపరుస్తాడు. ఈ కార్యాల ద్వారానే జనకుడు కూడ సుతుని మహిమపరుస్తాడు.

సమానాంతర సువిశేషాలూ, పౌలూ క్రీస్తు మరణాన్ని అవమానంగాను, ఉత్థానాన్ని మహిమనుగాను వర్ణించారు. కాని యోహాను సువిశేషం క్రీస్తు మరణాన్ని మహిమనుగా వర్ణిస్తుంది. ఎందుకు? దేవుడు ప్రేమస్వరూపుడు కదా! - 1 యోహా 4,8. ఆ ప్రేమకు ప్రబల చిహ్నం క్రీస్తు సిలువమరణం. కనుక క్రీస్తు మరణం మహిమాన్వితమైంది. స్నేహితుల కొరకు ప్రాణాన్ని ధారపోసేవాడికంటె ఎక్కువ ప్రేమగలవాడు ఎవడూలేడు - 15,13.

### 6. తండ్రీ కుమారుల ఐక్యత

క్రీస్తు నేనూ తండ్రీ ఒకటే అని చెప్పాడు - 10,20. అతడు తండ్రి గుణాన్ని తనకు ఆరోపించుకొన్నాడు. పూర్వవేదంలోని యావే ప్రభువు నేను ఉన్నవాడను అని మోషేకు చెప్పాడు - నిర్గ 3,14. దీనికి సమానంగా క్రీస్తుకూడ "నేనే ఆయనను" అని చెప్తుంటాడు - 18,5.

చాల పర్యాయాలు క్రీస్తు తండ్రిగుణాలు తనకు ఆరోపించుకొన్నాడు. పూర్వవేదంలో దేవుడు జీవజలం ఇచ్చేవాడు. క్రీస్తుకూడ జీవజల మిస్తాడు - 4,10. యావేలాగే క్రీస్తుకూడ మంచి కాపరి - 10,11. దేవుడు ప్రజలకు ఎడారిలో మన్నా భోజనం దయచేసాడు. క్రీస్తుకూడ జీవాహారం - 6,35. తండ్రిలాగే కుమారుడు కూడ వెలుగు- 8,12. తండ్రి జీవం కలవాడు. సుతుడుకూడ జీవమిచ్చేవాడు - 5,26. పితలాగే సుతుడుకూడ పనిచేసేవాడు -5,17. పవిత్రాత్మను జనకుడూ కుమారుడూ ఇద్దరూ పంపుతారు- 14,26. 15,36. తండ్రీ కుమారులు ఎంతగా ఐక్యమై యుంటారంటే వారిలో ఒకరికున్నది మరొకరికి కూడ ఉన్నట్లే - 17,10. ఇంకా పితను గౌరవిస్తే సుతుని గౌరవించినట్లే - 5,23. అతన్ని స్వీకరిస్తే ఇతన్ని స్వీకరించినట్లే - 13,20. అతన్ని చూస్తే ఇతన్ని చూచినట్లే - 14,9.

## 2. దేవుడు విశ్వాసులకు కూడ తండ్రి

యోహాను భావాల ప్రకారం యావే ప్రభువు క్రీస్తుకి మాత్రమేకాక, విశ్వాసులకుకూడ తండ్రి. దేవుని నుండి పుట్టిన ప్రతివానిలోను అతని ప్రకృతి వుంటుంది - 1 యోహా 3,9. క్రీస్తుద్వారా మనం దేవునికి బిడ్డలమౌతాం. కనుక మనం పితనూ కుమారునీ ఇద్దరను కూడ అనుకరించాలి. మన గొప్పంతా ఈ యిద్దరిని పోలివుండడంలోనే వుంది.

క్రీస్తు తన్నంగీకరించే వాళ్లందరికి దేవుని బిడ్డలయ్యే భాగ్యాన్ని దయచేసాడు - 11,12. అనగా క్రీస్తు పట్ల విశ్వాసం ద్వారా మనం దేవునికి బిడ్డలమౌతామని భావం. కడన, క్రీస్తుద్వారా తప్పితే ఎవడూ తండ్రిని చేరలేడు - 14,6.

తండ్రిని చేరాలంటే క్రీస్తుపట్ల విశ్వాసమే ముఖ్యం. ఈ విశ్వాసం ద్వారా తండ్రికీ క్రీస్తుకీ వుంధే సంబంధమే భక్తునికి తండ్రికీ కూడ ఏర్పడుతుంది. అదేలాగో చూద్దాం.

### 1. పరస్పర ప్రేమ

పితసుతులు ఒకరినొకరు ప్రేమిస్తుంటారని చెప్పాం. ఆలాగే ఆ దైవవ్యక్తులు విశ్వాసులను ప్రేమిస్తారు. విశ్వాసులూ వారిని ప్రేమిస్తారు.

తండ్రి మనలను ప్రేమిస్తాడు. దేవుడు లోకాన్ని ఎంతో ప్రేమించి తన ఏకైక కుమారుణ్ణి ప్రసాదించాడు. ఈ కుమారుని ద్వారానే మనం నిత్యజీవం పొందాలి - 3,16. మనం మొదట దేవుణ్ణి ప్రేమించలేదు. అతడే మొదట మనలను ప్రేమించాడు. మన పాపాల పరిహారం కొరకు క్రీస్తుని పంపాడు -1 యోహా 4,19.

ఇక తండ్రిలాగే క్రీస్తుకూడ మనలను ప్రేమించాడు. అతడు మనలను చివరిదాకా ప్రేమించాడు. అనగా మనలను తన శక్తికొలది ప్రేమించాడని భావం -11,3 భక్తుడు కూడ క్రీస్తుని ప్రేమిస్తాడు - 14,21. విశ్వాసులు తండ్రీ కుమారులను ప్రేమిస్తారు. కనుక లోకాన్ని ప్రేమించకూడదు - 1 యోహా 2,15. ఎందుకు? అది పాపపూరితమైంది కనుక.

## 2. ఒకరియందొకరు నెలకొని వుండడం

తండ్రీ కుమారులు ఒకరియందొకరు నెలకొని వుంటారు. అలాగే ఆ దివ్యవ్యక్తులు భక్తులయందూ, భక్తులు ఆ దైవవ్యక్తులందూ నెలకొని వుంటారు. దేవుని ఆజ్ఞలు పాటించేవారు దేవునియందూ, దేవుడు వారియందూ నెలకొనివుంటారు-1 యోహా 3,24. పవిత్రాత్మ ద్వారా ఈకార్యం జరుగుతుంది. తండ్రీకుమారులు ఏకకాలమందే వచ్చి విశ్వాసి హృదయంలో వసిస్తారు -14,23. విశ్వాసులు కూడ ఆ దైవవ్యక్తులందు వసిస్తారు - 17,21. ఈలా దైవ వ్యక్తులందు నెలకొని వుండేవాళ్ళ కనుక విశ్వాసులు వారిలోవారు ఐక్యమై యుండాలి. ఇంకా, తండ్రి క్రీస్తుని ప్రేషితసేవకు పంపాడు. అలాగే క్రీస్తుకూడ శిష్యులను ప్రేషితసేవకు పంపుతాడు -20,21.

## 3. పరస్పర జ్ఞానం

తండ్రీ కుమారులకు పరస్పర జ్ఞానం వుంది. అలాగే విశ్వాసులకూ తండ్రికీ కూడ పరస్పర జ్ఞానం వుంటుంది. పితకు సమీపంలో వుండే సుతుడే తండ్రిని మనకు తెలియజేసాడు. కనుక దేవుడు మనకు తెలుసు - 1,18.

మనం క్రీస్తు గొర్రెలం. అనగా క్రీస్తు భక్తులం. మనం ఆ ప్రభువుకి తెలుసు, అతడూ మనకు తెలుసు - 10,14. ఈ పరస్పర జ్ఞానం తండ్రీ కుమారులకు వుండే పరస్పర జ్ఞానం లాంటిదే. తండ్రీ క్రీస్తూ మనలను ప్రేమతో తెలిసికొంటారు. మనంకూడ వారిని ప్రేమతో తెలిసికోవాలి.

## 4. పరస్పరం చెందివుండడం

శిష్యులు తండ్రికి చెందినవారు -17,6. అలాగే వాళ్ళు క్రీస్తుకికూడ చెందినవాళ్ళు - 13,1. తమకు చెందినవారిని తండ్రీకుమారులు దివ్యాహారంతో పోషిస్తారు-6,32. ఇక పిశాచం వారిని దక్కించుకోలేదు - 10,29.

# 3. దేవుని బిడ్డల ప్రవర్తనం

విశ్వాసులు దేవునికి బిడ్డలు. కనుక వాళ్ళు దేవుని ఏకైక కుమారుడైన క్రీస్తుని పోలివుండాలి. అతన్ని అనుసరించాలి. ఈ యనుసరణం ఐదంశాల్లో కన్పించాలి.

## 1. విధేయత చూపాలి

విశ్వాసులు తండ్రికీ క్రీస్తుకీ విధేయులు కావాలి. విధేయత అంటే క్రీస్తు ఆజ్ఞలూ, మాటలూ పాటించడం - 14,15. ప్రభువు ఆజ్ఞలు పాటించేవాడు అతనికంటె గొప్ప కార్యాలు చేస్తాడు - 14,12. దేవునికి విధేయులైనవాళ్ళు అతనికి ప్రీతి కలిగించే పనులు మాత్రమే చేస్తారు.

## 2. ప్రేమను చూపాలి

దేవుడు ప్రేమస్వరూపుడు -1 యోహా 4,8. అతని బిడ్డలమైన మనంకూడ ప్రేమపూరితులమై యుండాలి. క్రీస్తు మనకు నూత్న ఆజ్ఞనిచ్చాడు. ఇది ప్రేమాజ్ఞ. అనగా మనం ఒకరినొకరం ప్రేమించాలి - 13,34. తండ్రి క్రీస్తుని ప్రేమించినట్లే క్రీస్తు మనలను ప్రేమించాడు- 15,9. ఈ ప్రేమనే మన తరపున మనం తోడివారిపట్ల చూపాలి. తండ్రిని ప్రేమించేవాళ్లు అతని బిడ్డలైన తోడి నరులను గూడ ప్రేమించాలి-1 యోహా 5,2. మనం కండ్లారా జూచే తోడి నరులను ప్రేమించకపోతే, అసలు కంటితో చూడని దేవుణ్ణి ఏలా ప్రేమిస్తాం? -1 యోహా 4,20. తోడివారిని ప్రేమించేవాళ్ళు వెలుగులో నడుస్తున్నారు అనాలి -1 యోహా 2,10. ఆలా చేయనివాడు చీకట్లో వున్నట్లే - 1 యోహా 2,9.

## 3. వెలుగులో నడవాలి

దేవుడు వెలుగు. అతనిలో చీకటి యేమాత్రం లేదు- 1 యోహా 1,5. ఈ తండ్రిలాగే క్రీస్తుకూడ వెలుగు- యోహా 8,12. కనుక విశ్వాసులు కూడ వెలుగు కలవాళ్ళుగా జీవించాలి - 12,36. నికొదేము చీకట్లో వెలుగైన క్రీస్తు దగ్గరికి వచ్చాడు -3,2. దీనికి భిన్నంగా యూదా వెలుగైన క్రీస్తుని విడనాడి చీకటిలోనికి వెళ్లాడు - 13,30. మన ప్రవర్తనం నికొదెములాగ వుండాలి. పాపకార్యాలు చేసేవాడు వెలుగుని సమీపించలేడు. కాని సత్కార్యాలు చేసేవాడు వెలుగు చెంతకు వస్తాడు - 3,20.

## 4. శ్రమలు అనుభవించాలి

క్రీస్తుకి శ్రమలు కలిగాయి. ఆలాగే శిష్యులకు కూడ కష్టాలు వస్తాయి - 6,33. ఒకోసారి వాళ్ళు వధకుకూడ గురికావచ్చు -16,3. వాళ్ళు ఈ లోకానికి చెందినవాళ్ళు కాదు. క్రీస్తు ఎన్నుకొన్నవాళ్ళు. కనుక లోకం వారిని ద్వేషిస్తుంది - 15,19. కాని వాళ్ల

నేలలో పడిన గోదుమ గింజలాగ చివికిపోవాలి. అప్పుడే మంచి ఫలితాన్ని ఇచ్చేది - 12,24. క్రీస్తు ఆలా చివికిపోయాడు. కనుక మనకూ అదే మార్గం.

### 5. ప్రార్థన చేసికోవాలి

క్రీస్తు శిష్యులతో మీరు నా పేరిట ఏమి అడిగినా నేను దాన్ని చేస్తాను అన్నాడు- 14,13. అనగా మన ప్రార్థనను అతడు వింటాడని భావం. ఇంకా "మీరు తండ్రిని నా పేరిట ఏమి అడిగినా అతడు మీకు అనుగ్రహిస్తాడు అని చెప్పాడు - 16,23. కనుక తండ్రీకుమారులు ఇద్దరు మన మొర వింటారు. ఐతే క్రీస్తు మన మొర ఆలించాలంటే మనం ఆయన ఆజ్ఞలు పాటించాలి. అతని చిత్త ప్రకారం జీవించాలి. అతనికి విధేయులం కావాలి. ఈ లక్షణాలు కలవారి విన్నపాలను క్రీస్తూ తండ్రీ తప్పక వింటారు.

## 4. దైవ కటాక్షం

### 1. సొంత కుమారునే సమర్పించిన తండ్రి

దేవుణ్ణి ప్రేమించేవాళ్లకు అన్నీ మంచికే సమకూరుతాయి అన్నాడు పౌలు భక్తుడు - రో 8,28. మన తరపున మనం దేవుణ్ణి ప్రేమిస్తే చాలు, అతని దయవల్ల అన్ని సంఘటనలూ, మనకు మంచినే చేసిపెడతాయి. ఈజిప్టులో యోసేపుకి అన్నీ అనుకూలంగానే జరిగాయి కదా! మనకుకూడ ఆలాగే జరుగుతుంది.

దేవుడు తన సొంత కుమారునే మన కొరకు సమర్పించడానికి వెనుకాడలేదు. మరి ఇతర వస్తువులను ఉచితంగా ఈయడా? రోమా 8,32. తండ్రికి కుమారుడు అత్యంత ప్రీతిపాత్రుడు. ఆలాంటి కుమారుణ్ణే మన కొరకు సమర్పించినపుడు ఇతర వస్తువులు ఏపాటివి? అన్ని భాగ్యాల కంటె క్రీస్తు గొప్ప భాగ్యం కాదా? కనుక అతడు మనకు అవసరమైనవన్నీ ఇస్తాడని నమ్మాలి. మన తరపున మనకు ఆ తండ్రిపట్ల భక్తీ నమ్మకమూ వుంటేచాలు.

ప్రభువు శిష్యులను మేము ఏమి తింటాం, ఏమి త్రాగుతాం, ఏమి ధరిస్తాం అని కలత చెందవద్దన్నాడు. మన అవసరాలన్నీ ఆ తండ్రికి ముందుగానే తెలుసు అన్నాడు- మత్త 6,31 -32. అన్న పానీయాలు బట్టలు నరుని ప్రాథమికావసరాలు. ఐనా చాలమంది ఇవికూడ దొరక్క బాధపడిపోతుంటారు. కాని మనం దేవుణ్ణి నమ్మి అతని ఆజ్ఞల ప్రకారం జీవిస్తే చాలు. అతని రాజ్యాన్ని ఆశిస్తే చాలు. ఈ ప్రాథమికావసరాలను అతడు తప్పక తీరుస్తాడు. అతడు మనకు పరలోక భాగ్యాలనూ భూలోక భాగ్యాలనూ గూడ దయచేస్తాడు.

నేను మిమ్ము జోలె, పాదరక్షలు లేకుండ పంపినపుడు మీకు ఏమైన కొరత కలిగిందా అని ప్రభువు శిష్యులను అడిగాడు. వాళ్ళు ఏ కొరత కలగలేదని జవాబు

చెప్పారు - లూకా 22,35. ప్రభువు శిష్యులను ప్రేషిత సేవకు పంపినపుడు వారికి అన్ని వస్తువులు ఇచ్చి పంపలేదు. ఐనా వారికి ఏ కొరత రాలేదు. ఎందుకు? తండ్రి ఆ సేవాకాలంలో వారి అక్కరలన్నీ తీర్చాడు కనుక. అందుకే మనం తండ్రిని నమ్మి జీవించాలి.

తండ్రి మనకు క్రీస్తుని రక్షకుణ్ణిగా ఇచ్చాడు. ఆ రక్షకుని ద్వారానే మనకు సర్వస్వమూ దయచేసాడు అనుకోవాలి. తండ్రిగా బిడ్డలమైన మనలను పట్టించుకోవడం అతని పూచీ. ఈ బాధ్యతను అతడు ఏనాడు విస్మరించడు. క్రీస్తు అంతటివాణ్ణి మన కొరకు దయచేసాక మనలను ఏలా విస్మరిస్తాడు? మన తరపున మనం అనవసరంగా ఆందోళనం చెంది బాధను కొనితెచ్చుకొటాం. కాని ఈ యాందోళనం వలన మన ఆయుస్సును ఏమాత్రం పెంచుకోలేం - మత్త 6,27.

## 2. అల్ప విషయల్లో కూడ

మామూలుగా మనం దేవుడు స్వల్ప విషయాలను పట్టించుకోడు అనుకొంటాం. కాని ఇది పొరపాటు. దేవుడు మన తలవెంట్రుకలను గూడ లెక్కబెట్టుకొని వుంటాడు - మత్త 10,30. కనుక అతని అనుమతి లేనిదే మన తలవెంట్రుక ఒక్కటి వూడిపడదు. తల రోమంకంటె అల్ప వస్తువు ఏముంది? అలాంటి స్వల్పవస్తువుని గూర్చి కూడ అతడు జాగ్రత్తపడతాడు. అతని అనుమతి లేనిదే పెద్ద సంఘటనంగాని చిన్న సంఘటనంగాని ఏది జరగదు. నరుడు తన తలలోని రోమం ఒకటి ఊడినందుకుగాని ఊడనందుకుగాని పెద్దగా విచారించడు. కాని దేవుడు విచారిస్తాడు. మనపట్ల అతడు అంత జాగ్రత్తతో, అంత కరుణతో మెలుగుతాడు.

యూదుల దృష్టిలో పిచ్చుక అల్పప్రాణి. ఆ రోజుల్లో ఒక దమ్మిడీకి రెండు పిచ్చుకలు వచ్చేవి. ఆలాంటి చిన్నప్రాణి కూడ దేవుని అనుమతి లేనిదే చావదు. పిచ్చుకలనుగూడ పట్టించుకొనే దేవుడు వాటికంటె ఎన్నోరెట్లు అధికులైన నరులను పట్టించుకోడా? క్రీస్తుకి అనుచరులూ, అతనిద్వారా తనకు స్వయంగా దత్తపుత్రులు ఐన నరులను పట్టించుకోడా? తప్పకుండా పట్టించుకొంటాడు - మత్త 11,29-31. కనుక పెద్ద విషయాల్లోగాని స్వల్ప విషయాల్లోగాని మనకు ఆందోళనం పనికిరాదు. ఇంకా మనం అనుకొన్నట్లుగా అదృష్టం దురదృష్టం అనేవి ఏవీలేవు. అన్ని వస్తువులు, అన్ని సంఘటనలు దేవుని అధీనంలో వుంటాయి. దేవుని అనుగ్రహం లేనిదే చెట్టుమీది ఆకుకూడ కదలాడదు.

## 3. ప్రకృతిని కూడ

దేవుడు ఒక్క నరులనే గాక ప్రకృతిలోని పక్షులనూ చెట్టుచేమలనూగూడ పట్టించుకొంటాడు. కాకులు వున్నాయి కదా! అవి పైరులువేసి పంటలు పండించి ధాన్యాన్ని

కొట్లలో నిల్వజేసికోవు. ఐనా భగవంతుడు వాటినిగూడ పోషిస్తుంటాడు - లూకా 12,24. ఇక్కడ కాకిని ప్రత్యేకంగా గమనించాలి. అది నల్లగా వుంటుంది. దానికి జూటాతనం జాస్తి. దొంగబుద్ధి ఎక్కువగా వుంటుంది. కనుక మనం దాన్ని గౌరవంతో గాని సానుభూతితోగాని చూడం. చీదరించుకొంటాం. అలాంటి క్షుద్రపక్షినిగూడ దేవుడు పట్టించుకొంటాడు. దానికి తిండి పెడతాడు. అతని ప్రాణిపోషణాచాతుర్యం అంత గొప్పది. అతడు పక్షులకు గూడ తండ్రే.

ప్రభువు ఒక్క పక్షులనేగాక చిన్న పూలమొక్కలను గూడ పట్టించుకొంటాడు. లిల్లీ మొక్కలున్నాయి కదా! అని శ్రమపడవు. నూలు వడికి వస్త్రాలు నేసికోవు. ఐనా దేవుడు వాటికికూడ రంగురంగుల పూలనే బట్టలు తొడుగుతాడు. మహావైభవంగా జీవించిన సొలోమోను రాజుకూడ వాటి పూలంత అందమైన బట్టలు ధరించలేదు. ఈ గడ్డిమొక్కలు ఇవ్వాళ్ల వుండి రేపు పొయ్యిలో కాలిపోయేవి. ఆలాంటి విలువలేని చెత్తనే పట్టించుకొనే పరమేశ్వరుడు తనకు పోలికగా వున్న నరులను ఎంతగా పట్టించుకోడు? - మత్త 6,28-29. గడ్డి మొక్కలతో పోలిస్తే నరులమైన మన విలువ కోటిరెట్లు అదనంగాదా? అంత అల్ప వస్తువులను గూర్చి జాగ్రత్తపడేవాడు మనలనుగూర్చి ఎంతగా జాగ్రత్తపడడు? గడ్డి మొక్కలకు గూడ తండ్రియైనవాడు మనకెంతగా తండ్రికాడు?

దేవుడు మనలను గూర్చి అధికంగా జాగ్రత్తపడతాడు అంటే మనం సోమరిపోతులంగా వుండిపోవచ్చునని భావంకాదు. మన శక్తి కొలది మనం కృషిచేయాలనే ఆ ప్రభువు కోరుకొనేది. ఒక లక్ష వరహాలు పొందినవాడు ఆ సొమ్మునకు తగినట్లుగా శ్రమ చేయలేదు. కనుక యజమానుడు అతన్ని శిక్షించాడు కదా! - మత్త 25,26-28. ఎప్పుడూ దైవమూ పురుషకారమూ కలసి పనిచేస్తాయి.

## 4. దైవ కటాక్షం అందరికీ

దేవుడు నరులందరికీ మేలు చేస్తాడు. వీళ్ళు మంచివాళ్లు వీళ్ళు చెడ్డవాళ్ళు అనే భేదభావం అతనికుండదు. అతడు దుర్జనులకూ సజ్జనులకూ గూడ తన సూర్యరశ్మిని ప్రసాదిస్తాడు. సన్మార్గులకూ దుర్మార్గులకూ గూడ వర్షాన్ని ప్రసాదిస్తాడు. అదేవిధంగా మనంకూడ శత్రువులనూ మిత్రులనూ ఆదరించాలి - మత్త 6,44 -45.

దేవుడు అందరూ రక్షణం పొందాలనే కోరుకొంటాడు. అందరూ క్రీస్తుద్వారా తన్ను చేరుకోవాలనే వాంఛిస్తాడు. కనుక అందరికీ వుపకారం చేస్తాడు. పాపులపట్ల అతడు ప్రత్యేకంగా దయచూపుతాడు. వాళ్లు పరివర్తనం చెంది జీవాన్ని పొందాలనే అతని కోరిక. సూర్యరశ్మీ వానా ప్రాణికోటికి అత్యవసరం. కనుక దేవుడు ఈ ప్రాథమిక వస్తువులను అందరికీ దయచేస్తాడు.

ఇంకా దేవుని వరాలు అందరికీ, ఒక్కొక్కరికీ గూడ. అతడు ప్రతివ్యక్తికీ వానా వెల్తురూ దయచేస్తాడు. ఈ లోకంలో నేనొక్కడినే వున్నా నన్ను పట్టించుకొని నా యక్కరలన్నీ తీరుస్తాడు. ఈ లోకంలో నేనొక్కడనే వున్నా క్రీస్తు కేవలం నా కొరకు చనిపోయేవాడు. దేవునికి ఒక్కొక్క నరునిమీద అంత ప్రీతి. ఈ సూత్రాన్ని గమనించి మనంకూడ అందరికీ సాయంజేయాలి.

## 5. దైవ కటాక్షమూ శ్రమలూ

ఓ వైపు దైవకటాక్షమున్నా మరోవైపు శ్రమలుంటాయి. దేవుని ప్రాణిపోషణ చాతుర్యం మన కష్టాలను తొలగింపదు. క్రీస్తు స్వయంగా శ్రమలు అనుభవించినవాడు. బాధలు అతని జీవితంలో ముఖ్యాంశం. నేడు మనంకూడ క్రీస్తు శ్రమల్లో పాలుపొంది రక్షణాన్ని సంపాదించుకోవాలని తండ్రి కోరిక. కనుకనే అతడు మనకు శ్రమలు పంపుతాడు.

దైవకటాక్షం ఈ లోకంలో మన కెదురయ్యే శ్రమలను తొలగించదు. మనం వాటివల్ల నాశమైపోకుండేలా చేస్తుంది, అంతే.

ప్రభువు శిష్యులతో "విరోధులు మీలో కొందరిని చంపుతారు. నా నామం నిమిత్తం అందరూ మిమ్ము ద్వేషిస్తారు. ఐనా మీ తలవెంట్రుక కూడ ఊడదు" అన్నాడు - లూకా 21, 16-17. ఈ మాటల భావమేమిటి? శ్రమలు మనలను నాశం చేయలేవు. శత్రువులు మనలను హింసించి బాధించవచ్చు, చంపివేయవచ్చు. ఐనా మనం ఏమీ కోల్పోము. ఉత్థాన దినాన అన్నీ తిరిగి పొందుతాం. మన తరపున మనం విశ్వాసంతో జీవించాలి. శ్రమల వలన మనకు విజయమే కాని అపజయం కలగదని నమ్మాలి. క్రీస్తు బాధలతో చేరి మన బాధలు మనలను రక్షిస్తాయని అర్థంచేసికోవాలి.

# 5. అబ్బా అనుభవం

## 1. క్రీస్తూ - తండ్రీ

క్రీస్తు గెత్సెమని తోటలో తండ్రికి ప్రార్థన చేసాడు. "అబ్బా! తండ్రీ! ఈ పాత్రను నా యొద్ద నుండి తొలగించు. ఐనా నా చిత్తంగాదు. నీ చిత్తమే నెరవేరనీయి" అన్నాడు - మార్కు 14,36. ఈ "అబ్బా" అనే మాటకు నాన్న అని అర్థం. ఆ రోజుల్లో యూదుల చిన్నబిడ్డలు ఇంటిలో తమ నాన్నను అబ్బా అని సంబోధించేవాళ్ళు. ఈలాంటి సంబోధననే క్రీస్తు తండ్రికి వాడాడు. కనుక ఈ పదం యావేపట్ల అతనికున్న చనువునీ, పరిచయాన్నీ సూచిస్తుంది.

ఆ రోజుల్లో ఏ యూదుడు కూడ యావే ప్రభువుకి అబ్బా అనే మాటను వాడ్డానికి సాహసించలేదు. అసలు యూదులు యావే అనే పేరుకూడ ఉచ్చరించేవాళ్ళు కాదు. దేవునిపట్ల గల గౌరవంచే అతనిపేరు పలికేవాళ్ళు కాదు, బైబుల్లో యావే అనే పేరు చదవవలసి వచ్చినపుడు దానికి బదులుగా "అదొనాయి" అని పలికేవాళ్లు (యజమానుడు). అలాంటివాళ్ళు దేవుణ్ణి నాన్నా - ఆబ్బా అని పిలవడానికి సాహసిస్తారా?

ఇంకో విషయంకూడ. తండ్రి అన్న అర్థంలో తెలుగులోకూడ "అబ్బ" అనే శబ్దం వుంది. కాని క్రీస్తు వాడిన అబ్బ శబ్దం అరమాయిక్ పదం.

అయితే క్రీస్తు తండ్రిని అబ్బా అని ఎందుకు సంబోధించాడు? అతడు పవిత్ర త్రీత్వంలోనే కుమారుడు. నరమాత్రుల కెవరికీ దేవునితో లేని సంబంధం అతనికుంది. కనుక దేవునిపట్ల తనకున్న దగ్గరి సంబంధాన్నీ, చనువునీ, ప్రేమనీ సూచిస్తూ అతడు ఈ శబ్దం వాడాడు. అతనికి ముందు ఏ యూదుడూ వ్యక్తిగతంగా దేవునికి ఈ శబ్దం వాడలేదు. కనుక క్రీస్తు సంబోధనం శిష్యులకు ఆశ్చర్యం కలిగించి వుండాలి.

కాని క్రీస్తుకి తన తండ్రిపట్ల గాఢమైన అనుభవం వుంది. అపారమైన ప్రేమవుంది. ఇప్పుడు గెత్సెమని తోపులో అతడు ఘోరశ్రమను అనుభవిస్తున్నాడు. అతనికున్న అనుభవాన్ని బట్టి ఆ బాధల్లో అతని నోటివెంట అ ప్రయత్నంగానే అబ్బా అనే మాట వెలువడింది.

క్రీస్తులో దైవ స్వభావం మానవ స్వభావం అనే రెండంశాలు వున్నాయి. అవి రెండూ అతనిలో వేరువేరుగానే పనిచేసాయి. కాని అతడు తన మానవ స్వభావంలోనే దేవుణ్ణి అబ్బా అని పిల్చాడు. ఐతే దేవుడు తనకు అబ్బ ఔతాడని మానుష క్రీస్తుకి ఏలా తెలిసింది? పవిత్రాత్మ సహకారం ద్వారా తండ్రి అతని మానుష స్వభావానికి వెలుగును ప్రసాదించి అతడు దేవుడు తనకు నాన్న అని గ్రహించేలా చేసి వుండవచ్చు. ఈ ప్రబోధంవల్ల క్రీస్తు చిన్నప్పటినుండే దేవుణ్ణి అబ్బ అని పిలుస్తూండవచ్చు. ఐతే ఆ ప్రబోధం అతనికి ఏ ప్రాయంలో కలిగిందో మనం రూఢిగా చెప్పలేం.

అతడు 12 ఏండ్ల యీడున యెరూషలేము దేవాలయంలో వుండిపోయాడు. తల్లి మరియ అతని కొరకు గాలిస్తూ నాయనా! నేను నీ తండ్రి నీ కొరకు వెదుకుతున్నాం అంది. అందుకు ఆ బాలుడు మీరు నా కొరకు ఎందుకు వెదికారు? నేను నా తండ్రి పనిలో నిమగ్నుడైన యుండాలని మీకు తెలియదా అన్నాడు - లూకా 2, 48-49. ఈ వాక్యం భావం. మరియకు అప్పట్లో అర్థం కాలేదు. ఇక్కడ మరియ యోసేపును బాలుని తండ్రి అని సూచించింది. కాని బాలుడు తన తండ్రి పరలోకంలోని దేవుడేనని సూచించాడు. తాను ఆ దేవుని కార్యాల్లో నిమగ్నుడు కావాలని తెలియజేసాడు. కనుక ఈ సందర్భంలో అతడు తాను దేవునికి ప్రత్యేకమైన పద్ధతిలో కుమారుణ్ణవుతానని గ్రహించాడు అనుకోవాలి.

అతని మానుష చేతనం ఈ సంగతిని గ్రహించింది. తర్వాత అతడుపెరిగి పెద్దవాడైన పిదప పరలోకంలోని తండ్రిని గూర్చి శిష్యులను బోధించిన సంగతులన్నీ కూడ తన మానుష చేతనంవల్ల గ్రహించినవే అనుకోవాలి.

## 2. క్రైస్తవులూ - తండ్రి

క్రీస్తు స్వయంగా తండ్రిని అబ్బా అని పిల్చేవాడన్నాం. కాని అతడు తన శిష్యులు కూడ తండ్రిని అదే పేరుతో పిలవాలని కోరుకొన్నాడు. శిష్యులుకూడ తనలాగే దేవునికి చనువుతో ప్రార్థన చేయాలని కోరుకొన్నాడు. కనుకనే తనకు ప్రీతిపాత్రమైన పరలోక జపాన్ని వారికి కూడ నేర్పించాడు.

క్రీస్తు ప్రార్థన చేసికోవడం చూచి శిష్యులు మాకు కూడ ప్రార్థన నేర్పమని అడిగారు. అతడు మీరు ఈలా ప్రార్థన చేయండి అని చెప్పి పరలోకజపం నేర్పాడు. దానిలో మొదట వచ్చేది "తండ్రీ! నీ నామం పరిశుద్ధ పరచబడునుగాక" అనే విన్నపం - లూకా 11,2. ఇక్కడ క్రీస్తు తండ్రి అనే పదానికి అరమాయిక్ భాషలో వాడినమాట అబ్బా ఐయుంటుందని బైబులు పండితుల ఊహ. అనగా తాను నాన్నగా అనుభవానికి తెచ్చుకొన్న దేవుడు శిష్యులకుకూడ ఆలాగే అనుభవానికి రావాలని అతని కోరిక ఐయుంటుంది.

ఈ సంప్రదాయాన్ని అనుసరించి తొలినాటి క్రైస్తవులుకూడ దేవుణ్ణి అబ్బా అని పిల్చివుంటారు. పౌలు జాబుల్లో రెండుచోట్ల అబ్బా అన్న మాట వస్తుంది. పవిత్రాత్మ మనచేత దేవుణ్ణి అబ్బా అని పిలిపిస్తుంది - గల 4,6. మనకు దత్తపుత్రత్వాన్ని ఒసగే ఆత్మ దేవుణ్ణి మనచే అబ్బా అని పిలిపిస్తుంది - రోమా 8,15. ఆ తొలినాటి క్రైస్తవుల ప్రార్థనను చూచే, వాళ్ళు దేవుణ్ణి అబ్బా అని సంబోధించడాన్ని చూచే పౌలు ఈ వాక్యాలు వ్రాసి వుండవచ్చు.

దేవుణ్ణి అబ్బా అని సంబోధించాలి అంటే ఆత్మ సహాయం అవసరం. మనచేత ప్రార్థన చేయించేది ఆ యాత్మే. ఇంకా, క్రీస్తు సహాయంకూడ అవసరం. ఆ కుమారునిలోనికి జ్ఞానస్నానం పొంది మనం దేవునికి దత్తపుత్రులమౌతాం. ఈలాంటి బిడ్డలంగానే దేవుణ్ణి అబ్బా అని పిల్వగలుగుతాం. తర్వాత క్రీస్తు మరియ మగ్దలీనను శిష్యుల వద్దకు పంపుతూ "నా తండ్రి మీ తండ్రి, నా దేవుడు మీ దేవుడు" అనే మాటలు వాడాడు - యోహా 20,17. క్రీస్తుద్వారా అతని తండ్రి మన తండ్రి ఔతాడు. క్రీస్తు మనలను పాపంనుండి విమోచించడానికి మాత్రమే రాలేదు. తన తండ్రికి మనలను గూడ బిడ్డలనుగా జేయడానికి వచ్చాడు. నేడు మనం అబ్బా అనే పదాన్ని పట్టినే ఉచ్చరిస్తేనే చాలదు. ఈ మాటద్వారా దేవుణ్ణి మన తండ్రినిగా, నాన్ననుగా అనుభవానికి తెచ్చుకోవాలి. అతనిపట్ల ప్రేమా,

చనువూ పెంచుకోవాలి. క్రీస్తుకి తండ్రిపట్ల వున్న అనుభూతి మనకుకూడ కొంతవరకైనా కలగాలి. తొలినాటి క్రైస్తవుల అనుభవం మన అనుభవం కావాలి. పరలోకంలో మనకో నాన్న వున్నాడనే భావం మనకు బాగా ప్రేరణం పుట్టించాలి. అబ్బా అనే పదాన్ని మనం ఓ సుకృత జపంగా వాడుకోవాలి. అది మనకు ఓ మంత్రం కావాలి.

## 3. ఏలాంటి తండ్రి ?

భూలోకంలోని పిల్లలు తమ తండ్రిని చూచి సంతోషిస్తారు. ఇంతకంటె అదనంగా క్రీస్తు తన తండ్రిని చూచి సంతోషించాడు. అందరు తండ్రులకంటె ఆ తండ్రి ఇంకా గొప్పవాడుకదా! ఒకమారు క్రీస్తు భూలోకంలోని తండ్రులను ఉద్దేశించి మీరెంత చెడ్డవారైనా మీ బిడ్డలకు మేలి వస్తువులను ఇస్తారుకదా! పరలోకంలోని తండ్రి మీకు ఇంకెంతటి మేలి వస్తువులను ఇస్తాడో ఊహించండి అన్నాడు -మత్త 7,11. భూలోకంలోని జనకులకూ పరలోకంలోని జనకునికి అంత వ్యత్యాసం వుంది. ఆ జనకుడు తండ్రీ దేవుడూ కూడ.

మన భాషలో తండ్రి అనగానే కుమారుణ్ణి ఊహించుకొంటాం. క్రీస్తుకూడ దేవుణ్ణి తండ్రి అని పిల్చినపుడు తన జననాన్ని జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. పరిశుద్ధ త్రీత్వంలో పిత సుతునికి పుట్టువునిచ్చాడు. మానుష క్రీస్తుకికూడ తండ్రి పుట్టువునిచ్చాగు. యావే జీవనమే నజరేతూరి యేసులోకూడ కన్పించింది. కనుక యావే అతనికి రెండు విధాల తండ్రి. కనుక క్రీస్తు అతన్ని పరమ ప్రేమభావంతోనే తండ్రి అని పిల్చాడు. అతడు నా తండ్రి నాకు సమస్తము ఇచ్చాడు అన్నాడు - మత్త 11,27. అతనికున్నవన్నీ తండ్రినుండి వచ్చినవే.

ఇంకా, అతడు నా తండ్రి నాకంటె గొప్పవాడు అన్నాడు - యోహా 14,28. తాను తండ్రినుండి జన్మించాడు కనుక తండ్రి తనకంటె గొప్పవాడు. ఐనా అతడు దేవునితో సరిసమానుడు. కనుకనే అతడు నీకున్నదంతా నాది, నాదంతా నీది అన్నాడు - యోహా 17,10. ఇంకా నా తండ్రి నేను ఏకమైయున్నాం అనికూడ చెప్పాడు - 10,0. అతని బోధల్లో ఈ రెండంశాలు కన్పిస్తాయి. ఒక విధంగా అతడు తండ్రికంటె తక్కువవాడు, మరొకవిధంగా అతనికి సరిసమానుడు.

ఈ లోకంలోని పిల్లలకు వారి తల్లిదండ్రులు ఆదర్శంగా వుంటారు. తండ్రుల పోలికలూ అలవాట్లూ బిడ్డలకు వస్తాయి. క్రీస్తుకికూడ తన తండ్రి పద్ధతివచ్చింది. అందుకే అతడు నా తండ్రి ఇంకను పనిచేస్తున్నాడు, నేనూ పనిచేస్తున్నాను అన్నాడు -5,17. అనగా తండ్రి తన లోకసృష్టిని కొనసాగించుకొనిపోతున్నాడు. క్రీస్తు కూడ అద్భుతాల ద్వారా ఈ సృష్టిని కొనసాగించుకొని పోతున్నాడు. ఇంకా, తండ్రి ఏం జేస్తున్నాడో కుమారుడు కూడ దానిని అట్లే చేస్తాడు అన్నాడు - 5,19. భూలోకంలో పిల్లలు తమ తండ్రులు

చేసినట్లే ఆయా కార్యాలు చేస్తారు. క్రీస్తు నజరేతులో పెంపుడు తండ్రి యోసేపు లాగా వడ్రంగం చేసాడు. కాని పరలోకంలోని పితలాగ అద్భుతాలు చేసాడు. ఇంకా పరలోక తండ్రి గుణగణాలు క్రీస్తుకి కూడ వచ్చాయి. అతడు ఆ తండ్రిలాగే పవిత్రుడు, కరుణామయుడు, ప్రేమపూరితుడు. తండ్రికి అన్ని విధాల ప్రతిబింబం. కనుకనే మనం ఏనాడు చూడని తండ్రిని క్రీస్తు మనకు ఎరుకపరచాడు - 1,18. క్రీస్తులో తండ్రి పరిపూర్ణత అంతా యిమిడివుంది. కావున అతన్ని చూస్తే తండ్రిని చూచినట్లే - 14,9. అతడు తప్పితే తండ్రిని తెలియజేసేవాడు మనకు ఇంకొకడు లేడు.

సుతుడు త్రీత్వంలో తండ్రినుండి జనించినవాడు. కనుకనే అతడు తండ్రి దగ్గరికి తిరిగిపోయి అతని ఆనందంతో పాలుపొందాలని ఉవ్విళ్లూరాడు. యేసు తాను తండ్రి వద్దకు వెళ్లవలసిన గడియ వచ్చిందని గ్రహించాడు - 13,1. ఆదిలో వాక్కు వుంది. ఆ వాక్కు దేవునివద్ద వుంది -1,2. దేవుని వద్ద వున్న వాక్కు తిరిగి దేవుని చెంతకే తిరిగిపోవాలని ఉవ్విళ్లూరింది.

క్రీస్తుకి తండ్రి ఆదర్శం, మాదిరి. అతడు ఈ లోకంలో తన తండ్రిలాగే జీవించాలని కోరకున్నాడు. శిష్యులను కూడా మీరు పరలోకంలోని తండ్రిలాగా పరిపూర్ణులు కండని ఆజ్ఞాపించాడు. మత్త 5,48. మనం కూడా క్రీస్తులాగే తండ్రినిచేరుకోవాలని తపించిపోవాలి. అతనిలాగే తండ్రి పరిపూర్ణతను సాధించాలి.

క్రీస్తు ఎల్లపుడు తండ్రికి విధేయుడు. ఆ తండ్రి లోకాన్ని ఎంతో ప్రేమించి తన ఏకైక కుమారుణ్ణి ప్రసాదించాడు. ఈ ప్రేమను ఆదర్శంగా బెట్టుకుని క్రీస్తుకూడ మనకొరకు అసువులు అర్పించాడు. మొదట మన రక్షణను కోరినవాడు తండ్రి. దాన్ని సాధించినవాడు కుమారుడు. అతడు అన్ని విధాల తండ్రికి విధేయుడు, ప్రతిబింబం. అతనికిలాగే మనకు కూడా ఆ పరలోకపిత పరమపూజ్యుడు.

# 3. తల్లిగా భగవంతుడు



## విషయసూచిక

# 1. పూర్వవేదం

బైబులు భగవంతుడైన యావేకు భార్య లేదు, లింగం లేదు. అసలు అతడు శరీరధారి కాదు. కేవలం ఆత్మస్వరూపుడు.

ఈ భగవంతుడు నరుణ్ణి తనకు పోలికగా చేసాడు. భగవంతుని రూపం, శక్తి, అంశ అతనిలోకి ప్రవేశించాయి. దేవుడు నరుణ్ణి తనకు పోలికగా చేస్తే, నరులు దేవుణ్ణి తమకు పోలికగా ఊహించుకున్నారు. ప్రాచీన యిస్రాయేలు భక్తులు దేవునికి ఎన్నో పోలికలు చెప్పారు. అతన్ని సృష్టికర్త, రాజు, రక్షకుడు, తండ్రి, భర్త, యజమానుడు, స్నేహితుడు, యుద్ధవీరుడు, న్యాయాధిపతి మొదలైన పేర్లతో పిలిచారు. కాని ఈ పేర్లన్నీ కూడ అతడు పురుషుడని తెలియజేస్తాయి. ఐతే నరులు స్త్రీపురుషులుగా ఉంటారు కదా? మరి మనలోని స్త్రీత్వం ఆ భగవంతుల్లో లేదా?

బైబులు రచయితలంతా మగవాళ్ళు. కనుక వాళ్ళు అప్రయత్నంగానే దేవునికి పురుషత్వం ఆరోపించారు. అతన్ని పురుషుణ్ణిగా వర్ణించుకొంటూ పోయారు. కాని పురుషుల్లోకూడ కొంత స్త్రీత్వం వుంటుంది. కనుక ఈ సహజావబోధనంవల్ల వాళ్ళు భగవంతుణ్ణి అక్కడక్కడ స్త్రీనిగా కూడ చిత్రించారు.

బైబులు రచయితలు దేవునికి స్త్రీత్వాన్ని ఆరోపించిన సందర్భాలు కొద్దే. ఐనా ఈ స్వల్ప సందర్భాలు కూడ నేడు మనకెంతో ప్రేరణను పుట్టిస్తాయి. మహిళా విమోచనోద్యమం ముమ్మరంగా సాగిపోతున్న రోజులివి. కనుక బైబులు భగవంతుల్లోని స్త్రీత్వాన్ని చూచి స్త్రీలు ప్రేరణం పొందుతారు. ఆ ప్రభువు తమ్ము అనాదరం చేయలేదని సంతోషిస్తారు. ఒక్క స్త్రీలేకాదు, పురుషులుకూడ దేవుళ్ళోని స్త్రీత్వాన్నీ మాతృత్వాన్నీ చూచి ఆనందిస్తారు. కాని ముందే చెప్పినట్లు బైబులు భగవంతుడు శరీరధారి కానేకాదు. అతడు మన లింగానికి లొంగేవాడు కాదు. పరిశుద్ధ రచయితలు అతన్ని స్త్రీనిగానో పురుషుణ్ణిగానో చిత్రించడం అతడు మనకు అర్థంకావడం కొరకే. నిజానికి అతడు స్త్రీ పురుషుల్లో, ఎవరూ కాదు. ఈ గుణాలు కేవలం రచయితల ఊహలు, ఉత్ప్రేక్షలు అంతే. మొదటలోనే పాఠకులు ఈ అంశాన్ని జాగ్రత్తగా గమనించాలి.

ఇక, బైబులు దేవునికి చాల స్త్రీరూపాలు ఆరోపిస్తుంది. తల్లి, గర్భిణి, మంత్రసాని, యజమానురాలు, దాది, వస్త్రాలు నేసే స్త్రీ మొదలైన ప్రతీకలను భగవంతునికి వాడుతుంది. వీటిని క్రమంగా పరిశీలిద్దాం.

# 1. తండ్రితల్లిగా దేవుడు

పవిత్ర గ్రంథం హీబ్రూలో రెహం, బేటెన్ అనే క్రియలు, గ్రీకులో స్ప్లాంఖ్నిజొమాయి అనే క్రియను వాడింది. కరుణ ప్రేమ చూపడం, గర్భకోశం స్పందించడం అని ఈ పదాలకు అర్థం. తండ్రి భావమూ తల్లి భావమూ తెలియజేసేపుడు బైబులు ఈ మాటలను వాడుతుంది. అనగా నరులు దేవుడనే తల్లి లేక తండ్రి గర్భకోశం నుండి పుట్టినవాళ్ళనీ, వారిపై అతనికి అపారమైన ప్రేమ వుంటుందనీ భావం.

"దేవుడు మానవజాతిని సృజించాడు, తనను పోలునట్లుగా మానవుని చేసాడు. స్త్రీ పురుషలనుగా మానవుని సృజించాడు" అంటుంది ఆదికాండం 1,27. ఈ వాక్యంలో భగవంతుడు తండ్రీ తల్లీ కూడ అనే భావం ధ్వనిస్తుంది. దేవుడు మానవజాతిని అంతటినీ తనకు పోలికగా సృజించినవాడు. నరులను స్త్రీ పురుషులనుగా జేసిన పరమాత్ముడు తానుకూడ ఏదోరూపంలో పురుషత్వమూ స్త్రీత్వమూ కలవాడు అనుకోవాలి. అనగా అతడు అందరికీ తండ్రీ తల్లీ కూడ.

యోబు గ్రంథం 38, 29-29 ఈలా ప్రశ్నిస్తుంది.

వానకు తండ్రి కలడా?

పొగమంచుకు జనకుడు కలడా?

మంచుకు తల్లి కలదా?

నేలపై పేరుకొనిన నూగు మంచుకు జనని కలదా?

అనగా వానా, మంచూ మొదలైన ఆదిమ పదార్థాలు నరులనుండి పుట్టినవి కావనీ పరమాత్ముడే వాటికి తల్లీ తండ్రీ అని భావం. ఈ విధంగానే కీర్తన 27,10 కూడ దేవుడు తండ్రి తల్లి అని చెబుతుంది.

నా తల్లిదండ్రులు నన్ను విడనాడినా

ప్రభువు నన్ను చేరదీసి పరామర్శిస్తాడు.

ఇక్కడ కీర్తనకారునికి దేవుడే అమ్మా నాన్న అని అర్థం.

# 2. ప్రేమగల తల్లిగా దేవుడు

యూదులు క్రీస్తుపూర్వం 6వ శతాబ్దంలో బాబిలోనియాకు ప్రవాసులుగా వెళ్ళారు. అక్కడ ఘోర శ్రమలు అనుభవించారు. భగవంతుడు తమ్ము విడనాడాడు అనుకొని దిగులుచెందారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ప్రవక్తలు, ఆ ప్రభువు ప్రేమగల తల్లిలాగ తన ప్రజలను ఆదరిస్తాడని చెప్పారు. ఆ సందర్భానికి ఆ బోధ అవసరమైంది.

రెండవ యెషయా క్రీ.పూ. 550 ప్రాంతంలో బాబిలోనియాలోని ప్రవాసులకు దేవుని ప్రవచనాలు విన్పించాడు. ఆ కాలంలో యూదులు దేవుడు తమ్ము పూర్తిగా మర్చిపోయాడనీ, తాము దిక్కులేని బిడ్డల మయ్యామనీ వాపోతున్నారు. యెరుషలేమనే తల్లి తమ్ము వదలివేసిందనీ, ఇక తమకు తల్లి లేదనీ విలపిస్తున్నారు. ఈ సందర్భంలో ప్రవక్త ఈ క్రింది ప్రవచనాన్ని చెప్పాడు - 49, 14-15.

ప్రభువు నన్ను పరిత్యజించాడు, నన్ను విస్మరించాడు
అని సియోను పల్కింది
స్త్రీ తన పసికందును మరచిపోతుందా?
తన ప్రేవున పుట్టిన బిడ్డమీద
జాలి జూపకుండా వుంటుందా?
ఒకవేళ ఆమె తన శిశువును మరచిపోయినా
నేను మాత్రం నిన్ను మరువను.

ఇవి పూర్వ వేదంలోని అతి ప్రశస్తమైన వాక్యాల్లో కొన్ని. పక్షి మృగజాతుల్లోగాని, మానవజాతిలోగాని తల్లులు శిశువును మర్చిపోకుండా జాగ్రత్తగా పోషిస్తారు. లేకపోతే ఆ పసిప్రాయంలో శిశువు ఏలా బ్రతుకుంది? కనుక భగవంతుడు తల్లి హృదయంలో తన బిడ్డపట్ల అపారమైన ప్రేమను పెట్టాడు. ఇక్కడ ప్రవక్త దేవునికి యిస్రాయేలీయుల పట్ల వున్న ప్రేమను తల్లికి బిడ్డలపట్ల వుండే ప్రేమతో పోల్చాడు. ప్రభువు తల్లిలాంటివాడు. ఆ మాటకొస్తే, తల్లి ప్రేమ కంటె అతని ప్రేమ బలీయమైంది. ఒక వేళ తల్లి తన బిడ్డను మరచిపోయినా అతడు మాత్రం యిస్రాయేలీయులను మరచిపోడు. వాళ్ళు బాబిలోనియా దాస్యంలో వుండి దేవుడు తమ్ము మరచిపోయాడని విలపిస్తున్నారు. ఐనా దేవుడు వారిని ఎంతమాత్రం విస్మరించడు. వారిని ఆ దాస్యంనుండి విడిపించి తీరుతాడు. తల్లికిగూడ లేని ప్రేమ తనకుందని నిరూపిస్తాడు. ప్రజలు అతన్ని నమ్మాలి. ఇవి యెషయా పల్కిన వాక్యాలు. భగవంతుని ప్రేమనుగూర్చి చెప్పవలసి వచ్చినపుడు వీటిని మించిన వాక్యాలు పూర్వవేదంలో లేవు.

ఇంకా తల్లి బాధలోవున్న బిడ్డను అనునయించి ఓదార్చినట్లుగా ప్రభువు ప్రవాసంలో ఉన్న యూదులను అనునయిస్తాడు. ఈ సందర్భంలో యెషయా చెప్పిన పలుకులివి - 66,12 -13.

యెరుషలేమనే తల్లి మీకు
చంటిబిడ్డలకులాగ పాలిస్తుంది
మిమ్ము తన చేతులలోకి ఎత్తుకొంటుంది

తన వొడిలో కూర్చుండబెట్టుకొని లాలిస్తుంది
తల్లి కుమారునిలాగే నేనూ మిమ్ము ఓదారుస్తాను
యెరూషలేమున మిమ్ము అనునయిస్తాను.

తల్లి కుమారుని ఓదార్చి బుజ్జగించినట్లుగా ప్రభువు యిస్రాయేలును బుజ్జగిస్తాడు. అతడు ప్రవాసంలో యూదులు అనుభవిస్తున్న దుఃఖాన్ని, అవమానాన్ని శీఘ్రమే తొలగిస్తాడు. ఆ ప్రభువు తల్లిలా తన బిడ్డల కొరకు ఆందోళనం చెందేవాడు. మనకు తెలిసిన ప్రేమలన్నిటిలోను తల్లిప్రేమ బలీయమైంది. దానికిమించిన అనురాగం నరమాత్రులమైన మనకు తెలియదు. భగవంతుని ప్రేమ ఈ ప్రేమలాంటిది, దాన్ని మించిందికూడ. దేవుణ్ణిగూర్చి ఇంతకంటె యెక్కువగా ఏమి చెప్పగలం?

## 3. కరుణగల తల్లిగా దేవుడు

భగవంతుడు యిస్రాయేలీయుల తప్పిదాలను మన్నిస్తాడని చెప్పే సందర్భంలో ప్రవక్తలు అతని కరుణను వర్ణించారు. అతడు ఓ తండ్రిలా తన బిడ్డల దోషాలను మన్నిస్తాడు అని చెప్పేటప్పుడు ప్రవక్తలు "హెసెద్" అనే హీబ్రూ మాటను వాడతారు. కరుణ అని ఈ పదానికి అర్థం. కాని తల్లిలా మన్నిస్తాడు అని చెప్పే సమయంలో "రాహుమిం" అనే హీబ్రూమాట వాడతారు. గర్భకోశం, జాలి అని ఈ రెండవ మాటకు అర్థం.

ఏడవ శతాబ్దానికి చెందిన యిర్మీయా ప్రవక్త బాబిలోనియాలోని ప్రవాసులను గూర్చి చెప్తున్నాడు - 31,15-20 యూదులకు తల్లియైన రాహేలు తన బిడ్డలను కోల్పోయినందుకు, అనగా వాళ్ళు ప్రవాసానికి వెళ్ళిపోయినందుకు విలపించింది -15. ప్రభువు ఆమెను ఓదార్చి నీ బిడ్డలు ప్రవాసంనుండి మళ్ళా తిరిగివస్తారని చెప్పాడు 16-17. యిస్రాయేలీయులు (ఎఫ్రాయీము) దేవుని యెదుట పశ్చాత్తాపపడ్డారు. "నీవు మమ్ము కాడికి లొంగని కోడెను లాగ శిక్షించావు. నీవు మమ్ము వెనుకకు త్రిప్పితే మేము నీచెంతకు తిరిగివస్తాం." అని మొరపెట్టుకొన్నారు. "మా పాపాలకు రొమ్ము బాదుకొంటున్నాం. అవమానంతో తలవంచుకొంటున్నాం" అని పరితపించారు. దేవుడు వారి దుఃఖాన్నీ పశ్చాత్తాపాన్నీ గుర్తించాడు. రాహేలుకి బదులుగా తానే వారికి తల్లి అయ్యాడు. ఈ సందర్భంలో తల్లిలాంటి దేవుడు వారితో ఈలా అన్నాడు - 31,20.

ఎఫ్రాయీమూ! నీవు నాకిష్టుడవైన పుత్రుడివి
నాకు ప్రీతిపాత్రుడివి
నేను నిన్ను శిక్షింప బూనినప్పుడల్లా
ప్రేమతో నిన్ను జ్ఞప్తికి తెచ్చుకొంటాను

నా హృదయం నీపై వలపుకొంటూంది
నేను నీమీద తప్పక కరుణ చూపుతాను.

అనగా రాహేలుకి బదులుగా యావే యిస్రాయేలుకు తల్లియై వారిపట్ల అంతులేని మమకారం జూపుతాడు. ఆ ప్రజలను శిక్షింపబూనినప్పుడెల్ల అతనికి వారిపై ఉన్న ప్రేమ అడ్డు వస్తుంది. అతని హృదయంలో యిస్రాయేలుపై అనురాగం పుడుతుంది. ఇక్కడ "నా హృదయం నీపై వలపుగొంటుంది" అనే మాటలకు యిర్మీయా హీబ్రూలో "నా గర్భకోశం నీకోసం వేదనతో కంపిస్తుంది" అని వ్రాసాడు. అనగా తల్లి కష్టంలోవున్న బిడ్డకొరకు బాధపడినట్లే దేవుడు ప్రవాసంలోవున్న యూదులకొరకు బాధపడుతున్నాడని భావం. వారికొరకు తల్లిలాంటివాడైన ఆ దేవుని గర్భకోశం స్పందిస్తుందని అర్థం. అతడు వారిని శిక్షించడని ఫలితార్థం. ఇంకా "నేను నీమీద తప్పక కరుణ జూపుతాను అనే మాటలకు హీబ్రూ మూలంలో "నేను నీ పట్ల తల్లిచూపే జాలి చూపుతాను" అని వుంది. కనుక దేవుడు యిస్రాయేలీయులకు తల్లియై వారి తప్పులను మన్నించి, వారిని ప్రవాసంనుండి విడిపిస్తాడని ఫలితార్థం. ఇక్కడ ప్రవక్త దృష్టిలో యావే ప్రభువు దయగల తల్లి. అతడు కరుణగల అమ్మలా వారిని ఆదుకొని ప్రవాసం నుండి వెలుపలికి కొనివస్తాడు. ఈ భాగమంతా దేవుని మాతృగుణాన్ని వర్ణిస్తుంది.

## 4. సంరక్షించే తల్లిగా దేవుడు

హోషేయ ప్రవక్త క్రీ.పూ. 750 ప్రాంతంలో ప్రవచనం చెప్పాడు. అతడు యావే ప్రభువుని యిస్రాయేలనే బాలుణ్ణి సంరక్షించే తల్లినిగా చిత్రించాడు - 11, 1-9. తల్లి బిడ్డకు నానా ఉపచారాలు చేసినట్లే యావే అనే తల్లి యిస్రాయేలుకు నానా సేవలు చేస్తుందని చెప్పాడు. ఇవి కూడ పూర్వ వేదంలోని గొప్ప వాక్యాల్లో కొన్ని.

1. ప్రభువు ఈలా అంటున్నాడు
యిస్రాయేలు బాలుడై యుండగా నేనతన్ని ప్రేమించాను
ఐగుప్తునుండి నా కుమారుని పిలిపించాను
2. కాని నేనతన్ని పిల్చిన కొలది
అతడు నానుండి నై దొలగాడు
నా ప్రజలు బాలు దేవతకు బలులర్పించారు
విగ్రహాలకు సాంబ్రాణిపొగ వేసారు
3. యిస్రాయేలుకు నడవడం నేర్పింది నేనే
నేను వారిని నా చేతుల్లోకి తీసికొన్నాను
ఐనా నేను తమ్ము కరుణించానని వాళ్లు గ్రహించలేదు

4. గాఢమైన ప్రేమానురాగాలతో
నేను వారిని నా చెంతకు రాబట్టుకొన్నాను
వారిని పైకెత్తి నా బుగ్గలకు ఆనించుకొన్నాను
క్రిందికి వంగి వారిచే అన్నం తినిపించాను
ఐనా వాళ్ళు నా వద్దకు రావడానికి అంగీకరించడంలేదు.

ప్రభువనే తల్లి యిస్రాయేలు బాలుణ్ణి ప్రేమించి ఈజిప్టునుండి పిలువనంపింది. కాని ఆ బాలుడు యావే పిలిచేకొలది వెనక్కిపోయాడు. బాలు దేవతను ఆరాధించాడు. కాని యావే అతన్ని మన్నించాడు. తల్లిలాగ ఆ బాలుడికి నడవడం నేర్పాడు. అతన్ని చేతుల్లోకి తీసికొన్నాడు. గాఢమైన ప్రేమతో దగ్గరికి రాబట్టుకొన్నాడు. వాత్సల్యంతో పైకెత్తి బుగ్గలకు ఆనించుకొన్నాడు. తల్లిలాగ క్రిందికివంగి ఆ బిడ్డకు అన్నం తినిపించాడు. ఐనా ఆ బాలుడు యావే అనే తల్లిపట్ల ప్రేమ చూపలేదు. కావున యావే ఆ బాలుని విసర్జింపవచ్చుకదా? అనగా యిస్రాయేలును పరిత్యజింపవచ్చుకదా? ఐనా ప్రభువు అలా చేయలేదు. ఈ పట్టున ప్రవక్త చెప్పిన వాక్యాలు ఇవి - 11, 8-9.

యిస్రాయేలూ! నేను నిన్నెట్లు విసర్జించేది
నిన్నెట్లు పరిత్యజించేది?
నా హృదయం అందులకు అంగీకరించడంలేదు
నా యెడద జాలితో కంపిస్తుంది
నేను కోపంతో మిమ్ము శిక్షింపను
యిస్రాయేలును మరల నాశం చేయను
నేను దేవుణ్ణికాని నరుడనుగాను
నేను మీ నడుమనుండే పవిత్రమూర్తిని
నేను మీ చెంతకు కోపంతో రాను.

ఇవి చాల నెనరుగల పలుకులు. యావే అనే తల్లికి యిస్రాయేలును నాశం చేయడానికి చేతులు రావడంలేదు. పూర్వం వేదంలోని పెద్ద పాపం విగ్రహారాధనం. ఈ దోషానికి పాల్పడినందులకు దేవుడు ఆ ప్రజలను నాశం చేయవలసింది. ఐనా జాలి అతనికి అడ్డమొచ్చింది. వారిని శిక్షించాలంటే అతని హృదయం కంపించిపోయింది. బిడ్డడు దుష్టుడైతేమాత్రం తల్లి వాణ్ణి నాశంజేస్తుందా? నరుల్లాగా దేవుడు సులభంగా కోపతాపాలకు గురై శిక్షకు పూనుకొంటాడా? పవిత్రుడైన ప్రభువు తన ప్రజను శిక్షింపడు గదా, రక్షిస్తాడు.

సంఖ్యాకాండం కూడ దేవుణ్ణి బిడ్డను సంరక్షించే తల్లితోను దాదితోను పోలుస్తుంది - 11, 11-15. యిస్రాయేలీయులు ఎడారి ప్రయాణంలో కిబ్రోతు హట్టావా అనే

తావుకి వచ్చారు. అక్కడ వాళ్ళకు మాంసం తినాలనే కోరిక పుట్టింది. మేము ఈజిప్టులో అది తిన్నాం, యిది తిన్నాం, ఇక్కడేమి దొరకడం లేదని సుమ్మర్లు పడ్డారు. మోషేమీద తిరగబడ్డారు. వారి తిరుగుబాటును జూచి ప్రభువు వారిని శిక్షింపబోయాడు. కాని మోషే ఆ ప్రజలను కాపాడమని దేవునికి విజ్ఞాపనం చేసాడు. "ప్రభూ! నీ సేవకుని ఇంతగా బాధపెడుతున్నావెందుకు? నేను నీయనుగ్రహానికి ఏల నోచుకోలేదు? నీవు ఈ ప్రజలను పరామర్శించే బాధ్యతను నానెత్తిన పెట్టావెందుకు? నేనేమైనా వీరిని కన్నానా యేమి? నేను వీరిని ఓ దాదిలాగ రొమ్ముపై మోసికొనిపోయి నీవు వాగ్దానం చేసిన గడ్డకు చేర్చాలని నన్ను నిర్బంధం చేస్తున్నావెందుకు"? అని విన్నపంచేసాడు.

ఇక్కడ మోషే భావాల ప్రకారం, దేవుడు యిస్రాయేలును పరామర్శించడం అనే భారాన్ని తన నెత్తిపై బెట్టాడు. ఈ బరువుని మోషే మోయలేకపోతున్నాడు. యిస్రాయేలును తల్లిలా కన్నది అతడు కాదు. దాది పిల్లలను మోసికొని పోయినట్లుగా వారిని కనాను దేశానికి మోసికొనిపోవలసింది కూడ అతడుకాదు. మరి యెవరు? యిస్రాయేలును కన్నది యావే అనే తల్లే. వారిని కనాను దేశానికి ఎత్తుకొని పోవలసిందికూడ యావే అనే దాదే. కనుక వారిని పరామర్శించవలసిన పూచీ యావేదికాని తనదికాదని భావం. తల్లి, దాది అతడేనని అర్థం.

ద్వితీయోపదేశ కాండం దేవునికి ఆడు గరుడపక్షిని ఉపమానంగా వాడింది - 32, 10-11.

గరుడపక్షి తన పిల్లలను ఎగిరింపగోరి
గూటిమీద కెగసి
వాటిని చాచిన తన రెక్కలమీద సురక్షితంగా నిల్పుకొన్నట్లే
ప్రభువు యిస్రాయేలును కాచి కాపాడాడు.

గరుడపక్షి పిల్లలకు ఎగరడం నేర్పించేపుడు వాటిని కాసేపు ఆకాశంలోకి ఎగిరిస్తుంది. అవి పడిపోబోతే వాటిని తన రెక్కలమీద నిల్పుకొంటుంది. ఈ రీతినే ప్రభువు యిస్రాయేలును ఈజిప్టునుండి రెక్కలమీద మోసికొనివచ్చి కనాను మండలానికి చేర్చాడని భావం. ఈలాంటి భావమే నిర్గమకాండ - 19,4 లో కూడ వస్తుంది. "గరుడపక్షి తన పిల్లలను రెక్కలమీద మోసికొనిపోయినట్లే నేనుగూడ మిమ్ము మోసికొనివచ్చి నా కడకు చేర్చుకొన్నాను." మామూలుగా బైబుల్లో గరుడపక్షి వేగానికి గుర్తుగా వుంటుంది. కాని పై యాలోకనాల్లో గరుడపక్షి మాతృత్వం, సంరక్షణ భావం సూచింపబడింది. కనుక యావేకూడ ఓ తల్లిలా యిస్రాయేలును సంరక్షించేవాడని అర్థం.

131వ కీర్తన చెప్పిన భక్తుడుకూడ భగవంతుణ్ణి సంరక్షకురాలైన తల్లితో పోల్చాడు.

నా హృదయం నిమ్మళంగాను
ప్రశాంతంగాను వుంది
పాలు మాన్పించిన శిశువు తల్లి రొమ్ముమీద
ప్రశాంతంగా పరుండివున్నట్లే
నా హృదయం నాలో నిమ్మళంగా వుంది.

తల్లిపాలు త్రాగే శిశువు పాలకొరకు అల్లరిచేస్తుంది. కాని పాలు మాన్పించిన శిశువు అలా అల్లరి చేయకుండా నిమ్మళంగా తల్లి రొమ్ముమీద పండుకొంటుంది. తల్లి సన్నిధిలో, తల్లి స్పర్శను అనుభవిస్తూ సురక్షితంగా ఉండిపోతుంది. ఇక్కడ కీర్తనకారుడు తన్ను శిశువుతోను దేవుణ్ణి తల్లితోను పోల్చుకొన్నాడు. దేవుడు తన్ను కాచి కాపాడుతుంటాడు గనుక తానూ దేవుని సన్నిధిలో ప్రశాంతంగాను సురక్షితంగాను ఉండిపోతానని చెప్పుకొన్నాడు. దేవుడు తల్లిలాంటివాడినీ, తల్లి రక్షణనులాగే దేవుని రక్షణనుగూడ నమ్మవచ్చుననీ భావం. తల్లి వుంటే అండగదా! దేవుడివల్ల కూడ కొండంత అండ కలుగుతుందని పై ఉదాహరణల భావం.

## 5. గర్భిణిగా ప్రభువు

రెండవ యెషయా ప్రభువుని గర్భిణితో పోల్చాడు. చూలాలు బిడ్డను కన్నట్లుగా ప్రభువు యిస్రాయేలును మళ్ళా కంటాడని వాకొన్నాడు - 42,14.

ప్రభువు ఈలా పల్కుతున్నాడు
నేను దీర్ఘకాలం మౌనంగా వున్నాను
నోరువిప్పి మాట్లాడలేదు
నన్ను నేను నిగ్రహించుకొన్నాను
కాని యిప్పుడు ప్రసవవేదన పడే స్త్రీలా అరుస్తున్నాను
గట్టిగా గాలి పీలుస్తూ రోజుతున్నాను.

యిస్రాయేలీయులు బాబిలోనియాలో వుండి మొరపెట్టగా యావే కొన్నాళ్ళు పట్టించుకోలేదు. మౌనంగా ఉండిపోయాడు. కాని యిప్పుడు మనసుకరిగి ఆ ప్రజలను రక్షించడానికి పూనుకొన్నాడు.

అతని కరుణ అతనికి స్త్రీకిలాగ ఉద్వేగాన్ని పుట్టించింది. అతను బిడ్డనుకనే చూలాలు లాంటివాడు అయ్యాడు. ఆ ప్రభువుకూడ యిస్రాయేలును మళ్ళా కనాను దేశానికి కంటాడు. అనగా వారిని పాలస్తీనా దేశానికి తీసికొనిపోతాడని భావం. దేవుడు ప్రవాసంలోని యూదులపట్ల ప్రసవవేదన పడే స్త్రీలా ప్రవర్తిస్తాడని అర్థం.

## 6. మంత్రసానిగా ప్రభువు

కీర్తనకారుడు యావేను, ప్రసవిస్తూన్న స్త్రీ గర్భం నుండి బిడ్డను వెలికితీసే మంత్రసానితో ఉపమించాడు. 22, 9-10. ఈ గీతంలో భక్తుడు ఏదో ఆపదలో ఉండి ప్రభుని శరణు వేడుతున్నాడు.

తల్లి కడుపునుండి నన్ను సురక్షితంగా
బయటికి కొనివచ్చింది నీవే
నేను మాతృస్తన్యాన్ని గ్రోలి
భద్రంగా మనేలా చేసింది నీవే
మాతృ గర్భంనుండి వెలువడి నప్పటినుండి
నేను నీమీదనే ఆధారపడ్డాను
నేను జన్మించినప్పటినుండి నీవే నాకు దేవుడివి.

మంత్రసాని తల్లి గర్భంనుండి బిడ్డను వెలికితీస్తుంది. ఆలాగే దేవుడు ఓ మంత్రసానిలాగ తన్ను తల్లి గర్భంనుండి బయటికి తీసాడని భావం. మంత్రసాని బిడ్డను తల్లిరొమ్ము ప్రక్కన పండుకోబెట్టి పాలు కుడిపిస్తుంది. దేవుడు ఓ మంత్రసానిలాగ తనచే తల్లి రొమ్మునుండి పాలు త్రాగించాడని భక్తుని భావం. అనగా కీర్తనకారుడు జన్మించినప్పటి నుండి ప్రభువే అతన్ని సాకుతూ వచ్చాడని అర్థం. చంటిబిడ్డడుగా ఉన్నప్పటినుండి తన్ను కాపాడిన దేవుడు ఇప్పుడు ఆపదలో తన్ను రక్షించాలని భక్తుని మొర. ఇవి చాల భక్తిగల భావాలు. భగవంతుణ్ణి పూర్ణంగా నమ్మిన నరుడేగాని ఈలాంటి ఆలోచనలను వెలిబుచ్చలేడు.

## 7. ఇంటి యజమానురాలుగా యావే

మరో కీర్తనకారుడు యావే ప్రభువుని యింటి యజమానురాలితో పోల్చాడు - 123,23.

సేవకుల కన్నులు యజమానుని చేతిమీదను
సేవికల కన్నులు యజమానురాలి చేతిమీదను
ఏలా నిల్చివుంటాయో ఆలాగే
మన దేవుడైన ప్రభువు మనలను కరుణించేదాకా
మన కన్నులను అతనిమీద నిల్పివుంచుదాం.

యజమానురాలు ఇంటిలోని పనికత్తెలకు అన్నపానీయాలు బట్టలూ అందించి వారిని సంరక్షిస్తుంది. కనుక పనికత్తెలు ఆశతో ఆమె చేతులవైపు చూస్తుంటారు. ఆమె చేతులతో అందించే పదార్థాలను కృతజ్ఞతతో, వినయంతో స్వీకరిస్తారు. ఆలాగే యిస్రాయేలు

అనే పనికత్తె దేవుడు అనే యజమానురాలి హస్తాలవైపు ఆశతో చూస్తుండాలి. అతడిచ్చే పదార్థాల కొరకు కాచుకొని ఉండాలి. అనగా యిస్రాయేలు దేవుని ఆదరాభిమానాల కొరకూ రక్షణంకొరకూ ఆశతో ఎదురు చూస్తుండాలని భావం. కరుణగల యజమానురాలు పనికత్తెలనులాగ, ప్రభువు యిస్రాయేలును తప్పక ఆదుకొంటాడని అర్థం. ఇది నేడు మన ప్రార్థనలో మనంకూడ వాడుకోదగ్గ మంచి భావం.

## 8. బట్టలుకుట్టే తల్లిగా దేవుడు

ఆదాము ఏవ పాపం చేయనంతవరకు దిసమొలతోనే ఉన్నారు. ఐనా వారికి సిగ్గువేయలేదు. అనగా వారిలో ఇంకా కామం లేదు. ఉద్రేకం లేదు. ఇంద్రియాలు పూర్తిగా అదుపులో ఉన్నాయి - ఆది 2,25. కాని ఆదాము పాపం చేయగానే ఈ భాగ్యస్థితి పోయింది. వాళ్ళు జంతువాంఛలకు లొంగిపోయారు. తమ దిసమొలను చూచి తామే సిగ్గుపడి అంజూరపు ఆకులతో కప్పుకొన్నారు - 3,7. అనగా పాపఫలితంగా వారిలో కామం ఉద్భవించిందని భావం. తర్వాత దేవుడు వారిని శిక్షించినా వారిమీద కరుణ జూపాడు. జంతుచర్మంతో బట్టలునేసి ఆదామేవలకు తొడిగాడు - 3,21. ఇది గమనింపదగిన వాక్యం. ఇక్కడ రచయిత దేవుణ్ణి బట్టలుకుట్టి బిడ్డలకు తొడిగే తల్లితో పోల్చాడు. అనగా దేవుడు నెనరుతో ప్రజలను పట్టించుకొనేవాడని భావం.

## 9. బిడ్డలను మోసే గర్భవతిగా యావే

రెండవ యెషయా ప్రవక్త దేవుణ్ణి బిడ్డలను కడుపులో మోసే గర్భవతితో పోల్చాడు - 46, 1-4. బాబిలోనీయులు బేలు, నెబో అనే దేవతలను కొల్చేవాళ్ళు. పర్షియా రాజయిన కోరెషు దండెత్తి వస్తున్నాడని విని వాళ్ళు భయంతో ఆ దేవతల విగ్రహాలను పశువులమీది కెక్కించుకొని పారిపోయారు. ఆ బొమ్మలను వాళ్ళే మోసికొనిపోవాలి. అవి స్వయంగా నడువలేవు. వాటికి శక్తి లేదు. అవి తమ భక్తులను కాపాడలేవుకూడ. ఈ బొమ్మలతో పోలిస్తే యిస్రాయేలు దేవుడైన యావే సజీవుడు, శక్తిమంతుడు. తన భక్తులను తానే మోసికొనిపోయేవాడు.

యాకోబు వంశజులారా!
యిస్రాయేలున మిగిలియున్నవారలారా!
నా మాటలు వినండి
మీరు పుట్టినప్పటినుండి నేను మిమ్ము భరించాను
మీరు జన్మించినప్పటినుండి నేను మిమ్ము మోసాను

మీరు వృద్ధులయ్యేదాక నేను మీకు దేవుణ్ణి
మీ తల నెరిసేవరకు నేను మిమ్ము మోస్తాను
నేను మిమ్ము సృజించాను, మిమ్ము భరించాను
మిమ్ము మోస్తాను, రక్షిస్తాను.

అన్యజాతివారి దేవుళ్ళను వారి పశువులు మోస్తే, యిస్రాయేలును యావేప్రభువు ఓ గర్భవతిలాగ తన కడుపులో మోస్తాడు. అనగా ఆ జాతి పుట్టినప్పటినుండి ప్రభువు వారిని కాపాడుతూ వచ్చాడని భావం. వాళ్ళు ముసలివాళ్ళయి పోయేవరకు కూడ యావే వారిని మోస్తూ, సంరక్షిస్తూ ఉంటాడు. కనుక తమ్ము భరించే ప్రభువుని నమ్మడం యిస్రాయేలుకు అన్నివిధాల శ్రేయస్కరం. ఇక్కడ మనకు కావలసింది యావే గర్భిణిలాంటివాడు అనే భావం.

## 10. స్త్రీమూర్తిగా జ్ఞానం:

పూర్వవేదంలో జ్ఞానం ఓ పెద్ద అంశం. దీనికి హీబ్రూలో హోక్మా అనీ, గ్రీకులో సోఫియా అనీ పేర్లు. ఇవి రెండూ స్త్రీ లింగాలు. కనుక పూర్వవేదంలో జ్ఞానం ఓరకమైన దివ్యశక్తిగా, దేవతగా, దివ్యమాతగా, ఉత్ప్రేక్షింపబడింది. చాల పర్యాయాలు ఇది భగవంతుణ్ణే సూచిస్తుంది. కాని అతన్ని స్త్రీనిగా సూచిస్తుంది.

అసలు జ్ఞానం అంటే యేమిటి? అది భగవంతుని అంశ, లేక శక్తి, లేక గుణం. భగవంతుని దివ్యశక్తిని సూచించే ఓ వ్యక్తి. అనగా యూదులు భగవంతుని దివ్య గుణాన్ని ఓ వ్యక్తినిగా, ఓ స్త్రీమూర్తినిగా భావించారన్న మాట. ఈమె బాబిలోనియులు కొల్చే అస్టార్టె అనే దేవతకు దీటుగా ఉంటుంది.

ఈ జ్ఞానం ఏంచేస్తుంది? నరులకు మంచి చెడ్డలను తెలిసికొనే శక్తినిస్తుంది. జీవితంలో వారికి విజయాన్ని ప్రసాదిస్తుంది. ఏ కార్యాన్ని ఎలాచేయాలో నేర్పుతుంది. జీవిత అనుభవాల సారాన్ని తెలియజేస్తుంది. ఈ గుణం కలవాడు జ్ఞానియై దేవుకీ నరులకూ కూడ ప్రీతి కలిగిస్తాడు. అది నరుణ్ణి రక్షిస్తుంది. బైబుల్లో జ్ఞానగ్రంథాలు ఏడు ఉన్నాయి.

బైబులు జ్ఞానాన్ని స్త్రీమూర్తినిగా చిత్రిస్తుంది అన్నాం. ఆమెకు సృష్టికర్త్రి, తల్లి వధువు, భార్య, ఉపాధ్యాయ, ఆతిథేయ అనే ఉపమానాలు వాడుతుంది. ఈ నాల్గింటిని క్రమంగా పరిశీలిద్దాం.

### 1. సృష్టికర్త్రిగా జ్ఞానం

సామెతల గ్రంథం 8, 22-31 జ్ఞానాన్ని సృష్టికర్త్రినిగా వర్ణిస్తుంది. ప్రభువు మొదట చేసిన సృష్టి జ్ఞానమే - 8,22. కనుక దానికి తర్వాత జరిగిన సృష్టిమీద అధికారముంది. ఆమె భగవంతునితో కలసి తానూ సృష్టికార్యంలో పాల్గొంది - 8, 30.

నేను ప్రధాన శిల్పివలె అతని చెంత నిల్చివున్నాను
పసికందువలె రోజురోజు అతనికి
ఆనందం చేకూరుస్తూ
నిత్యం అతని సన్నిధిలో ఆటలాడుకొనేదాన్ని.

ప్రభువు లోకసృష్టి చేస్తుండగా జ్ఞానం దేవునితోపాటు తానూ ఆ సృష్టిలో పాల్గొంది. శిల్పి భవనాన్ని నిర్మించినట్లుగా ఆమె లోకసృష్టిని చేసింది. కనుక ఆమె సృష్టికర్త్రి. జ్ఞానానికి దేవునితోను, లోకంతోను, నరులతోను ఉండడమంటే ప్రీతి. ఆమె దేవునిగూర్చి, లోకాన్ని గూర్చి నరులకు తెలియజేస్తుంది. కనుకనే తాను "ప్రభువు చేసిన భూమిమీద క్రీడిస్తూ ప్రమోదంతో మానవాళిమధ్య వసిస్తూ వచ్చాను" అని చెప్పుకొంది -31.

## 2. తల్లిగా జ్ఞానం

సీరా గ్రంథం జ్ఞానాన్ని తల్లితో పోలుస్తుంది - 15,1-6.
దైవశాస్త్ర పారంగతుడు జ్ఞానాన్ని పొందుతాడు
విజ్ఞానం తల్లివలె వచ్చి అతన్ని ఆహ్వానిస్తుంది
అది అతనికి తెలివిడి అనే అన్నం పెడుతుంది
వివేకం అనే పానీయం ఒసగుతుంది
అతడు ఊతకర్రమీదలాగ దానిమీద వాలి నడవాలి
ఏనాడు క్రిందపడిపోడు.

ధర్మశాస్త్రాన్ని తెలిసికొని పాటించేవాణ్ణి జ్ఞానం ప్రేమిస్తుంది. తల్లిలా వచ్చి అతనికి అన్నపానీయాలు అందిస్తుంది. వివేకం, తెలివి అనేవే ఆ యాహార పదార్థాలు. ఆమీదట అతడు తెలివితేటలతో సమాజంలో బాగా రాణిస్తాడు.

## 3. వధువుగా జ్ఞానం

జ్ఞానియైన సొలోమోనురాజు దేవునినుండి జ్ఞానాన్ని భార్యనుగా పొందగోరాడు. - సొలోమోను జ్ఞానం - 8,2.

నేను జ్ఞానాన్ని ప్రేమించాను
బాల్యం నుండి దానికొరకు గాలించాను
దానిని నా వధువుని చేసికోగోరాను
దాని సౌందర్యానికి ముగ్ధుడనయ్యాను.

ఆరాజు జ్ఞానంకొరకు ప్రభువుకి ఈలా ప్రార్థనం చేసాడు 9, 10-11.
మా పితరులకు దేవుడవైన ప్రభూ!

పరమ పవిత్రమైన మోక్షపథంనుండి,
మహిమాన్వితమైన నీ సింహాసనం నుండి
జ్ఞానాన్ని నాయొద్దకు పంపు
అది నాతోగలసి పనిచేయునుగాక
దాని సాయాన నీకు ప్రియమైనదేదో
నేను తెలిసికొందునుగాక
అది అన్నిటిని ఎరుగును
నేను చేసే పనులన్నిటిలో నాకు త్రోవ చూపుతుంది
దాని శక్తినన్ను కాపాడుతుంది.

జ్ఞానాన్ని పొందినవారు దేవునికి ప్రీతి కలిగించే పనులు చేసి విజయాన్ని సాధిస్తారని ఈ వాక్యాల భావం.

## 4. ఆతిథేయగా, ఉపధ్యాయగా జ్ఞానం

సామెతల గ్రంథం జ్ఞానాన్ని ఆతిథేయగాను, ఉపాధ్యాయగాను చిత్రిస్తుంది - 9,1-6.

జ్ఞానమనే స్త్రీమూర్తి తన భవనాన్ని నిర్మించి
ఏడు స్తంభాలను నెలకొల్పింది
ఆమె వేటమాంసం వండి
సుగంధ ద్రవ్యాలు కల్పిన ద్రాక్షాసవం సిద్ధంచేసి
భోజన పదార్థాలు తయారుచేసింది
వివేకహీనునికి ఆమె యీలా కబురు పంపింది
రా, నేను తయారుచేసిన భోజనాన్ని ఆరగించు
నేను సిద్ధంచేసిన ద్రాక్షాసవాన్ని సేవించు
మూర్ఖత్వాన్ని విడనాడితే నీవు బాగుపడతావు
నీవు విజ్ఞానపథాన నడువు.

ఇక్కడ రచయిత జ్ఞానాన్ని నరుణ్ణి భోజనానికి ఆహ్వానించే ఆతిథేయనుగా చిత్రించాడు. ఈ యాతిథేయ వడ్డించే భోజనం ఏమిటి? జ్ఞానమే. ఆమె వివేకాన్ని బోధించే ఉపాధ్యాయ - 8,4 -10.

నరులారా! నేను మిమ్ము ఆహ్వానిస్తున్నాను
నేలమీది జనులందరికి విజ్ఞప్తి చేస్తున్నాను
అజ్ఞానులారా! మీరు జ్ఞానాన్ని ఎరుగండి

మందమతులారా! మీరు వివేకాన్ని అలవర్చుకోండి
నేను ఉదాత్త సత్యాలనే బోధిస్తాను
నా పెదవులనుండి సత్యవాక్కులేగాని వెలువడవు
మీరు వెండిని విడినాడి నా ఉపదేశాన్ని అంగీకరించండి
బంగారాన్ని వదలుకొని విజ్ఞానాన్ని పొందండి.

పైన మనం చూచిన జ్ఞానమనే స్త్రీమూర్తి భగవంతుడే. అతని వరప్రసాదమే. జ్ఞానగ్రంథాలు భగవంతుని శక్తినే స్త్రీమూర్తినిగా వర్ణించాయని ముందే చెప్పాం.

## 11. స్త్రీమూర్తిగా దేవుని ఆత్మ

హీబ్రూలో ఆత్మకు రువా అనిపేరు. ఇది స్త్రీలింగం. కనుక యూదులు దేవుని ఆత్మను స్త్రీమూర్తినిగా భావించారు. ఈయాత్మ దేవుని ఊపిరి లేక జీవశక్తి. ఇంకా అతని క్రియాశక్తిగూడ. ఈ శక్తివల్లనే లోకంలోని ప్రాణులన్ని జీవిస్తున్నాయి, పనిచేస్తున్నాయి.

భగవంతుని జీవ, క్రియాగుణాలనే బైబులు ఆత్మ అంటుంది. ఆత్మ స్త్రీలింగం గనుక దానికి ఆలవాలమైన దేవుణ్ణిగూడ స్త్రీమూర్తినిగా భావిస్తుంది. కనుక ఆత్మ అంటే స్త్రీరూపంలో ఉన్న దేవుడే.

ఆత్మ ఏం చేస్తుంది? అది ఆదిమ జలాలమీదికి ఎగిరి వాటిలో ప్రాణికోటిని పుట్టించింది – ఆది 1,2. దేవుడు తన ఊపిరిని (ఆత్మను) మట్టిముద్దలోనికి ఊదగా అది జీవించే ప్రాణి ఐంది. అతడే ఆదాము – ఆది 2,7. ప్రభువు తనకు ఎదురుతిరిగే యిస్రాయేలీయుల మీదికి తన ఆత్మను పంపుతాడు. వారిలోని రాతిగుండెను తొలగించి మాంసపు గుండెను దయచేస్తాడు. అనగా అవిధేయులైన యూదులను విధేయులనుగా మారుస్తాడు –యెహె 36, 26–28. కనుక యిస్రాయేలీయయుల హృదయాలను మార్చి వాళ్ళు నైతికంగా విశుద్ధజీవితం గడిపేలా చేసేది ఆత్మే. ఈ యాత్మ హృదయ పరివర్తనానికీ, నూత్నత్వానికీ చిహ్నం. ప్రవక్తలను ప్రేరేపించింది దేవుని ఆత్మే. అంత్యకాలంలో ప్రభువు నరులందరిమీద ఈ యాత్మను కుమ్మరిస్తాడు – యోవేలు 2,28–29. పెంతెకోస్తు దినాన ఈ ప్రవచనం నెరవేరింది. నేడు నరులందరినీ నడిపించేది ఆత్మే – కీర్తన 143,10. ఈవిధంగా బైబులు దేవుని ఆత్మద్వారా దేవుణ్ణి స్త్రీమూర్తినిగా చిత్రిస్తుంది.

## 12. స్త్రీమూర్తిగా దేవుని సాన్నిధ్యం

దేవునిసాన్నిధ్యానికి హీబ్రూలో షెకీనా అని పేరు. ఈ పదంకూడ స్త్రీలింగం. ఇదికూడ దేవుణ్ణి సూచించేదే. కనుక స్త్రీమూర్తిగా నరులమధ్యలో ఉన్న దేవుడు లేక

అతని సాన్నిధ్యం షెకీనా. బైబులు కొన్నిసార్లు దేవుని ఆత్మే అతని సాన్నిధ్యం అనికూడ చెప్తుంది. కనుక కొన్ని తావుల్లో రువా, షెకీనా కలసిపోతాయి - కీర్తన 139,7.

దైవసాన్నిధ్యం ప్రధానంగా దేవళంలో వుంటుంది - నిర్గ 25,8. సోలోమోను దేవాలయం కట్టి ప్రతిష్ఠించాక ఈ షెకీనా ఆ మందిరంలో నెలకొంది - 1 రాజు 8,11. ధర్మశాస్త్రాన్ని బోధించేకాడ షెకీనా ఉంటుందని రబ్బయుల నమ్మకం. ఇంకా, అది నరులమధ్య, నరులతో ఉంటుంది.

కాని షెకీనా ఏంచేస్తుంది? నరుల అంతరంగంలో దివ్య ప్రేరణలు పుట్టిస్తుంది. వారి చేత మంచి పనులు చేయిస్తుంది.

దేవుని సాన్నిధ్యంగూడ దేవుని ఆత్మలో ఓ భాగమే. ఈయాత్మనే బైబులు దేవుని ముఖం, దేవుని దూత, దేవుని మేఘం, దేవుని సాన్నిధ్యం అని నానారూపాలతో పిలుస్తుంది. దేవుని ఆత్మ మనకు చేసిపెట్టే పనులుకూడ నానారూపాల్లో ఉంటాయి. ఆ యాత్మ మనకు నూత్నత్వాన్ని దయచేస్తుంది. మనలను ఐక్యపరుస్తుంది. మనకు చికిత్స చేస్తుంది. మనలో మార్పు తెస్తుంది. మనలో వసిస్తుంది. కనుక ఆ దివ్యాత్మ పట్ల మనకు భక్తి అత్యవసరం.

హోక్మా, రువా, షెకీనా అనే పదాల ద్వారా పూర్వవేదం దేవుణ్ణి స్త్రీమూర్తినిగా చిత్రిస్తుందని మనం తెలిసికోవలసిన అంశం.

ఇంతవరకు మనం చూచిన భావాల సారాంశం ఇది. యూదులు దేవుణ్ణి స్త్రీమూర్తినిగా, తల్లినిగా భావించారు. కనుక మన ప్రార్థనంలో మనం అతన్ని ఎప్పుడూ తండ్రినిగానే భావించుకోనక్కరలేదు. తల్లినిగా గూడ భావించి జపం చేసికోవచ్చు. అతన్ని అమ్మా! అని పిలువవచ్చు. అమ్మ మనకు ప్రీతికరరమైన వ్యక్తి. పవిత్రమైన వ్యక్తి. ఆ పవిత్ర భావాన్ని దేవునికిగూడ ఆరోపిస్తే అతడు తప్పక సంతోషిస్తాడు.

# 2. నూత్న వేదం

నూత్న వేదంలో దేవుణ్ణి తల్లిగా భావించిన సందర్భాలు కొద్దిగానే ఉన్నాయి. నాల్గు తావుల్లో మాత్రం నూత్నవేదం దేవుణ్ణి తల్లితో ఉపమిస్తుంది. వీటిల్లో రెండు యావే ప్రభువుకి చెందినవి. ఒకటి క్రీస్తుకీ ఇంకొకటి పవిత్రాత్మకీ చెందినవి. ఇక ఈ నాల్గు సందర్భాలను పరిశీలిద్దాం.

## 1. గృహస్థురాలుగా దేవుడు

క్రీస్తు మామూలుగా యావే ప్రభువుని అబ్బ (నాన్న) అని పిల్చేవాడు. అతనికి పుంలింగాన్నే వాడేవాడు. రెండు తావుల్లో మాత్రం అతన్ని స్త్రీనిగా పేర్కొన్నాడు. మొదటిది

నాణాన్ని పోగొట్టుకొన్న స్త్రీ సామెతలో - లూకా 15,8-10. ఈ కథలో ఓ గృహస్థురాలికి పది నాణాలున్నాయి. వాటిల్లో ఒక్కటి జారిపోయింది. ఆమె దానికోసం శ్రద్ధగా వెదికింది. దీపం ముట్టించి ఇల్లంతా ఊడ్చింది. చివరకు ఆ నాణెం దొరికింది. ఆమె యిరుగుపొరుగు స్త్రీలను పిల్చి పోయిన నా కాసు దొరికింది. నాతోపాటు మీరుకూడ ఆనందించండి అని చెప్పింది.

ఈ సామెతలోని భావం ఇది. స్త్రీ జారిపోయిన నాణెం దొరికినపుడు ఆనందించినట్లే దేవుడు పాపి పరివర్తనం చెందినపుడు ఆనందిస్తాడు. దేవుని ప్రతినిధిగా వచ్చిన క్రీస్తుకూడ పాపులు పరివర్తనం చెందినపుడు సంతోషిస్తాడు. దేవునికీ, క్రీస్తుకీ పాపులంటే ఇష్టం, దయ. ఆ పాపులు పరివర్తనం చెంది దేవునితో రాజీపడాలి. అతడు ఇప్పుడు క్రీస్తుద్వారా వాళ్ళను స్వయంగా వెదుక్కొంటూ వస్తున్నాడు.

ఈ సామెతలో క్రీస్తు ఓ గృహస్థురాలిని యావే ప్రభువుతో పోల్చడానికి వెనుకాడలేదు. కనుక దేవుణ్ణి స్త్రీనిగా, తల్లినిగా భావించడం అతనికి ఇష్టమే అనుకోవాలి.

## 2. రొట్టెలు చేసే స్త్రీగా దేవుడు :

క్రీస్తు యావేను రొట్టెలు కాల్చే స్త్రీతో పోల్చాడు. ఈ సందర్భంలో అతడు ఈ సామెతను చెప్పాడు. దైవ రాజ్యాన్ని దేనితో పోలుస్తాను? ఓ స్త్రీ పులిపిడి ద్రవ్యాన్ని మూడు కుంచాల పిండిలో వుంచగా ఆ పిండంతా పులియబారింది - లూకా 17,20-21. ఇక్కడ భావం ఇది. మూడు కుంచాల పిండి మొదటలో కొద్ది పరిమాణంలో కన్పిస్తుంది. అది పులిపిడి ద్రవ్యంతో కలిసి పులియబారినప్పుడు చాల పెద్దదౌతుంది. అలాగే దైవరాజ్యం క్రీస్తు ప్రారంభించినప్పుడు చిన్నదే. కాని అతని మరణోత్థానాల తర్వాత అది ప్రపంచమంతా వ్యాపిస్తుంది. యూదులూ అన్యజాతివాళ్లు కూడ దానిలో చేరతారు. కనుక పెరుగుదల ఇక్కడ ముఖ్యాంశం.

ఇక, ఈ పెరుగుదలకు కారకుడు యావే ప్రభువే. దైవరాజ్యం అతనిరాజ్యమే. కనుక ఈ సామెత దేవుణ్ణి గూర్చే. స్త్రీ పిండిని పొంగ జేసినట్లే దేవుడు దైవరాజ్యాన్ని వ్యాప్తిచేస్తాడు. ఈ దేవుణ్ణే క్రీస్తు రొట్టెలు తయారుచేసే స్త్రీతో పోల్చింది. ఈ దేవునిపట్ల, అతడు వ్యాప్తిచేయబోయే దైవరాజ్యం పట్ల క్రీస్తుకి పూర్ణవిశ్వాసం ఉంది.

ఇక్కడకూడ క్రీస్తు యావే ప్రభువుని ఓ సామాన్య స్త్రీతో పోల్చాడు. అనగా దేవుణ్ణి పురుషుణ్ణిగా భావించినట్లే స్త్రీనిగా గూడ భావించవచ్చునని భావం.

## 3. తల్లిగా క్రీస్తు

యెరూషలేముకి వినాశం దాపురించింది. రోమీయులు ఆ నగరాన్ని నాశం చేయబోతున్నారు. ఇది యూదులకు దైవశిక్ష. ఈ శిక్షకు గురికాకముందే వాళ్ళు క్రీస్తు

బోధలను అంగీకరించి పశ్చాత్తాపపడితే మంచిది. తండ్రి వారిని క్షమించి కాపాడతాడు. ఈ సందర్భంలో క్రీస్తు చెప్పిన వాక్యం ఇది. "ఓ యెరుషలేమూ! కోడి రెక్కలను చాపి తన పిల్లలను కాపాడుకొన్నట్లే, నేను కూడ ఎన్నో పర్యాయాలు నీ బిడ్డలను చేరదీయగోరాను. కాని నీవు అంగీకరించలేదు" - లూకా 13,34. క్రీస్తు యెరూషలేమును కాపాడగోరుతుంటే ఆనగరం అతన్ని చంపగోరుతూంది. ఇది విడ్డూరం. ఇక్కడ క్రీస్తు తన్ను తల్లికోడితో పోల్చుకొన్నాడు. యూద ప్రజలే ఆ కోడికి పిల్లలు. ఈ ఉపమానం పూర్వవేదంనుండి వచ్చిందే. ద్వితీ 32,11-12 భగవంతుణ్ణి తల్లిపక్షితో పోల్చింది. యెషయాకూడ ఈ పోలికను వాడాడు - 31,25. "పక్షి తన పిల్లలమీద రెక్కలువిప్ప వాటిని కాపాడినట్లే సర్వశక్తిమంతుణ్ణయిన నేను యెరూషలేమును కాపాడతాను. దానిని శత్రువులకు చిక్కకుండ రక్షించి భద్రంగా ఉంచుతాను."

పూర్వవేదంలో యావే తల్లిపక్షి లాంటివాడు ఐనట్లే క్రీస్తుకూడ మనకు తల్లిపక్షి లాంటివాడు ఔతాడు. అనగా తల్లిపక్షి శత్రుపక్షుల నుండి తన పిల్లలను కాపాడుకొన్నట్లే క్రీస్తు మనలను ప్రేమతో కాచికాపడతాడని భావం. ఈలా కాపాడ్డమే అతడు మనకు దయచేసే రక్షణం. కాని యూదులు మూర్ఖులై ఆ రక్షణాన్ని నిరాకరించారు. నేడు మనంమాత్రం ప్రభువనే తల్లిపక్షి దయనూ ఆదరణనూ రక్షణాన్నీ అంగీకరించాలి.

ఇక్కడ పూర్వవేద సంప్రదాయాన్ని అనుసరించి క్రీస్తు తన్నుతాను తల్లితో పోల్చుకొన్నాడు. తర్వాత చాలమంది భక్తులు క్రీస్తుని తల్లిగా భావించి ప్రార్థన చేసికొన్నారు. వారిలో ప్రముఖురాలు 14వ శతాబ్దానికి చెందిన భక్తురాలు నోర్విచ్ జూల్యానా. ఈమె క్రీస్తుని "అమ్మా" అని సంబోధించేది.

## 4. తల్లిగా పవిత్రాత్మ :

క్రీస్తు నికొదేముతో మాట్లాడుతూ "నరుడు నీటివలన ఆత్మవలన జన్మిస్తేనేతప్ప దైవరాజ్యంలో ప్రవేశించడు" అని వాకొన్నాడు - యోహా 3, 3-6. మనం మొదట మన తల్లినుండి శారీరకంగా పుడతాం. ఆటుపిమ్మట జ్ఞానస్నానం ద్వారా ఆధ్యాత్మికంగా పుడతాం. ఈ రెండవ పుట్టుకవల్లనే మనం మోక్షాన్ని పొందగలిగేది. ఇక, మనకు ఈ రెండవ పుట్టుకనిచ్చే తల్లి పవిత్రాత్మే. ఆత్మ హీబ్రూ భాషలో స్త్రీలింగం. కనుక శారీరకమైన తల్లిలాగే వరప్రసాద రూపిణియైన తల్లికూడ ఉంది. ఈ రెండవతల్లే పవిత్రాత్మ. ప్రాచీన క్రైస్తవులు ఆత్మను తల్లినిగానే భావించారు.

ఈలా బైబులు తండ్రి, కుమారుడు, పవిత్రాత్మ అనే ముగ్గురు వ్యక్తులకు స్త్రీత్వాన్ని మాతృత్వాన్ని ఆరోపిస్తుంది. కట్టకడన ఈ క్రింది అంశాలను జాగ్రత్తగా గమనిద్దాం.

# పర్యవసానాలు

1. భగవంతుడు పురుషుడూ కాదు, స్త్రీకాదు. దేవుడు దేవుడే. ఐనా ఆ సృష్టికర్త స్త్రీపురుషులను ఇద్దరినీ తనకు పోలికగా చేసాడు. కనుక స్త్రీ పురుషులు ఇద్దరికి సంబంధించిన గుణం ఏదో అతనిలో ఉండాలి. కనుక అతన్ని మన భాషలో తండ్రి అనడం ఎంత ఉచితమో తల్లి అనడం కూడ అంత ఉచితం. కనుకనే ప్రపంచంలోని నానామతాల భక్తులు అతన్ని ఈ రెండు పేర్లతోను సంబోధించారు.

2. కొందరికి దేవుణ్ణి తండ్రి అని పిల్చినప్పటికంటె తల్లి అని పిల్చినప్పుడే ఎక్కువ భక్తి ప్రేమ పుడతాయి. ఈలాంటివాళ్ళు నిరభ్యంతరంగా అతన్ని తల్లినిగా భావించుకోవచ్చు.

3. చిన్నపిల్లలకు బోధించేపుడు తల్లిదండ్రులు దేవునితో సమానం అని చెప్తాం. చిన్న బిడ్డలు మొదట గుర్తించేది అమ్మా నాన్నలనే. వారికి కొంత ప్రాయం వచ్చి ఆయా విషయాలు అర్థంజేసికొనే శక్తి రాగానే మనం వారికి దేవుణ్ణి అమ్మనుగాను నాన్ననుగాను పరిచయం జేయడం మంచిది. జ్ఞానోపదేశంలోను బైబులు బోధలోను వారికి దేవుడు అమ్మా నాన్న రెండూ అని చెప్పాలి.

4. మన ఆరాధనలో, ప్రార్థనల్లో, పాటల్లో దేవుణ్ణి తల్లీ తండ్రిగా భావించుకోవాలి. మన ప్రార్థనలను "తల్లీ తండ్రివీ ఐన దేవా" అని ప్రారంభించడం మంచిది. మన ప్రసంగాల్లో, వడకాల్లో అతన్ని తల్లీ తండ్రినిగా చూపించాలి.

5. దైవశాస్త్రం క్రీస్తు గుణగణాలనూ అతడు దయచేసిన రక్షణాన్నీ వివరిస్తుంది. క్రీస్తులో మనకు ప్రధానంగా కన్పించే గుణం కరుణ, ప్రేమ. కాని ఈ గుణాలు తల్లిలోనే ఎక్కువగా ఉంటాయి. కనుక దైవశాస్త్రరీత్యా అతన్ని తల్లిగా భావించడం ఉచితమే.

6. భగవంతుడు అన్ని వస్తువుల్లోను ఉంటాడు. ప్రధానంగా మన హృదయంలో ఉంటాడు. కనుకనే మన దేశ ఋషులు అతన్ని "అంతర్యామి" అన్నారు. మన తరపున మనం మన హృదయగుహలోనికి ప్రవేశించి అక్కడ కొలువున్న ప్రభువుని గుర్తించాలి. బిడ్డ తల్లికి చేరువగా ఉంటుంది. భక్తుడుకూడ భగవంతునికి దగ్గరగా ఉండాలి. కాని అతన్ని తల్లినిగా భావించుకొన్నపుడు ఈ దగ్గరితనం ఇంకా యెక్కువౌతుంది. తల్లిపట్ల మనకుండే అనురాగం ఆప్యాయత ఎంతో గొప్పది కదా!

7. బైబుల్లోగాని, క్రైస్తవ సంప్రదాయంలోగాని దేవుణ్ణి మామూలుగా తండ్రి అనే పేర్కొన్నారు. కనుక ఒకవిధంగా చెప్పాలంటే, మనకు తల్లిలేదు. ఈ కొరతను మన క్యాతలిక్ సమాజంలో మరియమాత కొంతవరకు తీరుస్తుంది. మరియను గౌరవించడం ఉచితమే. కాని ఆమె కేవలం మానవమాత్రురాలైన తల్లి. దైవత్వాన్ని పొందిన తల్లి కాదు.

8. హిందూమతంలో సరస్వతి, లక్ష్మి, పార్వతి మొదలైన స్త్రీమూర్తులున్నారు. వీళ్ళు నరమాత్రులుకాదు. దైవత్వంకల స్త్రీ దేవతలు. ఈలాంటివాళ్ళు ఎవరూ మన క్రైస్తవమతంలో లేరు. మనం తల్లినిగా ఎంచి కొల్చే భగవంతుడుకాని, మనం గౌరవించే మరియమాతకాని పై స్త్రీ దేవతల్లాంటివాళ్ళుకాదు. ఈ యంశాన్ని మన ప్రజలు స్పష్టంగా గ్రహించాలి.

# 4. శిష్యలక్షణాలు



## మనవిమాట

నేటి మన క్రైస్తవజీవితం వట్టి చౌకబారురకమై పోయింది. మనందరిలోను చిత్తశుద్ధి లోపిస్తూంది. నేడు క్రీస్తు బోధలప్రకారం జీవించే క్రైస్తవులు కరవైపోయారు. ఈలాంటి పరిస్థితుల్లో ఆ ప్రభువు ఉద్దేశించిన నిజశిష్య లక్షణాలనూ తొలినాటి క్రైస్తవులు ఆ లక్షణాలకు అనుగుణంగా జీవించిన తీరునూ ఓ మారు స్మరించుకోవడం లాభదాయకం ఔతుంది. ప్రభువు అడుగుజాడల్లో నడవడం క్రైస్తవ శిష్యుడి ధర్మం. ఈ చిన్ని పొత్తం అ ప్రేరణనే కలిగిస్తుంది.

## విషయసూచిక



# 1. శిష్యలక్షణాలు

## 1. శిష్యులంటే యెవరు?

క్రీస్తుకి చాల వర్గాల శిష్యులు ఉండేవాళ్లు. సువిశేషాల్లో కనీసం మూడు వర్గాలనైనా గుర్తించవచ్చు. అందరికంటె ముఖ్యులు 12 మంది శిష్యులు - మత్త 10,1. వీళ్లుకాక డెబ్భైమంది అనే పేరుతో మరోవర్గంవాళ్లు కూడ వున్నారు - లూకా 10,1. ఇంకా కొన్ని తావుల్లో అతనికి గొప్ప శిష్యవర్గం వుండేదని చెప్పబడింది - లూకా 6, 17. కాని ఈ వార్గలన్నీ శిష్య వృత్తిలో ఎక్కువకాలం కొనసాగలేదు. ప్రభువు కొంచెం కటువైన బోధలు చేయగానే చాలమంది జారుకొన్నారు. ఓమారు అతడు తన శరీరాన్నే ఆహారంగా యిస్తానని చెప్పాడు. శిష్యులు ఈ వాక్యాన్ని అపార్థం చేసికొన్నారు. అది వాళ్లకు వెగటుగా తోచింది. అప్పటినుండి చాలమంది అతన్ని అనుసరించడం మానివేసారు - యోహా 6, 66.

ఉత్థాన క్రీస్తు తన్ను గూర్చి బోధించమని శిష్యులకు ఆజ్ఞ యిచ్చాడు. జనులను తన శిష్యులనుచేసి వాళ్లు తన ఆజ్ఞలను పాటించేలా చేయమని చెప్పాడు. వాళ్లకు జ్ఞానస్నానం ఈయమని అదేశించాడు - మత్త 28,19. ఈలా తయారైన జనులు ఎప్పుడుగూడ క్రీస్తుశిష్యులేకాని మన శిష్యులు కాదు. కనుక వాళ్లను మన దగ్గరికి కాదు క్రీస్తు దగ్గరికి రాబట్టాలి.

సువిశేషాల్లో శిష్యశబ్దాన్ని ప్రత్యేకార్థంలో వాడారు. క్రీస్తుని ప్రత్యక్షంగా ఎరిగివుండి అతన్ని అనుసరించేవాళ్లు శిష్యులు. కాని అపోస్తులుల చర్యలు గ్రంథం వ్రాసేప్పటికల్లా ఈ శబ్దం మారిపోయింది. ప్రభువుని ప్రత్యక్షంగా ఎరిగివున్నా లేకపోయినా అతన్ని విశ్వసించి అతని బోధలను పాటించే వాళ్లనందరినీ ఈ గ్రంథం శిష్యులనుగా అంగీకరించింది - అచ 6,1. 9,1. నేడు మనంకూడ శిష్యశబ్దాన్ని ఈ విస్తృతార్థంలోనే వాడుతూన్నాం.

## 2. క్రీస్తే తన శిష్యులను ఎన్నుకొన్నాడు.

గ్రీసుదేశంలో శిష్యులే గురువుని ఎన్నుకొన్నారు. ఆలాగే యూదులల్లోకూడ శిష్యులే తమ రబ్బయిలను ఎన్నుకొన్నారు. మనదేశంలో ఋషులసంగతి చెప్పవలసివచ్చినపుడు కూడ శిష్యులే తమ గురువుని ఎంపిక చేసికొనేవారు. కాని క్రీస్తు విషయంలో మాత్రం ఈలా కాదు. అతడే తన శిష్యులను నిర్ణయించుకొన్నాడు. ఇది అసాధారణమైన విషయం. "మీరు నన్ను ఎన్నుకోలేదు, నేనే మిమ్ము ఎన్నుకొన్నాను" అన్నాడు ప్రభువు - యోహా 15,16. మీరు నావెంట రండి, నేను మీచే చేపలకు బదులుగా మనుష్యులను పట్టిస్తాను అని పల్కాడు - మత్త 4, 19-20. ప్రభువు తండ్రే తనగొర్రెలను తనకు అప్పగించినట్లుగా కూడ మరోతావులో చెప్పుకొన్నాడు - యోహా 10,29.

క్రీస్తు అర్హతలేనివాళ్లనుకూడ కొందరిని తన శిష్యులను చేసికొన్నాడు. ఉదాహరణకు యూదుల్లో అట్టడుగు వర్గమైన సుంకరులకు రబ్బయిల శిష్యులయ్యే అర్హత లేదు. అగ్రవర్గం వాళ్లు వీళ్లని అసహ్యించుకొనేవాళ్లు - లూకా 15,1-2. కాని ఈ క్రిందివర్గంవారి నుండే లేవీని శిష్యుణ్ణిగా ఎన్నుకొన్నాడు క్రీస్తు - మార్కు 2,14. దీన్నిబట్టి లోకం అయోగ్యులనుగా ఎంచే వాళ్లనుగూడ ప్రభువు తన శిష్యుల్లో చేర్చుకొన్నాడు అనుకోవాలి. కొందరు శిష్యులకు పెద్ద తెలివితేటలుగూడ లేవు. ఐనా ప్రభువు వాళ్లనే ఎంపిక చేసాడు. ఈ సత్యాన్ని గుర్తించే తర్వాత పౌలు "ప్రభువు లోకం అవివేకులనుగా ఎంచేవాళ్లను ఎన్నుకొని తాము వివేకులమనుకొనే వాళ్లనందరినీ సిగ్గుపరచాడు" అని నుడివాడు - 1 కొరి 1, 27-28. అనగా శిష్యులశక్తి క్రీస్తునుండే గాని తమనుండి కాదని భావం.

## 3. గురవు నేర్పే జ్ఞానంకాదు, గురువే ముఖ్యం

పూర్వవేదంలోని తొలి ఐదుగ్రంథాలకు టోర అనిపేరు. అదే ధర్మశాస్త్రం. యూదులకు ఈ టోర ఎంతో ముఖ్యమైనది. దాన్ని నేర్చుకోవడానికే వాళ్ల శిష్యులు రబ్బయిలదగ్గరికి వెళ్లారు. ఆలాగే గ్రీసుదేశంలో విజ్ఞానాన్ని ఆర్జించడానికి శిష్యులు సోక్రిటీసులాంటి గురువులను ఆశ్రయించారు. మన ప్రాచీన గురుకులాల్లో గూడ బ్రహ్మవిద్యను నేర్చుకోవడానికి శిష్యులు ఋషులను ఆశ్రయించారు. ఈ మూడు

ఉదాహరణలనుబట్టి శిష్యుడు గురువునుండి విజ్ఞానాన్ని ఆర్జింపగోరాడని తెలుస్తుంది. కాని క్రీస్తు శిష్యులు ఈలా విజ్ఞానం కొరకు తమ గురువుని ఆశ్రయింపలేదు. వాళ్ళ క్రీస్తు వ్యక్తిత్వాన్ని చూచి మురిసిపోయి అతని శిష్యులయ్యారు. ఆగురువుకి తమ జీవితాలు అర్పించుకొన్నారు. అతన్ని ఓ ఆరాధ్యమూర్తిగా భావించారు. ఆ శిష్యులు తమ గురువు బోధలు నేర్చుకోవాలి అనుకోలేదు. అతని అడుగుజాడల్లో నడవాలి అనుకొన్నారు - అంతే. క్రీస్తుబోధలు నేర్చుకోవడంకంటె అతన్ని అనుసరించడం వాళ్లకు ముఖ్యం. ఓ అతను మొదటవెళ్లి బంధువులవద్ద సెలవు తీసికొనివచ్చి తర్వాత క్రీస్తుని అనుసరిస్తానన్నాడు. ప్రభువు నాగటిమీద చేయిపెట్టి వెనక్కు చూచేవాడు తన శిష్యుడు కాలేడని చెప్పాడు. మరో అతన్ని యేసు తనవెంటరమ్మని పిల్చాడు. కాని అతడు మొదటవెళ్లి తన తండ్రిని పాతిపెట్టి వస్తానన్నాడు. బహుశః అతడు మళ్లావచ్చి వుండడు - లూకా 9, 59-62. ఇంకోమారు ఓ ధనికయువకుడు ప్రభువుని అనుసరిస్తా నన్నాడు. క్రీస్తు అతన్ని తన ఆస్తిపాస్తులు అమ్మి పేదలకు దానం చేసి తన వెంట రమ్మన్నాడు - మత్త 19,21. ఈలాంటి ఉదాహరణలన్నిటిలోను శిష్యులు క్రీస్తు ఉపదేశాలను వినాలనికాదు, అతన్ని వెంబడించాలని సూచింపబడింది. వాళ్లు తమ పూర్వ జీవితంతోను పూర్వసంబంధాలతోను తెగత్రెంపులు చేసికొని ఆ గురువుని అనుసరించాలని పేర్కొనబడింది. అనగా క్రీస్తు బోధలను నేర్చుకోవడంగాదు, అతని జీవిత విధానాన్ని అనుసరించడం శిష్యులకు ముఖ్యం. ఓ తావులో ప్రభువు శిష్యులను తననుండి నేర్చుకొమ్మన్నాడు - మత్త 11,29. కాని ఇక్కడ కూడ వాళ్లు నేర్చుకోవలసింది అతని బోధలుగాదు, ప్రవర్తనం. క్రీస్తు వినయమూ వినమ్రతా కలవాడని శిష్యులు నేర్చుకోవాలి. తాము ఆలాగే వినయంతో మెలగాలి. యూదరబ్బయిల శిష్యులూ గ్రీకు విద్వాంసుల శిష్యులూ విజ్ఞానార్జనం కొరకు తమ గురువులను ఆశ్రయించారు. కాని క్రీస్తు శిష్యులు తమ గురువు జీవిత విధానాన్ని అనుసరించగోరారు. ఆ గురువుని వాళ్లు తమ సొంత తల్లిదండ్రులకంటె గూడ ఎక్కువ గౌరవంతో చూచారు - మత్త 10,37. అతనికి తమ సర్వస్వం అర్పించుకొన్నారు. అతనిపట్ల భక్తిభావం ప్రదర్శించారు.

శిష్యులకు క్రీస్తుపట్ల వున్న గౌరవాన్నీ పూజ్యభావాన్నీ అర్థం చేసికోవాలంటే వాళ్ల పిలుపునే పరిశీలించాలి. ప్రభువు పేత్రూ అతని అన్న అంద్రెయా చేపలు పడుతుండగా చూచి వాళ్లను తనవెంట రమ్మని పిల్చాడు. ఆ యన్నదమ్ములు తమ వలలనుగూడ వదలిపెట్టి ఉన్నవాళ్లు వున్నపాటిన ఆ గురువు వెంట వెళ్లారు. ఆలాగే అతడు యోహాను అతనిఅన్న యాకోబు చేపలు పడుతుండగా చూచి వాళ్లనుకూడ పిల్చాడు. ఆ సోదరులు కూడ తమ ముసలి తండ్రినీ పడవనీ వదలిపెట్టి ఏమీ జాప్యం చేయకుండ గురువువెంట వెళ్ళిపోయారు - మత్త 4, 18-22.

ప్రభువు సుంకపుశాలలో గూర్చుండి సుంకాలు వసూలు చేసే మత్తయిని పిల్చాడు. యూదులకు డబ్బంటే పంచప్రాణాలు లేచివస్తాయి. కాని మత్తయి ఆ కాసులనుగూడ అక్కడే వదలిపెట్టి క్రీస్తువెంట వెళ్ళిపోయాడు - మార్కు 2,14. ఆలాగే యేసు అంజూరంక్రింద కూర్చుండివున్న నతనియేలు తన శిష్యుడు కావాలని కోరుకొన్నాడు. కోరినట్లే నతనియేలు వచ్చి అతని శిష్యవర్గంలో చేరిపోయాడు - యోహా 1, 47-49. ఈ వుదాహరణలను బట్టి క్రీస్తు శిష్యులను బలంగా ఆకర్షించాడనీ, వాళ్ళు అతని వ్యక్తిత్వానికి ముగ్ధులైపోయారనీ అర్థంజేసి కోవాలి. వాళ్ళు తమ పూర్వజీవితంతో తెగత్రెంపులు చేసికొని అతిశీఘ్రంగా అతని శిష్యులైపోయారని గుర్తించాలి.

ఇంకా, క్రీస్తు చనిపోయాక శిష్యులకు అతనిపట్ల వున్న ఆదరాభిమానాలను నిలబెట్టిందేమిటి? క్రీస్తు బోధలుకాదు, అతని వ్యక్తిత్వమే. క్రీస్తు మరణానంతరం ఎమ్మావుకు వెళ్ళిన శిష్యులు అతడు "వాక్యంలోను క్రియలోను శక్తిగల ప్రవక్త" అని నమ్మారు. ఈ వ్యక్తే వాళ్ళ విశ్వాసాన్ని నిలబెట్టింది - లూకా 24,19. ఆలాగే క్రీస్తు ఉత్థానమై పరిశుద్ధాత్మ దిగివచ్చాక శిష్యులు అతని బోధలకు గాదు, అతని జీవితానికి సాక్ష్యంగా వుండాలి - అచ 1,8. ఈ చర్చ అంతటినిబట్టి తేలిందేమిటంటే క్రీస్తు శిష్యులకు అతని బోధలు కాదు, అతడే ముఖ్యం.

## 4. క్రీస్తుపట్ల విశ్వాసం ప్రధానం

5వ శతాబ్దంలో బాబిలోను ప్రవాసంనుండి తిరిగివచ్చిన యూదులు ధర్మశాస్త్రాన్ని జాగ్రత్తగా పాటించడం మొదలెట్టారు. వాళ్ళ రబ్బయిలు ధర్మశాస్త్రాన్ని క్షుణ్ణంగా బోధించడం ప్రారంభించారు. ఆ శాస్త్రాన్ని బాగా అర్థం చేసికొని నేర్పుతో బోధించగలిగిన రబ్బయిలను శిష్యులు ఎంతో గౌరవించేవాళ్ళు. క్రీస్తుకు కొలదియేండ్లపూర్వం వర్ధిల్లిన అఖిబా, హిలెల్, షమ్మయి మొదలైనవాళ్ళు ఈలాంటి రబ్బయిలే. ఇంకా గ్రీకు సంప్రదాయంలో శిష్యులు సోక్రటీసు, ప్లేటో వంటి ఉత్తమ విద్వాంసుల విజ్ఞానాన్ని జూచి ఆ గురువులను గౌరవించారు. కాని క్రీస్తు విషయం ఆలాకాదు. అఖిబా, సోక్రటీసు మొదలైన గురువుల శిష్యులు వాళ్ళపట్ల చూపని విశ్వాసాన్ని క్రీస్తు శిష్యులు అతనిపట్ల చూపారు. ఇక్కడ విజ్ఞానంకాదు, విశ్వాసం ముఖ్యం. క్రీస్తు తన్ను నమ్మి జ్ఞానస్నానం పొందిన వాడికి రక్షణం వుంటుందని నుడివాడు - మార్కు 16,16. పేతురు విశ్వాసం తొలగిపోకుండా వుండడానికై ప్రభువు ముందుగానే అతని కొరకు ప్రార్థనం చేసాడు - లూకా 22, 32. అదే పేతురు క్రీస్తుతో "ప్రభూ! మేము ఎవరివద్దకు వెళ్తాం! నీవు దేవుని చెంతనుండి వచ్చిన పవిత్రమూర్తివని విశ్వసిస్తున్నాం" అన్నాడు - యోహా 6, 68-69. ఈలాంటి సందర్భాలనుబట్టి శిష్యులు క్రీస్తుని ఓ

అతీతవ్యక్తినిగా భావించారని అర్థం చేసికోవాలి. తండ్రి చెంతనుండి వచ్చిన ఓ దివ్యుణ్ణిగా గుర్తించారని తెలిసికోవాలి. కనుకనే వాళ్ళు అన్నిటినీ వదలిపెట్టి అతనివెంట వెళ్లారు - లూకా 5,11. యూదులు సంప్రదాయంలో శిష్యులు తమ రబ్బయుల విజ్ఞానాన్నీ బోధనా పాటవాన్నీ మెచ్చుకొన్నారేగాని వాళ్ళను దివ్యులనుగా విశ్వసింపలేదు.

## 5. శిష్యులు క్రీస్తు అధికారానికి బద్ధులయ్యారు

రబ్బయిలూ వారి శిష్యులూ ధర్మశాస్త్రంలోని ఆజ్ఞలకు బద్ధులయ్యారు. ఏరబ్బయిగూడ తనఅధికారాన్నే ప్రమాణంగా చూపించి నేను చెప్తున్నాను మీరు వినండి అనలేదు. వాళ్ళు ఎప్పుడుకూడ మోషే ఆజ్ఞలనే ప్రమాణంగా చూపించేవాళ్ళు. కాని క్రీస్తు మోషే ధర్మశాస్త్రాన్నిగాక తన అధికారాన్నే ప్రమాణంగా చూపించాడు. నేను చెప్తున్నాను మీరు వినండి అన్నాడు. మోషే ఐతే శత్రువులమీద పగతీర్చుకొమ్మని చెప్పాడు, కాని నేను శత్రువుని ప్రేమించమని చెప్తున్నాను అన్నాడు - మత్త 5, 43-44. తాను సొంత అధికారంగలవాడిలాగ బోధించాడు. అతనికి ముందు ఏ రబ్బయికూడ అలా బోధించలేదు. కనుకనే అతని బోధలు విని ప్రజలు విస్తుపోయారు - మత్త 7, 28-29. పైగా అతడు తనకోసమే శిష్యులు అన్నిటినీ, చివరికి తల్లిదండ్రులనుగూడ, పరిత్యజించాలని కోరాడు - మత్త 10, 37 శిష్యులు ఆలాగే చేసారు. ఆ గురువు ఆజ్ఞ ఈయగానే వాళ్ళు విధేయులయ్యారు. అతడు గాడిదపిల్లను తోలుకొని రమ్మనగానే వాళ్ళు సేవకుల్లాగ వెళ్లి దాన్ని తీసికొని వచ్చారు - మార్కు 14, 1-6. అతని ఆజ్ఞలను పాటించడమే శిష్యుల విధి - యోహా 14,15. ప్రభువు శిష్యులపట్లగల ఆదరంచేత వాళ్ళను సేవకులనుగా గాక మిత్రులనుగా పరిగణించాడు - యోహా 15, 15. కాని వాళ్లేమో వస్తుతః సేవకులే. యూదుల గురుశిష్య సంబంధంలో ఈ అధికార భావమూ, ఈ విధేయతాభావమూ గోచరించదు. ఈవిషయంలో గూడ క్రీస్తు ఇతర రబ్బయిలకంటె భిన్నంగా ప్రవర్తించాడు.

## 6. క్రీస్తు శిష్యులకు తగింది పెత్తనంగాదు, పరిచారం

రబ్బయిల శిష్యులు కొంతకాలం తర్ఫీదు పొందినంక తాముగూడ రబ్బయిలయ్యేవాళ్ళు. తామూ అధికారపూర్వకంగా మోషే ధర్మశాస్త్రాన్ని బోధించేవాళ్ళు. కాని క్రీస్తు శిష్యులు ఈలా రబ్బయిలు కావడానికి వీల్లేదు. బోధకుడు, తండ్రి, గురువు మొదలైన బిరుదాలు యేసు శిష్యులకు చెల్లవు. అనాడు కొందరు రబ్బయిలు ఈ బిరుదాలను వాడుకొని గర్వంతో పొంగిపోయారు. అందుకే ప్రభువు తన శిష్యులకు ఈ బిరుదాలను నిషేధించాడు - మత్త 23, 8-11. క్రీస్తువల్ల తర్ఫీదుపొంది అతనిలా తయారుకావడమే శిష్యుల ఆశయం. కాని క్రీస్తులా తయారు కావడమంటే ఏమిటి? అతడు అందరికీ

పరిచారకుడు. క్రీస్తు శిష్యులుకూడ అందరికీ సేవలుచేయడం నేర్చుకోవాలి - మత్త 2,11. లోకంలో అధికారులు తమ క్రిందివాళ్ళమీద పెత్తనం చలాయిస్తారు. కాని క్రీస్తు శిష్యులు ఆలా చేయకూడదు. మనుష్యకుమారునిలాగ తామూ పరిచారం చేయాలేగాని, చేయించుకోగూడదు - మార్కు 10, 42-45. కనుక క్రీస్తు శిష్యులకు వినయంతో సేవలు చేయడం తగుతుంది కాని పెత్తనం చేయడం తగదు.

## 7. క్రీస్తుతోపాటు, బాధలూ, మరణమూ

శిష్యుల బాధ్యత క్రీస్తు బోధలను నేర్చుకోవడం గాదు, అతని జీవితవిధానాన్ని అనుసరించడం అని చెప్పాం. కాని క్రీస్తు జీవితవిధానం ఏమిటి? అతనిది సిలువమార్గం, సిలువమరణం. కనుక శిష్యుడికిగూడ ఈ సిలువమార్గం తప్పదు. అందుకే ప్రభువు "ఎవడైనా నన్ను వెంబడింపగోరితే తన్నుతాను త్యజించుకొని తన సిలువ నెత్తుకొని నావెంటరావాలి" అన్నాడు - మత్త 16,24. మరోతావులో యేసు "శిష్యుడు గురువుకంటె అధికుడు కాదు. తాను కూడ గురువులాగే వుండాలి" అని చెప్పాడు - మత్త 10, 24-25. ఈ వాక్యాలనుబట్టి గురువుకి ఒక మార్గమూ, శిష్యుడికి ఇంకోమార్గమూ అంటూలేదు.

పై మత్తయి 16,24వ వచనంలో మూడు భావాలున్నాయి. 1) శిష్యుడు తన్నుతాను త్యజించుకోవాలి. 2) తన సిలువను తాను ఎత్తుకోవాలి. 3) ప్రభువు వెంటపోవాలి. ఈ మూడు భావాలను క్రమంగా పరిశీలిద్దాం.

1. శిష్యుడు తన్నుతాను త్యజించుకోవాలి. మామూలుగా నరుడు నాకు నేనే రాజుని అన్నట్లు స్వేచ్ఛగా వర్తించబోతాడు. తానాడింది ఆట పాడింది పాట. అతనిలో విపరీతమైన స్వార్థంగూడ వుంటుంది. కనుక ఇతరులను తన ప్రయోజనానికి వాడుకోబోతాడు. కాని క్రీస్తు శిష్యుడు కాగోరేవాడు ఈ స్వార్థాన్నీ ఈ సొంత అధికారాన్నీ వదలుకోవాలి. తన చిత్తప్రకారం తాను జీవించడం అనే పద్ధతిని విడనాడాలి. అతడు తన హృదయ సింహాసనంమీద తానే ఆసీనుడు కాకూడదు. ఆ యాసనాన్ని క్రీస్తుకి ఇచ్చివేయాలి. ఇక మీదట తన యిష్టం వచ్చినట్లుగా తాను నడవకూడదు, క్రీస్తుచేత నడిపింపబడాలి.

2. తన సిలువను తాను మోసికోవాలి. క్రీస్తు తన సిలువను తాను మోసికొని వెళ్లాడు. సిలువ బాధకు చిహ్నం. ఆ గురువుకి చాల బాధలు ఎదురయ్యాయి. యూదనాయకులు అతన్ని ఎదిరించారు, అతనిమీద దౌర్జన్యం చూపారు. అతన్ని అవమాన పరచారు, బాధించారు, హింసించారు, చంపారు. క్రీస్తుకి ప్రాప్తించిన ఈ కష్టాలన్నీ ఏదో రూపంలో శిష్యుడికి కూడ ప్రాప్తిస్తాయి. ఆగురువులాగే శిష్యుడుకూడ బాధామార్గంలో

నడచిపోవాలి. ఈ బాధలు శారీరకమైనవికావచ్చు, మానసికమైనవి కావచ్చు. మరేమైనా కావచ్చు.

3. శిష్యుడు ప్రభువువెంట బోవాలి. అనగా ప్రభువు జీవితవిధానాన్ని అనుసరించాలి. అతని జీవితవిధానంలో రెండుఘట్టాలు ముఖ్యమైనవి - మరణమూ, ఉత్థానమూ. శిష్యుడు ఈ రెండిటినీ అనుసరించాలి. రబ్బయిలు శిష్యులు తమ గురువులనుండి కొన్ని బోధలు విన్నారు. తరువాత తామూ రబ్బయిలై తాము విన్న బోధలను మళ్లా తమ శిష్యులకు అందించారు. కాని క్రీస్తు శిష్యులు అతని బోధలను నేర్చుకొని వాటిని శిష్యపరంపరకు అందీయలేదు. మరి అతని జీవితవిధానాన్ని అనుకరించారు. తామూ అతనిలా జీవించడం మొదలెట్టారు. తమ్ముతాము పూర్తిగా ఆ ప్రభువుకి అర్పించుకొన్నారు. ఈనాడు మనంకూడ కేవలం ఆప్రభువు బోధలను ఆలిస్తే చాలదు. అతని జీవితపద్ధతిని విశేషంగా అతని మరణోత్థానాలను - మన జీవితంలో ప్రతిబింబించుకోగలిగి వుండాలి. క్రీస్తు సిలువకు దడిసి ఆ ప్రభువుని నిరాకరించేవాళ్ళని అతడు కూడ నిరాకరిస్తాడు - మత్త 10-32.

పైన ప్రభువులాగే శిష్యుడుకూడ తన సిలువను తాను మోసికొనిపోవాలనీ, ఈ సిలువ బాధలకు చిహ్నమనీ చెప్పాం. కాని శిష్యులు క్రీస్తు సిలువను ఎంతవరకు అర్థంచేసికొన్నారు? ప్రభువు తాను యెరూషలేము వెళ్ళి హింసలనుభవించి సిలువమీద మరణిస్తానని ముందుగానే చెప్పాడు. కాని శిష్యులకు అతని బోధలు అర్థంకాలేదు. పైగా పేత్రు నీవేమిటి సిలువ మరణం అనుభవించడమేమిటి అని ప్రభువుని మందలించాడు. అనగా అతనికి సిలువభావం ఏమాత్రం బోధపడలేదు- మత్త 16, 21-23. కనుకనే క్రీస్తుని బంధించినపుడు శిష్యులంతా బ్రతుకుజీవుడా అని పారిపోయారు - మత్త 26,56.

అయితే ఆత్మ దిగివచ్చాక శిష్యులకు క్రీస్తు బాధాతత్వం అర్థమయింది. అతడు ఎందుకు చనిపోయాడో, చనిపోయి ఏమి సాధించాడో తెలిసికొన్నారు. అటుపిమ్మట వాళ్ళు ప్రభువు కోసం బాధలనుభవించడం మహాభాగ్యమని యెంచారు - అచ 5, 40-41. మనంగూడ ఇంచుమించు ఈ యపోస్తలుల్లాగే వుంటాం. మొదట్లో ఆ ప్రభువు బాధాతత్వాన్ని అర్థంచేసికోం. మన జీవితంలో వచ్చే సిలువలను కూడ సహించం. కాని క్రీస్తు అనుభవానికి వచ్చేకొద్దీ ఆ గురువు సిలువే మన భుజాలమీదికి గూడ ఎక్కిందని గుర్తిస్తాం. మొదట క్రీస్తు బాధల్లో పాలుపంచుకొని తర్వాత అతనివైభవంలోగూడ భాగస్తులమౌతామని గ్రహిస్తాం - రోమా 8,17. ఆ ప్రభువు కొరకు బాధలు అనుభవించినవాళ్ళు కడన ఆప్రభువులాగే సింహాసనాన్ని అధిష్ఠిస్తారని అర్థం చేసికొంటాం - మత్త 19,28. ఏమైతేనేం, సిలువతత్వం అర్థంజేసికోనివాడు ప్రభువు శిష్యుడు కాలేదు.

ప్రభువులో పూర్వవేద బోధలన్నీ నెరవేరాయి. మోషే ధర్మశాస్త్ర మంతా, పూర్వుల పారంపర్య బోధలన్నీ అతనిలో ఫలసిద్ధినందాయి. పూర్వబోధలన్నీ అతని యందు మానవాకారం చేసికొన్నాయి. కనుక శిష్యులు మళ్లా అతని బోధలను ప్రచారం చేయరు. ఆ బోధలకు ఆధారమైన యేసు అనే దివ్యమూర్తి జీవితానికిమాత్రం వాళ్ళు సాక్షులుగా వుంటారు. ఆ దివ్యుని జీవితంలో గూడ ముఖ్యమైన ఘట్టాలు రెండు - మరణమూ, ఉత్థానమూ. క్రీస్తు మనలను రక్షించింది వీటిద్వారానే. కనుక శిష్యులు ప్రప్రథమంగా ప్రభువు మరణోత్థానాలకు సాక్షులు. జనులు ఆయన మరణోత్థానాలను స్మరించుకొని పాపాలకు పశ్చాత్తాపపడి క్షమాపణం పొందాలని బోధించేవాళ్ళు - లూకా 24, 47-48. ఈలా క్రీస్తు జీవితానికి సాక్షులుగా వుండడం అతని శిష్యులకు ప్రత్యేకమైన బాధ్యత. రబ్బయిల శిష్యులకెవరికి ఈ పూచీ లేదు.

## 10. ఇంకా కొన్ని వ్యత్యాసాలు

పూర్వాంశాల్లో రబ్బయిల శిష్యులకూ క్రీస్తు శిష్యులకూ వుండే వ్యత్యాసాలను పరిశీలించాం. ఆలాంటి భేదాలు ఇంకా కొన్ని వున్నాయి.

1. రబ్బయిలు స్త్రీలను శిష్యురాళ్ళనుగా అంగీకరించలేదు. వాళ్ళు స్త్రీలకు అసలు ధర్మశాస్త్రాన్ని బోధించనే గూడదు అన్నారు. కాని క్రీస్తు ఈ పద్ధతికి భిన్నంగా పోయాడు. అతని శిష్యుల్లో స్త్రీలుకూడ కొంతమంది వున్నారు - లూకా 8, 2-3. బెతనీ గ్రామంలో మరియ ప్రభువు పాదాలచెంత కూర్చుండి అతని బోధను ఆలించినట్లుగా చదువుతూన్నాం. ఈ మరియ ప్రభువు శిష్యురాలు కనుకనే ఆగురువు చరణ సన్నిధిలో కూర్చుండి అతని ఉపదేశాన్ని భక్తిభావంతో ఆలించింది - లూకా 10,39.

2. రబ్బయిల శిష్యులు టోరాను నేర్చుకోవడానికి వచ్చారు. ఆలాగే సోక్రటీసు ప్లేటోల్లాంటి గ్రీకు విద్వాంసుల శిష్యులు విజ్ఞానాన్ని ఆర్జించడానికి వచ్చారు. కాని క్రీస్తు శిష్యులు విజ్ఞానార్జనం కోసంగాక, చిన్న బిడ్డల్లా తయారు కావడంకోసం గురువు దగ్గరికి వచ్చారు - మత్త 18,3. ఇక్కడ శిష్యులు చిన్నబిడ్డల్లా తయారు కావడమంటే ప్రభువు మీద ఆధారపడ్డం. వినయాన్ని అలవర్చుకోవడం. దీనాత్ములు కావడం. ఈ వొక్కఅంశాన్ని బట్టే క్రీస్తు శిష్యులకూ ఇతర గురువుల శిష్యులకూ ఎంత వ్యత్యాసం వుందో గుర్తించవచ్చు.

3. స్నాపక యోహాను శిష్యులకు యోర్దాను స్నానం గుర్తు. పరిసయుల శిష్యులకు ముఖపట్టికలు గుర్తు. క్రీస్తు శిష్యులకు గుర్తేమిటి? సోదరప్రేమ. దీన్నిబట్టే లోకం మనలను ఆ ప్రభువు అనుచరులనుగా గుర్తిస్తుంది. లోకంలో వుంది సోదరప్రేమ కాదు, పరపీడనం. నరునికి నరుడు తోడేలు - ఇది లోకం వాలకం. ఆలాంటప్పుడు ఎవరైనా సోదరప్రేమతో

జీవిస్తే వాళ్ళు విలక్షణంగా కన్పిస్తారు. లోకం వాళ్లెవరని ప్రశ్నిస్తుంది. వాళ్లు క్రీస్తు శిష్యులని తెలిసికొంటుంది - యోహా 13, 34-35.

## 11. పర్యవసానం

ఇంతవరకు క్రీస్తు శిష్యుల లక్షణాలను పరిశీలించాం. కడన రెండు మూడు పర్యవసానాలను తిలకిద్దాం.

1. క్రైస్తవ జీవితమంటే ఏవో కొన్ని ఆజ్ఞలను పాటించడంగాదు. కొన్ని సిద్ధాంతాలను నమ్మడమూ కాదు. ఒక వ్యక్తిని అనుసరించడం. ఉత్థానుడై క్రైస్తవ సమాజంలో సజీవంగా నెలకొనివున్న క్రీస్తుని నాయకుణ్ణిగా అంగీకరించి అతన్ని వెంబడించడం. కొందరు కమ్యూనిస్టుపార్టీలో చేరతారు. మరికొందరు కాంగ్రెసులోనో జనతాలోనో చేరతారు. ఈ పార్టీల సభ్యులు కొన్ని సూత్రాలనూ సిద్ధాంతాలనూ పాటిస్తారు. ఇక్కడ సిద్ధాంతాల విలువేగాని ఆ సిద్ధాంతాలను బోధించిన వ్యక్తి విలువ వుండదు. క్రైస్తవ మతం గూడ ఈలాగే కొన్ని నియమాలను పాటించి కొన్ని సిద్ధాంతాలను నమ్మేదిమాత్రమే కాదు. అది ఓ సజీవుడైన వ్యక్తిని, ఉత్థాన క్రీస్తుని అనుసరించేది. ఆ నాయకుని అడుగుజాడల్లో నడిచేది. కనుక క్రైస్తవ భక్తునికి ఈ ప్రభువుపట్ల అనుభవం ముఖ్యం. ఈ యనుభవం ఏర్పడేంతవరకూ మనం క్రైస్తవులమని చెప్పుకోనేగూడదు. ఈలాగే గురుజీవితమూ కన్యాజీవితమూ కూడ కొన్ని నిర్జీవ సూత్రాలనూ సిద్ధాంతాలనూ పాటించేది మాత్రమేకాదు. కొన్ని మఠనియమాలకు కట్టుబడి వుండేది మాత్రమేకాదు. సజీవ క్రీస్తుని నాయకుణ్ణిగా అంగీకరించి అతని వెనువెంట నడచిపోయేవాళ్ళు గురువులూ మఠకన్యలూను.

2. మామూలుగా మన గురువులూ బోధకులూ ప్రార్థనా మందిరాల్లో క్రీస్తు బోధలను పునశ్చరణంచేసి దానితోనే తమబాధ్యత తీరిపోయినట్లుగా భావిస్తారు. ఇది పెద్ద పొరపాటు. క్రీస్తు శిష్యులు ఆ గురువుబోధలను పునశ్చరణం చేసేవాళ్ళు కాదు, అతని జీవిత విధానాన్ని అనుసరించేవాళ్ళు అని చెప్పాం. కనుక ఈనాడు మనం అతని ఉపదేశాలను వల్లెవేయడంగాదు, అతనిలా జీవించడం ముఖ్యం. ఆచరణశుద్ధి అలవర్చుకోవడం లేక ఆ ప్రభువు జీవితానికి సాక్ష్యంగా వుండడం అంటే యిదే. సోదరప్రేమ, సిలువ, చిత్తశుద్ధితో కూడిన ఆరాధన మొదలైనవి క్రీస్తు జీవితంలోని ముఖ్యాంశాలు. ఈ యంశాలను మనం కేవలం మాటలతో బోధిస్తేనే చాలదు. ఈ సత్యాలను మనం స్వయంగా జీవించి చూపించగలిగి వుండాలి. అప్పుడే మనం ఆ ప్రభువుకి సాక్ష్యంగా వుండేది, లోకం మనలను నమ్మేదీను. ఈ విషయాన్ని మూడవ అధ్యాయంలో విపులంగా వివరిస్తాం.

3. క్రీస్తు తాను బోధించిన సత్యాలన్నీ స్వయంగా ఆచరించి చూపించాడు. వాటిల్లో ఒక్కటి చాల విలువైంది వుంది. అదే సిలువ. క్రీస్తు మొదట శ్రమలు అనుభవించి అటుపిమ్మట మహిమను పొందడం ఆనివార్యం – లూకా 24,26. తండ్రి ఆ ప్రభువుకి మొదట సిలువ మరణాన్నీ అటుపిమ్మట ఉత్థాన మహిమనీ ప్రసాదించాడు. ఈనాడు మనం కష్టాలు లేకుండానే సుఖాలు పొందగోరుతూన్నాం. సిలువ లేకుండానే ఉత్థానాన్ని ఆశిస్తూన్నాం. ఇది పెద్ద పొరపాటు, క్రీస్తు విలువలను తారుమారు చేయడం.

నేడు లోకం సుఖభోగాలవైపు మొగ్గుతూంది. సినిమా, టీవీ లాంటి సమాచార సాధనాలూ, శాస్త్రపరిశోధనలవల్ల లభ్యమయ్యే ఆధునిక సదుపాయాలూ మొదలైనవన్నీ సుఖభోగాలను అనుభవించడమే ధ్యేయంగా పెట్టుకొంటున్నాయి. తినడం, త్రాగడం, శారీరక సుఖాలు అనుభవించడం మొదలైన విలువలను లోకం హోరాహోరీగా ప్రచారం చేస్తూంది. ఈలాంటి విలువల్లో సిలువకు తావుంటుందా? అయినా ఆ సిలువ అనేది మన గురువు బోధించిన, ఆచరించి చూపించిన గొప్ప విలువ. మరి దాన్ని పాటించకపోతే మనమేమి శిష్యులం? క్రీస్తు అడుగుజాడల్లో నడవకపోతే మనమేమి అనుచరులం? – 1 పేత్రు 2, 21.

# 2. శిష్యధర్మాలూ పర్వతప్రసంగము

మత్తయి 5–7 అధ్యాయాల్లో పర్వత ప్రసంగాన్ని చదువుతాం. క్రీస్తు చేసిన ఈ ప్రసంగం నూత్నవేదానికంతటికీ గుండెకాయలాంటిది. సువిశేషసారమంతా దీనిలోనే యిమిడి వుంది. ఇక ఈ ప్రసంగంకూడ చాలా శిష్యధర్మాలను పేర్కొంటుంది. ఇక్కడ ఈ ధర్మాలను ఎన్మిందిటిని సంగ్రహంగా వివరిస్తున్నాం.

## 1. దీనాత్ములు

మొదటి ధన్యవచనం శిష్యుడు దీనాత్ముడై వుండాలి అని చెప్తుంది – మత్త 5,3. పూర్వవేదంలో "హనవిం" అనే ఓ శాఖ ప్రజలు ఉండేవాళ్లు. వీళ్లు తరచుగా పేదలు. కష్టాలకు గురైనవాళ్ళు. ప్రభువుమీద ఆధారపడి జీవించడం వీళ్ళ ముఖ్య లక్షణం. వీళ్లే దీనులు. జెఫన్యా ప్రవక్త ఈ శాఖవాళ్ళని గూర్చి చెప్తూ "నేనిచట దీనులూ దరిద్రులూ ఐన ప్రజలను ఉంచుతాను. వాళ్ళు నా సహాయాన్ని వేడుతారు" అంటాడు – 3,12. పూర్వవేదంలో దీనుల ప్రతినిధి బాధామయ సేవకుడు. యెషయా ప్రవచనంలో ఈ సేవకుడు "ప్రభువు ఆత్మ నా మీదికి దిగివచ్చింది. దీనులకు సువార్తను ప్రకటించడానికి ప్రభువు నన్ను అభిషేకించాడు" అంటాడు – 61,1.

ప్రభువుమీద ఆధారపడ్డమూ అతన్ని నమ్ముకొని జీవించడమూ దీనుల లక్షణం అని చెప్పాం. క్రీస్తు శిష్యుడికి గూడ ఈ లక్షణమే వుండాలి. మరో తావులో నూత్నవేదం చిన్నబిడ్డనుగూర్చి చెప్తుంది. చిన్నబిడ్డడు తనమీద తాను ఆధారపడడు. తల్లిదండ్రులమీద ఆధారపడి జీవిస్తాడు. ఆలాగే శిష్యుడుకూడ ప్రభువుమీద ఆధారపడి జీవించాలి. అప్పుడే అతడు దైవరాజ్యంలో ప్రవేశించేది - మత్త 18,3. కనుక దీనాత్ముడికి ఈ చిన్నబిడ్డడి మనస్తత్వం అవసరం. పూర్వం కొందరు యూదులు తమ పుణ్యకార్యాలే తమ్ము రక్షిస్తాయి అనుకొన్నారు. ఇక దేవుని అనుగ్రహంతో పనిలేదు అనుకొని విర్రవీగారు. దీనాత్ముడు ఈలా భావించడు. అతడు మోక్షంమీద తనకేమో హక్కుంది అనుకోడు. ప్రభువే దాన్నితనకు ఓ వరంగా దయచేస్తాడు అని యెంచుతాడు. ఆ ప్రభువుమీద ఆశపెట్టుకొని జీవిస్తాడు.

మామూలుగా మనం మేము అంతటివాళ్ళం ఇంతటివాళ్ళం అనుకొంటాం. భావిస్తాం. నాకు నేను చాలనా అనుకొంటాం. మిడిసిపడతాం. ఇది శిష్యలక్షణంకాదు. శిష్యుడు నేను చేతగానివాణ్ణి అనుకొని ప్రభువుమీద ఆధారపడుతూండాలి. వినయంతో అతన్ని శరణు వేడుతూండాలి. ఈలాంటివాళ్ళే హనవిం, లేక దీనులు. వీళ్ళ లక్షణాలను అలవర్చుకొన్నపుడే మనంగూడ శిష్యులమయ్యేది.

## 2. ఉప్పూ, వెలుగూ

ప్రభువు శిష్యులను ఉప్పుతోను వెలుగుతోను పోల్చాడు - మత్త 5,13-16. మొదట ఉప్పును పరిశీలిద్దాం. దానిలో రెండు గుణాలున్నాయి. అది భోజనానికి రుచినిస్తుంది. ఉప్పులేని కూర ఏలావుంటుందో మనకు తెలుసు. ఇంకా, వుప్పు భోజనం చెడిపోకుండా పదిలపరుస్తుంది. శిష్యులు ఇతరులకు ప్రభువు వాక్యం విన్పిస్తుండాలి. ప్రభువుపట్లా అతని వాక్యం పట్లా ప్రజలకు రుచి కలిగిస్తుండాలి. ప్రభువు వాక్యం ప్రజల హృదయాల్లో ప్రవేశిస్తే ఆ ప్రజలు ఇక చెడిపోరు. పదిలంగా నిలుస్తారు. కనుక భోజనంలో ఉప్పు ఏమి చేస్తుందో లోకంలో శిష్యులు అది చేయాలి. వాళ్ళు తమ ఉప్పందనాన్ని కోల్పోయి నిస్సారులైన నరులుగా తయారుకాకూడదు. మృతసముద్రం నీళ్ళనుండి తయారైన ఉప్పులో ఉప్పందనముండదు. శిష్యులు కూడ ఈలాగే భ్రష్టులైపోవచ్చు. యూదా ఈలా తయారయ్యాడు. దేమా అనే శిష్యుడు లోకవస్తువ్యామోహంలో పడిపోయి పౌలును విడనాడాడు-2 తిమొ 4,10. మనం ఈలా కాకూడదు.

రబ్బయిలు మోషే ధర్మశాస్త్రాన్ని భోజనంలోని ఉప్పుతో పోల్చారు. అది ఈ జీవితానికి రుచినిస్తుంది అన్నారు. ఎప్పుడూ ఉప్పులా వుండి లోకానికి క్రీస్తు విలువలు అనే రుచినిస్తూ దాన్ని పదిలపరుస్తూండడం శిష్యుడి ధర్మం.

ఇక వెలుగును గూర్చి. రబ్బయిలు మోషే ధర్మశాస్త్రమూ దేవాలయమూగూడ వెలుగులాంటివని బోధించారు - బరూకు 4, 1-2. శిష్యుడు లోకంమీద క్రీస్తు వెలుగును ప్రసరింపజేసి దానిని వెలిగించాలి. క్రీస్తు స్వయంగా జ్యోతి - యోహా 8,12. కనుక మనం అతని విలువలను లోకానికి అందీయాలి. అప్పుడు లోకం ప్రకాశిస్తుంది.

శిష్యులు మంచిపనులు చేస్తే వాటినిజూచి ప్రజలు పరలోకంలోని తండ్రిని కొనియాడతారు. కనుక మన మంచిపనులూ మంచిమాటలూ ఒక వెలుగులా లోకంలో ప్రసరించాలి. అప్పుడేగాని మనం ఆప్రభువుకి సాక్ష్యంగావుండం. నేల నాలుగు చెరుగుల వరకుగూడ అతనికి సాక్ష్యంగా వుండడం శిష్యుల పూచీ - అచ 8,1.

## 3. ధర్మశాస్త్రాన్ని మించిన నీతి

శిష్యుడు ధర్మశాస్త్రాన్ని మించిన నీతిని పాటించాలి. ఈ సత్యాన్ని ప్రభువు ఆరు ఉదాహరణలతో వివరించాడు - మత్త 5, 21-48. వీటిని క్రమంగా పరిశీలిద్దాం.

1. పూర్వవేదం హత్యను నిషేధించింది. కాని మనం కేవలం హత్యను విసర్జిస్తేనే చాలదు. శత్రువుమీద కోపాన్ని గూడ మానుకోవాలి. అతన్ని భ్రష్టుడు, కొరగానివాడు మొదలైన తిట్లతో దూషించకూడదు - మత్త 5, 21-24.

2. మోషే వ్యభిచారాన్ని ఖండించాడు. కాని శిష్యుడికి ఇది చాలదు. ఒకోమారు వ్యభిచారానికి పూనుకోకపోయినా మన హృదయంలో చెడ్డకోరికలు కోరుకొంటూంటాం గదా? కనుక శిష్యుడు ఈలాంటి కోరికలనుగూడ అరికట్టగలిగి వుండాలి. కనుకనే ప్రభువు పరస్త్రీని హృదయంలో కామించడం గూడ పనికిరాదన్నాడు -5, 27-28. ఇక్కడ మోషే ధర్మశాస్త్రం కేవలం బాహ్యక్రియను నిషేధించింది. క్రీస్తు బాహ్యశుద్ధినేగాక అంతశ్శుద్ధిని గూడ పాటించమన్నాడు. నైతిక జీవితానికి మూలకందం హృదయం. చెడ్డ కోరికలకూ మంచి కోరికలకూగూడ ఆది స్థానం. కనుక దాన్ని అరికట్టి చిత్తశుద్ధిని అలవర్చుకొన్నవాడే శిష్యుడు - మత్త 15, 19-20.

3. పూర్వవేదం కొన్ని పరిస్థితుల్లో భార్యా పరిత్యాగానికి సమ్మతించింది. కాని శిష్యుడికి ఈ పద్ధతి చెల్లదు. మోషేకి ముందు సృష్ట్యాదిలో, అనగా ఆదిదంపతుల నాడు ఈ విధానం లేదు. తర్వాత మోషే యూదుల హృదయ కాఠిన్యాన్ని జూచి కొన్ని సమయాల్లో విడాకులు ఈయవచ్చని చెప్పాడు. కాని నరులు సృష్ట్యాదిలోవున్న పద్ధతికి రావాలని క్రీస్తు కోరాడు. కనుక అతడు విడాకులను పూర్తిగా నిరాకరించాడు. అందుచేత శిష్యుడు చిత్తశుద్ధితో తన భార్యపట్ల విశ్వాససహితంగా మెలగాలేకాని ఏదో నెపంతో ఆమెను పరిత్యజించడానికి సిద్ధంగా వుండకూడదు - 5, 31-33.

## 5. అవిభక్తహృదయం

పూర్వం గ్రీసు రోము రాజ్యాల్లో బానిసలుండేవాళ్లు. వాళ్ళు తాము ఏ యజమానునికి బానిసలో అతనికి మాత్రమే సేవలు చేయగలిగేవాళ్లు. ఇంకో యజమానునికి ఊడిగంచేయలేకపోయేవాళ్ళు. అలాగే శిష్యుడికి కూడ ఇద్దరు యజమానులు దొరకవచ్చు. వాళ్లే ధనమూ దేవుడూను. కాని అతడు ధనాన్ని విడనాడి దేవునికిమాత్రమే పరిచారం చేయాలి. లేకపోతే ఐహిక వ్యామోహాల్లో తగులుకొని భ్రష్టుడై పోతాడు - మత్త 6, 24. ఈ సూత్రాన్ని పాటించనందున చాలమంది గోతిలో పడిపోయారు. అవివేకియైన ధనవంతుడు ఐహికవస్తులంపటత్వానికి చిక్కి నాశమైపోయాడు - లూకా 12, 13-21. శిష్యుడికీ ఇదేగతి పడుతుంది. ఇంకా మన సంపద ఇక్కడకాక పరలోకంలో వుండాలి. మన సంపద వున్నకాడనే మన హృదయంకూడ వుంటుంది. కనుక మన సంపద పరలోకంలోవుంటే మన హృదయంకూడ అక్కడే వుంటుంది. అనగా మన మనసు దేవునిమీద లగ్నం కావాలేగాని ఇహలోక వస్తువులమీద కాదు -6, 19-21.

కనుక శిష్యుడు అవిభక్త హృదయంతో ఆప్రభువుని సేవించాలి. హృదయం ఆ ప్రభువుమీద లగ్నంజేసికొనేవాడు ఇహలోక వ్యామోహాలకు లొంగడు.

## 6. చింతలూ వంతలూ జయించడం

ఆ ప్రభువు మన తండ్రి, మనం అతని బిడ్డలం. మనలను పోషించే భారం అతనిదే. కనుక మనం ఆందోళనం చెందకూడదు. పెద్దవరాన్ని ఇచ్చిన దేవుడు చిన్నవరాన్ని ఈయకపోడు. అతడు మనకు పెద్దవరమైన ప్రాణాన్నే ఇచ్చాడు. ఆ ప్రాణాన్ని నిల్పుకొనే సాధనాలయిన కూడు గుడ్డా ఈయకుండా వుంటాడా? కనుక శిష్యులు ఏమితిందామా ఏమి కట్టుకొందామా అని ఆందోళన పడకూడదు. ఆకాశపక్షులను పోషించేవాడు అంతకంటె శ్రేష్ఠప్రాణులైన నరులను పోషించకుండా వుంటాడా? మత్త 6,26. పొలంలోని గడ్డిమొక్కలకు పూలు అనే దుస్తులు తొడిగినవాడు తన బిడ్డలమైన మనకు గుడ్డలనీయకుండా వుండడు కదా? -6, 28-30. ఆ తండ్రి అనుమతిలేనిదే ఓపిచ్చుక చావదు, ఓ తలవెంట్రుక ఊడదు. వీటికంటె మనం తప్పకుండ గొప్పవాళ్ళం. మరి మనకు కలవరపాటెందుకు? -10, 29-30. పైగా ఆందోళనంచెంది మన ఆయుస్సుని ఒకరోజుగాని కనీసం ఒకగంటగాని పెంచుకోగలమా? -6,27. కనుక శిష్యుడు ప్రభువుని నమ్ముకొని జీవిస్తూండాలి. ఒకోమారు దైవశాస్త్రాంశాలు నేర్చుకొని తెలివైనవాళ్ళమనుకొనే నరులకంటెగూడ పశుపక్ష్యాది అజ్ఞానప్రాణులకే దేవునిమీద ఎక్కువ నమ్మకం వుంటుంది. కనుక శిష్యుడు ఈ జంతుజలాన్ని అవలోకించి దేవునిమీద విశ్వాసం పెంపొందించుకోవాలి. అనవసరమైన ఆందోళననూ విచారాన్నీ విడనాడాలి.

మరియామార్తల కథకూడ ఈ సత్యాన్నే బోధిస్తుంది. మార్త ప్రభువుకి ఏలా భోజనం సిద్ధంచేయాలా అని చింతించసాగింది. కనుకనే క్రీస్తు ఆమెను నీవు ఎన్నో పనులను గూర్చి విచారిస్తున్నావని మందలించాడు - లూకా 10,41. మరియకు ఈ విచారం లేదు. ఆమె స్తిమితంగా ప్రభువు పాదాల చెంత కూర్చుండి అతని వాక్కుని ఆలించింది. ఆ వాక్కునే శరణుజొచ్చింది. ఆమె సంపద ఆవాక్కే. కనుకనే మరియ హృదయం ఆవాక్కు మీదనే నిల్చింది - లూకా 10,29. శిష్యుడు ఈ మార్తలాగ ఆందోళనపడకూడదు. ఈ మరియలాగ ప్రభువుని నమ్ముకొని నిర్విచారుడై యుండాలి.

## 7. సోదరప్రేమను పాటించాలి

సోదరప్రేమను పాటించడంగూడ శిష్యధర్మాల్లో ఒకటి. మనం తెలియక ఇతరులను తీర్మానిస్తాం. మన లోపాలను ఆలావుంచుకొని ఇతరుల లోపాలను ఎత్తి చూపిస్తాం. ఇది వట్టి అజ్ఞానం. మనకంటిలోని దూలాన్ని చూడకుండ ఇతరుల కంటిలోని నలుసుని చూడ్డం వట్టి అవివేకం. మనం ఇతరులకు ఏ కొలతన కొలుస్తామో దేవుడుకూడ మనకు అదే కొలతన కొలుస్తాడని గుర్తుంచుకోవాలి - మత్త 7, 1-5.

ఈ సందర్భంలోనే ప్రభువు బంగారుసూత్రం ఒకటి చెప్పాడు. అది "ఇతరులు మీకేమి చేయగోరుతారో మీరూ ఇతరులకు అదిచేయండి" అనే వాక్యం - 7, 12. మామూలుగా ఇతరులు మనకేమి చేయగోరుతాం? వాళ్ళు మనకు కీడుగాదు ఉపకారం చేయాలని ఆశిస్తాం. మనలను గూర్చి చెడ్డగాగాకుండ మంచిగా మాట్లాడాలని కోరుతాం. మన అక్కరలో మనలను ఆదుకోవాలనుకొంటాం. మనపట్ల ఆదరమూ ఆప్యాయతా చూపాలనుకొంటాం. ఇతరులపట్ల మనంకూడ ఈలాగే మెలగాలి. "ఆత్మోపమ్యేన సర్వభూతేషు దయాం కుర్వంతి సాధవః" అంటుంది ఓ సంస్కృత సామెత. అనగా సాధుమతులు అన్ని ప్రాణులూ తమలాంటివేకదా అనుకొని వాటిపట్ల దయజూపుతూంటారు అని భావం. ఇదే సోదరప్రేమ. మోషే ఆజ్ఞలూ, ప్రవక్తల బోధలూ, క్రీస్తు సూత్రాలూ అన్నీ ఈ ప్రేమాజ్ఞలోనే యిమిడివున్నాయి. కనుక ఈ సోదరప్రేమను పాటించేవాడే శిష్యుడు.

## 8. ఆచరణశుద్ధి

శిష్యుడు మాటలతో కాలం వెళ్ళబుచ్చగూడదు. ఆతనిలో ఆచరణశుద్ధి వుండాలి. ఈ యాచరణ శుద్ధిని గూర్చి ప్రభువు నాల్గు సంగతులు చెప్పాడు. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

1. రెండు మార్గాలున్నాయి. ఒకటి ఇరుకైందీ, మరొకటి విశాలమైందీ. శిష్యుడు ఇరుకుమార్గంలో పయనించాలిగాని విశాలమైనదానిలో కాదు. "నీతిమంతులమార్గం ప్రభువుకి

తెలుసు, దుష్టుల మార్గం వినాశానికి నడిపిస్తుంది" అంటుంది మొదటి కీర్తన 6వ వచనం. కుర్రాను భక్తులుకూడ జ్యోతిర్మార్గమూ తమోమార్గమూ అని రెండు త్రోవలు పేర్కొన్నారు.

విశాలమార్గం వినాశానికి చేరుస్తుంది. ఏమిటి ఈ మార్గం? ప్రపంచ సుఖభోగాలు. శిష్యుడికి ఈ త్రోవ తగదు.

ఇరుకైన మార్గం జీవానికి నడిపిస్తుంది. ఏమిటి ఈ మార్గం? ఆత్మనిగ్రహం, సిలువను మోయడం. శిష్యుడికి ఈ త్రోవ తగుతుంది. ఇక్కడ మార్గాలంటే బోధలు. శిష్యుడు క్రీస్తు బోధల ప్రకారం జీవించాలిగాని ప్రపంచ బోధల ప్రకారం కాదు - మత్త 7, 13-14.

2. మంచి చెట్టు మంచి పండ్లనూ పాడుచెట్టు పాడుపండ్లనూ కాస్తాయి. ఉమ్మెత్త కాయలుకాస్తే అది పాడు చెట్టు. మామిడిపండ్లు కాస్తే అది మంచి చెట్టు. పండ్లనుబట్టి చెట్టును నిర్ణయించినట్లే క్రియలనుబట్టి నరుని నిర్ణయించాలి. శిష్యులు మంచి పనులు చేస్తూ మంచిపండ్లు పండే చెట్లలా వుండాలి - మత్త 7,20.

3. కొందరు ప్రభూ ప్రభూ అని దేవుణ్ణి సంబోధిస్తూంటారు. కాని వాళ్ళు దేవుని చిత్తాన్ని పాటించరు. తమ ఇష్టంవచ్చినట్లుగా ఏవేవో వెర్రిమొర్రి పనులు చేస్తారు. ఈలాంటివాళ్ళను ప్రభువు అంగీకరించడు. పైపెచ్చు వీళ్ళను దుష్క్రియలు చేసేవాళ్ళనుగా ఎంచుతాడు. కనుక శిష్యుడు దైవచిత్తం ప్రకారం జీవిస్తూండాలి - మత్త 7, 21-23.

4. ప్రభువు వాక్యాన్ని వింటేనే చాలదు. దాన్ని ప్రతిదినం జీవితంలో పాటించాలిగూడ. ఈలా పాటించినవాడు రాతిపునాదిమీద కట్టిన యిల్లులాగ సురక్షితంగా వుంటాడు. పాటించనివాడు ఇసుకపునాదిమీద కట్టిన ఇల్లులాగ కూలిపోతాడు - 7,24-27.

ఈలా రెండు మార్గాలు, మంచి చెట్టు, ఒట్టినే పెదవులతో ప్రభువా అని పల్కడం, రెండు యిండ్లు అనే యీ నాల్గు అంశాలుకూడ ఆచరణశుద్ధిని బోధించేవే. ఈ యాచరణ శుద్ధిని అలవర్చుకొన్నవాడే శిష్యుడు. క్రియాశుద్ధిలేనివాళ్ళు ప్రభువుకి ప్రియపడరు.

# 3. శిష్యధర్మమూ ఆచరణశుద్ధీ

ఇక్కడ కొన్ని పర్యవసానాలను తిలకిద్దాం.

1. ప్రభువు దైవరాజ్యాన్ని గూర్చి బోధించాడు. తండ్రిని గూర్చి చెప్పాడు. పశ్చాత్తాపపడి పాపవిమోచనం పొందమన్నాడు. ప్రేమతో జీవించమన్నాడు. కాని ఆ ప్రభువు వట్టినోటిమాటలతో బోధించలేదు. తన బోధలను తానే ఆచరించి చూపించాడు. అపోస్తలుల చర్యల గ్రంథం "క్రీస్తు చేసిన పనులూ, చెప్పిన బోధలూ" అంటుంది - 1,1. ఇక్కడ క్రీస్తు చేసిన పనులు అంటే విశేషంగా అతని అద్భుతాలు. కాని శిష్యుల కాళ్ళు కడగడం, శత్రువులను క్షమించడం మొదలైన అతని ఆదర్శ క్రియలుకూడ ఈ

"పనులు" అనే మాటలద్వారా సూచింపబడ్డాయి. ఆ ప్రభువు తాను ఆచరించకుండా వట్టినే నీతులు బోధించినవాడు కాదు. అతని బోధల్లో ప్రధానమైంది ప్రేమసూత్రం. ఈ సూత్రాన్ని అతడు క్రియపూర్వకంగా పాటించి చూపించాడు. "తాను ప్రేమించినవారికోసం ప్రాణాలు అర్పించడంకంటె ఎక్కువ ప్రేమ ఏముంది"? అన్నాడు - యోహా 15,13. తానన్నట్లే సిలువమీద ప్రాణత్యాగం చేసికొన్నాడు. కనుక క్రీస్తు ఆచరణశుద్ధికల బోధకుడు.

2. క్రీస్తు శిష్యులను తనకు సాక్షంగా వుండమని ఆదేశించాడు - అచ 1,8. అనగా క్రీస్తు శిష్యులు అతని బోధలను వల్లెవేస్తే చాలదు. అతని జీవిత విధానాన్ని అనుసరించాలి. తామూ ఆ గురువులా ప్రేమజీవితం జీవించాలి. తొలినాటి శిష్యులు ఈలాంటి ప్రేమజీవితం జీవించారనే అపోస్తలుల చర్యలు అనే గ్రంథం చెపుతూంది. ఆదిమ శిష్యులు యెరూషలేములో ఉమ్మడిగా జీవించారు. ధనవంతులైనవాళ్లు తమ ఆస్తిపాస్తులను పేదలతో పంచుకొన్నారు. అందరూ కలిసి ఏకపంక్తిలో భోజనం చేసారు. దేవాలయంలో అందరూ కలసి ప్రార్థించారు. అంతా ఏకమై ప్రభువుని స్తుతించారు. కనుక ఆ ప్రేమ సమాజాన్ని జూచి యెరూషలేము పౌరులంతా మెచ్చుకొన్నారు. రోజురోజు క్రొత్త సభ్యులువచ్చి ఆ సమాజంలో చేరిపోయారు - అచ 2, 44-47. ఎప్పుడుగూడ నోటి మాటలతో చెప్పడంకంటె క్రియపూర్వకంగా చేసి చూపించడం ఉత్తమ బోధ.

3. ప్రభువుని క్షుణ్ణంగా అర్థంజేసికొన్నవారిలో పౌలు ఒకడు. అతడు తాను బోధచేయకపోతే సర్వనాశమౌతాననుకొన్నాడు - 1కొరి 9,16. ఐనా బోధించడం మాత్రమే తన బాధ్యత అనుకోలేదు. ఆచరణంకూడ తన విధి అనుకొన్నాడు. కనుకనే ఇప్పుడు నేను కాదు నాయందు క్రీస్తే జీవిస్తున్నాడు అని చెప్పుకొన్నాడు - గల 2,20. అనగా అతడు తన జీవిత విధానాన్ని క్రీస్తు జీవితవిధానానికి సరిపోయేలా దిద్దుకొన్నాడు. ఇంకో తావులో అతడు "నేను క్రీస్తుని అనుసరించినట్లే మీరూ నన్ను అనుసరించండి" అని కొరింతు విశ్వాసులను హెచ్చరించాడు- 1కొ 11,1. ఆచరణ లోపం కలవాడు ఈలా చెప్పుకోగలడా? ఇంకా అతడు "సమయం అనుకూలంగా వుందా లేదా అనికూడ ఆలోచించకుండ ఎడతెగక బోధ చేయ" మని తిమోతీని ఆజ్ఞాపించాడు -2 తిమొ 4,2. ఐతే ఈ తిమోతి తాను క్రైస్తవ సమాజానికి ఆదర్శంగా వుండాలని గూడ హెచ్చరించాడు. మాటల్లో చేతల్లో ప్రేమను జూపించడంలో విశ్వాసంలో పవిత్ర జీవితం జీవించడంలో తిమోతి తన మందకు ఆదర్శప్రాయంగా వుండాలని చెప్పాడు - 1తిమొ 4,12. కనుక పౌలు మంచి ఆదర్శం ఎంతో ముఖ్యమని భావించాడు అనుకోవాలి.

4. ఇక మన దేశంలో తొలి శతాబ్దంనుండి కూడ బోధకులు క్రైస్తవ మతాన్ని బోధిస్తూ వచ్చారు. కేరళ ప్రాంతంలో క్రీస్తు శిష్యుడు తోమాసో లేక ఆ భక్తుని అనుయాయులో బోధ చేసారు. ఆనాటి సమాజంలోని అగ్రవర్గాలవాళ్ళు ఆ బోధలను అంగీకరించి క్రైస్తవ మతం చేపట్టారు. అలాగే 18,19 శతాబ్దాల్లో తిరుచురాపల్లి చుట్టుపట్ల యేసుసభ గురువులు బోధ చేసారు. ఆ బోధలు ఆలించి ఆ ప్రాంతంలోని బ్రాహ్మణులు క్రైస్తవ మతాన్ని అంగీకరించారు. ఈ బోధకులంతా చిత్తశుద్ధి కలవాళ్లు. వాళ్ల ఉపదేశమూ ఆచరణమూ – రెండింటినీ పాటించారు. హైందవులు క్రైస్తవ ధర్మాన్ని స్వీకరించినకాడల్ల చిత్త శుద్ధికల ఓ క్రైస్తవ భక్తుడు కారణంగా కన్పిస్తాడు. కాని నేడు క్రైస్తవుల సంఖ్య పెరిగిపోయేకొద్దీ ఆచరణశుద్ధి తరిగిపోతూంది. మంది ఎక్కువైతే మజ్జిగ పల్చనయింది అన్నట్లుగా తయారయింది. ఇది ఓ పెద్ద దౌర్భాగ్యం.

5. ఈ సందర్భంలో గాంధీగారి భావాలను జ్ఞప్తికి తెచ్చుకోవడం మంచిది. ఆయన క్రైస్తవ బోధకుణ్ణి ఓ గులాబీ పూవుతో పోల్చాడు. గులాబీ తన పరిమళాన్ని గూర్చి ఉపన్యాసాలీయదు. ఆ పరిమాళాన్ని వ్యాపింపజేస్తుంది అంతే. అలాగే బోధకుడు కూడ తన పరిమళాన్ని వ్యాపింపజేయాలే గాని దాన్ని గూర్చి చెప్పకూడదు. అనగా అతడు సువార్తను బోధించడంకంటె నిజజీవితంలో దాన్ని జీవించడం మెరుగు. సువార్త కుండే పరిమళం వుండనే వుంది. సత్యానికుండే విలువ మరి దేనికుంటుంది? కనుక సువార్తను గూర్చి మనం ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరంలేదు. మన జీవితాల్లో దాని పరిమళాన్ని చూపించగలిగితే చాలు, నరులు ముగ్ధులైపోతారు. జీవించి చూపించడం బోధించడం కంటెగూడ బలమైన బోధ.

గాంధిగారి అభిప్రాయం ప్రకారం చాలమంది క్రైస్తవుల్లో ఆచరణశుద్ధి లేదు. అందుచేత ఆయన "నాకు క్రీస్తంటే ఎంతో ఇష్టం. కాని క్రైస్తవులంటే ఇష్టంలేదు" అని చెప్పేవాడు. క్రీస్తు పర్వతప్రసంగం గాంధీని ఎంతో ప్రభావితం చేసింది. కాని ఈ ప్రసంగం ప్రకారం జీవించే క్రైస్తవులు ఆయనకు అట్టే తగల్లేదు. కనుక మహాత్మునికి క్రైస్తవులపట్ల గౌరవం కలగలేదు. చిత్తశుద్ధిలేని భక్తులను ఎవరు గౌరవిస్తారు?

ఇంకా ఓమారు ఓ హిందూ సన్యాసి ఓ క్యాతలిక్ గురువుతో ఈలా చెప్పాడు. "అయ్యా! మీవాళ్ళు చాలమంది క్రీస్తుని బోధిస్తున్నారు గాని మా ప్రజలు మాత్రం మీ బోధలను అట్టే పట్టించుకోవడంలేదు. దీనికి ఓ కారణం వుంది. ఈ ప్రజలను క్రీస్తు దగ్గరికి చేర్చాలంటే మీరు మా హిందూ సంప్రదాయంలోని గురువుల్లా తయారు కావాలి. హైందవ గురువు ఏవో గ్రంథాల్లోనుండి కొన్ని వాక్యాలు వల్లెవేసేవాడు కాదు. అతడు

భగవంతుణ్ణి వ్యక్తిగతంగా అనుభవానికి తెచ్చుకొన్నవాడు. కనుక అతడు తన శిష్యులకు ఏవేవో సూత్రాలూ నిర్వచనాలూ బోధింపడు. వాళ్ళచేత ఏవేవో కర్మకాండలు చేయించడు. వాళ్ళను నేరుగా దైవసాన్నిధ్యంలోకి నడిపించుకొని పోతాడు. వాళ్ళకు దేవుణ్ణి సాక్షాత్కారం చేస్తాడు. మీరు గూడ ఆ పనిని చేయగలిగితే ప్రజలు మీ బోధ తప్పకుండా వింటారు".

ఈ సన్యాసి వాక్యాల్లో ఎంతో విలువుంది. కనుక మనం క్రీస్తునిగూర్చి చెప్తే ప్రజలు మన బోధ ఆలిస్తారా అనేది ప్రశ్నకాదు. అసలు ప్రశ్న ఏమిటంటే మనం ఆ క్రీస్తుని అనుభవానికి తెచ్చుకొన్నామా అన్నది. ఆ ప్రభువు బోధలను మన జీవితంలో ఆచరించి చూపిస్తున్నామా అన్నది నిజమైన ప్రశ్న.

ఆచరణలేని బోధను డంబం అంటారు. క్రీస్తు ఈ డాంబికత్వాన్ని తీవ్రంగా ఖండించాడు. ఆనాటి పరిసయులు మోషే ధర్మశాస్త్రాన్ని పెద్ద గొంతుతోనే బోధించారు. కాని వాళ్ళు స్వయంగా దాన్ని పాటించలేదు. కనుక ప్రభువు ఈ బోధకులను ఏవగించుకొన్నాడు. వాళ్ళ డంబాన్ని ఖండించాడు. వాళ్ళు సున్నం గొట్టిన సమాధులన్నాడు. గుడ్డి ప్రజలను నడిపించే గుడ్డి నాయకులు అన్నాడు. ఈ బోధకులు తాము చెప్పేది తామే చేయడంలేదు కనుక ప్రజలు వాళ్ళ క్రియలను అనుకరింపగూడదన్నాడు - మత్త 23,3. ఈనాడు చెప్పేది చేయని క్రైస్తవ బోధకులకుగూడ ఈ ఖండనం అక్షరాల వర్తిస్తుంది. కనుక క్రైస్తవ బోధకుడు మొదట తనకు తాను బోధచేసికోవాలి. తాను బోధించేది తానే ఆచరించాలి. అతడు మాటలద్వారానేగాక చేతలద్వారాగూడ బోధించాలి. అప్పుడే అతని వెలుగు నలువైపులా ప్రసరించేది - మత్త 5,16. మనకు చెప్పవలసిన సందేశమేమో లేకపోలేదు. చాల గొప్ప సందేశమే వుంది. కాని ఆ సందేశాన్ని విన్పించడానికి విశ్వాసయోగ్యులైన బోధకులు మాత్రమే కరవైపోయారు.

మనమేమో బోధ చేయవలసిందే. అది ప్రభువు ఆజ్ఞ. మీరు వెళ్ళి సకలజాతి జనులకు నన్ను గూర్చి బోధించండి అన్నాడు క్రీస్తు - మత్త 28,19. కాని ఏలా బోధించాలి? ఆచరణశుద్ధితో మరో మార్గం ఫలదాయకం కాదు. కనుక ఆచరణశుద్ధి అన్నిటికంటె ముఖ్యమైన శిష్యలక్షణం అని చెప్పాలి.

# 5. క్రీస్తూ- శిష్యుడూ

బైబులు భాష్యం - 126

## విషయసూచిక



ప్రభువు మనలను రక్షించాడు కదా! దాని పర్యవసానంగా నేడు మనం తన్ను అనుకరించాలని అతని కోరిక. అతడు ప్రారంభించిన రక్షణోద్యమంలో మనం కూడ తనతో కలసి పనిచేయాలని అతని అభిలాష. అతడు దైవరాజ్యాన్ని ప్రారంభించాడు. నేడు దాన్ని వ్యాప్తిచేయవలసింది మనమే. క్రీస్తు పనిని కొనసాగించేవాడు క్రీస్తు శిష్యుడు. బైబుల్లో శిష్యుడు అంటే నేర్చుకొనేవాడు. క్రీస్తునుండి మనం అతని బోధలూ అతని జీవిత విధానమూ నేర్చుకోవాలి. వాటిని పాటించాలి. అ పిమ్మట వాటిని ఇతరులకు కూడ నేర్పించాలి. అనగా శిష్యుడు లోకంలో క్రీస్తునీ అతని ధర్మాన్నీ వ్యాప్తిచేయాలి. ఉత్థాన క్రీస్తుతో కలసి కృషిచేసి ప్రపంచాన్ని మంచికి మార్చాలి.

మనం తరచుగా క్రీస్తుని నమ్ముతాం, ఆరాధిస్తాం. అతనికి ప్రార్ధన చేసికొంటాం. కాని ఈ మాత్రమే చాలదు. ఇది సగం శిష్యత్వం మాత్రమే. పూర్ణశిష్యుడైనవాడు ఇతరులకు కూడ ప్రభువుని పరిచయం చేస్తాడు. శిష్యత్వంలో ప్రేషిత సేవకూడ ఇమిడివుంది.

ఈ పొత్తంలో మొదట క్రీస్తు జీవిత విధానాన్ని పరిశీలిద్దాం. అటుపిమ్మట అతని బోధలను తిలకిద్దాం. తదనంతరం శిష్యులంగా మనం చేసే పొరపాట్లను కొన్నిటిని జ్ఞప్తికి తెచ్చుకొందాం. కడన క్రీస్తుతో స్నేహాన్ని ఏర్పరచుకొనే విధానాన్ని తెలిసికొందాం.

## 1. క్రీస్తు జీవిత విధానం

ప్రభువు జీవితాన్ని పరిశీలిస్తే ప్రధానంగా నాల్గంశాలు కన్పిస్తాయి. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

### 1. అతడు దేవుని కొరకు జీవించాడు

క్రీస్తు జీవిత విధానంలోని ముఖ్యాంశం దేవుని కొరకు జీవించడం. అతడు దేవుణ్ణి నాన్ననుగా (అబ్బ) అనుభవానికి తెచ్చుకొన్నాడు. అతన్ని నాన్నా అని సంబోధించాడు. అతని దృష్టిలో భగవంతుడు నాన్న అమ్మ కూడ. కనుక దేవుణ్ణి నాన్న అనికాని అమ్మ అని

కాని పిలువవచ్చు. క్రీస్తు ఆరాధించిన దేవుడు కరుణామయుడు, ప్రేమపూరితుడు. మనం మన అమ్మానాన్నలనులాగే ప్రేమమయుడైన ఈ పరలోకపు నాన్నను గూడ నమ్మాలి. ఆ నాన్న మనలను అంగీకరించి ఆదరిస్తాడని విశ్వసించాలి.

క్రీస్తు తండ్రిని నమ్మి పూర్తిగా అతని కొరకే జీవించాడు. జీవితంలోని ప్రతి సంఘటనలోను ఆ తండ్రి హస్తాన్ని దర్శించాడు. ఇతరులకు కూడ ఆ తండ్రిని గూర్చి బోధించాడు. ఏకాంతంగా ఆ తండ్రి సమక్షంలో వుండిపోయి అతనికి ప్రార్థనం చేసికొన్నాడు.

క్రీస్తు ధ్యేయం తండ్రి చిత్తాన్ని పాటించడమే. ఆ చిత్తాన్ని పాటించడం తనకు భోజనంతో సమానం అన్నాడు - యోహా 4,34. అతన్ని గూర్చిన దైవచిత్తం ఏమిటి? సిలువ మరణం. కనుక తండ్రి నిర్ణయించినట్లుగా సిలువపై చనిపోవడానికి అతడు తపించిపోయాడు. ఆ సిలువ మరణం నెరవేరేవరకు అతని హృదయానికి శాంతిలేదు - లూకా 12,50. ప్రభువుకి అన్నిటికంటె తండ్రి, అతని ఆజ్ఞ, అతని ప్రేమ ముఖ్యం. అతనితో ఐక్యమై జీవించడం ప్రధానం. ఈ యంశాన్ని బాగా గ్రహిస్తేనేగాని మనం అతన్ని అర్థంచేసికోలేం.

## 2. అతడు ఇతరుల కొరకు జీవించాడు

సువిశేషాల్లో ఎక్కడ చూచినా క్రీస్తు ఎవరికో ఏవో సేవలు చేస్తున్నట్లుగా కన్పిస్తాడు. అతడు సేవలు చేసే వ్యక్తి ఒక్కడుకావచ్చు లేక ఓ సమూహం కావచ్చు. అతని పరిచర్యలు నానా విధాలుగా వుండేవి. ప్రజల పాపాలు పరిహరించడం, రోగాలు నయం చేయడం, ఆహారం పంచిపెట్టడం, దయ్యాలను పారద్రోలడం, దుఃఖితులను ఓదార్చడం ప్రోత్సహించడం, ప్రజల ప్రశ్నలకు జవాబులు చెప్పడం ఈలా అతని పరిచర్యలు బహు విధాలుగా వుండేవి. కొన్నిసార్లు అతడు మతాధికారులతోను రాజకీయ నాయకులతోను తలపడేవాడు. కాని ఇదికూడ పీడితులకు మేలు చేయడానికే. లూతరెన్‌వేదశాస్త్రి బోన్‌హోపర్ అతనికి "ఇతరుల మనిషి" అని పేరు పెట్టాడు. ఇది అక్షరాల సత్యం. నరుల బాధలను తొలగించడమే అతని ప్రధానమైన పని. క్రీస్తు ఎవరినీ కేటాయించేవాడు కాదు. అందరిపట్ల ప్రేమ చూపేవాడు. అందరిలోను మంచిని చూచేవాడు.

యేసు స్నాపక యోహానులాగ సన్యాసియై ఏకాంత జీవితం గడపలేదు. ఎడారిలో వసించలేదు. ఎప్పుడూ జనం మధ్యనే తిరుగుతుండేవాడు. అతని దృష్టిలో మనం ఈ లోక వ్యామోహాలకు చెందినవాళ్ళంకాదు - యోహా 17,15-16. ఐనా అతడు ఈ ప్రపంచాన్ని త్యజించమని ఏనాడు బోధించలేదు. క్రీస్తు చాల పర్యాయాలు ఏకాంత స్థలాల్లో తండ్రికి ప్రార్థన చేసికొనేవాడు - లూకా 5,16. 6,2. కాని ఈ ప్రార్థన ముగియగానే

భోజనాల ద్వారా గూడ ప్రభువు యూదులకు దైవసాన్నిధ్య మయ్యాడు. నేడు మనం స్వీకరించే దివ్యసత్ప్రసాద భోజనంలో కూడ ఈ భావాలన్నీ ఇమిడివున్నాయి.

యేసు చాలమందిని కలసికొని వారికి ఉపకారం చేసాడు. ఉదాహరణకు చేపలు పట్టుకొనే బెస్తలను తన వెంట రమ్మనిపిల్చాడు. బావివద్ద సమరయస్త్రీతో మాట్లాడి ఆమె మనసు మార్చాడు. జక్కయను చెట్టు దింపి అతనికి పరివర్తనం కలిగించాడు. నాయీను వితంతువును ఓదార్చాడు. మరియా మార్తల ఆతిథ్యాన్ని స్వీకరించాడు. ఈ వ్యక్తులందరు క్రీస్తుని యెంతో విలువతో చూచారు. అతని ద్వారా దేవుడే తమ్ము సందర్శిస్తున్నాడని నమ్మారు. అతన్ని దేవుని సాన్నిధ్యంగా ఎంచారు. క్రీస్తు నిరంతరం తండ్రితో ఐక్యమై జీవించాడు. ఆ తండ్రే అతన్ని ప్రజలతోగూడ ఐక్యమై జీవించేలా చేసాడు. క్రీస్తుద్వారా తండ్రే యిస్రాయేలు ప్రజలతో ఐక్యమయ్యాడు. తన సాన్నిధ్యాన్ని వారికి దయచేసాడు.

## 4. అతడు స్వేచ్ఛాపరుడు

క్రీస్తు సర్వతంత్ర స్వతంత్రుడు. అతని ప్రవర్తనం అనూహ్యంగాను విచిత్రంగాను వుండేది. అతడు యూద నాయకుల ప్రశ్నలకు చెప్పిన జవాబులు చిత్రంగా వుండేవి. కైజరుకి పన్ను చెల్లించాలా వద్దా అని అడిగినప్పుడు, నీవు యెవరి అధికారంతో దేవాలయంలోని బేరగాళ్ళను వెళ్ళగొట్టావని ప్రశ్నించినపుడు అతడు చెప్పిన జవాబులు యూద నాయకులను నిరుత్తరులను చేసాయి. అతని సామెతలు ఆకర్షణీయమైనవి. అతని బోధలు పూర్వ రబ్బయుల భావాలు కాదు. అతని సొంత భావాలే. కనుకనే అతని ఉపదేశాలు విని ప్రజలు ఆశ్చర్యపోయారు - మత్త 7, 28-29. మొత్తంమీద అతని బోధలు ప్రజలను గిలిగింతలు పెట్టాయి.

యేసు ప్రజలు కోరినట్లుగా చేసేవాడు కాదు. హేరోదు ఒక అద్భుతాన్ని చేసి చూపించమన్నా చూపించలేదు - లూకా 23,28-29. ప్రజలు తన్ను రాజుని చేయబోగా అంగీకరించలేదు - యోహా 6,15. శత్రువులు తన్ను దౌర్జన్యంగా పట్టుకొన్నా తాను వారిపై దౌర్జన్యం చేయలేదు - మత్త 26, 53-54. ఓ మారు క్రీస్తు బంధువులు అతడు పిచ్చివాడు ఐపోయాడనుకొని అతన్ని తీసికొని పోవడానికి వచ్చారు - మార్కు 3,21. అతని శిష్యులే చాలసార్లు అతన్ని అపార్థం చేసికొన్నారు. పేత్రు అతనితో ఈ సిలువమరణం నీకు వద్దన్నాడు - మార్కు 8,32. ఈలాంటి సందర్భాల్లో క్రీస్తు ఇతరులు చెప్పినట్లుగా చేయలేదు. తన పద్ధతిలో తానుపోయాడు. అతనిది స్వతంత్ర ప్రవర్తనం.

యేసు యూదుల ధర్మశాస్త్ర నియమాలకీ వారి సంప్రదాయాలకూ కట్టుపడి వుండలేదు. వాటిని అనుసరించవలసినప్పుడు అనుసరించాడు. త్రోసివేయవలసినప్పుడు

మళ్ళా జనం దగ్గరికి వెళ్ళి వారికి సేవలు చేసేవాడు. నిజానికి అతని ప్రార్థన తన సేవలను బలపర్చుకోవడానికే. ఎడారిలో అతడు చేసిన నలువది నాళ్ళ ప్రార్థనకూడ తర్వాత బహిరంగ జీవితం ద్వారా తోడివారికి పరిచర్యలు చేయడానికి– లూకా 4,1–2. యేసు విశేషంగా అట్టడుగువర్గం వారితో కలసిపోయేవాడు. వారితో అన్న పానీయాలు సేవించేవాడు. అది గిట్టని విరోధులు "భోజన ప్రియుడు, మద్యపాన రతుడు, సుంకరులకు పాపాత్ములకు మిత్రుడు అని అతన్ని గేలిచేసారు - లూకా 7,34. అతడు స్నాపక యోహానులాగ తపస్సులు ఉపవాసాలు చేసి ప్రజల మెప్పు పొందినట్లుగా సువిశేషాలు యెక్కడా చెప్పవు. అతడు బ్రహ్మచర్య జీవితం గడిపినందుకు సమకాలికులు అతన్ని మెచ్చుకొన్నట్లు యెక్కడా వినం. అతడు ప్రజలకు చేసిన సేవలు మాత్రం నూత్నవేదం మాటిమాటికి పేర్కొంటుంది. క్రీస్తు ప్రధానంగా ప్రజల మనిషి. అతనికి తండ్రిపట్ల అపారమైన ప్రేమ. ఆ తండ్రిని తోడివారిలో గుర్తించి వారికి సేవలు చేసేవాడు.

## 3. అతడు ప్రజలకు దైవసాన్నిధ్యం

మత్తయి సువార్త యేసుని యిమ్మానువేలు అనిపిలుస్తుంది. అనగా దేవుడు మనతో వున్నాడని భావం - 1,23. ఇక్కడ దేవుడు మనతో వున్నాడంటే, మనలను కాపాడుతూ సంరక్షిస్తూ వుంటాడని భావం. ఆనాటి ప్రజలు క్రీస్తు ద్వారా దేవుడు తమ్ము సందర్శించాడని యెంచారు. యోహాను సువిశేషం క్రీస్తుని దేవుని వాక్కు అంటుంది. - 1,1. ఇక్కడ వాక్కు అంటే సందేశం. దేవుడు ప్రజలకు తెలియజేసిన సమాచారం. పూర్వవేదపు యూదులకు దేవుడు తమతో మాట్లాడతాడని తెలుసు. ప్రకృతి పాఠాలద్వారా, చారిత్రక సంఘటనల ద్వారా, ప్రవక్తల బోధల ద్వారా దేవుడు యిస్రాయేలీయులతో మాట్లాడాడు. ఈ మాటలే దేవుని సందేశం. ఇక క్రీస్తు దేవుని వాక్కు అంటే, దేవుడు యూదులకు చెప్పగోరిన సందేశమంతా క్రీస్తు అనే వ్యక్తిలో కేంద్రీకృతమై వుందని భావం. దేవుడు క్రీస్తు ద్వారా యిస్రాయేలీయులకు తన్నుతాను పూర్తిగా తెలియజేసికొన్నాడని అర్థం. కనుకనే ప్రభువు ఫిలిప్పుతో "నన్ను చూస్తే తండ్రిని చూచినట్లే అని చెప్పాడు - యోహా 14,9. కావున క్రీస్తు ప్రజలకు దైవసాన్నిధ్యం.

ప్రభువు పాపులతోను, సుంకరులతోను కలసి భోజనం చేసేవాడు - మత్త 9,10–12. ఇది గొప్ప సంఘటనం. క్రీస్తు ద్వారా దేవుడే యూదుల్లో అట్టడుగు వర్గంవారితో కలసి భోంచేసినట్లు. దేవుడే వారిని అంగీకరించి వారి పాపాలు మన్నించి వారితో కలసిపోయినట్లు. యూదుల భావాల ప్రకారం, మనం ఎవరితో భుజిస్తామో వారితో సరిసమానమౌతాం. వారిలాంటి వాళ్ళమౌతాం. వారిలోకి మారిపోతాం. కనుక ఈ

త్రోసివేసాడు. విశ్రాంతి నియమాలను మీరి రోగులకు వ్యాధి నయంజేసాడు. వ్యభిచారిణిని రాళ్ళతో కొట్టి చంపాలనే ధర్మశాస్త్ర నియమాన్ని ఉల్లంఘించాడు. ఉపవాస నియమాలను పాటించలేదు. అట్టడుగు వర్గంవారితో కలసి భోజనం చేసాడు - మత్త 9,14. అతని కార్యాలు యూదుల సంప్రదాయాలమీద తిరుగుబాటు అన్నట్టుగా కన్పించేవి. అతని స్వతంత్రబుద్ధి అలాంటిది.

ప్రభువు ధనం ఆస్తిపాస్తులు కూడబెట్టుకోలేదు. అవి మన స్వేచ్ఛను హరిస్తాయని అతని భావం. అతడు సంచార బోధకుడు. సొంత ఇల్లుకూడ లేకుండ బికారిలాగ ఊరినుండి ఊరికి తిరుగుతుండేవాడు- మత్త 8,20. తరచుగా ఇతరుల ఆతిథ్యంతోనే రోజులు గడిపేవాడు. అతడు పుట్టినపుడు సొంతయింటిలో పుట్టలేదు. చనిపోయినపుడు అతన్ని సొంతసమాధిలో పాతిపెట్టలేదు. మరణానంతరం సైనికులు అతని వస్తువులను పంచుకోబోగా పై అంగీమాత్రమే దొరికింది. ఇహలోక వస్తువులకు దాసుడుకాని స్వతంత్రుడు యేసు.

కడన, క్రీస్తు భయానికికూడ లొంగలేదు. అతడు భయపడిన సందర్భాలు లేకపోలేదు. మార్కు 14, 33-34. కాని అతడు దానికి లోపడలేదు. హేరోదు తన్ను చంపజూస్తున్నాడని తెలియవచ్చినా జంకలేదు. యూద నాయకులు తన్ను నాశంజేయ జూచినా దడియలేదు. ఈయంశాలన్నీ అతని స్వాతంత్ర్యానికి నిదర్శనం. ఇంత వరకు క్రీస్తు జీవితంలోని ముఖ్యాంశాలను నాల్గింటిని పరిశీలించాం. ఇక అతని బోధలను తిలకిద్దాం.

## 2. క్రీస్తు బోధలు

ప్రభువు జీవితశైలికీ అతని బోధలకూ దగ్గరి సంబంధం ఉంది. అతడు ఏలా జీవించాడో ఆలాగే బోధించాడు. క్రీస్తు బోధా జీవితమూ ఒకటే. తానాచరించంది ఏనాడూ చెప్పలేదు. ప్రస్తుతం అతని ఉపదేశాల్లో నాల్గు ముఖ్యాంశాలను పరిశీలిద్దాం.

### 1. దేవునిపై ప్రేమ

క్రీస్తు భావాల ప్రకారం, దేవునికి మనపై అమిత ప్రేమ ఉంటుంది. మనం అతన్ని అడక్కముందే మనకు ఏంకావాలో అతనికి తెలుసు. ఆ తండ్రి మనలనుగూర్చి ఎంతగా జాగ్రత్తపడతాడంటే, మన తల వెండ్రుకల సంఖ్యకూడ అతనికి తెలుసు - మత్త 10,30. మనం అతన్ని నమ్మవచ్చు. మనం తప్పుచేసినా అతనికి మనపట్ల ఉండే కరుణ పోదు. మనం పశ్చాత్తాపపడి మళ్ళా తనదగ్గరికి రావాలనే ఆ తండ్రి కోరిక. ఈలా మన

మేలుకోరి, మన పాపాలు మన్నించి, మనలను ప్రేమించే తండ్రిని మన తరపున మనం పూర్ణహృదయంతో ప్రేమించాలి. ప్రభువు బోధల్లో ముఖ్యాంశం దేవుణ్ణి తండ్రిగా భావించి ప్రేమించడమే.

## 2. తోడి నరులపట్ల ప్రేమ

క్రీస్తు దృష్టిలో దేవుణ్ణి ప్రేమించడం ఎంతముఖ్యమో తోడి నరులను ప్రేమించడంగూడ అంత ముఖ్యం. ఈ రెండవ ఆజ్ఞ మొదటి ఆజ్ఞ అంత బలీయమైంది - మత్త 22, 39. అతడు సోదర ప్రేమను మనకు ఉపదేశించక ముందు దాన్ని స్వయంగా ఆచరించాడు.

మన విరోధులనూ, మనకు కీడుచేసిన వాళ్ళనూ, మనలను హింసించేవాళ్ళను గూడ ప్రేమించాలి. వారికొరకు ప్రార్థన చేయాలి - మత్త 5,44. దేవుడు మన తప్పిదాలను మన్నిస్తున్నాడు. ఆలాగే మనంకూడ ఇతరుల అపరాధాలను మన్నించాలి - 6,12. ఇతరులు మనకు ఎన్నిసార్లు అపరాధం చేసినా మన్నించవలసిందే - 18,22. ఈ మన్నింపు వట్టి నటన కాక హృదయపూర్వకమైనది కావాలి - 18,35.

పేదసాదలపట్ల మనకు విశేష దయ ఉండాలి. మనకు ఉన్నదికూడ అమ్మి వారికి సాయం చేయాలి - మార్కు 10,21. అక్కరలో ఉన్నవారిని, వాళ్ళు మనకు అపరిచితులైనా సరే, తప్పక ఆదుకోవాలి. మంచి సమరయుని కథే దీనికి తార్కాణం - లూకా 10. ఇంకా మనం ఆకలిగొన్నవారికి భోజనం పెట్టాలి. బట్టలు లేనివారికి బట్టలీయాలి. వ్యాధిగ్రస్తులనూ చెరలో ఉన్నవారినీ పరామర్శించాలి. కడతీర్పు సామెత ఈ యంశాలన్నిటినీ విపులంగా పేర్కొంటుంది - మత్త 25. మనం ఇతరులకు ప్రేమతో వినయంతో సేవలు చేయాలి. ఈ సేవలు ఇతరుల పాదాలు కడిగేవరకు పోవాలి. క్రీస్తే దీనికి ఆదర్శం - యోహా 13,14-15. ఈ యంశాలనుగూర్చి ఆత్మ పరిశీలనం చేసి చూచుకొంటే ప్రభువు ఆదేశించిన సోదర ప్రేమను మనం ఏమాత్రం పాటించడంలేదని తెల్లమౌతుంది.

మనం సోదర ప్రేమను పాటిస్తున్నామాలేదా అని తెలుసుకోవడానికి ప్రభువు రెండు సూత్రాలను ఇచ్చాడు. మొదటిది, మనలను మనం ప్రేమించుకొన్నట్లే తోడివారిని గూడ ప్రేమించాలి - మత్తయి 22, 38. మామూలుగా మనంతోడివారిని అసలు ప్రేమించం. పైగా వారిపట్ల ద్వేషం, కోపతాపాలు అసూయ పెంచుకొంటాం. ఇక వారిని మనలను మనం ప్రేమించు కొన్నంతగా ప్రేమించేదెక్కడ? రెండవది క్రీస్తు మనలను ప్రేమించినంతగా మనం ఇతరులను ప్రేమించాలి - యోహా 13,34. ప్రభువుకి మన

స్వార్థబుద్ధి తెలుసు. మనం ఇతరులను ప్రేమించమని తెలుసు. కనుక తాను శిష్యులను ప్రేమించి, వాళ్ళ కాళ్ళు కడిగి, మనం కూడ తనలాగే ఇతరులను ప్రేమించాలని ఆజ్ఞాపించాడు. మన సోదరప్రేమకు అతడే ఆదర్శం. కనుక ఈ గుణం కొంతవరకైనా అలవడితేగాని క్రీస్తు శిష్యులం కాలేం. మనం తోడివారిని ప్రేమించి వారికి సేవలు చేస్తున్నట్లు నటిస్తేనే చాలదు. అది వట్టి రాజకీయం. ఆ పనిని నిజంగానే చేయాలి. విశేషంగా మనతో కలసి జీవించేవారిని, మన చుట్టూ ఉన్నవారిని పట్టించుకొని ఆదరాభిమానాలతో చూడాలి.

## 3. పేదరికం

క్రీస్తుకి పేదరికం ఇష్టం. అతడు బుద్ధిపూర్వకంగానే పేద జీవితం గడిపినవాడు. అతని బోధల ప్రకారం, మనం ఈ లోకంలో సంపదలు కూడబెట్టుకోగూడదు - మత్త 6,19. ఒకేసారి ధనం దేవుడు అనే యిద్దరు యజమానులకు సేవలు చేయలేం - 6,24. పేదలు ధన్యులు, ధనికులకు అనర్థం - లూకా 6,24. ధనిక యువకుడు తన అస్తులను విక్రయించి క్రీస్తుని అనుసరించాలి - మార్కు 10,21. ధనవంతుడు దైవరాజ్యంలో ప్రవేశించడంకంటె ఒంటె సూది బెజ్జంలో దూరడం సులభం - 10,25. తన ధాన్యాన్ని దాచుకోవడానికి పెద్దకొట్లు కట్టించగోరిన ధనికుడు అవివేకి - లూకా 12,20. ధనికుడు లాజరు కథలో పేదవాడు స్వర్గంలో అబ్రాహాము వొడిలో కూర్చుండగా, ధనికుడు నరకాగ్నిలో కూరుకొనిపోయాడు - లూకా 16,22.

క్రీస్తు చేసిన ఈ వుపదేశాలను నేడు ధనికులు లెక్కచేయకపోవచ్చు. కాని అతని బోధల్లో కలిమి పేదరికంఅనే అంశమే అన్నిటికంటె ఎక్కువసార్లు వస్తుంది. చట్టాలు పాటించడం, తిరుసభ అధికారం, లైంగిక వాంఛలు, నరకం మొదలైన అంశాలు ప్రభువు బోధల్లో అంత అధికంగా రావు. కలిమిలేములు మాత్రం తొలిమూడు సువిశేషాల్లో ప్రతి పది వాక్యాలకు ఒకసారి తగలుతుంటాయి. పూర్వవేదం కూడ ఈ యంశాన్ని మాటిమాటికీ ప్రస్తావిస్తుంది. అక్కడ ఎక్కువసార్లు కన్పించే అంశం విగ్రహారాధనం. ఇది యూదుల ప్రధాన పాపం. దాని తర్వాత ప్రధానంగా కన్పించే అంశం కలిమిలేములు.

బైబుల్లో ఈ యంశాన్ని ఇంతగా నొక్కిచెప్పడానికి రెండు కారణాలు ఉన్నాయి. మొదటిది, మన సంపదలున్న చోటనే మన హృదయంకూడ ఉంటుంది - మత్త 6,21. ధనాన్ని కోరేవాడి మనసు ఎప్పుడు దానిమీదనే ఉంటుంది. దేవుణ్ణి కోరేవాడి మనసు ఎప్పుడూ దేవునిమీదనే ఉంటుంది. కనుక మన సంపద దేవుడు కావాలిగాని ధనం కాగూడదు. ఐనా లోకంలోని నరులు సులభంగా దేవుణ్ణి విడనాడి ధనం వైపు వెళ్ళుతుంటారు. డబ్బు మనకు పెద్ద ప్రలోభం. అందుకే బైబులు మాటిమాటికి ఈ యంశాన్ని ప్రస్తావిస్తూ ఉంటుంది.

రెండవది, లోకంలో అధికశాతం ప్రజలు పేదలు. వాళ్ళు తిండిలేక నానా యాతనలు పడుతున్నారు. కొద్దిమంది ధనికులు మాత్రం సంపదనంతా దక్కించుకొని రాజభోగాలు అనుభవిస్తున్నారు. ఈలా కొద్దిమంది మాత్రమే సంపదలను చేజిక్కించుకొని అధికశాతాన్ని పేదలను జేయడాన్నే సాంఘిక అన్యాయం అంటాం. లోకంలో ఈ అన్యాయంలేని తావులేదు. ఇది ప్రాచీన కాలంనుండి వస్తూన్న పాపం. కనుక బైబులు ఈ యంశాన్ని తేపతేపకు గుర్తుకు తెస్తుంది. క్రీస్తు బోధల్లో కూడ ఇది ప్రముఖాంశమైంది. ధనవంతులు తమ భాగ్యాలను పేదలతో పంచుకోవడం ఎలా అన్నది నేడు ప్రపంచంలో ముఖ్య సమస్య.

## 4. శ్రమల సమస్య

క్రీస్తు బోధల్లో నాల్గవ అంశం ఈ లోకంలో నరులు అనుభవించే శ్రమలను గూర్చింది. ఈ విషయాన్ని గూర్చి క్రీస్తు అభిప్రాయాలు రెండున్నాయి. మొదటిది బాధలు చెడ్డవి. దేవుడు మనలను సంతోషించడానికి పుట్టించాడు గాని దుఃఖించడానికి కాదు. జీవించడానికి పుట్టించాడుగాని చనిపోవడానికి కాదు. మోక్షంలో సంతోషమేగాని దుఃఖం ఉండదు. జీవమేగాని మరణం ఉండదు. మృత్యువు, శ్రమలు పిశాచం తెచ్చి పెట్టినవి. అది శత్రువు చేసినపని. దేవునిసృష్టి అనే గోదుమచేలో పిశాచం శ్రమలు అనే కలుపు విత్తనాలు చల్లింది - మత్త 13,28. కనుక క్రీస్తు సాధ్యమైనంతవరకు ఈ శ్రమలను తొలగించాలని కోరుకొన్నాడు. అతడు స్వయంగా అద్భుతాలు చేసి ప్రజల ఆర్తిని తీర్చాడు. గ్రుడ్డివాళ్ళు దృష్టిని పొందుతున్నారు, కుంటివాళ్ళు నడుస్తున్నారు. కుష్ఠరోగులు శుద్ధులౌతున్నారు. చెవిటివాళ్ళు వింటున్నారు. మృతులు పునరుత్థానులౌతున్నారు. పేదలకు సువార్త బోధింపబడుతూంది అని ప్రభువు యోహాను శిష్యులకు చెప్పాడు - మత్త 11,5. అంతేగాదు, ఈ పనులను చేయడానికీ క్రీస్తు తన శిష్యులనుగూడ పంపాడు. ఇప్పుడు తిరుసభకూడ నరుల వ్యాధి బాధలను తొలగించడానికి తనవంతు కృషి తాను చేస్తుంది. నేడు ఆస్పత్రులద్వారా మన మఠకన్యలు చేసే వైద్యసేవకు పునాది ఈ సూత్రమే.

రెండవది, మనం తొలగించుకోలేని శ్రమలను దేవునిపై భారంవేసి మంచి మనసుతో స్వీకరించాలి. దేవుణ్ణి నమ్మినపుడు మనం వదలించుకోలేని శ్రమలను ఏదోవిధంగా భరించగల్గుతాం. దేవుడు పంపిన కష్టాలు మనకు ఏదోవిధంగా మేలుచేస్తాయి కూడ. క్రీస్తు స్వయంగా శ్రమలను ఆహ్వానించలేదు. తండ్రి పంపినపుడు వాటిని స్వీకరించాడు, అంతే. క్రీస్తు స్వయంగా మరణం చెంతకు పోలేదు. సాధ్యమైనంతవరకు దాన్ని తప్పించుకో జూచాడు. నజరేతు పౌరులు ప్రభువుని కొండ శిఖరమునుండి క్రిందికి

పడద్రోయబోయినపుడు అతడు వారిమధ్య నుండి తొలగిపోయాడు - లూక 4,29-30. క్రీస్తు లాజరుని జీవంతో లేపి జనాన్ని తనవైపు ఆకర్షించు కొన్నప్పటినుండి యూద నాయకులు అతన్ని నాశం చేయాలని నిశ్చయించుకొన్నారు. కాని ప్రభువు వారి కంటబడకుండ దూర ప్రాంతాలకు వెళ్ళిపోయాడు - యోహా 11,53-54. ఐతే తండ్రి నిర్ణయించిన గడియ వచ్చినపుడు అతడు తండ్రిమీదనే భారంవేసి మరణాన్ని అంగీకరించాడు. ఈలా అతడు మనం మొదట శ్రమలను తొలగించుకోవాలనీ, తొలగించుకోలేనపుడు దేవుణ్ణి నమ్మి వాటిని మంచిమనసుతో స్వీకరించాలనీ బోధించాడు.

నేడు క్రీస్తు శిష్యులమైన మనం ఈ బోధల విషయంలో రెండు పొరపాట్లు చేయవచ్చు. మొదటిది, బాధలు వాటంతట అవి మంచివో అన్నట్లు వాటిని ఆహ్వానించడం. వేదనలు అనుభవించడమే గొప్ప పుణ్యం అనుకోవడం. ఐతే ఈ పొరపాటుని కొద్దిమంది మాత్రమే చేస్తారు. రెండవది, శ్రమలు తప్పనిసరియైనపుడు గూడ వాటిని నిరాకరించడం. నిరాశకు గురై దేవుణ్ణి తిట్టిపోయడం. ఈ పొరపాటుని చాలమంది చేస్తారు. క్రీస్తు జీవితంలో ఆనందమూ బాధలూ రెండూ ఉన్నాయి. జీవమూ మరణమూ కూడ అతనిలో నెలకొని ఉన్నాయి. నేడు మన జీవితం కూడ ఈలాగే ఉండాలి.

ప్రభువు బోధలనుగూర్చి చెప్పే సందర్భంలో లైంగికాంశాలను గూర్చి కూడ రెండుమాటలు చెప్పాలి. తిరుసభ అధికారులందరూ బ్రహ్మచర్యాన్ని పాటించేవాళ్లే. కనుక వివాహం లైంగిక విలువలు తక్కువని, బ్రహ్మచర్యం ఎక్కువది అనేభావం మన క్యాతలిక్ సమాజంలో చాలమందికి ఉంది. తిరుసభకూడ మోహా తలంపులు, ముష్టిమైథునం, స్వలింగ సంపర్కం, వివాహేతరలైంగిక సంబంధాలు, కుటుంబనియంత్రణ మొదలైన అంశాలను గూర్చి పదేపదే హెచ్చరిస్తూంటుంది. బహుశా అవసరమైన దానికంటె ఎక్కువగానే ఉపదేశిస్తూంటుంది. కాని క్రీస్తు ఈ లైంగిక సమస్యలనుగూర్చి చెప్పింది చాలా తక్కువ. అతని బోధల్లో లైంగికాంశానికి అసలు తావున్నట్లే కన్పించదు. అతడు ఒక్కసారిమాత్రం శారీరక వ్యభిచార్యాన్ని మానసిక వ్యభిచారాన్నీ కూడ నిషేధించాడు అంతే - మత్త 5,28. ఇంతకుమించి క్రీస్తు లైంగిక విషయాలను నేరుగా ఎక్కడా ప్రస్తావించలేదు. ప్రభువు స్వయంగా బ్రహ్మచారి. ఐనా అతడుగాని, అతని సమకాలికులుగాని ఆ విషయాన్ని ఘనంగా ఎంచలేదు. వ్యభిచార దోషంలో చిక్కుకొన్న స్త్రీలనుగూడ అతడు కఠినంగా మందలించలేదు. కరుణతో వారి తప్పిదాలనూ బలహీనతలనూ మన్నించి వారిని మరల త్రోవకు తీసికొనివచ్చాడు. కనుక నేటి తిరుసభ లైంగికాంశాలనుగూర్చి ఎక్కువగా చెప్పనక్కరలేదేమో! వీటికంటె సాంఘిక అన్యాయం, సోదరప్రేమ మొదలైనవి ముఖ్యమైనవి. ఈలాగంటే మనం లైంగిక విషయాల్లో విచ్చలవిడిగా

ప్రవర్తింపవచ్చునని భావం కాదు. దానికి ఈయగూడని ప్రాముఖ్యం ఈయనక్కరలేదని అభిప్రాయం.

# 3. మనం చేసే పొరపాట్లు

క్రీస్తు శిష్యులంగా మనం నిర్మల జీవితం గడపాలి. నిర్దోషులంగా జీవించాలి. కాని శిష్యులమైనంత మాత్రాన్నే మన బలహీనతలు పోవు. కనుక అందరమూ చాలా పొరపాట్లు చేస్తుంటాం. కాని ప్రభువు తన జీవితాదర్శంద్వారా నైతేనేమి, తన బోధలద్వారా నైతేనేమి, తాను తిరుసభకు దయచేసిన ఆత్మద్వారా నైతేనేమి నిరంతరం మనలను చక్కదిద్దుతుంటాడు. తప్పిపోయినపుడెల్ల మనలను తిరిగి మందలోనికి చేరుస్తుంటాడు. ఈ యధ్యాయంలో మామూలుగా మనం చేసే పొరపాట్లు, క్రీస్తు మనలను చక్కదిద్దే తీరూ తెలిసికొందాం.

## 1. దేవుణ్ణి నమ్మం

దేవుడు మనలను పట్టించుకొంటాడనీ, ప్రేమిస్తాడనీ అంతగా నమ్మం. మనలో ఎన్నో లోపాలు అవకతవకలు ఉంటాయి. కనుక సర్వగుణ సంపూర్ణుడైన దేవుడు మనలను మెచ్చుకోడని మన భయం. దేవుడు మన అవసరాలను తీర్చి మనలను ఆదుకొంటాడని గూడ అంతగా నమ్మం. అందుకే మన భద్రతకోసం అనేక లోకవస్తువులు కూడబెట్టు కొంటాం. అవి మనలను కాపాడతాయని భ్రాంతి పడతాం. కాని దేవుని సహాయంలేకుండ ఏ వస్తువూ, ఏ వ్యక్తి మనలను కాపాడలేవు.

దేవుణ్ణి నమ్మవలసినంతగా నమ్మకపోవడం మన ప్రధాన బలహీనతల్లో వొకటి. కాని ఈ విషయంలో మన గురువైన క్రీస్తు మనలను చక్కదిద్దుతాడు. అతడు దేవుడు కరుణామయుడనీ అతన్ని ప్రేమించమనీ మనకు తెలియజేస్తాడు. ఆ తండ్రి మన లోపాలతోపాటు సద్గుణాలతో పాటు మనలను ఉన్నవాళ్ళను ఉన్నట్లుగా అంగీకరిస్తాడని నేర్పుతాడు. దేవుడు ఎల్లప్పుడు నరులను కాచి కాపాడుతుంటాడనే సత్యాన్ని రూఢిగా నమ్మమని మనకు విశదం చేస్తాడు. దీనివల్ల మనం అంతగా నమ్మని దేవుణ్ణి నమ్మడం నేర్చుకొంటాం. అతన్ని అధికంగా ప్రేమిస్తాంగూడ.

## 2. మనమీద మనకే ఇష్టం ఉండదు

చాలమంది వాళ్ళనువాళ్ళే అంగీకరించుకోరు, ప్రేమించరు. మనమంటే మనకే యిష్టం ఉండదు. మన లోపాలను ఎక్కువగా గమనించి మన శక్తిసామర్థ్యాలను తక్కువగా అంచనా వేసుకొంటాం. ఇతరులతో పోల్చి చూచుకొని మనం కొరగానివాళ్ళమని

బాధపడతాం. లోకంలో మనం చేయగల మంచిపని లేదో అన్నట్లుగా జీవితంలో వెనక్కువెనక్కు పోతాం. ఇతరులతో కలవకుండ వొంటరిగా ఉండిపోతాం. మనలను మనం నిరాకరించుకొని అప్రయోజకులమైపోతాం.

మనలను మనమే నమ్మకపోవడం మన ముఖ్య లోపాల్లో వొకటి. ఇక్కడకూడ మార్గదర్శకుడైన క్రీస్తు మనలను సవరిస్తాడు. ఆ ప్రభువు మనలందరినీ అంగీకరిస్తాడు, ప్రేమిస్తాడు. మనలో ఒక్కొక్కరితోను నీవు నాకు అమూల్యమైనవాడివి, నీవంటె నాకు ఇష్టం అని చెప్తాడు. ఈలా క్రీస్తు తండ్రి క్రీస్తూ మనలను అంగీకరిస్తుంటే, మనంకూడ విలువైన వాళ్ళమేననే అభిప్రాయం మనకు కలుగుతుంది. ప్రభువుమనతో మీరుబలహీనులైనా ఇబ్బందిలేదు. కాలుజారి కిందపడిపోయేవాళ్ళయినా పర్వాలేదు. మీరు మళ్ళా పైకిలేస్తే చాలు అని చెప్తుంటాడు. దీనివలన మనం ఉత్సాహం తెచ్చుకొంటాం. మనలను మనం నమ్ముతాం, అంగీకరించుకొంటాం.

## 3. ఇతరులంటె ఇష్టం ఉండదు

సమాజంలో చాలమందిని మనం అనిష్టంతో చూస్తాం. కొందరికి ఆడవాళ్ళంటే యిష్టం ఉండదు. కొందరికి మగవాళ్ళంటే గిట్టదు. కొందరికి పలానా కులం వాళ్ళంటే, పలానా ప్రాంతం వాళ్ళంటె, పలానా మతం వాళ్ళంటే పడదు. ఇతరులను గూర్చి మనకెన్నో అపోహలూ, అపార్థాలూ, కోపతాపాలూ, అసూయలూ ఉంటాయి. మన బంధువుల్లోనే, ఆమాటకొస్తే మన కుటుంబసభ్యుల్లోనే కొందరంటే మనకు పడదు. ఇక మనం ప్రేమించేదెవరిని? బహుశ చాల కొద్దిమందినే.

ఈ యంశంలోగూడ మన బోధకుడైన క్రీస్తు మనకు తోడ్పడతాడు. అతడు మనం ఇతరులను అంగీకరించి ప్రేమించాలని నేర్పుతాడు. తన ప్రేమాత్మను మనపై కుమ్మరించి మనం ఈ కార్యంలో విజయం సాధించేలా చేస్తాడు. మనకు అపరాధం చేసినవాళ్ళను మన్నించమని ప్రబోధిస్తాడు. దేవుణ్ణి తోడినరుల్లోనే దర్శించమని హెచ్చరిస్తాడు. మనలను మనం కాసేపు మర్చిపోయి తోడివారికి సేవలు చేయమని మందలిస్తాడు. దీనివల్ల మన ప్రవర్తనం మారుతుంది. ఇతరులను విలువతో చూడ్డం అలవాటు చేసికొంటాం.

## 4. లోక వస్తువులను నమ్ముతుంటాం

భగవంతుణ్ణీ తోడినరులనూ నమ్మవలసినంతగా నమ్మకపోవడంవల్లనే లోక వస్తువులను ఆశ్రయిస్తాం. వీటి ద్వారా మనలోని అభద్రతా భావాన్ని తొలగించుకోజూస్తాం. ఇందుకే కొందరు ఆస్తులు, ధనం కూడబెట్టుకోగోరుతారు. కొందరు అధికారాలూ, పదవులూ

దక్కించుకోగోరుతారు. కొందరు పేరు తెచ్చుకోవాలని తాపత్రయ పడతారు. ఇవన్నీ లోకంయెదుట మనలను గొప్పవాళ్ళను చేస్తాయని భ్రాంతి పడతారు. కాని మనకు స్వయంగాలేని విలువ లోకవస్తువులవల్ల రాదు.

ఈ సందర్భంలోగూడ మన గురువైన క్రీస్తు మనలను దారికి తీసికొని వస్తాడు. మనం లోక వస్తువులను అంటిపెట్టుకొని ఉండకుండ పేదజీవితం గడపాలని బోధిస్తాడు. నరుని హృదయానికి పూర్ణతృప్తినిచ్చేది వస్తువులు కాదు, వాటిని సృష్టించిన భగవంతుడు ఒక్కడేనని విదశం చేస్తాడు. మనం లోకవస్తువులను పూర్తిగా త్యజించనక్కరలేదనీ, వాటిల్లోకూడ దేవుణ్ణి దర్శించి వాటిని మన అవసరాలకు వాడుకోవచ్చుననీ తెలియజేస్తాడు. ప్రకృతిలో భగవంతుని సాన్నిధ్యాన్ని దర్శింపమనిచెప్తాడు. ఈ లోకాన్ని వదలివేయనక్కరలేదని, లోకంలో వున్నా లోకానికి చెందకుండా జీవిస్తే చాలుననీ నేర్పుతాడు.

మన వుపాధ్యాయుడైన క్రీస్తు మనలను ఈలా నిరంతరం చక్కదిద్దుతుంటాడు. మనం అవివేకంవల్ల అపమార్గం పట్టినా అతని సవరింపులవల్ల మళ్ళా మంచి త్రోవలో అడుగిడతాం. మనతరపున మనం ఆ ఉపాధ్యాయునికి మంచి శిష్యులంగా మెలిగితే చాలు, అతడు మనలను సంస్కరించి పునీతులను చేస్తాడు.

## 4. క్రీస్తుతో స్నేహం

ప్రభువు మనకు గురువు, అనుకరణీయుడు. అంతేగాదు. అతడు ఎప్పుడుగూడ తిరుసభలో సజీవుడై యుండి మనకు తోడుగాను స్నేహితుడుగాను మెలుగుతుంటాడు. క్రీస్తుకి శిష్యుడైనవాడు అతనికి స్నేహితుడుకూడ ఔతాడు. నూత్నవేదం క్రీస్తు స్నేహాన్ని చాలసార్లు ప్రస్తావిస్తుంది.

ఉత్థాన క్రీస్తు లోకాంతంవరకు నేను సర్వదా మీతో ఉంటానని అభయమిచ్చాడు - మత్త 28,20. అతడు మనతో వుంటాడు అంటే, మనకు స్నేహితుడుగాను సహాయం చేసే వాడుగాను వుంటాడని భావం. ఇంకా ప్రభువు శిష్యులతో ఈలా చెప్పాడు. "నన్ను ప్రేమించేవాడు నా మాటను పాటిస్తాడు. అపుడు నా తండ్రి అతన్ని ప్రేమిస్తాడు. మేము అతనివద్దకు వచ్చి అతనితో వసిస్తాం" - యోహా 14,23. ప్రభువు మనకు నేస్తుడుగానే మనతో వసిస్తూంటాడు. మరోమారు అతడు శిష్యులతో "ఇకమీదట నేను మిమ్ము దాసులని పిలువను, స్నేహితులని పిలుస్తాను" అన్నాడు - 15,15. కదన దర్శన గ్రంథం 3,20లో ప్రభువు ఈలా నుడివాడు. "విను, నేను ద్వారంవద్ద నిలచి తలుపు తడతాను. ఎవడైనా నా స్వరం విని తలుపుతీస్తే నేను లోనికి వస్తాను. నేను అతనితోను అతడు నాతోను భుజిస్తాం". ఈ వేద వాక్యాలన్నీ క్రీస్తూ మనమూ స్నేహితులమనే నొక్కి చెప్తాయి.

క్రీస్తు మనకు స్నేహితుడు కావడం మన భాగ్యవిశేషం. అతన్ని మామూలు మిత్రులలాగ కంటితో చూడలేం. చేతితో తాకలేం. ఐనా అతడు మనకు నిజంగానే మిత్రుడు. మామూలు నరుల స్నేహంకంటె క్రీస్తు స్నేహం మనకు ఎక్కువ లాభదాయకం. ఎందుకంటే అతడు దేవుడు. సర్వశక్తి సంపన్నుడు. మనమంటే యిష్టపడేవాడు. మనకు సహాయం జేయగోరేవాడు. మామూలు నరుల చెలిమికి ఈ లక్షణాలన్నీ వుంటాయా? కనుక క్రీస్తుని స్నేహితునిగా బడసిన నరుడు ధన్యుడు.

పౌలుభక్తుని గొప్ప క్రీస్తు తనకూ, తాను క్రీస్తుకీ స్నేహితులు కావడంలోనే ఉంది. ఈ స్నేహభావాన్ని మనసులో పెట్టుకొనే అతడు "నాకు జీవించడమంటే క్రీస్తుని జీవించడమే అని వ్రాసికొన్నాడు. ఫిలి 1,21. అతడు క్రీస్తుని నమ్మినవాడు. నిరంతరం ఆ ప్రభువుని గూర్చి తలంచుకొన్నవాడు. ఎల్లవేళల అతన్ని స్తుతించి కీర్తించినవాడు. తన అవసరాల్లో అతన్ని ఆశ్రయించినవాడు. అతన్ని బోధించడానికి సేవలు చేయడానికే నిరంతరం శ్రమించినవాడు. అతని ప్రేమను పొందానని నమ్మినవాడు. కనుకనే "క్రీస్తు నన్ను ప్రేమించి నా కొరకు ప్రాణత్యాగం చేసికొన్నాడు" అని వ్రాసికొన్నాడు - గల 2, 20. అతడు ప్రభువుని ఎంతగా నమ్మాడు అంటే "నన్ను బలపరచే ఆ ప్రభువుద్వార, నేను ఏ పనినైనా చేయగలను" అని చెప్పుకొన్నాడు - ఫిలి 4,13. క్రీస్తుతో ఏలా చెలిమి చేయాలి అనే ప్రశ్న వచ్చినపుడు ఈ పౌలు మనకు ఆదర్శంగా ఉంటాడు.

శిష్యులమైన మనం నేడు క్రీస్తుతో స్నేహాన్ని పెంపొందించుకోవడానికి మార్గాలు నాల్గున్నాయి.

1. మొదటిది, క్రీస్తుకి నేస్తులంగావాలనే కోరిక మన హృదయంలో బలంగా ఉండాలి. మనకు నరుల స్నేహం చాలదు. దేవుని స్నేహంకూడ అవసరం. మన విలువలన్నిట్లో పైవిలువ క్రీస్తే. అతనికొరకే మనం జీవించేది. అతని స్నేహాన్ని పొందకపోతే ఇక మన జీవితానికి సార్థక్యమేమిటి?

2. మన హృదయంలోని స్నేహవాంఛను గుర్తించి ఆ ప్రభువు తన్నుతాను మనకు మిత్రునిగా సమర్పించు కొంటాడు. మనం కృతజ్ఞతా భావంతో ఆ దివ్య మిత్రుణ్ణి అంగీకరించాలి. అతన్ని చెలికాణ్ణిగా పొందడం మహాభాగ్యం అనుకోవాలి. పూర్వం ఆ ప్రభువు ధనిక యువకుని వంక ప్రేమతో చూచాడు - మార్కు 10, 21. లాజరుని గాఢంగా ప్రేమించాడు - యోహా 11,36. మగ్దలీనను మరియా అని ఆప్యాయంగా పేరెత్తి పిలిచాడు - 20,16. యోహానుని ప్రత్యేకంగా ప్రేమించాడు - 13,23. మార్త ఆతిథ్యాన్ని స్వీకరించాడు - లూకా 10,40. ఆలాంటి ప్రభువు నేడు మనలను గూడ ప్రేమించి మనకు స్నేహితుడు కాబోతున్నాడు. కనుక మనం ఆ ప్రభువుని బంగారాన్ని లాగ స్వీకరించాలి. ఈ లోకమిత్రులు ఎందరున్నా వాళ్ళు అతనితో సాటిగారు.

3. క్రీస్తుకి స్నేహితులైనవాళ్ళు వాళ్ళల్లో వాళ్ళు స్నేహితులుగా మెలగాలి. తొలినాటి యెరూషలేము క్రైస్తవులు ప్రభువుని నమ్మిన శిష్యులు. అతనికి స్నేహితులు. ఈ స్నేహితులంతా తమలోతాము మిత్రులుగా ఉండేవాళ్ళు. క్రీస్తుని విశ్వసించిన వాళ్ళంతా కలసి సమష్టిగా జీవించారు. తమకున్నదాన్ని అందరితో పంచుకొన్నారు - అ.చ. 2,44. విశ్వాసులు ఏక మనస్సుతో, ఏక హృదయంతో జీవించారు. తమకున్న ఆస్తిపాస్తులను ఇవి మా సొంతం అనుకోకుండా అందరితో పంచుకొన్నారు - 4, 32. ఈ తొలినాటి విశ్వాసులు మనకు ఆదర్శం. కనుక మనం క్రీస్తుకి మిత్రులైన తోడి క్రైస్తవులతో కలసిమెలసి జీవించాలి. ఇచ్చిపుచ్చుకొంటుండాలి. ఇతరులకు సాయం చేస్తుండాలి. ఇతరులనుండి సాయం పొందుతూండాలి.

4. విశ్వాసులుకాని అన్యులనుకూడ క్రీస్తుకి మిత్రులనుగా చేయాలి. చాలమందిని క్రీస్తు దగ్గరికి రాబట్టాలి. వాళ్ళు అతన్ని అంగీకరించి పూజించి ప్రేమించేలా చేయాలి. పౌలు భక్తుడు ఈలా చేసాడు. అతడు కొరింతు పౌరులను నిష్కలంకమైన కన్యనుగా క్రీస్తుకి ప్రధానం చేయగోరాడు - 2 కొరి 11,2. అనగా వారిని క్రీస్తు శిష్యులనుగా భక్తులనుగా తయారుచేయగోరాడు. ఈలాగే మనంకూడ మన ప్రేషిత సేవద్వారా చాలమందిని క్రీస్తుకి శిష్యులనుగా మిత్రులనుగా తయారుచేయాలి. వేదబోధలో ఉత్సాహం చూపాలి. దైవరాజ్య వ్యాప్తి మనపని అనుకోవాలి.

స్నాపక యోహానుకూడ తన్ను పెండ్లికుమారుని మిత్రునితో పోల్చుకొన్నాడు. యూదుల సంప్రదాయం ప్రకారం వధూవరులను కలిపేవాడు పెండ్లికుమారుని మిత్రుడు. వాళ్ళిద్దరికీ పరిణయమయ్యాక తాను వైదొలగుతాడు. యోహాను క్రీస్తు రాకడకు ప్రజలను సిద్ధంజేసాడు. వాళ్ళు తమ పాపాలకు పశ్చాత్తాపపడి మెస్సీయాను అంగీకరించాలని బోధించాడు. క్రీస్తు వచ్చాక ఇతడే లోకం పాపాలను పరిహరించే గొర్రెపిల్ల, మీరు ఇతన్ని అనుసరించండి అని పల్కి అతన్ని ప్రజలకు పరిచయంజేసాడు. ఆ పిమ్మట అతడు హెచ్చాలి నేను తగ్గాలి అని చెప్పి తాను ప్రక్కకు తొలగాడు - యోహా 3, 29-30. ఈ యోహానులాగే మనంకూడ తోడివారిని క్రీస్తుని అంగీకరించడానికి సిద్ధం చేయాలి. వారి హృదయాల్లో క్రీస్తుపట్ల భక్తి విశ్వాసాలు పుట్టించాలి. వాళ్ళు క్రీస్తుని ఎన్నుకొన్నాక మనం వినయంతో ప్రక్కకు తొలగాలి. ఈ విధంగా అన్యులను క్రీస్తు దగ్గరికి రాబట్టడంలో పౌలూ స్నాపక యోహానూ మనకు ఆదర్శంగా ఉంటారు. మనమూ క్రీస్తుకి స్నేహితులంగా మెలగాలి. ఇతరులూ అతనికి స్నేహితులయ్యేలా చూడాలి.

ఈ పొత్తంలో శిష్యధర్మాలను నాల్గింటిని ఉదాహరించాం. శిష్యుడు క్రీస్తు జీవిత విధానాన్ని అనుసరిస్తాడు. అతని బోధలను పాటిస్తాడు. తాను అపమార్గం పట్టినపుడు ప్రభువు అతన్ని చక్కదిద్దుతాడు. అతడు క్రీస్తుకి మిత్రుడుగా మెలుగుతాడు. ఈ భాగ్యాలన్నీ మనకుకూడ సిద్ధించాలని ప్రభువుని వేడుకొందాం.

# 6. క్రీస్తు సిలువ

బైబులు భష్యం - 136

## మనవిమాట

ఈ సంచికలో సిలువ చరిత్రను వివరించాం. క్రీస్తు రాకముందు, క్రీస్తు జీవితంలో, అతని మరణానంతరం సిలువ చరిత్ర ఏలా వుండేదో తెలియజేసాం. సిలువ నూత్నవేదంలోని ప్రధాన భావాల్లో వొకటి. క్రైస్తవ జీవితంలోని ముఖ్యాంశాల్లో వొకటి. కనుక ఈ పదమూ, దాని భావమూ మన ప్రజలకు స్పష్టంగా తెలిసివుండాలి. ఈ సంచికలోని నాల్గు ముఖ్యాంశాలు ఇవి:

1. ప్రాచీనకాలంలో సిలువ మరణం
2. క్రీస్తు సిలువ మరణం
3. సిలువ మరణంలోని అంతరార్థం
    1. క్రీస్తు జీవితంలో సిలువ
    2. క్రైస్తవుల జీవితంలో సిలువ
4. సిలువ భక్తి

## 1. ప్రాచీనకాలంలో సిలువమరణం

మధ్యధరాసముద్ర తీర దేశాల్లో దోషులకు సిలువ మరణాన్ని విధించడం వాడుకలో వుండేది. క్రీస్తు పూర్వం 6వ శతాబ్దంనుండి క్రీస్తుశకం 3వ శతాబ్దం వరకు ఈ శిక్ష కొనసాగింది. రోమను చక్రవర్తి కోన్‌స్టంటయిను క్రైస్తవుడయ్యాక 337లో ఈ శిక్షను రద్దుచేసాడు. క్రీస్తుసిలువపై చనిపోయినందున ఆ ప్రభువు గౌరవార్థం ఈ శిక్షను రద్దు చేస్తున్నానని ఆ రాజు ప్రకటించాడు.

సిలువ మరణం అతి ఘోరమైంది. అది దోషులను కఠినంగా శిక్షిస్తుందనీ, ఇతరులనుగూడ భయపెట్టి నేరానికి దూరంగా వుంచుతుందనీ ప్రాచీనులు భావించారు. ఈ శిక్షలో దోషిని నిలువుగా పాతిన పొడగాటి మానుకి అంటగట్టి చావనిచ్చేవాళ్ళు. మొదట దోషిని వెల్లకిలపరుండబెట్టి అతని చేతులను అడ్డమానుకి అంటగొట్టేవాళ్ళు దోషితోపాటు ఆ మానుని పైకెత్తి నిలువుగా వున్న మానుకి బిగించేవాళ్ళు. నిలువుమాను ఎప్పుడూ కొరతవేసే తావులోనే వుండేది. దోషి పిరుదులను ఆనించుకోవడానికి నిలువుమానిపై ఓ పీట కూడ వుండేది. ద్రోహి కొంతకాలం మానుపై వేలాడి ఆకలిదప్పులకు గురై, ఆయాసం వలన ఊపిరాడక చనిపోయేవాడు.

క్రీస్తుపూర్వం 8వ శతాబ్దంలోనే హెరోడోటస్ అనే గ్రీకు చరిత్రకారుడు ఈ శిక్షను పేర్కొన్నాడు. పర్ష్యారాజులు ఈ శిక్షను ఎక్కువగా అమలు చేయించారు. అక్కడినుండి ఇది ఆఫ్రికా దేశంలోని కార్తేజికి ప్రాకింది. అక్కడినుండి గ్రీసురోమను దేశాల్లోకి దిగుమతి ఐంది. అలెగ్జాండరు చాలమందికి సిలువ శిక్ష విధించాడు. రోమను ప్రభువులు లక్షలకొలది ద్రోహులను నిర్దయతో సిలువ వేసారు. రోమనుల దృష్టిలో సిలువచావు క్రూరమైన బాధకీ అవమానానికీ గూడ నిలయమైంది. కావున బానిసలనేగాని రోమను పౌరుల నెవరినీ సిలువ వేయకూడదని కట్టడచేసారు. మామూలుగా రోమను ప్రభుత్వం రాజకీయ ద్రోహులూ, తిరుగుబాటుదారులూ, దొంగలూ మొదలైన నేరగాళ్ళను సిలువవేసేది.

రోమనులు సిలువ శిక్ష విధించాక దోషిని న్యాయస్థానంలోనే కొరడాలతో కొట్టించేవాళ్ళు. ఇది కూడ కఠినమైన శిక్ష. అసలు ఈ శిక్షవల్లనే ఆ దౌర్భాగ్యుడికి సగం ప్రాణాలు పోయేవి. ఆ పిమ్మట దోషి చేతులను అడ్డమానుకి అంటగట్టేవాళ్ళు. అతడే అడ్డమానును భుజాలపై కొరత స్థలానికి మోసికొని పోవాలి. అక్కడ అతన్ని అడ్డమానుతో సహా లేపి చీలలతో నిలువుమానుపై అంటగొట్టే వాళ్ళు. దారిపోదుగున సైనికులు అతన్ని అవమానిస్తు హేళన చేసేవాళ్ళు. కడన అతడు సిలువపై ఘోరయాతనలు అనుభవించి చనిపోయేవాడు. ఎవరూ అతనిపట్ల దయా సానుభూతి చూపేవాళ్ళు కాదు. సిలువ పై భాగాన దోషి పేరూ అతడు చేసిన నేరమూ వ్రాసివుంచేవాళ్ళు. దోషి త్వరగా చనిపోకపోతే అతని కాళ్ళు విరుగగొట్టేవాళ్ళు. అప్పుడు నిందితుడు క్రిందికి వేలాడుతూ ఊపిరాడక ప్రాణాలు విడిచేవాడు. ఇంకా కొన్నిసార్లు నిందితుని రొమ్మును ప్రక్కభాగాన ఈటెతో పొడిచేవాళ్ళు. ఆ పోటు గుండెకు తగిలి అతడు వెంటనే మరణించేవాడు. మరణం తర్వాత దోషి దేహం సిలువపైనే వుండి కుళ్ళిపోయేది. కొన్నిసార్లు క్రూరమృగాలు కూడ దానిని లాగుకొని తినేవి. అతనికి భూస్థాపనం వుండేది కాదు. ప్రజలు దోషి దుర్గతిని చూచి భయపడి నేరాలకు దూరంగా వుండాలని అధికారుల తలపు.

సిలువ మరణం బహుక్రూరమైంది. దాని బాధను భరించలేక దోషి అందరినీ దూషించి శపించేవాడు. తన్నుకన్న తల్లి దండ్రులను కూడ శపించేవాడు. తాను పుట్టకుండా వున్నా బాగుండేదని వాపోయేవాడు. ఇంకా అతడు తన చెంతకు వచ్చినవారిపై కోపంతో ఉమ్మి వేసేవాడు. అందుకే సైనికులు కొన్నిసార్లు అతని నాలుకను కోసివేసేవాళ్ళు. మామూలుగా దోషులను అందరికీ కనిపించే బహిరంగ స్థలాల్లోనే సిలువ వేసేవాళ్ళు. వారి చావును కన్నులార చూచినవాళ్ళు నేరాలు చేయడానికి జంకేవాళ్ళు.

పాలస్తీనా దేశంలో యూదులు సిలువ మరణాన్ని అమలు పరచలేదు. ద్రోహిని రాళ్ళతో కొట్టిచంపడం వాళ్ళ పద్ధతి. వాళ్ళు కొన్నిసార్లు దోషిని వధించి అతని శవాన్ని

చెట్టుకు వ్రేలాడదీసేవాళ్ళు. ఇది కూడ ఒక రకమైన సిలువ మరణమే, అవమానాన్ని సూచించేదే - ద్వితీ 21, 22 - 23. కాని అరుదుగా యూదులు కూడ సిలువ మరణాన్ని అమలు చేయించారు.

## 2. క్రీస్తు సిలువ మరణం

సువిశేషాలు వర్ణించే క్రీస్తు సిలువ మరణం అచ్చంగా ఆనాటి రోమనుల సిలువ శిక్షా పద్ధతిలోనే జరిగిపోయింది. ఇక్కడ కొన్ని వివరాలను పరిశీలిద్దాం. సిలువ శిక్షకు ముందు అతన్ని కొరడాలతో కొట్టించారు - మార్కు 15,15. అతడు తన అడ్డమానును తానే మోసికొని కపాల కొండకు వెళ్ళాడు - యోహా 19, 17. దోషులు దిగంబరులుగానే సిలువను మోయాలి. కాని యూదులు మాత్రం తమ దేశంలో సిలువవేయబడేవాళ్ళు సవస్త్రులుగానే ఆ శిక్షను అనుభవించే అనుమతిని పొందారు. కనుక ప్రభువుని కొరడాలతో కొట్టాక మళ్ళా అతని దుస్తులు అతనికి కట్టబెట్టారు - మార్కు 15, 20. ఒక దోషి సిలువ మరణం దోషులందరికీ హెచ్చరికగా వుండాలని రోమను ప్రభుత్వం ఉద్దేశం. కాని దోషి దారిలోనే చనిపోతే ఈయాశయం నెరవేరదు. క్రీస్తు కూడ బలహీనుడై సిలువను మోయలేని పరిస్థితిలో వున్నాడు. కనుక అతడు దారిలోనే చనిపోకుండా వుండడానికి అతని సిలువను కొంతదూరం మరొకనిచో మోయించారు. అతడే కురేనియా సీమోను - 15,27. క్రీస్తు శారీరక బాధను తగ్గించడానికి అతనికి మత్తుపానీయాన్ని ఈయబోయారు. ఇది కూడ యూదులు రోమను ప్రభుత్వంనుండి ప్రత్యేకంగా పొందిన అనుమతి. ఇది కరుణకార్యం. కాని ప్రభువు ఆ పానీయాన్ని స్వీకరించలేదు. నరుల కొరకు పూర్తి శ్రమలను అనుభవించాలనే అతని కోరిక - 15,23. కడన క్రీస్తు వస్త్రాలను తొలగించారు - 15, 25. చీలలతో అతని చేతులను అడ్డమానుకి అంటగొట్టారు. చివరన అతన్ని సిలువపై కొరతవేసారు. అతడు సిలువపై దిగంబరుడుగానే చనిపోయాడు.

యేసు సిలువపై "యూదులరాజు" అనే నేరం వ్రాసిపెట్టారు - 15,26. దాన్ని హీబ్రూ, గ్రీకు, లాటిను అనే మూడు భాషల్లోను వ్రాసారు. అతన్నిచాల యెత్తు మానుమీద కొరత వేసారు. అందరూ అతన్నిచూచి చీదరించుకోవాలని యూదుల అభిలాష. అతనికి పులిసిన రసాన్ని ఈయబోయినపుడు దాన్ని ఒక కర్రకు తగిలించి పై కెత్తి ఈయవలసి వచ్చింది - 15,36. యూదుల ధర్మశాస్త్రం ప్రకారం కొరత వేయబడినవాని శవం రేయి చెట్టుపై ఉండకూడదు. అది దేశాన్ని అపవిత్రం చేస్తుంది - ద్వితీ 21,23.యూదులు ఈ సంగతి రోమను అధికారులకు విన్నవింపగా వాళ్లు క్రీస్తు కాళ్ళను విరుగగొట్టి అతనికి త్వరలో చావు రప్పించడానికి సైనికులను పంపారు. కాని ఆ సైనికులు వచ్చిచూడగా

క్రీస్తు అప్పటికే చనిపోయి వున్నాడు. కనుక వాళ్ళు అతని కాళ్లు విరుగగొట్టలేదు. ఒక సైనికుడు మాత్రం అతని ప్రక్కను ఈటెతో పొడిచాడు - యోహా 19, 31-34. ఆ పిమ్మట అరిమత్తయియా యోసేపు మొదలైనవాళ్ళు అతని శరీరాన్ని సిలువనుండి దించి గౌరవప్రదంగా పాతిపెట్టారు - మార్కు 15, 46. సువిశేషాల నుండి మనకు లభించే క్రీస్తుశ్రమల వివరాలు ఇవి. సువిశేష రచయితలు క్రీస్తు శారీరక బాధలను వర్ణించలేదు. అతన్ని కొరడాలతో కొట్టించారు, సిలువ వేసారు అని వట్టి పొడిమాటలు చెప్పి వూరకున్నారు. కాని యివి ఘోరమైన శ్రమలు.

# 3. సిలువ మరణంలోని అంతరార్థం

దైవశాస్త్రరీత్యా సిలువ మరణంలోని అంతరార్థం ఏమిటి? అతని సిలువ మరణం మనకు ఏమి సాధించి పెట్టింది? ఆ సంఘటనం ఈనాడు మన క్రైస్తవ జీవితాన్ని ఏలా ప్రభావితం చేస్తుంది? ప్రభువు సిలువ మరణం ఈనాడు మన జీవితంలో ఏలా కొనసాగిపోతుంది? ఈ ప్రశ్నలకు జవాబులు రాబట్టాలి. సిలువ మనకు రక్షణ సాధనం. కనుక మనకు దానిపట్ల ఆరాధన భావముండాలి. క్రీస్తు మరణానికి ముందు అది అవమాన సూచకమైంది. అతని మరణం తర్వాత అది గౌరవప్రదమైంది ఐంది. అది మొదట క్రీస్తుకి మహిమను చేకూర్చి పెట్టింది. తర్వాత క్రైస్తవులమైన మనకు కూడ మహిమను సంపాదించి పెడుతుంది.

## 1. క్రీస్తు సిలువ

### 1. సిలువ ఆటంకాన్ని కలిగిచేంది

"మేము సిలువ వేయబడిన క్రీస్తుని ప్రకటిస్తున్నాం. అతడు యూదులకు ఆటంకంగాను అన్యులకు అవివేకం గాను వున్నాడు" అని వ్రాసాడు పౌలు భక్తుడు - 1కొ 1,23. గ్రీకు రోమను ప్రజలకు సిలువ వేయబడినవాడు అవివేకిగా కన్పిస్తాడు అనగా వాళ్లు అలాంటివాణ్ణి గౌరవంతో చూడక చీదరించుకొంటారు. ఆలాంటివానినుండి తమకు రక్షణం లభిస్తుందని వాళ్ళు ఏమాత్రం నమ్మరు. రోమను సామ్రాజ్యంలో సిలువ మరణం బానిసలకు ఉద్దేశింపబడింది - ఫిలి -2,7. బానిస యజమానుని రక్షిస్తాడా? ఇంకా ఆ మరణం అవమానకరమైంది కూడ - హెబ్రే 12,2.

ఇక, సిలువ మరణం యూదులకు ఆటంకంగా వుండేది. వాళ్ళు మృతదేహం నుండి రక్షణం లభిస్తుందని ఎంతమాత్రం నమ్మరు. వాళ్ళ భావాల ప్రకారం మృతదేహాన్ని తాకనుగూడ తాకకూడదు. అలా తాకితే మైలపడతాం అనుకొనేవాళ్ళు. ఇంకా,

సిలువవేయబడినవాడు శాపగ్రస్తుడు అని ధర్మశాస్త్రం చెపుతుంది - ద్వితీ 21,23. క్రీస్తు అలా శాపగ్రస్తుడు ఐనవాడు. ఆలాంటివాడు తమ్ము రక్షిస్తాడని యూదులు కలలో కూడ తలంచరు. ప్రభువు సిలువపై వ్రేలాడుతుండగా చూచినవాళ్ళు అతన్ని అపహసించారు. నీవే మెస్సీయావైతే సిలువమీది నుండి దిగిరమ్మన్నారు. పేత్రు మొదలైన శిష్యులు క్రీస్తు సిలువమరణాన్ని ఏ మాత్రం అంగీకరించలేదు. "అది నీకు దూరమగునుగాక అని పేత్రు పలికాడు - మత్త 16,22. అది నిందావమానాలను సూచిస్తుందని చెప్పాంగదా! ఈలా సిలువ మరణం గ్రీకురోమనులకూ, శిష్యులకూ, యూదులకూ ఎల్లరికీ అసహ్యాకరమైంది. అలాంటి మరణం ద్వారా క్రీస్తు జనులను రక్షించడమేమిటి? ఐనా తండ్రి రక్షణ ప్రణాళికలోని గొప్పతనం ఇక్కడే వుంది.

## 2. తండ్రి నిర్ణయం, లేఖనాలు

క్రీస్తుకి సిలువ మరణం అవసరం. అది తండ్రి నిర్ణయించిన రక్షణ ప్రణాళిక. దానికి తిరుగులేదు. అందుకే క్రీస్తు అది అగత్యం అని పల్కాడు - మత్త 16,21. అగత్యం అంటే తప్పనిసరి అని అర్థం. కాని ఆ దశలో ఆ సంగతి శిష్యులకు అర్థం కాలేదు. క్రీస్తు వుత్థానమై ఆత్మ దిగివచ్చాక మాత్రమే వారికి సిలువ రహస్యం బోధపడింది. తండ్రే దాన్ని నిర్ణయించాడని అప్పుడు శిష్యులు అర్థం చేసికొన్నారు. తర్వాత శిష్యులు కూడ తమ బోధల్లో దాని అవసరాన్ని పేర్కొన్నారు. పరిశుద్ధ గ్రంథంలో ఆయన్ని గూర్చి వ్రాయబడినదంత నెరవేరిందని బోధించారు - అ.చ. 13,28. లేఖనాలు అతనియందు నెరవేరాయని ప్రకటించారు - యోహా 19,28. "క్రీస్తు శ్రమలు అనుభవించి మహిమలో ప్రవేశించడం అనివార్యం" అని వెల్లడిచేసారు - లూకా 24, 26. ఈ విధంగా క్రీస్తు సిలువను తండ్రి ముందుగానే నిర్ణయించాడు. పూర్వవేదం కూడ ఆ సంఘటనను ముందుగానే చాలసార్లు పేర్కొంది. అనగా సిలువ మరణం యాదృచ్ఛికమైంది కాదు. అది జరిగితీరాలి. అది లేకపోతే నరులకు రక్షణం లేదు.

## 3. సిలువద్వారా తండ్రి విజ్ఞానం వెల్లడియౌతుంది

గ్రీకులు, రోమనులు సిలువ మరణం పిచ్చితనం, అవివేకం అని యెంచారు. కాని పౌలు సిలువ మరణం తండ్రి విజ్ఞానాన్ని ప్రదర్శిస్తుంది అని బోధించాడు. అతని భావాలను కొంచెం విపులంగా పరిశీలిద్దాం. క్రీస్తు మన పాపాల కొరకు మరణించాడు - 1 కొ 15,3. సిలువ వేయబడిన క్రీస్తుని మాత్రమే తెలిసికోవాలని పౌలు కోరిక - 2,2. పూర్వవేదం పేర్కొన్నట్లుగా, సిలువలోనే తండ్రి రక్షణ ప్రణాళిక స్పష్టంగా వెల్లడియౌతుంది - 1,19. దానిలోనే అతని బలం గోచరిస్తుంది - 1,25. సిలువమీద

చనిపోయేవాడు శాపగ్రస్తుడు అని ధర్మశాస్త్రం వాకొంది. కాని క్రీస్తు సిలువపై మరణించి శాపగ్రస్తుడైంది తన పాపాలకొరకు కాదు, మన పాపాల కొరకు. కనుక అతన్ని విశ్వసించడానికి మనం ఏ మాత్రం సందేహించకూడదు - గల 3, 13. సిలువపై చనిపోయిన క్రీస్తు మానవదేహం దేహధారులమైన మన పాపాలకు పరిహారం చేసింది - రోమా 8, 3. క్రీస్తు సిలువ మరణంద్వారా తండ్రి మన పాపపు ఋణపత్రాన్ని రద్దుచేసాడు - కొలో 2, 14. యేసు సిలువపై చిందించిన నెత్తురు ద్వారా అతడు సర్వప్రపంచాన్ని తనతో సమాధాన పరచుకొన్నాడు - కొలో 1,20. యూదులకూ అన్యజాతివారికీ మొదటినుండి వైరం వుండేది. క్రీస్తు మరణంద్వారా ఈ వుభయజాతులకు మధ్యగల అడ్డుగోడ తొలగిపోయి శాంతి నెలకొంది. ఇప్పుడు ఆ రెండు జాతులు ఏకమై తండ్రిని చేరగల్గుతున్నాయి - ఎఫె 2, 13-18 సిలువ క్రీస్తుకి మనపట్ల గల ప్రేమను తెలియజేస్తుంది. అది మనలను నూత్న మానవులను చేస్తుంది - గల 6,15. ఈలాంటి లోతైన భావాలు పౌలు జాబుల్లో చాల వున్నాయి. క్రీస్తు సిలువ తండ్రి జ్ఞానాన్ని ప్రదర్శిస్తుందని అతడు చాలసార్లు చెప్పాడు. సిలువ ద్వారా నరులకు రక్షణం కలగాలని నిర్ణయించడమే తండ్రి జ్ఞానం.

### 4. సిలువ క్రీస్తు మహిమను సూచిస్తుంది

పౌలు భావాల ప్రకారం క్రీస్తు సిలువ అతని శ్రమలనూ, అవమానాన్నీ సూచిస్తుంది. తొలి ముగ్గురు సువిశేషకారులు సిలువ మరణం తర్వాత క్రీస్తు మహిమను పొందాడని వ్రాసారు. కాని యోహాను భావాల ప్రకారం క్రీస్తుకి సిలువ మరణంలోనే గొప్ప మహిమ కలిగింది. ఈ భావాన్ని కొంచెం విపులంగా పరిశీలిద్దాం. క్రీస్తు సిలువ మీదికి ఎత్తబడతాడు - యోహా 12, 32. ఇక్కడ ఎత్తబడ్డమంటే సిలువ మరణమే. కాని ఈ యెత్తబడ్డం అతనికి అవమానాన్ని కాక మహిమను కలిగిస్తుంది. ఇంకా, మోషే ఎడారిలో సర్పాన్ని ఎత్తినట్లుగా క్రీస్తుని సిలువ మీదికెత్తి చూపిస్తారు - 3,14. సంఖ్యా 21,9. ఈ యెత్తబడ్డం కూడ క్రీస్తుకి మహిమను తెచ్చిపెడుతుంది. యోహాను సువిశేషంలో క్రీస్తు రాజఠీవితో సిలువ దగ్గరికి నడుస్తాడు. రాజు సింహాసన మెక్కినట్లుగా అతడు సిలువ నెక్కుతాడు. సిలువపైనుండే అతడు తన ఆత్మను వదలుతాడు - 19,30. ఇక్కడ "ప్రాణము విడిచెను" అన్న మూలంలోని గ్రీకు మాటలను "ఆత్మను విడిచెను" అనికూడ అనువదించవచ్చు. సిలువమీద వుండగానే అతని ప్రక్కలోనుండి నీళ్ళు నెత్తురు స్రవించాయి - 19,34. ఈ యాత్మద్వారా, ఈ జలరక్తాల ద్వారా తిరుసభ స్థాపింపబడింది. ఈ ప్రక్రియ అంతా అతనికి మహిమనే చేకూర్చిపెడుతుంది. ఇకమీదట మనం పొడవబడిన వానివైపు చూడాలి - 19,37. అనగా మనం ఈటెతో పొడవబడిన ప్రభువుని విశ్వాసంతో

వీక్షించి అతనినుండి రక్షణాన్ని పొందాలని భావం. ఇది కూడ అతని కీర్తినే చాటుతుంది. అతని సిలువ మనకు జీవవృక్షమౌతుంది. ఈ వృక్షం కాసిన ఫలాలు మనకు ఆహారమౌతాయి కూడ - దర్శ 22, 2.14.

### 5. పూర్వవేదంలోని సూచనలు

పూర్వవేదం చాలా తావుల్లో క్రీస్తు సిలువను సూచిస్తుంది. యూదుల పాస్క సంఘటన వుంది. దాని ద్వారా వాళ్ళు ఈజిప్టునుండి వాగ్దత్త భూమికి వెళ్ళిపోయారు. అసలు పాస్క అంటేనే దాటిపోవడం అని అర్థం. క్రీస్తుకూడ తన సిలువ మరణమనే పాస్క ద్వారా ఈ లోకం నుండి తండ్రి వద్దకు సాగిపోయాడు - యోహా 13,1. శుక్రవారం సాయంత్రం క్రీస్తు సిలువమీద చనిపోతూండగా యూదులు దేవాలయంలో పాస్క గొర్రెపిల్లలను వధిస్తున్నారు. ఆ గొర్రెపిల్లలు క్రీస్తు గొర్రెపిల్లనే సూచిస్తాయి. కనుక ఆయేటి ప్రధానమైన పాస్క గొర్రెపిల్ల అతడే - 19,36. సీనాయి కొండవద్ద యూదులకూ దేవునికీ మధ్య నిబంధనం జరిగింది. ఆ నిబంధన మధ్యవర్తి మోషే - నిర్గ 24,8. నూత్నవేదంలో క్రీస్తుసొంత నెత్తురు చిందించి దేవునికి మానవునికి మధ్య నిబంధనం చేసాడు. అతడు నూత్న నిబంధన మధ్యవర్తి - మార్కు 14,24. పూర్వవేదంలో బాధామయ సేవకుడున్నాడు. అతడు తన ప్రాణాన్ని పాపపరిహారబలిగా సమర్పించి, మన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసాడు - యెష 53,10. నూత్నవేదంలో ఈ బాధామయ సేవకుడు క్రీస్తే. పూర్వవేదంలో మెస్సీయా రాజు వున్నాడు. ఇతడు దావీదు రాజ్యాన్ని పునరుద్ధరించేవాడు. నూత్నవేదంలో ఈ రాజు క్రీస్తే - యోహా 18,37. ఎడారి కాలంలో మోషే సర్పాన్ని గడెమీది కెత్తి చూపించి యూదులను పాముకాటునుండి రక్షించాడు - సంఖ్యా 21,9. నూత్నవేదంలో క్రీస్తు ఆ సర్పంలాగే పైకెత్తబడి మనలను పాపంనుండి రక్షించాడు - యోహా 3,14. 22వ కీర్తన పెక్కుబాధలు అనుభవించిన నీతిమంతునొకణ్ణి పేర్కొంటుంది. నూత్న వేదంలో ఈ నీతిమంతుడు క్రీస్తే -మత్త 27,46. ఈ విధంగా పూర్వవేదంలోని చాల వ్యక్తులు, చాల సంఘటనలు, నూత్న వేదంలోని క్రీస్తునీ అతని సిలువనూ సూచిస్తుంటారు.

## 2. క్రైస్తవుని సిలువ

### 1. గురువు సిలువ శిష్యుల సిలువకూడ

మనం కూడ గురువుపోయిన త్రోవలోనే పోవాలి. కనుకనే ప్రభువు "నన్ననుసరింప గోరేవాడు తన్ను తాను పరిత్యజించుకొని, తన సిలువను తీసికొని, నన్ను అనుసరించాలి" అని వాకొన్నాడు - మత్త 16,24. నేడు మనల నెవరూ సిలువేసి

చంపరు. కాని క్రీస్తు ఆత్మత్యాగమూ ఆత్మార్పణమూ, శ్రమలూ, మరణమూ మనలో కూడ కన్పించాలి. అప్పుడే మనం నిజమైన శిష్యులమయ్యేది. అతనిలో అక్షరాల నెరవేరిన సిలువమరణం మనలలో సాంకేతికంగా నెరవేరుతుంది. ప్రభువు కొరకు మనం బంధుమిత్రులను త్యజించాలి - 10,37. అతని కొరకు వేదహింసలు అనుభవించాలి - 23,34. ఇక్కడ అతని శ్రమలను అనుభవించేవాళ్ళు పరలోకంలో అతని మహిమను పొందుతారు - యోహా 12,26. క్రీస్తు సిలువను మోయనివాడు ప్రభువుకి యోగ్యుడుకాదు - మత్త 10,38.

## 2. సిలువ వేయబడిన జీవితం

శిష్యులది సిలువ వేయబడిన జీవితం. ఈ యంశాన్ని పౌలు చక్కగా వివరించాడు. అతని భావాల ప్రకారం, యూదులకు ధర్మశాస్త్రం వలన రక్షణం లభించింది. కాని క్రైస్తవులకు క్రీస్తుని విశ్వసించడం ద్వారా రక్షణం సిద్ధిస్తుంది. నేడు మనం శారీరక వాంఛల ప్రకారంగాక ఆత్మ ప్రబోధాల ప్రకారం జీవించాలి. రక్షణమూ జ్ఞానమూ సిలువలోనే వున్నాయి. సిలువపై మరణించిన యేసుని కన్నుల ముందట నిల్పుకొని మనం రక్షణం పొందాలి - గల 3,1. క్రీస్తుకు చెందినవాళ్ళు వ్యామోహాలతో గూడిన తమ మానవ స్వభావాన్ని సిలువవేయాలి - గల 5,24. ధర్మశాస్త్రం ఇప్పుడు మనలను రక్షించదు. పౌలు క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొంది ధర్మశాస్త్రానికి చనిపోయాడు - గల 2,19. దేవుని కొరకు జీవించాడు. క్రీస్తుతోపాటు సిలువవేయబడ్డాడు. ఇంకా అతడు ఈ లోకానికి సిలువ వేయబడ్డాడు. ఈ లోకం కూడ అతనికి సిలువ వేయబడింది. అనగా అతడు లోకవాంఛలను అణచుకొని క్రీస్తు శిష్యుడుగా జీవించాడని భావం - గల 6,14. ఇది మహావాక్యం. అతడు క్రీస్తు సిలువకు శత్రువు కాదల్చుకోలేదు. కనుక తన నమ్మకమంతా క్రీస్తునందే వుంచాడు - ఫిలి 3,18. ఇవి లోతైన భావాలు. పౌలు భావాలు మనవికూడ కావాలి. అతనిలాగే మనం కూడ ఇప్పుడు నేను కాదు, నాయందు క్రీస్తే జీవిస్తున్నాడు అని చెప్పుకోగలిగి వుండాలి - గల 2,10.

## 3. సిలువ క్రైస్తవులకు మహిమను చేకూర్చేది

మనలోని పాతమానవుడు సిలువ వేయబడాలి - రోమా 6,6. వినయవిధేయలతో సిలువ మరణానికి గూడ పాల్పడిన క్రీస్తుని మనం అనుసరించాలి - ఫిలి 2,8. ఎల్లవేళల క్రీస్తు మనకు ఆదర్శంగా వుండాలి. అతడు సిలువపై శ్రమలు అనుభవించి మనకొక దృష్టాంతాన్ని చూపాడు. అతడు మన పాపాలను మోసికొనిపోయి వాటిని సిలువకు అప్పగించాడు. దానివలన మనం పాపానికి మరణించి పుణ్యానికి జీవించాలి - 1 పేత్రు

2,21-24. మనం క్రీస్తుపట్ల విశ్వాసాన్ని కోల్పోయి ఆ ప్రభువుని మళ్ళా సిలువ వేయకూడదు - హెబ్రే 6,6. నేడు మనం క్రీస్తు సిలువలో తప్పితే మరి దేనిలోను గర్వించకూడదు - గల 6,14. మనకు కీర్తిని చేకూర్చేది సిలువ వొక్కటే.

# 4. సిలువ భక్తి

క్రీస్తు రాకపూర్వమే లోకం సిలువ ఆకృతిని వాడేది. ప్రాచీన లోకంలో గీతమీద గీతగీస్తే నాల్గు దిక్కులు అని అర్థం. స్వస్తిక సూర్యుని వెల్తురునీ, జననశక్తినీ సూచించేది. శిక్షాసాధనంగా సిలువ చాలదేశాల్లో ప్రచారంలో వుండేది.

## 1. క్రైస్తవ లోకంలో సిలువ చరిత్ర

సిలువపై క్రీస్తు శరీరాన్ని చూపించే ఆచారం ఐదో శతాబ్దంలో ప్రారంభమైంది. నాల్గవ శతాబ్దం వరకు క్రైస్తవులు వట్టి సిలువనే వాడేవాళ్ళు. ఈ వట్టి సిలువకూడ నాల్గవ శతాబ్దంలోగాని ప్రచారంలోకి రాలేదు. తొలిమూడు శతాబ్దాల్లో క్రైస్తవులు సిలువను చాల అరుదుగా వాడారు.

దీనికి రెండు కారణాలున్నాయి. మొదటిది యూదులూ గ్రీకు రోమను ప్రజలూ కూడ సిలువను ఎగతాళి చేసేవాళ్ళు. సిలువ నెక్కినవాడు శాపగ్రస్తుడని యూదుల భావం. కొరత వేయబడినవాడు వెర్రివాడని గ్రీకు రోమను ప్రజల తలంపు. అందుచే సిలువను బహిరంగంగా ప్రదర్శించడానికి తొలినాటి క్రైస్తవులు వెనుకాడారు. గాడిద తలగల మనిషి సిలువమీద వ్రేలాడుతున్నట్లుగాను, క్రింద ఒక నరుడు అతన్ని ఆరాధిస్తున్నట్లుగాను గీయబడిన చిత్రం ఒకటి ప్రాచీన రోమను భవనాల్లో కన్పించింది. "అలెక్సెమెనోస్ తనదేవుణ్ణి ఆరాధిస్తున్నాడు" అని ఆ చిత్రం క్రింద వ్రాసివుంది. ఆ గాడిద తలగల మనిషి క్రీస్తే. అలా ఆ రోజుల్లో అన్యమతాలవాళ్ళు సిలువ వేయబడిన క్రీస్తుని ఎగతాళి చేసేవాళ్ళు. కనుక ప్రాచీన క్రైస్తవులు సిలువను బహిరంగంగా చూపించేవాళ్ళు కాదు. రెండవది, తొలి మూడు శతాబ్దాల్లో వేదహింసలు వుండేవి. సిలువ చిహ్నం ద్వారా క్రైస్తవులు రోమను ప్రభుత్వానికి చిక్కిపోయేవాళ్ళు. అందుచే వాళ్ళు దాన్ని వాడ్డానికి భయపడ్డాడు.

ఇంకా, క్రీస్తుని దిగంబరుణ్ణిగానే సిలువ వేసారు. అలాంటి దిగంబర క్రీస్తుని బహిరంగంగా చూపించడానికి క్రైస్తవులు వెనుకాడారు. అందుకే క్రీస్తు రూపంగల సిలువలు ఐదవ శతాబ్దందాకా వాడుకలోకి రాలేదు. అంతకు ముందు క్రీస్తు దేహంలేని సిలువను వాడి అది జీవన దాయకమైనదని విశ్వసించేవాళ్ళు.

నాల్గవ శతాబ్దంలో రోమను చక్రవర్తి కోన్‌స్టంటయిను క్రైస్తవ మతాన్ని స్వీకరించాడు. అతడు యుద్ధానికి ముందు ఆకాశంలో సిలువను దర్శించాడు. ఆ సిలువ

అనుగ్రహంతోనే యుద్ధంలో తన శత్రువుని జయించానని నమ్మాడు. అతడు తన డాళ్ళపై సిలువ ఆకారాన్ని గూడ చెక్కించాడు. ఈ చక్రవర్తి సిలువపై చనిపోయిన క్రీస్తుపట్ల గల గౌరవభావంచే, దోషులకు విధించే సిలువశిక్షను రద్దుచేసాడు. ఆనాటినుండి సిలువ బహిరంగంగా కన్పించడం మొదలుపెట్టింది.

ఉన్నట్లుండి దిడీలున ప్రజల్లో సిలువపట్ల గౌరవాదరాలు పెరిగాయి. దీనికి కారణమిది. 326లో కోన్స్టంటయిను తల్లీ భక్తురాలూ ఐన హెలెన యెరూషలేములో క్రీస్తు సిలువను కనుగొంది. అది పవిత్రమైన మృతావశేషం ఐంది. కనుక ఆ సిలువ కొయ్యముక్కలను భక్తి భావంతో ప్రపంచం నలుమూలలకూ పంపారు. భక్తులు వాటిని ఆరాధించడం మొదలుపెట్టారు. కనుక ఐదారు శతాబ్దాల్లో సిలువ విరివిగా ప్రచారంలోకి వచ్చింది. మధ్య యుగాలదాకా ఈ రీతిగానే జరిగింది. క్రమేణ బంగారు సిలువలు రత్నాలు పొదిగిన సిలువలు వాడుకలోకి వచ్చాయి. సిలువపట్ల తొలి శతాబ్దాల్లోలేని గౌరవమూ ఆదరణా ఇప్పుడు పుట్టుకవచ్చాయి. సిలువను మోసే గొర్రెపిల్ల బొమ్మ ద్రాక్షతీగలు కలిగిన సిలువ బొమ్మ ఇంకా నానా ఆకారాల్లో కూడ సిలువలు వ్యాప్తిలోకి వచ్చాయి. సిలువ రక్షణ నిచ్చేదనీ, ఏదెను తోటలోని జీవవృక్షమనీ ఈ బొమ్మలు సూచించేవి. ఐర్లండులో దారిప్రక్కనగల పెద్ద బండలపై సిలువను చెక్కడం ప్రారంభించారు. మధ్యయుగాల్లో క్రీస్తు రూపంగల సిలువలు విరివిగా ప్రచారంలోకి వచ్చాయి. ఆ కాలంలో ప్రజలకు క్రీస్తు శ్రమలపట్ల గాఢమైన భక్తి వుండేది. ఆ రోజుల్లో యుద్ధాయుధాల మీద సిలువ ఆకృతి తప్పకుండా వుండేది.

ఇక్కడే హెలెన భక్తురాలు సిలువను కనుగొన్న ఉదంతాన్ని గూడ చెప్పాలి. నాల్గవ శతాబ్దంలో కోన్స్టంటయిను చక్రవర్తి క్రైస్తవ మతాన్ని స్వీకరించాడని చెప్పాంగదా! దానితో రోమను సామ్రాజ్యంలో క్రైస్తవులను హింసించడం మానివేసారు. ఈ చక్రవర్తి తల్లే పునీతురాలయిన హెలెన. ఈమె యెరూషలేములో యూదులనూ క్రైస్తవులనూ ప్రోగుజేయించి క్రీస్తు చనిపోయిన సిలువను వెదికించింది. కాని ఒకే స్థలంలో మూడు సిలువలు దొరికాయి. వానిలో ఒకటి క్రీస్తుదీ, మిగతావి రెండూదొంగలవీ అని నిర్ధారించారు. కాని వాటిల్లో క్రీస్తు సిలువ ఏదో గుర్తించడం ఏలా? దైవప్రేరణంపై ఆ సిలువలను ఒక మృత దేహానికి తాకించారు. ఏ సిలువవల్ల మృతుడు సజీవుడౌతాడో అది క్రీస్తు సిలువ అనుకొన్నారు. ఆ నిర్ణయం ప్రకారమే క్రీస్తు సిలువను గుర్తించారు. ఈలా గుర్తించడం 325 లో జరిగింది. తర్వాత ఈ సిలువ ముక్కలను ప్రపంచం నలుమూలలకు ఆరాధించడానికి పంపారు.

కాని నాల్గవ శతాబ్దంలోనే కొంతమంది ఇది వట్టి కట్టుకథ అని పేర్కొన్నారు. ఇప్పుడు అందరు చరిత్రకారులూ ఈ కథను నమ్మరు. ఇది భక్తిభావంతో కల్పించిన కథ

మాత్రమే అనేవాళ్ళు చాలమంది వున్నారు. పైగా పైన మనం పేర్కొన్న హెలెన కథకు కనీసం మూడు రూపాంతరాలు కూడ వున్నాయి. ఇంకా, హెలెన కాక మరెవరో పవిత్ర సిలువను కనుగొన్నారని చెప్పే కథలు కూడ వున్నాయి.

## 2. సిలువ వాడకం

క్రైస్తవ సంకేతాలన్నిటిలోను మనం ఎక్కువగా వాడేది సిలువనే. ఐదవ శతాబ్దంలోనే సిరియా దేశంలో పూజనర్పించే పీఠంపై సిలువను పెట్టేవాళ్ళు. ఆరవ శతాబ్దంలో ప్రదక్షిణాల్లో సిలువను మోసికొనిపోవడం మొదలుపెట్టారు. 8వ శతాబ్దంలో షార్లమేన్‌రాజు పాపుగారికి ప్రదక్షిణ సిలువను బహూకరించాడు. ప్రదక్షిణం ముగిసాక దాన్ని పూజనర్పించే పీఠం దగ్గర పెట్టేవాళ్లు. మధ్యయుగాల్లో దేవాలయాల గోడలపై పండ్రెండు తావుల్లో సిలువ ఆకృతులు చెక్కేవాళ్ళు. ఈ పండ్రెండు తావుల్లోను దేవళాలకు ప్రతిష్ఠ చేసేవాళ్లు. క్రమేణ దేవాలయాల మీదనేగాక ఇండ్లమీద, బళ్ళమీద ఇంకా రకరకాల కట్టడాల మీద సిలువ ఆకృతులు నిర్మించారు. సమాధుల దొడ్లలో సిలువలు నెలకొల్పారు. పూజ వస్త్రాలమీద వాటిని కుట్టించారు.

క్రమేణ పంట భూములను సిలువతో ఆశీర్వదించడం మొదలుపెట్టారు. అలాగే నూత్న భవనాలు, వాహనాలు పశువులు మొదలైనవాటిని గూడ ఆశీర్వదించారు. సిలువ ఆకృతులను గూడ సిలువ గుర్తుతో ఆశీర్వదించారు. భక్తిగలవాళ్లు తాము వాడుకొనే ప్రతిక్రొత్త వస్తువును మొదట ఆశీర్వదించిగాని వాడుకొనేవాళ్లు కాదు.

కోన్‌స్టంటయిను చక్రవర్తి ఆకాశంలో సిలువను దర్శించి యుద్ధంలో విజయాన్ని సాధించాడని చెప్పాం. అతని తర్వాత యుద్ధాల్లో సిలువ ప్రచురమైన సంకేతమైంది. సైనికుల దుస్తుల మీద ఆయుధాలమీదా సిలువ గురుతులు వుండేవి. 11-13 శతాబ్దాల మధ్యకాలంలో క్రైస్తవులు మహమ్మదీయులతో చేసిన యుద్ధాలకు "సిలువ యుద్ధాలు" అని పేరు. ఐతే ఈ కాలంలో సిలువ క్రీస్తుశ్రమల చిహ్నంగా గాక విజయ చిహ్నంగా మారిపోయింది. క్రీస్తు తన సిలువ ద్వారా మరణాన్నీ పాపాన్నీ జయించినట్లే మనం కూడ సిలువ ద్వారా శత్రువులను జయిస్తామని క్రైస్తవ ప్రభువులు భావించారు.

రానురాను సిలువభక్తి ఇంకా చాలా భక్తి మార్గాలకు దారితీసింది. పంచగాయాల భక్తి, తిరుహృదయ భక్తి, క్రీస్తు శ్రమలపట్ల భక్తి, తిరురక్తభక్తి, సిలువ మార్గం మొదలైన భక్తిమార్గాలన్నీ సిలువ నుండి పుట్టినవే. మధ్యయుగాల్లో సిలువ ధ్యానాలు కూడ విరివిగా ప్రచారం లోకి వచ్చాయి. ఇగ్నేష్యసుగారి తపోభ్యాసాల్లో భక్తుడు సిలువపై వ్రేలాడే క్రీస్తుని

స్మరించుకొంటూ ఆ ప్రభువుకి ఇంతవరకు నేను ఏమి సేవ చేసాను? ఇప్పుడు ఏమి సేవ చేస్తున్నాను? ఇకమీదట ఏమి సేవచేస్తాను అని ధ్యానించుకొనే అంశం వస్తుంది - 53.

పదహారవ శతాబ్దంలో చీలిపోయిన ప్రోటస్టెంటు శాఖలు సిలువ ఆకృతిని నిరాకరించాయి. ప్రజలు సిలువపట్ల పిచ్చి భక్తిని చూపుతున్నారని వారి అభిప్రాయం. క్రీస్తునిగాని, పునీతులనుగాని స్వరూపాల రూపంలో పూజించడానికి వాళ్ళు ఇష్టపడరు. ఈ శాఖల్లో లూతరు వర్గీయులు మాత్రం సిలువను కొంచెం ఎక్కువగా వాడుతారు. మొత్తంమీద క్యాతలిక్ సమాజంలో వుండే సిలువభక్తి ప్రోటస్టెంటు సమాజాల్లో లేదనే చెప్పాలి.

### 3. సిలువగుర్తు వేసికోవడం

భక్తులు నొసటిమీద సిలువగుర్తు వేసికోవడం రెండవ శతాబ్దంలోనే వాడుకలో వుండేది. కాని ఈ యాచారం 4వ శతాబ్దంలోనే బాగా వాడుకలోకి వచ్చింది. తర్వాత నొసటి మీదా రొమ్ముమీదా గూడ ఈ గుర్తువేసికొనే పద్ధతి అమలులోకి వచ్చింది. కొందరు దివ్య సత్ప్రసాదంతో గూడ నొసటిమీద కండ్లమీద సిలువగుర్తు వేసికొనేవాళ్ళు. పెదవుల మీద ఈ గుర్తు వేసికొనే పద్ధతి 8వ శతాబ్దంలో వచ్చింది. నొసలు, రొమ్ము, భుజాలమీద పెద్ద సిలువ గుర్తు వేసికొనే ఆచారం 10వ శతాబ్దంలో గాని వాడుకలోకి రాలేదు. మొదట నొసటమీదా రొమ్ముమీదా ఆ పిమ్మట కుడి భుజంమీద, కడపట ఎడంభుజంమీద చేతిని త్రిప్పేవాళ్ళు. తర్వాతి కాలంలో చేతిని ఎడమ భుజంమీదినుండి కుడిభుజం మీదికి త్రిప్పడం మొదలుపెట్టారు. ఇప్పటికీ ఈ పద్ధతే కొనసాగుతూంది.

సిలువ గురుతు వేసికొనేపుడు భక్తిని కలిగించుకోవడానికి కొన్ని మాటలను గూడ ఉచ్చరించేవాళ్ళు. "పిత పుత్ర పవిత్రాత్మ నామమున" అనే మాటలు అతి ప్రాచీన కాలం నుండీ వాడుకలో వున్నాయి. వీటికి బదులుగా గ్రీకు క్రైస్తవులు "ఓ పవిత్రుడవైన దేవా, ఓ పవిత్రుడువూ బలవంతుడవూ ఐన దేవా, ఓ పవిత్రుడవూ అమర్త్యుడవూ ఐన దేవా మాపై దయజూపు" అనే మాటలు వాడతారు.

ఐతే నరులను సిలువ గురుతుతో ఆశీర్వదించడంలో అర్థమేమిటి? ఇక్కడ చాల అర్థాలున్నాయి. ఆ నరులు క్రీస్తు ముద్రను స్వీకరించి ఆ యజమానునికి చెందుతారని ఒక భావం. వారు క్రీస్తుని విశ్వసిస్తున్నారని మరొక అర్థం. ప్రభువు పిశాచ శక్తినుండి మనలను కాపాడతాడని మరొక భావం. క్రీస్తు సిలువ మనలను రక్షించాలనిగాని అతని వరప్రసాదం మనలను కాపాడాలనిగాని ఇంకొక అర్థం. ఈ సిలువ గుర్తుతో నరులనూ వస్తువులనూ గూడ ఆశీర్వదించవచ్చు.

## 4. సిలువ భక్తి సమర్థనీయం

తమ రక్షణ సాధనమైన సిలువపట్ల క్రైస్తవులు భక్తిప్రపత్తులు చూపడంలో ఆశ్చర్యంలేదు. పౌలు జాబుల్లోనే సిలువభక్తి అక్కడక్కడ తగులుతుంది - గల 6,14 కోలో 1,20. క్రీస్తు సిలువ శ్రమలను సూచించేదే. కాని అతడు ఈ సిలువ ద్వారానే పాపాన్నీ మృత్యువునీ జయించాడు. విజయాన్ని సాధించాడు. కనుక అది నేడు మన జీవితంలో కూడ శ్రమలను సూచించినా, ప్రధానంగా రక్షణాన్నీ జీవాన్నీ సూచిస్తుంది. అది నేడు మనకు మహిమను పొందిన క్రీస్తురాజు జెండా. విజయ సంకేతనం. అతని వుత్థానాన్ని జ్ఞప్తికి తెచ్చేఏది. లోకాంతంలో ప్రభువు న్యాయాధిపతిగా విచ్చేసినపుడు సిలువతోనే వస్తాడు.

తొలిరోజుల్లోనే క్రైస్తవులు భక్తిభావంతో తమ యిండ్లమీదా తాము వాడుకొనే వస్తువుల మీదా సిలువ ఆకృతులు నిల్పుకొన్నారు. క్రీస్తు వాడిన సిలువను కనుగొన్నాక సిలువ భక్తి బాగా వ్యాప్తిలోకి వచ్చింది. సిలువ భాగాలను పవిత్ర అవశేషాలుగా భావించి ప్రపంచం నలుమూలలకు పంపించారు. చాలమంది పవిత్ర సిలువను ఆరాధించడానికి యెరుషలేము యాత్ర చేసారు.

క్రీస్తు స్వరూపాలనూ సిలువనూ పునీతుల స్వరూపాలనూ పూజించాలని నైసీయా మహాసభ 787లో ఆజ్ఞాపించింది. స్వరూపాలను పూజించినపుడు ఆ పూజ అవి సూచించే వ్యక్తులకే చెల్లుతుందని స్పష్టం చేసింది. సిలువకు "ఆరాధన" చెల్లుతుందని వేదశాస్త్రులు వివరించారు. పెద్ద శుక్రవారం మనం సిలువ ముందు మోకరిల్లుతాం. సిలువను ముద్దుపెట్టుకొని ఆరాధిస్తాం. ఆ దినం మనం సిలువను క్రీస్తు శ్రమల చిహ్నంగా మాత్రమే గాక అతని విజయ చిహ్నంగా గూడ భావిస్తాం. ఈలా దైవార్చనలో సిలువపట్ల గౌరవాన్నీ ఆరాధన భావననూ ప్రదర్శించే సందర్భాలు చాలా వున్నాయి.

325 నుండి తిరుసభలో సిలువ వుత్సవాన్ని జరుపుతున్నారు. మొదట ఈ పండుగ యెరుషలేములో పవిత్ర సిలువను కనుగొన్న సంఘటనను ఆధారంగా జేసికొని పుట్టింది. నేడు ఈ పండుగను సెప్టెంబరు 14న క్రైస్తవ ప్రపంచమంతటా జరుపుతున్నారు. దీనికి పవిత్ర సిలువ విజయోత్సవం అని పేరు. మన రక్షణచిహ్నాన్ని అర్థం జేసికోవడానికి గౌరవించడానికి ఈ వుత్సవం బాగా వుపయోపగడుతుంది.

నేడు క్రైస్తవులమైన మనకు సిలువ పట్ల అపార గౌరవమూ భక్తీ వుండాలి. దాన్ని అన్యమతస్థుల యెదుట బహిరంగంగా ప్రదర్శించడానికి ఏ మాత్రం సిగ్గుపడ కూడదు. రాత్రి పండుకోవడానికి ముందూ, ఉదయం నిద్రలేచాక, భోజనానికి ముందూ వెనుక సిలువ గురుతు వేసికోవడం మంచిది. కొందరు మెడలో సిలువను ధరిస్తారు. ఇది కూడ యోగ్యమైన అలవాటే. మనం దీర్ఘకాలం పనిజేసుకొనే తావులో కూడ సిలువ

ఆకృతి వుండాలి. పిశాచ శక్తిని పారదోలడానికి సిలువ బాగా వుపయోగపడుతుంది. క్రీస్తు శ్రమల సాధనమూ, విజయ చిహ్నమూ ఐన సిలువను భక్తిభావంతో ధ్యానించుకోవాలి. మన పిల్లలకు సిలువ పేరు పెట్టడం కూడ ఉచితమే.

## ప్రార్థనా భావాలు

1. క్రీస్తు సిలువ అతని శ్రమలనూ విజయాన్నీ కూడ సూచిస్తుంది. నేడు మనం సిలువను ఈ రెండర్థాల్లోను గ్రహించాలి.
2. నేను క్రీస్తుతోపాటు సిలువ వేయబడ్డాను అని చెప్పుకొన్నాడు పౌలు భక్తుడు. కొలదిగానైనా సిలువను మోయందే క్రీస్తు శిష్యులం కాలేము. అసలు మనం సిలువను తప్పించుకోవాలన్నా తప్పించుకోలేం. కనుక మన పాలబడిన సిలువను మనం అంగీకరించడం మంచిది.
3. మోషే గడెమీదికి ఎత్తి చూపిన పాములాగే క్రీస్తు కూడ సిలువమీదికి ఎత్తబడినవాడు. సిలువ వేయబడిన ప్రభువుని విశ్వాసంతో వీక్షించి మనం రక్షణం పొందాలి.
4. క్రైస్తవ జీవిత సారమంతా "సిలువ" అనే మూడక్షరాల చిన్న మాటలో ఇమిడి వుంది. మన భక్తి మార్గాల్లో సిలువకు కూడ ప్రముఖస్థానం వుండాలి.
5. క్రీస్తు మొదట శ్రమలు అనుభవించి తర్వాత మహిమలో ప్రవేశించడం అనివార్యం. సిలువ లేకుండానే మనలను రక్షించేమార్గం వుంటే ప్రభువు తప్పకుండ ఆ మార్గాన్నే ఎన్నుకొనేవాడు. ఇప్పుడు గురువు పోయిన మార్గంలోనే శిష్యుడు కూడ పోవాలి.
6. పూర్వం పిశాచం ఒక చెట్టెక్కి నరుణ్ణి ఓడించింది. క్రీస్తు మరొక చెట్టెక్కి పిశాచాన్ని ఓడించాడు. ఈ జీవవృక్షాన్ని మనం పలుసార్లు భక్తిభావంతో మననం చేసికోవాలి.
7. క్రీస్తు సిలువ ద్వారా రక్షణం పొందివుండకపోతే మనం పుట్టివుండి కూడ ప్రయోజనంలేదు. ఆదాము పాపంవల్ల మనం శాశ్వతంగా దేవునికి దూరమయ్యేవాళ్ళమే.
8. పౌలు చెప్పినట్లుగా క్రైస్తవుడు ఈ లోకానికీ, ఈ లోకం క్రైస్తవునికి సిలువ వేయబడాలి. లోక వ్యామోహాలతో జీవించేవాళ్ళు దేవునికి ప్రీతి కలిగించలేరు. ఇద్దరు యజమానుల సేవ పనికిరాదు.
9. కొన్ని పర్యాయాలు క్రీస్తు సిలువ మనమీద భారంగా వాలుతుంది. బాధలూ వ్యధలూ మనలను క్రుంగదీస్తాయి. కాని ఈ సిలువవల్ల గురువుని పోలిన శిష్యులమై పునీతులమౌతాం. కనుక శ్రమల్లో దేవునిమీద మొరపడకూడదు.
10. క్రైస్తవులమైన మనం ఈ దేశంలో అల్పసంఖ్యాకులం. ఐనా అన్యమతస్థులముందు మన రక్షణ సాధనమైన సిలువను ప్రదర్శించడానికి ఏమీ సిగ్గుపడకూడదు. ఈ లోకంలో మనం క్రీస్తుని అంగీకరించకపోతే పరలోకంలో అతడు మనల నేలా అంగీకరిస్తాడు?
11. మన బాలబాలికలకు సిలువపేరు పెట్టాలి.

# 7. ఉత్థాన క్రీస్తు దర్శనాలు

బైబులు భాష్యం - 132

## విషయసూచిక



యోహాను 20-21 అధ్యాయాలు క్రీస్తు వుత్థానాన్నీ అతడు శిష్యుల కిచ్చిన దర్శనాలనూ వర్ణిస్తాయి. ఈ భాగంలో మొత్తం 7 సంఘటనలు వున్నాయి. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

## 1. ఖాళీ సమాధి వుదంతం 20,1-10

తొలి రోజుల్లో క్రీస్తు వుత్థానాన్ని గూర్చి క్రైస్తవులకూ యూదులకూ వాదోపవాదాలు జరుగుతుండేవి. యూదులు క్రీస్తు వుత్థానం కాలేదు అతని శిష్యులే వచ్చి దొంగతనంగా అతని దేహాన్ని ఎత్తుకొని పోయారు అని వాదించేవాళ్ళు. ఆ సందర్భంలో క్రైస్తవులు ఖాళీ సమాధికి గొప్ప ప్రాముఖ్యమిచ్చారు. అది క్రీస్తు వుత్థానానికి సాక్ష్యం పలుకుతుంది అన్నారు.

ఆదివారం వేకువున మరియ మగ్దలీన క్రీస్తు సమాధి దగ్గరికి వెళ్ళింది. చనిపోయిన వారికొరకు సమాధి దగ్గర విలపించడం యూదుల ఆచారం - యోహాను 11,31. ఇక్కడ మగ్దలీన కూడ భక్తిభావంతో విలపించడానికే సమాధి దగ్గరికి వచ్చింది అనుకోవాలి. ఆమె సమాధి తెరువబడి వుండడం చూచి పేత్రు యోహానుల వద్దకుపోయి ఆ సంగతి తెలియజేసింది. ఆ యిద్దరు శిష్యులు వెంటనే సమాధి దగ్గరికి పరుగెత్తారు. యోహాను వేగంగా పరుగెత్తి ముందుగా సమాధిని చేరుకొన్నాడు. అతని హృదయంలో క్రీస్తుపట్ల అధిక ప్రేమ వుంది. కనుకనే అధికవేగంతో పరుగెత్తగలిగాడు. ఐనా పేత్రు పట్లగల గౌరవంచే అతడు ముందుగా సమాధిలోకి పోలేదు. పేత్రుని ముందు పోనిచ్చి తర్వాత తాను పోయాడు. అక్కడ వారికి క్రీస్తు శరీరానికి చుట్టివుంచిన నారబట్టలు కన్పించాయి. అతని తలకు చుట్టిన వస్త్రం మడిచిపెట్టబడి ఒక ప్రక్కన వుంది. వాటి భావం ఏమిటి?

క్రీస్తు శరీరానికి చుట్టిన బట్టలు సమాధిలోనే వున్నాయి. అనగా యూదులు వాదించినట్లుగా దొంగలు అతని శవాన్ని ఎత్తుకొనిపోలేదు. ఎత్తుకొని పోయినట్లయితే శవవస్త్రాన్ని విప్పి అక్కడ వదలివేయరు. దానితోపాటే శవాన్ని ఎత్తుకొని పోయేవాళ్ళు. ఇంకా, దొంగలు శిరో వస్త్రాన్ని మడిచి ప్రక్కనపెట్టరు. వాళ్ళు గబగబా వెళ్ళిపోతారు కదా! కనుక క్రీస్తుదేహాన్ని దొంగలు ఎత్తుకొని పోలేదు అనుకోవాలి. ఐనా ప్రేతం సమాధిలో కన్పించడం లేదు. అది యేమైందో పేత్రుకి అంతుపట్టలేదు.

ఈ సందర్భంలో ఇంకా లోతైన భావంకూడ వుంది. క్రీస్తు తన వస్త్రాలను వదలివేసాడు. ఇకమీదట అతనికి వాటితో అవసరంలేదు. ఇక అతడు శారీరక జీవితంగాక ఆధ్యాత్మిక జీవితం గడుపుతాడు. మరణంనుండి లేవనెత్తబడిన క్రీస్తు మరల మరణించడు – రోమా 6, 9. దీనికి భిన్నంగా లాజరు చావునుండి లేచినపుడు ప్రేతవస్త్రంతోనే లేచాడు. ఇది అతడు మరల జీవించి చనిపోతాడు అనడానికి గురుతు – యోహా 11,44.

పేత్రూ యోహాను ఇద్దరూ ప్రేతవస్త్రాలను చూచారు. పేత్రుకి క్రీస్తు ఏమయ్యాడో అర్థం కాలేదు. యోహాను మాత్రం అతడు వుత్థానమయ్యాడని గ్రహించి విశ్వసించాడు– 8. ప్రభువుపట్ల అతని ప్రేమ గొప్పది. కనుక అతడు ప్రభువు ఉత్థానాన్ని గ్రహింపగలిగాడు. క్రీస్తుని ప్రేమించేవాళ్ళు వేదశాస్త్రులకంటెగూడ అధికంగా అతన్ని అర్థం జేసికొంటారు. భగవంతుని దగ్గరికి వెళ్ళినపుడు మన హృదయంలోని ప్రేమ అన్నిటికంటె ముఖ్యమైంది. దైవప్రేమ కలవాళ్ళు అతన్ని త్వరగా అర్థం జేసికొని అనుభవానికి తెచ్చుకొంటారు.

తర్వాత తోమా క్రీస్తు వుత్థానాన్ని శంకిస్తాడు. అతన్ని కంటితో చూస్తేనేగాని విశ్వసించను అంటాడు. కాని తోమాతో పోలిస్తే యోహాను గొప్ప విశ్వాసి. అతడు సమాధిలోని బట్టలను చూచే క్రీస్తు వుత్థానమయ్యాడని నమ్మాడు. నేడు మనలో విశ్వాసంగల క్రైస్తవులు ఎంతమంది?

శిష్యులూ మరియ మగ్దలీనా క్రీస్తు వుత్థానాన్ని గుర్తించడానికి ఖాళీ సమాధి కారణమైంది. ఈ నాల్గవ సువిశేషాన్ని వ్రాసేటప్పటికీ క్రీస్తు సమాధి యాత్రాస్థలం కూడ ఐయుంటుంది. అయినా శిష్యులు వుత్థానాన్ని విశ్వసించింది ఖాళీ సమాధిని బట్టిగాదు, క్రీస్తు దర్శనాలనుబట్టి. నేడు మన హృదయాల్లో ఉత్థాన క్రీస్తుపట్ల విశ్వాసం పుట్టించేది పవిత్రాత్మే.

## 2. మరియ మగ్దలీనకు దర్శనం 20, 11-18

ఇది పరమభక్తి భావాన్ని సూచించే దర్శనం. ఇంకా యిది శిష్యులు క్రీస్తుని గుర్తుపట్టేదర్శనం కూడ. ఈలాంటి దర్శనాలు దీర్ఘకాలం కొనసాగుతాయి. ఎమ్మావు శిష్యుల దర్శనం కూడ ఈలాంటిదే – లూకా 24.

పేత్రు యోహానులు తిరిగిపోయాక మరియ భక్తిభావంతో సమాధి దగ్గరే వుండిపోయింది. ఆమెకు మొదట దేవదూతలూ తర్వాత క్రీస్తూ కన్పించారు. కాని ఆమె క్రీస్తుని గుర్తుపట్టలేకపోయింది. అతడు తోటమాలి యేమో అనుకొంది. ఎందుకు? క్రీస్తు పూర్వపు క్రీస్తే అయినా వుత్థానం తర్వాత అతనిరూపం మారింది-1 కొ 15,42-44. కడకు మరియ క్రీస్తు స్వరం విని అతన్ని గుర్తుపట్టింది. ప్రభువు ఆమెను "మరియా" అని పిల్చాడు - 16. పూర్వం యేసు చాలసార్లు ఆమెను ఆలాగే ఆప్యాయంగా పేరెత్తి పిల్చివుంటాడు. ఆ అనుభవం వల్లనే ఆమె యిప్పుడు క్రీస్తు స్వరంలో అతన్ని గుర్తుపట్ట కలిగింది. భక్తులకు భగవంతునిపట్ల గాఢానుభవం వుంటుంది. ఆ అనుభవం తమ జీవితంలోని కొన్ని సంఘటనలను పురస్కరించుకొని గూడ వుంటుంది. ఈ పట్టున ఇంకో విషయాన్ని గూడ గమనించాలి. మరియ తోటమాలితో నీవు క్రీస్తుదేహాన్ని చూపిస్తే నేనుదాన్ని ఎత్తుకొనిపోతాను అంది-15. ఓ ఆడకూతురు మృతదేహాన్ని మోసికొని పోవడమా? ప్రేమ భారాన్ని లెక్కజేయదు కదా!

మగ్దలీన భక్తిభావంతో ప్రభువు పాదాలకు పెనవేసి కొంది. ఆ యడుగులను దీర్ఘకాలం గట్టిగా పట్టుకొని ఉండిపోవాలి అనుకొంది. కనుక ప్రభువు ఆమెతో నీవు నన్ను పట్టుకొని వుండిపోవద్దు అన్నాడు - 17. ఇక్కడ భావం ఇది. క్రీస్తు ఇక్కడ తాత్కాలికంగా మరియకు దర్శనమిచ్చాడు. మరియ ఈ తాత్కాలికమైన దివ్యసాన్నిధ్యాన్ని భద్రంగా నిలబెట్టుకోవాలనుకొంది. కనుకనే అతని పాదాలను వదలలేదు. కాని ఆత్మ దిగివచ్చాక క్రీస్తుశిష్యులకు తన శాశ్వత సాన్నిధ్యాన్ని దయచేస్తాడు. పవిత్రాత్మ ద్వారా అతడు శిష్యులకు నిరంతరం ప్రత్యక్షమై వుంటాడు. ప్రభువు మరియను ఈ రెండవ సాన్నిధ్యానికి సిద్ధంజేయగోరాడు. కనుక ఆమెతో "ఇక నన్ను వదలు. నేను నా తండ్రి దగ్గరికి ఆరోహణం చేయాలి. ఆ యారోహణం ద్వారానే ఆత్మను మీ మీదికి పంపాలి. ఆ యాత్మ సహాయంతో నేను శాశ్వతంగా మీతో నెలకొని వుండాలి. నీవు శిష్యుల వద్దకు పోయి వారికి ఈ సంగతిని తెలియజేయి" అని చెప్పాడు. ఇక్కడ శిష్యులు క్రీస్తుకి సోదరులు. యావే ప్రభువు వారందరికి తండ్రి, దేవుడు. అనగా క్రీస్తు శిష్యులను తనతో కలుపుకొన్నాడేగాని తననుండి వేరుచేయలేదు. వాళ్ళంటే అతనికి అంత ప్రేమ.

ఎమ్మావు శిష్యులకథలో శిష్యులు రొట్టె విరుస్తుండగా క్రీస్తుని గుర్తుపట్టారు. ఇక్కడ మరియ క్రీస్తు వాక్యంలో (పిలుపులో) అతన్ని గుర్తుపట్టింది. దివ్య సత్ప్రసాదమూ బైబులు వాక్యమూ రెండూ మనం క్రీస్తుని కలసికొనే ప్రధాన సాధనాలు.

మరియ క్రీస్తు తన్ను పేరెత్తి పిలవడంతో అతన్ని గుర్తించింది అన్నాం - 16. ఇది గొప్ప భక్తి భావం. ప్రభువు తన గొర్రెలను (భక్తులను) పేరుపేరున పిలుస్తాడు -

10,3. అతనికి తన గొర్రెలు (భక్తులు) తెలుసు. ఆ గొర్రెలకు అతడు తెలుసు -10, 14-15. యేసుకు మనం తప్పకుండా తెలుసు. కాని అతడు మనకు తెలుసా? ఎంత వరకు తెలుసు? మనకు అతనిపట్లవున్న ప్రేమభావ మెంత? మగ్దలీనలాగ మనంకూడ ఆ ప్రభువుపట్ల అపార భక్తినీ ప్రేమనూ పెంపొందించుకొనే భాగ్యం కొరకు వేడుకొందాం.

శిష్యులు క్రీస్తుకి సహోదరులు. దేవుడు అతనితండ్రి, వారి తండ్రికూడ -20,17. ఉత్థాన క్రీస్తుద్వారా శిష్యులు దేవునికి ప్రీతి కలిగించే బిడ్డలౌతారు. ఆత్మ వారి దైవపుత్రత్వాన్ని బలపరుస్తుంది. ఆ శిష్యుల్లాగా నేడు మనం కూడ క్రీస్తుకి సోదరులం, దేవునికి బిడ్డలం. ఈ భాగ్యానికి మనమెంతో సంతసించాలి.

## 3. శిష్యులకు దర్శనం 20, 19-23

ఈ భాగంలో నాల్గుఅంశాలున్నాయి. వీటిని క్రమంగా పరిశీలిద్దాం.

### 1. శాంతి

శిష్యులు యూదులకు భయపడి తలుపులు మూసిన గదిలో వున్నారు. వారి భయాన్ని పోగొట్టడానికే క్రీస్తు వారికి దర్శనమిచ్చింది. అతడు వారితో మీకు శాంతి కలగాలి అన్నాడు. ఏమి శాంతి? ఇది అభయవాక్యం. ఈ శాంతి ప్రధానంగా క్రీస్తు తన మరణంద్వారా సాధించిన పాపపరిహారమే. ఇంకా యీ శాంతి ఆత్మ ప్రదానాన్నీ, ఆ యాత్మద్వారా ఉత్థాన క్రీస్తు శిష్యులతో నెలకొని వుండడాన్నీకూడ సూచిస్తుంది. ప్రభువు శిష్యులకు తన చేతులనూ ప్రక్కనూ చూపించాడు. ఎందుకు? ఆ శరీర భాగాల్లో సిలువ గుర్తులున్నాయి. కనుక సిలువవేయబడిన క్రీస్తు, ఇప్పుడు వుత్థానమై దర్శనమిస్తున్న క్రీస్తు ఒక్కడేననిభావం. శిష్యులు తమకు కన్పించే క్రీస్తుని సందేహింపనక్కరలేదని తాత్పర్యం.

### 2. శిష్యుల వేదబోధ

క్రీస్తు శిష్యులతో తండ్రి నన్ను పంపినట్లే నేనూ మిమ్ములను పంపుతున్నాను అన్నాడు-21. ఇది గొప్ప వాక్యం. నాల్గవ సువిశేషంలో ప్రభువు శిష్యులను పంపడం అనే అంశం ఈ సందర్భంలో మాత్రమే వస్తుంది. తండ్రి క్రీస్తుని పంపడం, క్రీస్తు శిష్యులను పంపడానికి మాదిరి, ఆధారమూ కూడ. శిష్యులు క్రీస్తు రక్షణోద్యమాన్ని కొనసాగిస్తారు. ఆ వుద్యమంలో క్రీస్తు వారితో వుండి వారి కార్యాన్ని విజయవంతం చేస్తాడు. తండ్రి తనతో వుండి తన్ను బలపరచినట్లే, తానూ శిష్యులతో వుండి వారిని బలపరుస్తాడు. వాళ్ళ పనిని తన పనిగా భావిస్తాడు. క్రీస్తు లోకానికి తండ్రిని చూపించినట్లే ఇకమీదట శిష్యులు క్రీస్తుని చూపిస్తారు.

## 3. ఆత్మ ప్రదానం

ప్రభువు శిష్యుల మీదికి ఆత్మను వూదాదు -22. క్రీస్తు ఆత్మతో జ్ఞానస్నానం ఇచ్చేవాడు. అనగా ఆత్మను దయచేసేవాడు-1,33. ఈ యాత్మశక్తితోగాని శిష్యులు క్రీస్తు ప్రేషిత సేవను కొనసాగించలేరు. ఈ యాత్మ క్రీస్తుకి సాక్ష్యం పలికే ఆత్మ -15,26-27. ఇప్పుడు ఈ యాత్మ బలంతోనే శిష్యులుగూడ ప్రభువుకి సాక్ష్యం పలకాలి. ఈ యాత్మను లోకం ఎరుగదు, పొందలేదు - 14,17. కాని శిష్యులు ఇప్పుడు తాము పొందిన ఆత్మను లోకానికి తెలియజేస్తారు. ఇంకా ఈ యాత్మ జీవమిచ్చే ఆత్మ -3,6. ఈ యాత్మ నుండి పొందిన జీవాన్నే శిష్యులు ఇతరులకు ప్రసాదించేది. ఆత్మ యిక క్రీస్తు స్థానాన్ని పొందుతుంది. క్రీస్తుకి బదులుగా తాను శిష్యులకు ఆదరణ కర్త ఔతుంది - 14,16. ఐనా ఆత్మ క్రీస్తుని వదలివేయదు. అతన్ని వారికి ప్రత్యక్షం చేస్తూంటుంది.

సృష్ట్యాదిలో దేవుడు నరునిలోనికి తన శ్వాసను ఊదాడు- ఆది 2,7. అది ప్రాత సృష్టి. ఇప్పుడు శిష్యుల ప్రేషిత సేవద్వారా నూత్న సృష్టి ప్రారంభం కాబోతుంది. ఈ నూత్న సృష్టి ఆరంభంలోకూడ దేవుని ఆత్మ శిష్యుల మీదికి దిగివచ్చి వారిని చైతన్యవంతులను చేస్తుంది. ఇక్కడ ఆత్మ దిగిరావడాన్ని శిష్యుల జ్ఞానస్నానంగా భావించాలి. ఉత్థాన క్రీస్తుకీ శిష్యులకూ గల వ్యక్తిగత సంబంధం ఈ వాక్యంలో కొండ శిఖరాన్ని అందుకొంది -22.

అపోస్తలుల చర్యలు 2లో లూకా ఆత్మ ఆగమనాన్ని ఒక పద్ధతిలో వర్ణించాడు. ఇక్కడ యోహాను ఇంకో పద్ధతిలో వర్ణించాడు. బైబుల్లో భిన్న సంప్రదాయాలు వున్నాయి.

## 4. పాపపరిహారం

ప్రభువు శిష్యుల మీదికి ఆత్మను వూది వారికి పాపాలను పరిహరించే శక్తి నిచ్చాడు - 23. మొదట క్రీస్తుకే పాపాలను పరిహారించే శక్తివుంది -1,29. అతడిప్పుడు శిష్యులకు ఆత్మనిచ్చాడు కదా! ఆయాత్మ సహాయంతో తానే శిష్యుల ద్వారా నరుల పాపాలను మన్నిస్తాడు. నరులు రెండు వర్గాలు ఔతారు. క్రీస్తుని విశ్వసించి అతనినుండి పాపపరిహారం పొందేవాళ్ళు ఒక వర్గం. అతన్ని విశ్వసింపక అతనినుండి పరిహారాన్ని పొందనివాళ్ళు ఇంకో వర్గం. అనగా పాపపరిహారానికి హృదయాన్ని సిద్ధంజేసికొనేవాళ్ళు ఆ వరాన్ని పొందుతారు. ఆలా సిద్ధంజేసికోనివాళ్ళు ఆ వరాన్ని పొందలేరు.

కాని ప్రోటస్టెంటులు ఈ వాక్యానికి భిన్నమైన అర్థం చెప్తారు. శిష్యులు నరులకు క్రీస్తు పేరిట పాపపరిహారాన్ని బోధించి అతన్ని విశ్వసించినవాళ్ళకు జ్ఞానస్నానం ఈయాలని

ఈ వాక్యం భావం అని చెప్తారు. ఈ భావాన్ని క్యాతలిక్ సమాజం అంగీకరించదు. క్రీస్తు తన అనుచరులకు పాపపరిహార శక్తిని దయచేసాడు. కాని అనుచరులు ఈ శక్తిని ఎట్లా వినియోగించుకోవాలో క్రీస్తు చెప్పలేదు. కనుక నేడు దీన్ని వినియోగించుకొనే విధానంలో పై యిరుశాఖల వారికీ భేదాభిప్రాయాలున్నాయి.

తండ్రి తన్ను పంపినట్లే క్రీస్తు తన అనుచరులను దైవరాజ్యాన్ని వ్యాప్తి చేయడానికి పంపుతున్నాడు. కనుక వేద బోధకులకు తమపనిలో నమ్మకముండాలి. తాము క్రీస్తు ఉద్యమాన్నే కొనసాగిస్తున్నామనీ, తమతో వుండి ప్రభువే రక్షణ ఉద్యమాన్ని నడిపించుకొనిపోతున్నాడనీ నమ్మాలి. వాళ్లు తమపనిని తాము దీక్షతోను ఉత్సాహంతోను చేయాలి.

ఇంకా బోధకులు ప్రత్యేకంగా ఆత్మశక్తిని పొందినవాళ్లు. వాళ్ల పరిచర్యద్వారా ఆత్మ నరులను క్రీస్తు దగ్గరకి రాబడుతుంది. ప్రజలకు క్రీస్తుపట్ల ప్రీతీ విశ్వాసమూ పుట్టిస్తుంది. నేడు మనద్వారా వేదబోధచేసేది పవిత్రాత్మే. మనం ఆ యాత్మను నమ్మి అతన్ని హృదయంలో నిల్పుకోవాలి. అతని చేతుల్లో సాధనమాత్రులంగా తయారుకావాలి.

## 4. తోమాకు దర్శనం 20, 24-29

పై మూడు సంఘటనల్లోని దర్శనాలు క్రీస్తుకీ అతని సమకాలికులకూ సంబంధించినవి. ఈ నాల్గవ సంఘటనం క్రీస్తుకూ భావికాలంలో రాబోయే విశ్వాసులకూ సంబంధించింది. మనంకూడ ఈ రాబోయే విశ్వాసుల్లో వున్నాం. కనుక తోమాకథ మనకు ప్రత్యేకంగా ఆసక్తిని పుట్టించాలి.

మరియ మగ్దలీన ఉత్థాన క్రీస్తుకి అతిగా అంటిపెట్టుకొని వుంది. క్రీస్తు ఆమెలోని ఆ పొరపాటుని సవరించాడు. ఇక్కడ తోమా ప్రభువు ఇతర శిష్యులకు దయచేసిన దివ్య శ్రుతిని నమ్మక మొండితనంతో వున్నాడు. యేసు అతనిలోని యీలోపాన్ని సవరించాడు.

ఈ భాగంలో 27-28 వచనాలు ముఖ్యమైనవి. 27లో క్రీస్తు తోమాను ఆహ్వానించాడు. 28లో తోమా క్రీస్తుని విశ్వసించాడు. 29లో క్రీస్తు భావివిశ్వాసులందరికీ ధన్యతను ప్రకటించాడు.

తోమా ఇతర శిష్యులు అందించిన సమాచారాన్ని, అనగా క్రీస్తు ఉత్థానాన్ని ఎందుకు విశ్వసించలేదు? యూదులు ఉత్థానం ఎప్పుడో లోకాంతంలో జరుగుతుంది అనుకొన్నారు. కనుక క్రీస్తు ఇప్పుడు ఉత్థానంకావడమేమిటని తోమా అనుమానపడ్డాడు. అలా ఉత్థానమయ్యాడు అని చెప్పబడేవాణ్ణి నేను కన్నులార చూస్తేనేగాని నమ్మను అని

అతని మనోభావం. ఆనాడు అధిక సంఖ్యాకులైన యూదులు ఈలాగే భావించేవాళ్లు. తర్వాత తోమా ప్రభువుని కన్నులారచూచి అతన్ని విశ్వసించాడు.

క్రీస్తుని దర్శించిన తోమా "నా ప్రభువా నాదేవా" అన్నాడు - 28. ఇవి పూర్వవేదం యావేకు వాడిన మాటలు - కీర్త 35, 23. అనగా ఉత్థానక్రీస్తు పూర్వ వేదంలోని యావేకు సరిసమానమని భావం. నాల్గవ సువిశేషంలో క్రీస్తు దైవత్వాన్ని సూచించే పట్టులన్నిటిలోను ఇది శిఖరంలాంటిది. ప్రభువు పూర్వమే శిష్యులతో "మీరు నన్ను పైకెత్తినపుడు నేను ఆయననని గ్రహిస్తారు" అని పల్కాడు -8,25. ఆ పలుకు ఇప్పుడు అక్షరాల నెరవేరింది. క్రీస్తు యావేకు సరిసమానుడయ్యాడు. ఐతే "నా ప్రభువా నాదేవా" అన్నమాటలు తోమా స్వయంగా పలికాడా? ఇవి తోమా స్వయంగా పలికిన మాటలు కావనీ, తొలినాటి క్రైస్తవులు తమ ఆరాధనలో ఈ పదాలు వాడేవాళ్ళనీ, వాటినే సువిశేషరచయిత తోమా పల్కినట్లుగా వ్రాసాడనీ బైబులు పండితుల అభిప్రాయం. ఏది యేమైనా ఈ పల్కులు తొలినాటి క్రైస్తవులకు క్రీస్తు పట్ల వున్న భక్తివిశ్వాసులకు అద్దంపడతాయి అనాలి.

యోహాను సువిశేషం ప్రజలకు క్రీస్తుపట్ల విశ్వాసం పుట్టించడానికి వ్రాయబడింది - 20,31. తోమా కథ ఈ విశ్వాసానికి చక్కని నిదర్శనం. ఇక్కడ మూడు రకాల విశ్వాసాలు వున్నాయి. 25వ వచనం యూదుల విశ్వాసాన్ని పేర్కొంటుంది. యూదులు ప్రతిదానికి మేము కంటితో చూస్తేనేకాని నమ్మం అనేవాళ్లు. వాళ్లు క్రీస్తు పట్లగూడ ఈలాగే ప్రవర్తించారు -2, 23-25. ఇక్కడ అపనమ్మకం ముఖ్యాంశం. ఇది పరిపూర్ణమైన విశ్వాసంకాదు. క్రీస్తు ఈలాంటి విశ్వాసాన్ని మెచ్చుకోలేదు. ఇక 26-28 వచనాలు శిష్యుల విశ్వాసాన్ని పేర్కొంటాయి. చూచి విశ్వసించడం ఇక్కడ ముఖ్యాంశం. "నీవు విశ్వసించింది నన్ను చూడ్డం వలనకదా" అన్నాడు ప్రభువు. ఈ విశ్వాసం మంచిదే. అద్భుతాన్ని చూచి దానిలో దేవుని హస్తాన్ని దర్శిస్తాం. క్రీస్తు సమకాలికులు క్రీస్తు అద్భుతాలను చూచి అతని దైవత్వాన్ని నమ్మారు. శిష్యులు ఆనాడు క్రీస్తుని విశ్వసించివుండకపోతే నేడు మనం కూడ అతన్ని నమ్మలేం. క్రీస్తు ఈ రకం విశ్వాసాన్ని నిందించలేదు. ఐనా యిది శ్రేష్ఠమైన విశ్వాసంకాదు. కడన, 29వ వచనం క్రైస్తవుల విశ్వసాన్ని పేర్కొంటుంది. ఇక్కడ చూడకుండానే విశ్వసించడం ముఖ్యాంశం. శిష్యులు ఉత్థాన క్రీస్తుని చూచి నమ్మారు. కాని యిప్పుడు మనం అతన్ని కంటితో చూడకుండానే నమ్మాలి. ఇది శ్రేష్ఠమైన విశ్వాసం. క్రీస్తు దీన్ని ప్రశంసించాడు.

ఆగస్టీను భక్తుడు ఈ సంగతి చెప్పాడు. క్రీస్తు సమకాలికులు స్థలంలో నడచిపోయి అతన్ని దర్శించారు. ఉదాహరణకు జ్ఞానులు బెత్లెహేము వెళ్లి అక్కడ క్రీస్తుని దర్శించారు. కాని ప్రభువు ఇప్పుడు ఏవూరిలోను లేడు. మరి అతన్ని ఎక్కడ చూస్తాం? ఎక్కడికి నడచిపోయి అతన్ని సందర్శిస్తాం? ఇప్పుడు స్థలంలో నడచిపోయి క్రీస్తుని దర్శించం. విశ్వాసం ద్వారానే అతని దగ్గరికి నడచిపోయి అతన్ని దర్శిస్తాం. మన ధన్యత ఇక్కడే వుంది. కాని ఈ విశ్వాసం మనకేలా లభిస్తుంది? ఆత్మ ద్వారా. అందుకే ప్రభువు ఆత్మను శిష్యుల మీదికి ఊదింది. క్రీస్తుపట్ల విశ్వాసాన్ని అధికాధికాంగా దయచేయమని మనం ఆయాత్మనే అడుగుకోవాలి.

ఈ నాల్గవ సువిశేషం వ్రాసేప్పటికి క్రీస్తుని ప్రత్యక్షంగా చూచినవాళ్లంతా గతించారు. అతన్ని కంటితో చూడని రెండవతరం క్రైస్తవులు మిగిలివున్నారు. వీళ్ళుకూడ విశ్వాసంతో క్రీస్తుని దర్శింపవచ్చునని ఈ సువిశేషం హెచ్చరిస్తుంది. నేడు మనంకూడ ఈ వర్గంలో చేరినవాళ్ళమే.

నేడు మనం తోమాను అతని విశ్వాసాన్ని బట్టి గాక అవిశ్వాసాన్ని బట్టి గుర్తుపెట్టుకొంటున్నాం. కాని లోకం మన విశ్వాసాన్ని బట్టి మనలను గుర్తుపెట్టుకొన్ననాడు మనం ధన్యులమౌతాం.

### రచయిత ఉద్దేశం 20, 30-31

మొదట యోహాను సువిశేషం ఈ వచనాలతో ముగిసింది. 21వ అధ్యాయం కడపటి సంపాదకుడు చేర్చినది. ప్రభువు చాల అద్భుతాలు చేసాడు. కాని వుత్థానం అతని అద్భుతాలన్నిటిలోను గొప్పది.

రచయిత ఈ గ్రంథాన్ని వ్రాయడంలో ఉద్దేశం ఇది. పాఠకులు యేసే మెస్సీయా అని నమ్మాలి. అతడే దేవుని కుమారుడని విశ్వసించాలి. ప్రభువు తండ్రికి విధేయుడై సిలువ మరణాన్ని అనుభవించి మళ్ళా వుత్థానమయ్యాడని అంగీకరించాలి. అతడు దేవుడేనని విశ్వసించాలి. ఈ విశ్వాసం ద్వారానే జీవాన్ని పొందాలి. ఈ జీవం రక్షణమే. ఈ భావాలన్నీ పూర్వం మార్త ప్రకటించిన విశ్వాసంలో వున్నాయి -11,27.

వేదగ్రంథాలు ప్రధానంగా క్రీస్తుపట్ల విశ్వాసాన్ని పెంచుకొని రక్షణాన్ని పొందడానికే వున్నాయి. ఈ లక్ష్యంతోనే నేడు మనం వాటిని పఠించాలి.

## 5. సరస్సు తీరాన దర్శనం 21, 1-14

యోహాను సువిశేషం మొదట 20 అధ్యాయంతో ముగిసిందనీ, 21వ అధ్యాయం చివరి సంపాదకుడు చేర్చిందనీ చెప్పాం. ఐతే ఈ కడపటి అధ్యాయంలోని భావాలు

కూడ యోహాను శిష్యవర్గానికి చెందినవే. ఇంకా, ఈయధ్యాయం ప్రాచీన వ్రాతప్రతులన్నిటిలోను కన్పిస్తుంది. కనుక ఇదికూడ విలువైందే.

ఉత్థానక్రీస్తు సాన్నిధ్యం, అతడు శిష్యులచేత చేపలు పట్టించడం, వారికి భోజనాన్ని పెట్టడం ఈ ఘట్టంలోని ముఖ్యాంశాలు. పేత్రూ ఇతర శిష్యులు గలిలయసరస్సులో చేపలు పట్టడానికీ పోయారు - 3. వాళ్ళ రక్షణ వుద్యమాన్ని మరచిపోయి లౌకిక వ్యాపారంలో పడిపోయారు. పూర్వం క్రీస్తు చెప్పినట్లుగానే చెల్లాచెదరయ్యారు - 16,32. ఇక్కడ ప్రభువు వాళ్లను మళ్లా ఐక్యపరచాడు. వాళ్లను తన చుట్టూ చేర్చుకొని వుత్థానానంతరం చేయవలసిన పనిని వాళ్లకు మళ్లా జ్ఞప్తికి తెచ్చాడు.

శిష్యులు స్వయంగా చేపలను పట్టలేకపోయారు -3. కాని ప్రభువు ఆజ్ఞపై వాటిని విస్తారంగా పట్టారు. ఈ చేపలు భావికాలంలో శిష్యులు పట్టబోయే నరులనే సూచిస్తాయి. అనగా వాళ్లు వేదబోధ చేసి చాలమందిని తిరుసభలోనికి కొనివస్తారని భావం. సువిశేషాలు దైవరాజ్య వ్యాప్తిని సూచించడానికి చేపలను పట్టడమనే ఉపమానాన్ని వాడతాయి - లూకా 5,10. శిష్యుల వలలో చిక్కిన చేపలు 153. ఆనాడు ప్రపంచంలో 153 రకాల చేపలు ఉన్నట్లుగా యూదులు భావించారని జెరోము భక్తుడు వ్రాసాడు. ఇక్కడ ఈ సంఖ్య సాంకేతికమైంది. విశ్వవ్యాప్తతను సూచించేది. అనగా భావికాలంలో అన్ని జాతులవాళ్లు తిరుసభలో చేరతారని భావం. 153 చేపలుపడినా వల పిగిలిపోలేదు. ఇన్ని జాతులవాళ్లు చేరినా తిరుసభలో విభజన రాదనీ, అది ఏకసమాజంగా వుండిపోతుందనీ అర్థం. దానికి ఐక్యతనిచ్చేది ప్రభువు ఆత్మే.

ఈ సంఘటనంలో క్రీస్తుని మొదట గుర్తించింది యోహాను -7. అతడు క్రీస్తుని అధికంగా ప్రేమించినవాడు. అందుకే అందరికంటె ముందుగా తాను వుత్థాన క్రీస్తుని గుర్తించాడు. ప్రేమరీత్యా అతడు గొప్పవాడు. ఐతే భావిపరిచర్య రీత్యా పేత్రు గొప్పవాడు. ప్రజలను తిరుసభలోనికి చేర్చడం ప్రధానంగా ఇతని పని. ఈ కథలో చేపలను వొడ్డుకిలాగింది పేత్రేకదా! -11.

ఇక్కడ శిష్యులు భుజించిన రొట్టె చేపలు అనే ఆహారం దివ్య సత్ప్రసాదానికి సూచనంగా వుంటుంది - 3. శిష్యులు క్రీస్తుపేరిట ఐక్యమౌతారు. ఆ శిష్య సమాజానికి ఆహారం దివ్యసత్ప్రసాదమే. ఈ భోజనాన్ని అందించే వాడు మెస్సీయ. అతడు తనభక్త సమాజానికి విందు చేస్తాడు. ఆ విందు మోక్షపు విందుకే గుర్తుగా వుంటుంది. దివ్యసత్ప్రసాద భోజనమే ఈ విందు. ఇక్కడ యేసు రొట్టెను చేపలను తీసికొని శిష్యులకు పంచియిచ్చాడు

- 13. ఇదే వాక్యం దివ్యసత్ప్రసాద ప్రసంగంలో కూడ కన్పిస్తుంది -6,11. ఆ ప్రసంగం కూడ గలిలయసరస్సు తీరాన చేసిందే - 6,25. కనుకనే ఈ భోజనం దివ్య భోజనానికి సూచనంగా వుంటుందని చెప్పాం. ఇంకా యీ కథలో క్రీస్తు బొగ్గులతో మంటవేసి చేపలనూ రొట్టెనూ కాల్చి శిష్యులకు ఆహారంగా యిచ్చాడు. అనగా అతడు ఇక్కడ సేవకుడుగా వ్యవహరించాడని భావం. "సేవకుడు" అనేది క్రీస్తు బిరుదుల్లో వొకటి.

ఎమ్మావు శిష్యుల కథలో కూడ భోజన విషయం వస్తుంది-లూకా 2-4, 30-31. శిష్యులు దివ్యసత్ప్రసాద భోజనంలో క్రీస్తుని గాఢంగా అనుభవానికి తెచ్చుకొంటారు అని యీ ఘట్టాల భావం. నేడు మనమూ ప్రభువుని ఈలాగే అనుభవానికి తెచ్చుకోవాలి. ఇంకా, 20వ అధ్యాయంలో ప్రభువు శిష్యులకు ఆత్మను దయచేసాడు. 21వ అధ్యాయంలో దివ్యభోజనాన్ని దయచేసాడు. ఇవి రెండూ గొప్ప భాగ్యాలు. నేడు మనంకూడ ప్రభువు నుండి ఈ భాగ్యాలను సమృద్ధిగా పొందాలి.

శిష్యులు రాత్రంతా ప్రయాసపడినా చేపలు దొరకలేదు. ఉదయాన్నే క్రీస్తు ఆజ్ఞతో వాళ్లు విస్తారంగా చేవలను పట్టారు. శిష్యులు క్రీస్తు సహాయంలేకుండా చేపలను పట్టినట్లుగా సువిశేషాల్లో ఎక్కడ చదవం. మన ప్రేషిత సేవలో ప్రభువు సహాయం ఎంత అవసరమో దీన్నిబట్టే అర్థంచేసికోవాలి. ఇంకా "రాత్రి" "పగలు" అనే మాటలకు కూడ యోహాను సువిశేషంలో సాంకేతికార్థాలున్నాయి.

శిష్యుల్లాగ నేడు మనంకూడ చేపలను పట్టడానికి, అనగా వేదబోధచేయడానికి పోవాలి. క్రీస్తు అనుగ్రహంతో చాలమందిని తిరుసభలోనికి తీసుకరావాలి. ఇంకా వుత్థాన క్రీస్తుచుట్టూ చేరి దివ్యభోజనాన్ని ఆరగించాలి. ఆ ప్రభువు పేరుమీదిగా ఓ భక్తసమాజంగా ఐక్యంగావాలి. తిరుసభలో ఉత్థానక్రీస్తు సాన్నిధ్యం బలంగా పనిచేస్తుంటుంది. ఆ సాన్నిధ్యాన్ని మనం భక్తిభావంతో గుర్తించాలి.

## 6. పేత్రుకి అధికారం 21, 15-17

ప్రభువు పేత్రు పాపాన్ని పరిహరించి అతనికి అధికారాన్ని ఒప్పజెప్పడం ఇక్కడ ముఖ్యాంశం. నీవు నన్ను ప్రేమిస్తున్నావా అని క్రీస్తు పేత్రుని మూడుసార్లు అడిగాడు. మూడుసార్లు పేత్రు ప్రేమిస్తున్నానని జవాబు చెప్పాడు. పూర్వం అతడు ప్రభువును ఎరగనని మూడుసార్లు బొంకాడు కదా! దానికి పరిహారంగా ఇప్పుడు మూడుసార్లు నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పాడు. ఇక్కడ క్రీస్తు అడిగిన మూడు ప్రశ్నలను బట్టి అతడు పేత్రు ప్రేమను శంకించాడు అనుకోగూడదు. పేత్రు చెప్పిన మూడు జవాబులను బట్టి అతడు

ప్రభువును గాఢంగా ప్రేమించాడు అనుకోవాలి. ప్రేమ శిష్యుని ప్రధాన లక్షణం. మూడవ పర్యాయం పేత్రు తనకు సహజమైన తొందరపాటును అణచుకొని ఇంకా వినయంగా జవాబు చెప్పాడు.

ప్రభువు పేత్రుతో నా గొర్రెలను మేపు అని ముమ్మారు చెప్పాడు. అనగా క్రీస్తు అనుచరులకు అతడు కాపరి అయ్యాడు అని భావం. బైబుల్లో కాపరి అంటే నాయకుడు, అధికారి. కనుక పేత్రు క్రీస్తు అనుయాయులకు సర్వాధికారి అయ్యాడని అర్థం. గొర్రెలేమో క్రీస్తువే. అతడే ప్రధాన కాపరి. ఐతే ఆ కాపరి తన స్థానంలో పేత్రుని ముఖ్యకాపరినిగా నియమించాడు. తండ్రి తన్ను పంపినట్లే క్రీస్తు శిష్యులను పంపాడు. అతడు ప్రధాన కాపరి ఐనట్లే తన తరపున ఉపకాపరిని గూడ నియమించాడు.

ఆ కాలంలో ప్రాచ్యదేశాల రాజులు తాము ఇతరులకు ఆయాహక్కులను జారీచేసినపుడు ప్రజలందరు వినేటట్లుగా చెప్పిన మాటలే మూడుసార్లు చెప్పేవాళ్లు. రాజు దయచేసిన హక్కుకి ఇక తిరుగులేదని దీని భావం. దీన్ని బట్టి క్రీస్తు పేత్రుకి దయచేసిన హక్కుకి కూడ తిరుగులేదని అర్థంచేసికోవాలి.

ఐతే పేత్రు తన అధికారంతో ఏమిచేస్తాడు? ప్రజలకు వేదబోధచేస్తాడు. సంస్కారాలు జరుపుతాడు. మంద మేలు కొరకు కృషిచేస్తాడు. అవసరమొచ్చినపుడు ఆ మంద కొరకు ప్రాణాలు కూడ అర్పిస్తాడు.

ప్రభువు పేత్రుని అడిగినట్లే నేడు మనలను కూడ నీవు నన్ను ప్రేమిస్తున్నావా అని అడుగుతాడు. పేత్రులాగ మనం కూడ పాపంలో పడిపోయినవాళ్లం. కాని అతనిలాగ మనంకూడ ప్రభువుని ప్రేమించి వుండాలి. అప్పుడేగాని పేత్రులాగ మనంకూడ "ప్రభూ! నేను నిన్ను ప్రేమిస్తున్నానని నీవెరుగుదువు" అని చెప్పలేం. అనగా పేత్రుకీ మనకూ సామ్యం పాపం చేయడంలో మాత్రమే వుండకూడదు. ప్రభుని ప్రేమించడంలో గూడ వుండాలి. మనలను దేవునికి ప్రీతిపాత్రులను చేసేది ప్రధానంగా ప్రేమే. ఐతే దేవునిపట్ల నాకున్న ప్రేమ ఏపాటిది?

ఇంకా, ప్రభువు పేత్రులాంటిపాపికి తిరుసభమీద సర్వాధికారం ఒప్పగించాడు. నేడు తిరుసభలోని అధికారుల బలహీనతలను చూచి మనం విస్తుపోగూడదు. అధికారుల లోపాలు దేవునికి తెలియనివికావు. అవసరమొచ్చినప్పుడు ప్రభువే వాటిని చక్కదిద్దుతాడు.

పేత్రు క్రీస్తు గొర్రెలను ఎలామేపాలి? అవి తనవి అన్నట్లుగా గాక, క్రీస్తువి అన్నట్లుగా భావించి మేపాలి. అనగా క్రీస్తు మనోభావాలతో మందను మేపాలి. ఈలాగే

నేటి కాపరులు కూడ మంద శ్రేయస్సు కొరకు కృషి చేయాలి. స్వార్థ లాభాన్ని చూచుకోగూడదు. మందపట్ల శ్రద్ధా ప్రేమా పెంచుకోవాలి. దుర్లాభ అపేక్షతోగాక మనఃపూర్వకంగా మందను కాయాలి -1 పేత్రు 5,2. యోగ్యులైన గురువులూ సంఘపెద్దలూ వుపదేశులూ మొదలైనవాళ్లు క్రైస్తవ సమాజానికి గొప్ప వరాలు.

# 7. పేత్రు యోహానుల అంత్యగతి 21, 18-23

## 1. పేత్రు వేదసాక్షి మరణం

18-19 వాక్యాలు పేత్రు వేదసాక్షి మరణాన్ని తెలియజేస్తాయి. యువకుడుగా వున్నపుడు పేత్రు స్వేచ్ఛగా తిరిగాడు. కాని వృద్ధుడైన పేత్రుకి ఆ స్వేచ్ఛ వుండదు. శత్రువులు అతన్ని పట్టి నిర్బంధంగా చంపివేస్తారు. అతడు సిలువపై చేతులు చాస్తాడు. అతన్ని త్రాళ్లతో సిలువమానుకి అంటగడతారు. అతడు ఇష్టపడని సిలువ మరణం అనుభవించడానికి అతన్ని తీసికొని పోతారు-19.

క్రీస్తు పేత్రుకి కాపరి అధికారాన్ని ఇచ్చాడు. తర్వాత తన మరణంలో పాలుపొందే అధికారాన్ని కూడ ఇచ్చాడు. అనగా క్రీస్తులాగే పేత్రుకూడ సిలువపై వేదసాక్షిగా మరణిస్తాడని భావం. కనుకనే పేత్రుతో "నీవునన్ను వెంబడించు" అని చెప్పాడు - 19,22. ఇక్కడ "వెంబడించు" అంటే నావెంట నడువు అని ఒక అర్థం. నా సిలువ మరణాన్ని అనుభవించు అని ఇంకొక అర్థం. పేత్రు రోములో వేదసాక్షిగా మరణించాడని ప్రాచీనచరిత్ర చెప్తుంది. ప్రభువు మరణంలాంటి మరణం ఏ కొద్దిమంది భక్తులకోగాని లభించదు.

యోహాను సువిశేషం ఈ 18-19 వచనాలు వ్రాసేటప్పటికి పేత్రుని వాటికన్ కొండమీద సిలువవేసారు. అతడు క్రీస్తుని వెంబడించి వేదసాక్షిగా మరణించాడు. నేడు మనంకూడ యేసుని వెంబడించాలి. మనగురువు సిలువను మోసికొని పోయినవాడు. గురువుకి ఒక త్రోవా శిష్యునికి ఇంకొక త్రోవా వుంటుందా? కనుక కొన్ని కష్టాలైన అనుభవిస్తేనేగాని మనం క్రీస్తుకి నిజమైన శిష్యులం గాలేము.

పేత్రు ప్రభువుకి ప్రీతికరుడైన శిష్యుడు అయ్యాడు. అతనిలాగే క్రీస్తుని విశ్వసించే వాళ్లంతా అతనికి ప్రీతిని కలిగించే శిష్యులు కావాలి. నేడు మనకు క్రీస్తు పట్లగల ప్రేమే మన శిష్యత్వానికి గురుతుగా వుండాలి. పేత్రు యోహానులకు లాగే ప్రభువు మనలో ఒక్కొక్కరికీ ఓ గతినీ, ఓ ప్రత్యేక మరణ విధానాన్నీ, నిర్ణయించాడు. మనం ఆ మరణాన్ని అనుభవించి కడన మన గమ్యాన్ని చేరుకోవాలి. కనుక మన జీవితాన్ని లాగే మన మరణాన్ని కూడ ఆ ప్రభువుకే అర్పిద్దాం.

## 2. యోహాను మరణం

20-23 వచనాలు యోహాను మరణాన్ని తెలియజేస్తాయి. క్రీస్తు ముందు పోతున్నాడు. పేత్రు అతని వెంట వెళ్తున్నాడు. వారి వెంట యోహాను వస్తున్నాడు. పేత్రు వెనుకకు తిరిగి యోహానుని చూచాడు. యోహాను కూడ శిష్యుడే. ఐనా అతడు పేత్రుకంటె భిన్నంగా ప్రవర్తించాడు. క్రీస్తుని సిలువవేసేపుడు పేత్రు పారిపోయాడు. కాని యోహాను పారిపోలేదు. ఆదివారం ఉదయం అతడు కూడ పేత్రుతోపాటు సమాధి దగ్గరికి వచ్చాడు. కనుక పేత్రుకి ఇతని అంత్యగతి యేలా వుంటుందో తెలిసికొందామనే కుతూహలం కలిగింది. కనుక అతని గతిని గూర్చి క్రీస్తుని ప్రశ్నించాడు.

ప్రభువు పేత్రుతో నీ విషయం నీవుచూచుకో. అతని సంగతి నీకెందుకు అన్నాడు-22. భగవంతుడు ఎవరికి నిర్ణయించే గతిని వారికి నిర్ణయిస్తాడు. ఒకరి భవిష్యత్తుతో మరొకరికి పనిలేదు. ఎవరి భవిష్యత్తుని వాళ్ళు పట్టించుకొంటేచాలు. దేవుడు దయగలవాడు కనుక అందరి భవిష్యత్తుని తానే పట్టించుకొంటాడు.

పేత్రు వేదసాక్షి మరణం ద్వారా క్రీస్తుకి సాక్ష్యం పలికాడు. యోహాను మామూలు మరణం ద్వారా ప్రభువుకి సాక్ష్యం పలికాడు. ఎవరి పద్ధతిలో వాళ్ళు ఈ యిద్దరూ గొప్పవాళ్లే. కనుక వారిలో ఎవడు గొప్పవాడు అనేప్రశ్న రాకూడదు. బహుశ తొలినాటి క్రైస్తవుల్లో పేత్రు యోహానుల్లో ఎవడు అధికుడు అనే ప్రశ్న తలెత్తి వుంటుంది. యోహాను శిష్యులు మా గురువు కూడ పేత్రు అంతటివాడు అని వాదించి వుంటారు. ఈ బైబులు వాక్యాలు ఆనాటి శిష్యుల వివాదాలను సూచిస్తాయి.

ప్రభువు యోహానుని గూర్చి "నేను వచ్చేవరకు అతడు ఈలాగే వుండడం నాకిష్టం" అన్నాడు-22. ఈ వాక్యానికి యోహాను లోకాంతందాకా చనిపోకుండా వుండిపోతాడని భావంకాదు. పేత్రూ! యోహాను విషయం నీకనవసరం. నీపని నీవు చూచుకో అని మాత్రమే ఈ వాక్యానికి అర్థం. అందరు నరుల్లాగే యోహాను కూడ సామాన్య మరణానికి గురయ్యాడు అనుకోవాలి.

చివరి సంపాదకుడు ఈ 21వ అధ్యాయాన్ని వ్రాసేటప్పటికే "యేసు ప్రేమించిన శిష్యుడు" చనిపోయాడు. అతడు లోకాంతం వరకు చనిపోడని అతని అనుచరులు భావిస్తుండేవాళ్ళు. కనుక అతని అకాలమరణం వారికి నిరాశను పుట్టించింది. ఐతే ఆ అనుచరులు క్రీస్తు వాక్యాన్ని తప్పుగా అర్థంచేసికొన్నారనీ, ఈ శిష్యుడు లోకాంతందాకా బ్రతికి వుంటాడని క్రీస్తు అసలు చెప్పనేలేదనీ ఈ చివరి సంపాదకుడు తెలియజేస్తున్నాడు.

ఈ నాల్గవ సువిశేషం వ్రాసిన రచయిత ఈ గ్రంథంలోని అంశాలకు నేనే సాక్షిని అని చెప్తున్నాడు -24. క్రీస్తు ప్రేమించిన శిష్యునికి అనుచరులు వున్నారు. వాళ్ళంతా ఆ శిష్యుని నాయకత్వాన ఓ భక్త సమాజంగా ఏర్పడ్డారు. ఈ సమాజంలోనే ఈ నాల్గవ సువిశేషం పుట్టింది. దీన్ని నేరుగా ఈ శిష్యుడు వ్రాసివుండకపోవచ్చు. అతని పేరు మీదిగా, అతని భావాలతోనే ఈ భక్త సమాజంలోని రచయిత ఎవడో వ్రాసి వుంటాడు. ఐనా ఈ గ్రంథం ఈ గొప్ప శిష్యుని పేరుతోనే ప్రచారంలోకి వచ్చింది. ఈ గ్రంథంలో చెప్పిన అంశాలన్నీ నిజమేనని ఈ శిష్యుడు హామీ యిస్తున్నాడు. అతడు స్వయంగా క్రీస్తుతో కలసి జీవించినవాడు. కనుక అతని హామీని మనం నమ్మవచ్చు. ఆ శిష్యుడు లోకాంతం వరకు బ్రతికి వుండడంకంటె అతని హామీ ముఖ్యమైంది. ఈ సువిశేషం ద్వారా అతడు మనమధ్యలో ఇంకా జీవిస్తూనే వున్నాడు అనుకోవాలి. దానిలోని వాక్యాలు నేటికీ మనకు జీవమిస్తున్నాయి కదా! అతడు శారీరకంగా మన మధ్యలో జీవించివుండడం కంటె ఈ పుస్తకంలోని వాక్యాలు ఎక్కువ విలువైనవి. పేత్రు నాయకత్వాన్నీ, యోహాను ప్రాముఖ్యాన్నీ వెల్లడిచేయడానికే చివరి సంపాదకుడు ఈ 21వ అధ్యాయాన్ని చేర్చాడు.

యోహాను ఈ సువిశేషంలోని అంశాలకు సాక్షి. కాని ప్రధాన సాక్షి పవిత్రాత్మ. ఆ యాత్మ క్రీస్తు జీవితానికి సాక్షి. యోహాను శిష్యులు వ్రాసిన ఈ సువిశేషానికి సాక్షి. ఈనాడు మనం ఈ గ్రంథాన్ని చదివి క్రీస్తుపట్ల విశ్వాసాన్ని పెంచుకోవడానికి సాక్షి. కనుక మనకు జ్ఞానోదయం కలిగించి క్రీస్తుని విశ్వసించే భాగ్యాన్ని దయచేయమని ఆ యాత్మనే అడుగుకొందాం.

మనం ఏదైనా ఓ భక్త సమాజానికి చెందివుండాలి. మనకు విశ్వాసం చాలనపుడు ఈ భక్తబృందం దాన్ని పెంచుతుంది. మన ఆదర్శ జీవితం ద్వారానైతేనేమి, బోధద్వారా నైతేనేమి, రచనల ద్వారానైతేనేమి మనం ఈ భక్తబృందం స్థాయిని పెంచగలిగితే ఇంకా మంచిది.

# 8. దళిత క్రీస్తు

బైబులు భాష్యం - 157

## విషయసూచిక

## 6. దళితుల కొరకు నవసమాజ స్థాపనం



# దళిత క్రీస్తు

కులతత్వ వాదులు మనదేశంలోని జనాన్ని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులని నాల్గు వర్గాలుగా విభజించారు. ఐదవ వర్గాన్ని పంచములు అన్నారు. వీరికే చండాలులు, అస్పృశ్యులు, అవర్ణులు అనికూడ పేరు. గాంధీ వీరికి హరిజనులని పేరుపెట్టాడు. కాని యిప్పుడు వీరిని "దళితులు" అంటున్నారు. నరకబడినది, చీల్చబడినది అని ఈ సంస్కృతపదానికి అర్థం. అనగా దళితులు బాధలకు గురై నలిగిపోయినవాళ్లని భావం.

బైబుల్లో కనిపించే "హనవిం" అనే పేదవర్గానికీ ఈ దళిత వర్గానికీ చాల పోలికలున్నాయి. ఉభయులుకూడ పీడితులు, బాధితులు. ఇన్నాళ్లు అగ్రవర్గాల పీడనకు గురై అణగారిపోయిన దళితులు ఇప్పుడు సమాజంమీద తిరగబడుతున్నారు.

దళితుల్లో చాలమంది పూర్వమే క్రైస్తవ మతాన్ని స్వీకరించారు. ఆ మతం తమ బానిసాన్ని తొలగించి స్వేచ్ఛను ప్రసాదిస్తుందని ఆశించారు. కాని వారి ఆశయం నెరవేరలేదు. చర్చి వాళ్లకు కొంతవరకు తోడ్పడినా వాళ్ల బానిసాన్ని తొలగించలేదు. అందుచే వాళ్లు ఇప్పుడు క్రీస్తుపై తమ ఆశలను కేంద్రీకరించుకొన్నారు. బాధలకు, నిందలకు గురైన క్రీస్తు అచ్చమైన దళితుడు అనుకొన్నారు. తమ కష్టాలను అతని కష్టాలతో పోల్చుకొని, అతనినుండి ప్రేరణం పొంది, అతని శక్తితో తమ ఇక్కట్టులను తొలగించుకోగోరుతున్నారు. క్రీస్తు ఏలా దళితుడయ్యాడో రాబోయే పేజీల్లో పరిశీలించిచూద్దాం.

## 1. క్రీస్తు దళితుడు

### 1. బానిస, సేవకుడు

క్రీస్తుని బానిసనుగాను, సేవకునిగాను చూచారు. అతని సొంతజనమే అతన్ని అవమానించి నగర ద్వారం వెలుపల క్రూరంగా వధించారు. ఆ ప్రభువు "తన్నుతాను రిక్తుని జేసికొని, సేవక రూపాన్ని దాల్చి మానవుల పోలికగా జన్మించాడు"- ఫిలి 2,7.

అతనికి గౌరవాదరాలు లేవు. వ్యక్తిగా గుర్తింపులేదు. చనిపోయినపుడు సొంత సమాధికూడ లేదు. ఇప్పుడు మనకున్న పేరుప్రతిష్ఠలూ పలుకుబడి అతనికి లేవు. అతన్ని దళితునిగా, పరయనుగా, జాతిభ్రష్టుణ్ణిగా వెలివేసారు. ద్రాక్షతోట వెలుపలకు గెంటివేసి వధించారు. కాని అతడు అనేకుల రక్షణార్థం తన ప్రాణాన్ని క్రయధనంగా సమర్పించాడు- మార్కు 10,45.

యోహాను సువిశేషంలో అతడు బాధామయ సేవకుడు. అతడు శరీరధారి అయ్యాడు 1,14. మన బలహీనతలను చేకొన్నాడు. బహిష్కృతుడై పీడితుల వర్గంలో చేరిపోయాడు. పరపీడనకు వేదనకు గురై ఏడ్పులతో, కన్నీటితో తండ్రికి మొరపెట్టాడు - హెబ్రె 5,7. సాముదాయిక వ్యక్తిగా బలహీనులైన నరులందరినీ, వారి బాధలన్నిటినీ తనలో భరించాడు.

## 2. వెలివేయబడినవాడు

క్రీస్తు దళితుడుగా వెలివేయబడినవాడు. "అతడు తన వారివద్దకు వచ్చాడుగాని వాళ్లు అతన్ని అంగీకరించలేదు" - యోహా 1,11 నజరేతులో అతని సొంతప్రజలే అతన్ని తిరస్కరించారు. అతడు దళితులైన బాధితుల కోపు తీసికోబోగా ప్రజలతన్ని వూరి వెలుపలికి నెట్టివేసారు. దుష్టులైన కౌలుదార్ల కథలో అతడు త్రోసివేయబడిన రాయి అయ్యాడు - మార్కు 12,10. అతడు పుట్టినప్పుడే బేత్లెహేములో నిరాదరణకు గురై దళితుల దౌర్భాగ్యంలో పాలుపంచుకొన్నాడు. చిన్న శిశువుగా వున్నపుడే హేరోదు లాంటి రాజులూ అధికారులూ అతన్ని హింసించి అన్యదేశాలకు తరిమివేసారు. దళితుడు గనుకనే ఎల్లతావుల్లోను వెలివేయబడ్డాడు.

## 3. అశుద్ధుడు

దళితులు అశుద్ధులు. ఆ వర్గంలో పుట్టినవాళ్లంతా అలాంటి వాళ్లే. క్రీస్తుకూడా ఈ యశుద్ధుల వర్గంలో చేరిపోయాడు. సువిశేషాలు పేర్కొనే అతని వంశావళిలో కులీనులు కాని తామారు, రూతు, బత్షెబ మొదలైన అపవిత్రులూ అన్యజాతి స్త్రీలూ వున్నారు. వీళ్ల నెత్తురు పంచుకొని వీళ్ల వంశక్రమంలో వచ్చిన క్రీస్తుకూడ అశుద్ధుడు. మరియ కుమారుడు, గలిలయ నివాసి, నరపుత్రుడు, నజరేయుడు మొదలైన అతని బిరుదాలు కూడా అతడు అనిర్మలుడనే సూచిస్తాయి. గలిలయను యూదులు చిన్న చూపు చూచేవాళ్లు. అది యానాటి

మన "మాలపల్లి" లాంటిది. కాని ఈ యశుద్ధుడైన గలిలయుడే సకల లోకానికి రక్షణాన్ని సంపాదించి పెట్టాడు. ఈ దళితుడే అశుద్ధులందరినీ శుద్ధి చేసాడు.

## 2. క్రీస్తు దళితానుభవం

### 4. దళితుడి దైవానుభూతి

దేవుని చిత్తాన్ని నెరవేర్చేవాడే నా సోదరుడు, సోదరి, తల్లి అన్నాడు ప్రభువు - మార్కు 3, 35. అతనికి రక్త బంధుత్వం, అగ్రకులాలకు చెంది వుండడం ముఖ్యంకాదు. దైవబంధుత్వం, దేవునికి చెందివుండడం ముఖ్యం. నికొదేము కథలో కూడ అతడు, నీటివలన ఆత్మ వలన జన్మించినవాడే దైవ రాజ్యంలో చేరతాడని చెప్పాడు - యోహా 3,5. కనుక క్రీస్తుకి నరుల కుటుంబాలకంటె దైవకుటుంబం ముఖ్యం. పెద్దకులాలకు చెంది వుండడం కంటె దేవుని కుటుంబానికి చెంది వుండడం ప్రధానం.

పూర్వవేదపు యూదులు దేవుణ్ణి పరమ పవిత్రుణ్ణిగా, జనులకు దూరంగా వుండేవాణ్ణిగా భావించారు. కాని క్రీస్తు దేవుణ్ణి కరుణామయుణ్ణిగా, నరుల పాపాలను మన్నించేవాణ్ణిగా బడుగువర్గాలను ఆదరించేవాణ్ణిగా తన్ను కరుణించేవాణ్ణిగా భావించాడు. అతడు దేవుణ్ణి "అబ్బా" - అనగా నాన్నా అని పిల్చాడు. దళితుడుగా తన చిన్నరికాన్ని, నిస్సహాయత్వాన్ని అర్థంచేసికొని పూర్తిగా దేవుని మీదనే ఆధారపడ్డాడు. తాను చిన్న బిడ్డల్లా తయారైతేనే గాని దైవరాజ్యంలో ప్రవేశించనని గ్రహించాడు. కులబలం ధనబలం దేవుణ్ణి చేరడానికి ఉపయోగపడవనీ, దిక్కులేని వారికి దేవుడే దిక్కనీ అర్థంచేసికొన్నాడు. ఈ పద్ధతిలో అతడు నిక్కచ్చిగా దళితుడు.

### 5. దళిత బలిపశువు

దళితులు అశుద్ధులు, పేదలు, శక్తిలేనివాళ్లు. క్రీస్తుకూడ ఈలాంటివాడే. అతడు అనుభవించిన నిందావమానాలే ఇందుకు నిదర్శనం. అగ్రవర్గాలవాళ్లు అతన్ని మరియ కుమారుడు, గలిలయుడు, భోజన ప్రియుడు, మద్యపాన రతుడు, సుంకరులకు పాపాత్ములకు మిత్రుడు, ఉన్మత్తుడు, సమరయుడు, భూతావేశుడు అనే పేర్లతో ఎగతాళి చేసారు. క్రీస్తు పేదరికాన్ని గేలిచేస్తూ ధనికులు అతన్ని వడ్రంగికుమారుడు అని ఎద్దేవా చేసారు. ఏరబ్బియి దగ్గర చదువుకోకుండానే బోధచేస్తున్నాడని తప్పుపట్టారు. అసలతనికి బోధ చేసే హక్కు

లేదన్నారు. ప్రజలను అపమార్గం పట్టించే మోసగాడు, పాపి, దేవ దూషకుడు అన్నారు. ఆనాటి అగ్రవర్గాలవాళ్లు నేటి దళితులను వలె అతన్ని అన్నివిధాల అణచివేయజూచారు.

అతన్ని ద్రాక్షతోటనుండి, నగరం నుండి, నెట్టివేసారు. దళితుల్లాగే అతడు వెలివాడలో వుండిపోయాడు. అస్పృస్యుడుగా ధనికుల నిరాదరణకు గురై కడన ఆ వెలివాడలోనే అసువులు పాసాడు. నగరద్వారం వెలుపల మరణించాడు - హెబ్రే 13, 12. కాని తాను చిందించిన నెత్తురు ద్వారానే అతడు ప్రజలను పాపం నుండి శుద్ధి చేసాడు. దేవాలయంనుండి, నగరద్వారం నుండి నెట్టివేయబడిన క్రీస్తు వెలివాడలో, మాలపల్లిలో అందరు దళితుల్లాగే కన్నుమూసాడు. అది మృతపశు కళేబరాలు శవాలు పడివుండే తావు. అది పంచముల నివాసస్థలం. అక్కడ అతన్ని బలిపశువునిగా వధించారు.

## 6. జాలిగొలిపే దళితుని మరణం

యూదమతాధికారులు క్రీస్తుని వెలివేసారు. అతని అద్భుతాలవల్ల లాభం పొందిన వాళ్లు అతన్ని నిరాకరించారు. ఇతని శరీరాన్ని మనమేలా భుజిస్తామని శిష్యులు అతన్ని వదలివెళ్లి పోయారు. ఒక శిష్యుడు అతన్ని పట్టియిచ్చాడు. మరొకడు నేనతన్ని యెరగనే యెరగనన్నాడు. యూదుల దేవాలయము రోమను సామ్రాజ్యమూ అతన్ని ద్రోహినిగా నిర్ణయించాయి. క్రీస్తు సిలువనెక్కి మంటికీ మింటికీ మధ్య వ్రేలాడాడు. అతడు ఎవరికీ అక్కరబట్టలేదు. ఎవరికీ చెందివుండలేదు. అపవిత్రస్థలంలో, శవాల మధ్య సిలువపై వ్రేలాడాడు.

అతనికి తండ్రిగూడ తన్ను చేయివిడిచాడనిపించింది. దళితులకు లాగే తనకు కూడ దేవుని ప్రేమ, ఆదరణ, న్యాయం, సాన్నిధ్యం లభించవనిపించింది. పీడితులందరికీ కలిగే బాధయిదే. ఆ బాధను భరింపలేక అతడు వాయెత్తి నా దేవా! నా దేవా! నన్నెందుకు చేయి విడిచావని వాపోయాడు. అది అస్పృశ్యుల అరుపు.

క్రీస్తు సిలువమీద దళితుల వేదనను పరిపూర్ణంగా అనుభవించాడు. సిలువమీద నలిగి నుగ్గయ్యాడు. తెగి తుత్తునియలయ్యాడు. నరులూ దేవుడూ కూడ తన్ను విడనాడారని దుఃఖించాడు. దయామయుడైన దేవుడు గూడ తమ్ము నిరాకరించాడనేది దళితులందరి బాధ. కాని ప్రజలు త్రోసివేసిన రాయే భావనానికి మూలరాయి ఐంది. విధేయుడైన సేవకుడే దళితులకు విమోదకుడయ్యాడు. సిలువమీదికి ఎత్తబడినవాడే ఇప్పుడు అందరినీ తన చెంతకు ఆకర్షించుకొంటున్నాడు. అతడు బానిసల దేవుడు, నికృష్టుల దైవము, పాకీవాళ్ల వేల్పు అయ్యాడు.

## 7. బహిష్కృతులకు స్నేహితుడు

ప్రభువు దళితులతో కలసి, దళితుల కొరకు పోరాడి వారికి విమోచనం సంపాదించి పెట్టాడు. క్రీస్తు దళితుడుగా తన స్వేచ్ఛను అణచుకోలేదు. అతడు నిష్క్రియాపరుడు, నిరాశావాది, పోరాటంనుండి తప్పించుకొనేవాడు కాదు. అవర్ణుల బాధలకు అతని హృదయం స్పందించింది. అతనిలోని శక్తీ ఉత్సాహమూ కట్టలు త్రెంచుకొని వెల్లువలై పారాయి. బడుగువర్గాలవారిని విమోచించడానికి అతడు అధికారం పొందాడు. నిప్పులో పెట్టిన కత్తి పదునెక్కినట్లే అతడూ చైతన్యం పొందాడు. అధోజగత్ సహోదరులను పైకి లేపి దైవరాజ్యంలోకి చేర్చడానికి పూనుకొన్నాడు.

అతడు పాపులతో కలసి జ్ఞానస్నానం పొందాడు. దాని ద్వారా పాపులకు స్వేచ్ఛా, హోదా సిద్ధించాయి. నీటిలో జ్ఞానస్నానం పొందిన క్రీస్తు తర్వాత తన రక్తంతోనే జ్ఞానస్నానం పొంది పాపుల పాపాలకు పరిహారం చేసాడు.

ప్రభువు ఎప్పుడూ ఆనాటి దళితులైన పేదవర్గాలవారితో కలసిపోతుండేవాడు. గలిలయ సీమ ఆనాటి మాలపల్లె, మాదిగపల్లె. యేసు చాల యేండ్లు అక్కడే జీవించి అక్కడి ప్రజలతో కలసిపోయాడు. అతని శిష్యులూ, అపోస్తలులూ అక్కడివాళ్ళే. వాళ్ళు చేపలు పట్టడం, వడ్రంగం, సుంకాలు వసూలుచేయడం, చర్మాలు శుద్ధి చేయడం మొదలైన నీచవృత్తులు చేపట్టి జీవించేవాళ్ళు. వారికి విద్యాగంధం వుండేది కాదు. ఈలాంటి వాళ్ళు ఆ గురువు శిష్యులు. అతడు విద్యావంతులకు గాక పల్లెల్లోని పామరజన సమూహాలకు బోధించాడు. రోగులను, వికలాంగులను, కుష్ఠరోగులను, భూతావేశులను స్వస్థపరచాడు. వాళ్ళు ఆనాటి సమాజంలో అంటరానివాళ్ళు. ఆలాంటి సంఘ బహిష్కృతులకు అతడు స్నేహితుడు, ఆప్తుడు. - మత్త 11,19.

## 8. దళితులను ఎన్నుకొన్నాడు

ప్రభువు నేను రోగులకొరకు వచ్చిన వైద్యుణ్ణి అన్నాడు - మార్కు 2, 17. ఈ పాపపు రోగులు యూద సమాజంలోని అట్టడుగు వర్గం ప్రజలు. వీళ్ళే నేటి అస్పృశ్యులు. ఈ ప్రజలు కాపరిలేని మందలా వుండడంజూచి అతడు వాళ్ళమీద జాలిగొన్నాడు - మత్త 9, 36. సురక్షితంగా వున్న 99 గొర్రెలను వదలివేసి తప్పిపోయిన ఒక్క గొర్రెను వెదకబోయాడు - లూకా 15,4. రోగులను, ఆకలిగొన్నవారిని, బంధువియోగంతో బాధపడేవారిని ప్రత్యేకంగా పరామర్శించాడు.

క్రీస్తు పేద కుటుంబంలో పుట్టాడు. దేవాలయార్పణ సమయంలో అతని తల్లిదండ్రులు గొర్రెపిల్లనుగాక రెండు పావురాళ్లను కానుకగా అర్పించారు - లూకా 2,24. అతడు జీవితాంతం సంచార బోధకుడుగా, బికారిగా జీవించాడు. అతనికి యిల్లూ వాకిలీ తలవాల్చుకొనే తావూలేదు. పన్నులు చెల్లించడానికి కూడా డబ్బులేదు. చనిపోయిందాక ఒకే వస్త్రాన్ని తొడుగు కొన్నాడు - మార్కు 15, 24.

దళితవర్గాలు జీవాన్ని సమృద్ధిగా పొందాలని అతని కోరిక - యోహా 10,10. అతని బోధనకాలంలో స్నేహితులు శిష్యులు అతన్ని పోషించారు. అతడు పుట్టినప్పుడు సొంతయింటిలోగాక పసులగాటిలో పుట్టాడు. చనిపోయినప్పుడు అన్యుల సమాధిలో పాతిపెట్టారు. నాది అనేది యేదీ అతనికి లేదు. బడుగు వర్గాలను కోరుకొని, ఎన్నుకొని నూటికి నూరుపాళ్లు వాళ్లతో కలసిపోయినవాడు ఆ ప్రభువు.

## 9. దళితులతో పంక్తి భోజనం

ప్రభువు లేవీ యింట సమాజ బహిష్కృతులతో కలసి భోజనం చేసాడు - మత్త 9,10. ఈ చర్యకు పరిసయులు ఆగ్రహం చెందారు. ఎందుకు? వాళ్ల భావాల ప్రకారం మనం ఎవ్వరితో కలసి భుజిస్తామో వాళ్లలాంటివాళ్ల మౌతాం. సుంకరులు ధర్మ శాస్త్రాన్ని పాటించని పాపపు మూక. కనుక వాళ్లతో కలసి భుజించే క్రీస్తుకూడ పాపియై యుండాలి. కనుక వాళ్లు క్రీస్తుని తప్పుపట్టారు. ఈ సందర్భంలోనే ప్రభువు తప్పిపోయిన గొర్రె, నాణెం, కుమారుడు అనే మూడు సామెతలు చెప్పాడు. ఈ మూడు కథలు అట్టడుగువర్గంవారి పట్ల దేవుడు కరుణ జూపుతాడు అనే సత్యాన్ని బోధిస్తాయి. ఇంకా అతడు సుంకరులు జారిణులు పరిసయులకంటె ముందుగా దైవరాజ్యంలో చేరతారని చెప్పాడు. - మత్త 21, 31.

క్రీస్తు పాపులతో కలసి పంక్తిభోజనం చేసాడు. నేనూ మీరు సరిసమానమన్నాడు. నేటికీ మన దేశంలో అగ్రకులాలవాళ్లు దళితులతో కలసి భోజనం చేయరు. క్రీస్తు ప్రారంభించిన పంక్తి భోజనం ఆనాటి సమాజంలో పెద్ద విప్లవం తెచ్చిపెట్టింది. నూత్న సంస్కృతికి బాటలు వేసింది. నేడు మన పూజలోని దివ్యసత్ప్రసాద స్వీకరణం గూడ ఈలాంటిదే. కాని మనం దివ్యసత్ప్రసాదంలోని సోదర ప్రేమను గుర్తించం - 1 కొరి 10,17. ఒకే రొట్టెలో పాలుపంచుకొన్నవాళ్లు ఒకే శరీరం, ఒకేసమాజం ఔతారని గ్రహించం.

క్రీస్తు ఒక్కసారిగాదు, నిరంతరం అట్టడుగువర్గం వారితో కలసి భుజించాడు. తాను వారిలో ఒకడై పోయాడు. తనశిష్యులు కూడ తనలాగే పంక్తి భోజనం చేయాలని

కోరుకొన్నాడు. తన శిష్యుల్లో సమతామమతా భావాలు వేళ్లూనాలని ఆశించాడు. ఇప్పుడు కూడ అతడు మనతో కలసి భుజిస్తుంటాడు. మనమందరం ఏకపంక్తిలో అతనితో కలసి భుజించాలి - దర్శ 3,20.

# 4. దళితులకు అనుకూలమైన బోధలు

## 10. శుద్ధిని గూర్చిన నూత్నభావాలు

ఆరోజుల్లో పరిసయులు, ఎస్సీనులూ వాళ్ల ముఠావాళ్లతో కలసి భుజించేవాళ్లు. వేరే వాళ్లను ఆ భోజనానికి రానిచ్చేవాళ్లు కాదు. తాము శుద్ధులమనీ ఇతరులు కాదనీ వాళ్ల ఉద్దేశం. ఈలాంటి పరిస్థితుల్లో క్రీస్తు సుంకరులతోను పాపులతోను కలసి భుజించడం అందరినీ ఆశ్చర్యచకితులను చేసింది.

క్రీస్తు దేవుని పావిత్ర్యం ప్రధానంగా అతని కరుణలో వుందను కొన్నాడు - లూకా 6,36. యూదులు దేవుని పావిత్ర్యం ప్రధానంగా అతడు ప్రపంచానికి దూరంగా వుండడంలో వుందనుకున్నారు. క్రీస్తు దృష్టిలో మతమంటే శారీరక శుద్ధీకాదు, కర్మకాండాకాదు. ఒకరిపట్ల ఒకరు దయజూపడమే మతం. కాని యూదులభావాలు ఇవి కావు. అందుకే వారికీ అతనికీ తరచుగా ఘర్షణలు వస్తుండేవి.

యూదులు పావిత్ర్యానికి మూడు నియమాలు పెట్టారు. దేవాలయంలో వాడగలిగితే, అబ్రాహాము నెత్తురు కలిగివుండి అతని సంతానమైతే, దేహంలో అన్ని అవయవాలు సంపూర్ణంగా వుంటే ఆ వ్యక్తులు పవిత్రులు. వస్తువులకూ స్థలాలకూ కూడ ఈ నియమాలే వర్తిస్తాయి. మన దేశంలో మనుస్మృతి కూడ ఈలాంటి నియమాలే చేసింది. కాని క్రీస్తు ఈ నియమాలు చెల్లవన్నాడు. అతని దృష్టిలో పవిత్రతా లక్షణాలు కరుణ, ప్రేమ, న్యాయం, నిర్మలమైన ఉద్దేశం మొదలైనవి. తన భావాలను విశదం చేయడానికి అతడు పాపులతో కలసి భుజించాడు. కాళ్లుచేతులు కడుగుకోకుండానే భోజనం చేసాడు. కుష్ఠరోగిని చేతితో తాకాడు, - మార్కు 1,41. శరీర శుద్ధిలేని స్త్రీని తన్ను తాకనిచ్చాడు - మార్కు 5,28. ఏ భోజనమైనా శుద్ధిగలదేనని వచించాడు- మార్కు 7, 19. లోనికిపోయే ఆహారంగాదు, నరుల హృదయంనుండి బయటికి వచ్చే ఆలోచనలు వారిని మలినపరుస్తాయి అన్నాడు - మార్కు 7,15 దుష్టవాంఛలు, వివక్ష, ఇతరులను చిన్నచూపుచూడ్డం మొదలైనవి మనలను అశుద్ధులను చేస్తాయి. పరిసయుడు సుంకరి కథలో సుంకరి దళితుడు, పరిసయుడు బ్రాహ్మణుడు. నిజమైన శుద్ధి సుంకరికుందిగాని పరిసయునికి లేదు.

## 11. వంశపవిత్రత చెల్లదు

యూదులూ, మన దేశీయులూ కూడా వంశపవిత్రతను ఘనంగా యెంచారు. యూదులు అబ్రాహాము వంశానికి చెందివుండడం గొప్ప అనుకొన్నారు. మనదేశంలో బ్రాహ్మణులు ఏదో ఋషిపరంపరకు చెందివుండడం గొప్ప అనుకొని గోత్రాలు ఏర్పాటు చేసికొన్నారు. అన్యులను వివాహమాడితే ఈ పవిత్రత చెడుతుందనుకొన్నారు. కాని క్రీస్తు ఈ వంశ పవిత్రతకు, జాతి పవిత్రతకు విలువనీయలేదు. అసలు క్రీస్తు వంశావళిలోనే అన్యజాతి స్త్రీలూ అపవిత్రులూ వున్నారు. అతడు ఈ యంశం తనకు కళంకం ఆపాదిస్తుంది అనుకోలేదు. తాను దావీదు వంశానికి చెందివుండడం గొప్ప అనుకోలేదు - మార్కు 12, 35-37.

యూదులు అబ్రాహాము వంశంలో పుట్టడమే ఘనకార్యం అనుకొన్నారు. కాని స్నాపకయోహాను, క్రీస్తుకూడ అబ్రాహాము సంతతి కావడంలో గొప్పయేమీ లేదన్నారు. విశ్వాసమూ పశ్చాత్తాపమూ మాత్రమే నరులను రక్షిస్తాయన్నారు - లూకా 3, 8-9. దేవుని చిత్తప్రకారం జీవించేవాళ్లు ఘనులు. ఆలాంటివాళ్లే క్రీస్తుకు తోబట్టువుల్లాంటివాళ్లు. రక్తబంధుత్వం ముఖ్యం కానేకాదు - మార్కు 3, 31-35. క్రీస్తు శిష్యులుకూడ రక్తబంధుత్వంతో గూడిన తమ కుటుంబాలకు అంటిపెట్టుకొని వుండకూడదు - మత్త 10,37.

రక్షణం విశ్వాసంద్వారా వస్తుందేకాని అబ్రాహాము సంతతి కావడంవల్ల రాదని క్రీస్తు చాలసార్లు చెప్పాడు. అతడు అన్యజాతివాళ్లయిన కననీయ మహిళ, రోమను సైన్యాధిపతి విశ్వాసాన్ని మెచ్చుకొన్నాడు. వీళ్లకు అబ్రాహాముతో ఏ సంబంధంలేదు. ప్రభువు యూదులు ఏవగించుకొనే సమరయులతో కలసిపోయి వారి భోజనాన్ని తిన్నాడు. శుద్ధిని పొందిన పదిమంది కుష్ఠరోగుల్లో దళితుడైన సమరయుడు మాత్రమే అతినికి వందనాలు చెప్పాడు. మంచి సమరయుని కథలో ఆదర్శవ్యక్తి సమరయుడు కాని యాజకుడూ లేవీయుడూ కారు. ఐతే మనం అగ్రకులాలకు విలువనిస్తున్నాం.

## 12. పరిస్థితులు తారుమారు కావడం

యూదులు, మన దేశంలో హిందువులు కూడ పాపంవల్ల వ్యాధివస్తుందనుకొన్నారు. ఇది ఒకరకమైన కర్మ వాదం. క్రీస్తు ఈ వాదం పొసగదన్నాడు. అతడు రోగులను విశ్రాంతి దినానకూడ నయంజేసాడు. వారి పాపాలకూ వారి రోగాలకూ సంబంధం లేదన్నాడు. గ్రుడ్డివాడు తన పాపాలవల్లగాని తన తల్లిదండ్రుల పాపాల వల్లగాని గ్రుడ్డివాడు కాలేదని చెప్పాడు - యోహా 9,2. పరిసయుడు సుంకరి కథలో సుంకరి

ఐదవవర్గం వాళ్లయిన పంచములు బానిసలు, వెలివేతకు గురైనవాళ్లు, అంటరానివాళ్లు. కాని ఈ విభజనంలో అన్యాయం, కుట్ర, మోసం వున్నాయి.

పాలస్తీనా దేశంలో కూడ నరులను ఎక్కువ తక్కువగా విభజించారు. దేవాలయంలో అర్చనచేసే ప్రధానయాజకుడు అందరికంటె గొప్పవాడు. అటుతర్వాత యాజకులూ లేవీయులూ వస్తారు. ఆ పిమ్మట యిస్రాయేలు పురుషులు, వారి తర్వాత యూదస్త్రీలు వస్తారు. కడపటివాళ్లు అన్యజాతి ప్రజలు. వంశాన్ని బట్టీ, వృత్తిని బట్టీ, పరిపూర్ణ శరీరావయవాలను బట్టీ కూడ నరుల విలువను లెక్కకట్టేవాళ్లు. వికలాంగులు, రోగులు, నీచవృత్తుల్లో వుండేవాళ్లు అశుద్ధులు.

కాని క్రీస్తు అట్టడుగువర్గం వారితో కలసి భుజించి పై అధికార క్రమాన్ని రద్దుచేసాడు. అతని విలువలు వేరు. అతడు స్థాపించగోరిన నూత్నసమాజంలో నరులందరు సరిసమానం. ప్రతినరుడూ శుద్ధుడే. ఒకరి మీద ఒకరు పెత్తనం చలాయించకూడదు. నాయకులు కూడ ఎక్కువవాళ్లు కాదు. ఇతరులకు సేవలు చేసేవాళ్లే అధికులు, మాన్యులు - మత్త 23, 11. క్రీస్తు నెలకొల్పగోరిన నూత్న సమాజం దైవసమాజం. దానిలో అందరూ అన్నదమ్ములూ అక్కచెల్లెళ్లూ. క్రీస్తుకూడ తోడినరులకు స్నేహితుడు, సేవకుడు - అంతే - యోహా 15,15.

క్రీస్తు శిష్యులకు అతని విలువలు అర్థంకాలేదు. వాళ్లు దైవరాజ్యంలో మేము గొప్పంటే మేము గొప్పని కీచులాడుకొన్నారు. కాని అతడు "మీలో గొప్పవాడు కాదల్చుకొన్నవాడు మీకు పరిచారకుడై యుండాలి" అని చెప్పాడు - మార్కు 10, 43. వాళ్లు అప్పుడు గూడ పాఠం నేర్చుకోకపోతే, అతడు స్వయంగా వారి కాళ్లు కడిగి అధికారక్రమం చెల్లదని రుజువు చేసాడు. దాని ద్వారా ఆ శిష్యుల హృదయాల్లోని అధికారక్రమంగూడ కడిగివేసినట్లయింది- యోహా 13,5. ఆ రోజుల్లో శిష్యులు గురువుల కాళ్లు కడిగేవాళ్లు. కాని గురువే శిష్యులకాళ్లు కడగడం అరుదైన సంఘటనం. ఈవిధంగా క్రీస్తు నరుల్లో హెచ్చుతగ్గులు, కులం విలువలూ, అధికారభావాలూ రూపుమాపాడు. అతని యీచర్య పాలస్తీనా దేశంలోని వర్గవ్యవస్థకూ, మన దేశంలోని కులవ్యవస్థకూ గొడ్డలి పెట్టు.

### 14. దళితులకు గౌరవాదరాలు

క్రీస్తు బడుగువర్గాల వారితో కలసి తిరిగి వారి విలువనూ గౌరవాన్నీ పెంచాడు. వారిమీద వారికే నమ్మకం కలిగించాడు. నరులందరిలాగే వాళ్లుకూడ దేవుని బిడ్డలని నిరూపించాడు. మీరు ఎవరికీ బానిసలు కావద్దని వాళ్లను హెచ్చరించాడు. వారి మౌన

చండాలుడు. ఐనా దేవుడు అతని పూజనే అంగీకరించాడు. కనుక జాతి ముఖ్యంగాదు. అగ్రజాతి, అధమజాతి అనేవి లేవు. మండల్ కమీషన్ వెనుకబడిన వర్గాలకు రిజర్వేషన్ వుండాలని సిఫార్సు చేసింది. క్రీస్తు కూడ ఈ సిఫార్సు ఆమోదిస్తాడు.

క్రీస్తు పరిస్థితులు తారుమారైన సామెతలు కొన్ని చెప్పాడు. మంచి సమరయుని సామెతలో కడపట వచ్చినవాడూ, నీచజాతివాడు ఐన సమరయుడు పూజ్యుడు. యాజకుడూ లేవీయుడూ మాన్యులు కారు. లాజరు ధనికుడు కథలోను, వివాహవిందు కథలోను ధనికులుగాక పేదలు ఆదరణను పొందారు. ద్రాక్షతోట కూలీల కథలో చివరవచ్చినవాళ్లకు మంచిజీతం ముట్టింది.

దేవాలయంలో దళిత వర్గానికి చెందిన పేదరాలు చేసిన దానం ధనికులదానం కంటె గొప్పది - లూకా 21, 1-4. ప్రభువు చాలసార్లు కడపటివాళ్లు మొదటివాళ్లు, మొదటివాళ్లు కడపటివాళ్లు ఔతారని చెప్పాడు - మత్త 19, 30. మనం అట్టడుగువర్గంవారికి చేసిన సేవలు తనకే చెందుతాయని గూడ చెప్పాడు - మత్త 25,40.

క్రీస్తు శిశువుని మొదట దర్శించింది యెరూషలేము జ్ఞానులూ నాయకులుకాదు. పామరులయిన గొర్రెల కాపరులు. మరియ మహిమగీతం పెద్ద విప్లవగీతం. దానిలో ఆమె, దేవుడు అధిపతులను ఆసనాలనుండి పడద్రోసి దీనులను లేవనెత్తుతాడని చెప్పింది - లూకా 1, 52. క్రీస్తు తన దైవరాజ్య ప్రణాళికను ప్రకటించినపుడు ఏమన్నాడు? పేదలకు సువార్త బోధింపబడుతుంది అన్నాడు. చెరలో నున్నవారికి విడుదల, గ్రుడ్డివారికి చూపు, పీడితులకు విమోచనం లభిస్తుంది అన్నాడు. వీళ్లే నేటిదళితులు. సుంకరులు జారిణులు అగ్రవర్గాల వారికంటె ముందుగానే దైవరాజ్యంలో ప్రవేశిస్తారు. తండ్రిదైవరాజ్యరహస్యాలను విజ్ఞులకు కాక పసిబిడ్డలను ఎరిగిస్తాడు - మత్త 11, 25. దళితుడైన ప్రభువు దళితుల కోపు తీసికొన్నాడు. వారిని సమర్థిస్తూ మాటలాడాడు. వారికి అనుకూలంగా తీర్పుచెప్పాడు.

## 5. ప్రాత మతవిలువల్లో మార్పులు

### 13. అధికార క్రమాన్ని రద్దుచేయడం

మన దేశంలో అధికార క్రమం వుంది. సమాజంలో ఎక్కువ విలువగలవాళ్లు తక్కువ విలువగలవాళ్లు వున్నారు. మన దేశంలో బ్రాహ్మణులది అగ్రస్థానం. వీళ్లు యాజకులు. దేవుళ్లతో సమానమైన భూదేవుళ్లు. మానవాతీతులు. వీళ్ల తర్వాత క్షత్రియులూ, వారి తర్వాత వైశ్యులూ వస్తారు. వారి తర్వాత వ్యవసాయంజేసే శూద్రులు వస్తారు.

సంస్కృతిని ఛేదించాడు. మీకు అన్యాయాలు, అపకారాలు, మానభంగాలు జరిగినప్పుడు మీరు కూడ గొంతెత్తి ప్రతిఘటించండని ప్రోత్సాహించించాడు. క్రీస్తు హెచ్చరించి ప్రోత్సహించిందాకా ఆ దళితులకు ప్రతిఘటనం తెలియదు.

క్రీస్తు నెలకొల్పిన సమసమాజంలో సమానత్వం, సమకారం, సౌభ్రాత్రం, స్వేచ్ఛ, ప్రేమ, సేవ గొప్ప విలువలు. యూదులకూ అన్యజాతివారికీ మధ్య, యాజకులకూ గృహస్థులకూ మధ్య, స్త్రీ పురుషుల మధ్య, యజమానులకూ సేవకులకు మధ్య అంతరాలు గతించాయి - గల 3, 28. దళితులకు అతడు చేసిన ఉపకారం అది. మనదేశంలో లాగే యూదసమాజంలో గూడ స్త్రీలకు స్థానంలేదు. వాళ్లు దళితుల్లో దళితులు. భూమి, పశువులు, బానిసలు యజమానుని ఆస్తులు. స్త్రీలు కూడ ఈ యాస్తిలో ఓ భాగం. అనగా ఆమె వస్తువుకాని వ్యక్తికాదు - నిర్గ 20,17. వారికి ఆస్తిహక్కులేదు. భర్తలు వారి కెప్పుడైనా విడాకులు ఈయవచ్చు. వాళ్లు ఇంటిలో పడివుండాలేగాని సమాజంలో పదిమంది ముందుకి రాకూడదు. సమావేశాల్లో మాట్లాడకూడదు. కాని క్రీస్తు స్త్రీలను బంధించివుంచే దాస్య శృంఖలలను త్రెంచివేసాడు. తన శిష్యుల్లో మహిళలను కూడ చేర్చుకొన్నాడు. వాళ్లకు పురుషులతో సమానమైన గౌరవం విలువ యిచ్చాడు. ధర్మశాస్త్ర నియమాలను మీరి వాళ్లను తాకాడు, వాళ్లూ అతన్ని స్పృశించారు.

అతడు కననీయ స్త్రీ విశ్వాసాన్ని మెచ్చుకొన్నాడు. దేవళంలో దానం చేసినపేదరాలిని పొగడాడు. తనకు అభిషేకం చేసిన మహిళ కోపు తీసికొన్నాడు. సమరయస్త్రీ, మగ్దల మరియ అతనితో కలసి పనిచేసారు. తన రాజ్యంలో స్త్రీలకు కూడ పురుషులతో సమానమైన స్థానం కల్పించాడు. ఇంకా అతడు స్త్రీలతోపాటు చిన్న బిడ్డలకు కూడ యూద సమాజంలో స్థానం కల్పించాడు. అతడు వచ్చేవరకు యూదసమాజంలో పసిబిడ్డలు అనామకులు - 10, 13-16.

## 15. ధర్మశాస్త్రం, దేవాలయం

మతం, యాజకత్వం, దేవాలయం, పవిత్ర గ్రంథాలు, ధర్మశాస్త్రం అగ్రవర్గాల వారిని సమర్థించి దళితులను అణచివేస్తాయి. పాలస్తీనా దేశంలోను ఇండియాలోను కూడ ఇదే జరిగింది. పాలస్తీనాలో క్రీస్తు, మన దేశంలో అంబేద్కర్ పైవాటికి ఎదురు తిరిగారు. క్రీస్తు మోషేధర్మశాస్త్రంలో మార్పులు చేసాడు. మోషే తోడి నరుని హత్య చేయవద్దన్నాడు. నేనైతే తోడి నరుణ్ణి కోపించడం గూడ పనికిరాదని చెప్తున్నాను అన్నాడు - మత్త 5,21-22. ధర్మశాస్త్రాన్ని పేదసాదలకు అనుకూలంగా వుండేలా మార్చాడు. మనుధర్మశాస్త్రం పేదలను అణచివేస్తుంది కనుక అంబేద్కర్ దాన్ని నడివీధిలో తగలబెట్టాడు.

క్రీస్తుకి ముఖ్యమైన విలువలు న్యాయం, కరుణ, ప్రేమ, సేవ మొదలైనవి. కనుక అతడు డాంబికులైన పరిసయులను నిశితంగా దూయబట్టాడు. వాళ్లు సున్నంగొట్టిన సమాధుల్లాంటి వాళ్లన్నాడు - మత్త 23. అతడు పేదసాదలను రోగులను ఆదరించవలసివచ్చినపుడు విశ్రాంతి దిన నియమాలను ఖాతరు చేయలేదు. విశ్రాంతి దినం నరుని కొరకు వుందిగాని నరుడు విశ్రాంతిదినం కొరకు లేడని పల్కాడు - మార్కు 2, 27. ఇది యూదమతం మీద పెద్ద తిరుగుబాటు. సనాతన వాదులకు చెప్పుదెబ్బ. ఇంకా అతడు దేవుడు కోరేది కరుణ న్యాయాలుగాని జంతుబలులు కాదన్నాడు - మత్త 9,13. ఇది దళితులను దోపిడి చేస్తున్న యాజకులకు చెంపదెబ్బ. మంచి సమరయుని కథలో అతడు యాజకులు లేవీయులు పేదలను పట్టించుకోరని రుజువు చేసాడు.

యూదుల పలుకుబడి, శక్తి, అధికారం వాళ్ల దేవాలయంలో కేంద్రీకృతమై యుంది. సద్దూకయులు దానిలో బలిపశువులనమ్మి లాభాలు పొందుతున్నారు. నాణాలుమార్చే వ్యాపారులు పేదలను కొల్లగొడుతున్నారు. అన్యజాతివారికి దానిలో ప్రవేశంలేదు. పూర్వం మనదేశంలో గూడ దళితులకు దేవాలయ ప్రవేశం లేదు. కనుక క్రీస్తు దేవాలయ వ్యవస్థను దుయ్యబట్టాడు. "నా ఆలయం అన్ని జాతులకు ప్రార్థనాలయం" అన్నాడు - మార్కు 11, 17. మన దేశంలో దేవాలయ ప్రవేశానికి దళితులు చేసిన ఆందోళనకు క్రీస్తు ప్రాతిపదికగా వుంటాడు.

క్రీస్తు యెరూషలేము దేవాలయం వల్ల రక్షణం కలుగదన్నాడు. పేదసాదలను బడుగువర్గాలను ఆదుకోవడంవల్ల ముక్తి కలుగుతుందన్నాడు. వారికి చేసిన సేవ తనకు చేసినట్లేనన్నాడు. ఇదే తుది తీర్పు సామెత సందేశం - మత్త 25, 31-46. కనుక దేవాలయారాధనలో జంతుబలులు ముఖ్యంకాదు. హీనులనూ దీనులనూ ఆదుకోవడమే ముక్తికి మార్గం.

# 6. దళితుల కొరకు నవసమాజ స్థాపనం

## 16. నవసమాజ సభ్యులు

క్రీస్తు దళితుల కొరకు నవసమాజాన్ని ఏర్పాటు చేసాడు. సమానత, స్వేచ్ఛ, పంచుకోవడం, సేవ మొదలైనవి ఈ నూత్న సమాజ లక్షణాలు. క్రీస్తుకి ముందే యూదుల్లో విప్లవవాదులు, ఎస్సీనులు, పరిసయులు మొదలైనవాళ్లు తమసమాజాలను ఏర్పాటు చేసికొన్నారు. కాని క్రీస్తు సమాజానికి లభించిన విజయం వాటికి లభించలేదు. అతని

సమాజం విశేషంగా బడుగువర్గాలవారిని ఆదుకోవడానికి ఉద్దేశింపబడింది. దానిలో పంచుకోవడం, సేవచేయడం, జాతి లింగ వివక్ష చూపకపోవడం అనే గుణాలున్నాయి.

క్రీస్తు స్థాపించిన నవసమాజమే దైవరాజ్యం. ఆనాటి పాలస్తీనా దేశంలోని పేదవర్గాలన్నీ దానిలో చేరాయి. వాళ్లు ఇప్పటి మన దేశంలోని దళితులు, ఆదివాసీలు, గిరిజనులు మొదలైన వాళ్లకు సమానం. ధనికులు, అగ్రవర్గాలు, అధికారవర్గాలు మాత్రం దానిలో చేరలేదు. వాళ్లు హెరోదు, కైసరు, సైతాను సమాజానికి చెందినవాళ్లు.

## 17. నవసమాజ లక్షణాలు

క్రీస్తు స్థాపించిన నవసమాజ లక్షణాలు ప్రేమ, న్యాయం, శాంతి మొదలైనవి. వారికి తిండి, స్వేచ్ఛ, సహవాసం లభిస్తాయి. అందరికీ సౌభ్రాత్రం వుంటుంది. స్త్రీలకు గౌరవం, పిల్లలకు భద్రత లభిస్తాయి. దాని ప్రణాళికను క్రీస్తు నజరేతులోనే విశదం చేసాడు. అది పేదలకు సువార్తను బోధించే రూపంలో వుంటుంది - లూకా 4,18. అది బడుగు వర్గాల వారికి కరుణ జూపుతుంది.ధనికులను అగ్రవర్గాలవారిని పేదలను ఆహ్వానింపమని హెచ్చరిస్తుంది.

ఈ సమాజం నైతిక సూత్రాలు ముఖ్యంగా మూడు. అవి 1 స్వేచ్ఛ, 2 సహవాసం, 3 న్యాయం. మొదటిది, స్వేచ్ఛ. క్రీస్తు ప్రజలను పాపదాస్యం నుండి విడిపించాడు. పిశాచ శక్తులనుండీ, సంఘ బహిష్కారం నుండీ విడిపించాడు. ధర్మశాస్త్రం కట్టుబాట్ల నుండీ, కర్మకాండ నియమాలనుండీ విడిపించాడు.

రెండవది, సహవాసం. ఇక్కడ ఉన్నవాళ్లు లేనివాళ్లతో పంచుకోవాలి. క్రీస్తు పేదలను ఆదుకొమ్మన్నాడు. పేదసాదలను పట్టించుకొంటే దేవుణ్ణి పట్టించుకొన్నట్లు అని చెప్పాడు. నేను మిమ్ము ప్రేమించినట్లే మీరూ ఒకరి నొకరు ప్రేమించండి అన్నాడు - యోహా 13, 34. అక్కరలో వున్నవారిని ఆదుకొంటే తన్ను ఆదుకొన్నట్లేనని చెప్తూ తుది తీర్పు సామెతను బోధించాడు - మత్త 25,40.

మూడవది న్యాయం. క్రీస్తు దేవాలయంలో జరిగే అన్యాయాలను, సమాజంలో ధనికులు పేదలకు చేసే అన్యాయాలను ఎదిరించాడు. పిశాచశక్తికి ఎదురు నిల్చి బలవంతుణ్ణి జయించిన బలవంతుడు అయ్యాడు - మార్కు 3,27.

## 18. దళితోద్యమం భవిష్యత్తు

క్రీస్తు దళిత విమోచనోద్యమానికి సిలువ గురుతుగా వుంటుంది. అది విప్లవ చిహ్నం. పోరాటానికి గురుతు. మనిషిలో మార్పు రావాలనడానికి సంకేతం. నేడు దళితులు దానినుండి ప్రేరణం పొందాలి.

దళితోద్యమం మన దేశంలో పూర్వం బుద్ధునితోనే ప్రారంభమైంది. అతడు బ్రాహ్మణవర్గాన్ని ఎదిరించి బడుగువర్గాన్ని ఆదుకొన్నాడు. ఆపిమ్మట అది మధ్యయుగాల్లోని భక్తి ఉద్యమంలో పొడచూపింది. ఈ వుద్యమం పామరులకు కూడ ముక్తి లభిస్తుందని చాటి చెప్పింది. మన కాలంలో అది అంబేద్కరు ఉద్యమంలో మళ్లా తలయెత్తింది. బుద్ధుని విప్లవభావాలు క్రీస్తులో ఫలసిద్ధినందాయి.

క్రీస్తు నవసమాజ భావాలు 300 యేండ్లపాటు ప్రజలను తీక్షణంగా ప్రభావితం చేసాయి. కాని మూడవ శతాబ్దంలో కోన్‌స్టంటయిను చక్రవర్తి క్రైస్తవుడు కావడంతో క్రీస్తు విప్లవ భావాలు వాటి తీక్షణతను కొంతవరకు కోల్పోయాయి. కాని శతాబ్దాల పొడుగున అవి పేదసాదలను ప్రభావితం చేస్తూనే వచ్చాయి. ఆధునిక కాలంలో లక్షలకొలది దళితులు క్రీస్తు ప్రేమ తత్వానికీ స్వార్థ త్యాగానికీ మురిసిపోయి అతని శిష్యులయ్యారు. ఇది బ్రాహ్మణ హిందూమతానికి ఎదురు నిల్చే ఉద్యమం. ఇది భవిష్యత్తులో కూడ కొనసాగుతుంది.

కులవాదం భారతీయులను బందీలను చేసింది. కులం చెరసాల కొంతవరకు కూలిపోయినా ఇంకా నిల్చేవుంది. చాలమంది క్రైస్తవులు కూడా దానిలో బందీలైయున్నారు. ఈ కులం కోటను నేడు మనం పూర్తిగా కూల్చివేయాలి. క్రీస్తు ప్రారంభించిన దళితోద్యమాన్ని మనం కొనసాగించుకొని పోవాలి. దళితుల హక్కులను నిలబెట్టాలి. అందరూ క్రీస్తు ఉద్యమానికి చేయూతనిచ్చి నవసమాజ స్థాపనకు కంకణం కట్టుకోవాలి.

# 9. క్రీస్తూ - స్త్రీలూ

బైబులు భాష్యం - 99

## విషయసూచిక



## 1. యూద సమాజంలో స్త్రీల స్థానం

క్రీస్తు స్త్రీలతో మెలగిన తీరును అర్థంచేసుకోవాలంటే మొదట ఆనాటి యూద సమాజంలో స్త్రీలకున్న స్థానాన్ని సరిగా గ్రహించాలి. యూద మహిళలు మైనరు వ్యక్తుల క్రిందే లెక్క. కనుక న్యాయసభలో వాళ్ళ సాక్ష్యం చెల్లదు. వాళ్లు కోర్టుకు వెళ్ళి న్యాయాన్ని పొందలేరు. స్త్రీలకు చదువు ఎంతమాత్రం వుండేదికాదు. వాళ్ళు బైబులు చదవలేరు. రబ్బయుల దగ్గర ధర్మశాస్త్రం చదువుకొనేది మగపిల్లలు మాత్రమే. స్త్రీలకు ఆస్తిహక్కులేదు. తండ్రికి మగసంతానం లేనప్పుడు మాత్రమే అతని ఆస్తి కూతురుకి సంక్రమించేది.

ఇంటిపని విశేషంగా మహిళలది. వాళ్లు భోజనం సిద్ధంజేయాలి, నీళ్ళు తీసికొనిరావాలి, బట్టలు తయారుచేయాలి. కనుక పిండి విసిరి రొట్టెలు కాల్చడం, వంటచెరకు నీళ్ళు తీసికొని రావడం, బట్టలు నేయడం కుట్టడం మొదలైన నానా కార్యాలతో ఆడవాళ్ళు దినమంతా సతమతమైపోయే వాళ్లు. వీటితోపాటు మందలుకాయడం, పొలంలో పైరువేసి కోతకోయడం మొదలైన వ్యవసాయపు పనుల్లోగూడ స్త్రీలు పాల్గొనేవాళ్లు.

యూదులది పితృస్వామ్య వ్యవస్థ. యువతులకు 12 - 13 ఏండ్ల ప్రాయంలో పెండ్లిజేసేవాళ్ళు. పెండ్లి సొంత తెగలోనే కుదిర్చేవాళ్లు. వరుడు వధువు తండ్రికి కన్యాశుల్కం చెల్లించాలి. ఆమె బంధువులకు కానుకలీయాలి. వివాహంతో వధువు వరుని ఆస్తిఔతుంది. అతడు ఆమెకు యజమానుడు, అధిపతి (బాలు) ఔతాడు - నిర్గ 20,17. మగబిడ్డను కనిన స్త్రీకి మన్నన వుంటుంది. ఆడబిడ్డలను కనినా, అసలు బిడ్డలనే కనకపోయినా

ఆమెను నీచంగా జూచేవాళ్ళు. స్త్రీకి వ్యక్తిగా విలువలేదు. మగబిడ్డలను కనినదానినిబట్టీ, కాయకష్టం చేసినదానినిబట్టీ ఆమెకు విలువ వుంటుంది, అంతే. ఐనా యూదులు బిడ్డల తల్లిని గౌరవించేవాళ్ళు. కొన్ని సందర్భాల్లో భార్యలు భర్తలకు గౌరవం తెచ్చిపెట్టారు. దెబోరా, యూదితు మొదలైనవాళ్లు ఈలాంటివాళ్లు. యూదమహిళలకు గౌరవమిచ్చేది మాతృత్వం. కన్యాత్వం, వంధ్యాత్వం శాపాలు.

మొదటలో యూదులు ఏకపత్నీ వ్రతులే. కాని కాలక్రమేణ బహుభార్యాత్వం వ్యాప్తిలోకి వచ్చింది. కనుక సంపన్నులైన పురుషులకు సొంత భార్యలతోపాటు ఉపపత్నులు కూడ వుండేవాళ్లు. వీళ్లు ఉంపుడుగత్తెలుకాదు, నిజమైన భార్యలే. కాని వీళ్ల బిడ్డలకు వారసపుహక్కు వుండదు.

భార్య వ్యభిచారం భర్త హక్కులను భంగపరుస్తుంది. కనుక అతడు ఈ నేరం కారణంగా ఆమెకు విడాకులీయవచ్చు. ఈ సందర్భంలో అతడు విడాకుల చీటినిచ్చి ఆమెను ఇంటినుండి పంపివేయవచ్చు. భర్త వ్యభిచారం భార్య హక్కులను భంగపరచదు. అసలు ఆమెకు హక్కులనేవి వుంటేగదా! పురుషుడు కన్యతో వ్యభిచరిస్తే అది నేరం కాదు. ఎందుకంటే ఆమెకు భర్తలేదు కనుక పురుషుని హక్కుల కేభంగం కలుగదు. మగవాళ్లేగాని ఆడవాళ్లు విడాకులు ఇచ్చేవాళ్లుకాదు.

విధవలు పెద్దకుమారుని పోషణంలో వుండేవాళ్ళు. పెద్దకొడుకు పట్టించుకోకపోతే సమాజం, దుష్టులైన న్యాయాధిపతులు కూడ వాళ్ళను దోచుకొనేవాళ్ళు.

ఐనా యూదస్త్రీలకు కొంత స్వేచ్ఛ లేకపోలేదు. వాళ్ళు పర్దా లేకుండానే యిరుగుపొరుగు ఇండ్లకు వెళ్ళవచ్చు. స్వేచ్ఛగా పొలం పనికి పోవచ్చు. పండుగల్లో పాటలు పాడవచ్చు, నాట్యం చేయవచ్చు. దేవాలయంలో కానుకలు అర్పించవచ్చు. నైవేద్యాలు ఆరగించవచ్చు. కాని భర్త అనుమతి లేనిదే భార్య ఏ వ్రతాలు చేపట్టకూడదు. బాబిలోనియా ప్రవాసానంతరం యూద స్త్రీలు ఇల్లు విడిచి బయటికి పోయినప్పుడెల్ల పర్దా ధరించవలసివచ్చేది.

ఈ కాలంలో వ్రాసినవే విజ్ఞాన గ్రంథాలు. ఈ పుస్తకాలు వ్రాసిన రచయితలకు స్త్రీలపట్ల సద్భావంలేదు. వీళ్లు పురుషులను చెడగొట్టేవాళ్ళనుగా స్త్రీలను వర్ణించారు. కనుక యువకులు స్త్రీల వలల్లో చిక్కుకోగూడదని పదేపదే హెచ్చరిస్తుంటారు - సామె 6, 23-35. 7,5-27. కొందరు ప్రవక్తలు కూడ ఇదే మార్గంలో పోయారు. ఉదాహరణకు, జెకర్యా దుష్టత్వమంతా స్త్రీలకే అంటగట్టాడు - 5, 5-7. మామూలుగా యూదపురుషులు స్త్రీలతో కలవడంగాని వాళ్ళతో మాట్లాడ్డంగాని దురాచారంగా భావించేవాళ్ళు. బెన్ జొక్కయి

అనే రబ్బయి తాను స్త్రీగా పుట్టనందుకూ, అన్యజాతుల్లో పుట్టనందుకూ, ధర్మశాస్త్రం తెలియని సుంకరుల్లో పుట్టనందుకూ రోజూ దేవునికి వందనాలు అర్పించాడు. ఇతడు ఆనాటి చాలమంది యూద పురుషుల భావాలకు అద్దంపడతాడు. ఈలాంటి పరిస్థితుల్లో క్రీస్తు స్త్రీలపట్ల ఎంతో కరుణాపూరితంగా మెలిగాడు.

## 2. క్రీస్తు స్త్రీల కిచ్చిన విలువ

ప్రభువు ఆనాటి పరిసయులతోను సద్దూకయులతోను స్త్రీల హక్కులనుగూర్చి వాదించాడు. ఒకసారి అతడు ఆదికాండంలో స్త్రీ పుట్టువును తెలియజేసే వేదవాక్యాలను ఉదాహరించాడు. "దేవుడు మానవజాతిని సృజించాడు. తన్ను పోలునట్లుగా మానవుని చేసాడు. స్త్రీ పురుషులనుగా మానవులను సృజించాడు" - 1,27. ఇక్కడ ఈ వేదవాక్యాల భావమేమిటంటే, స్త్రీ పురుషులు సరిసమానం. వాళ్ళిద్దరిలోను దేవుని పోలిక వుంది. స్త్రీ పురుషుని కొరకులేదు. పురుషుని తర్వాత పుట్టలేదు. పురుషుడు పుట్టినప్పుడే తానూ పుట్టింది. కనుక వాళ్ళిద్దరికీ ఒకటే విలువ. ఒకటే స్వేచ్ఛ. వాళ్ళిద్దరు ఒకరితో ఒకరు సహకరిస్తూ పరస్పర ఐక్యభావంతోను ప్రేమ భావంతోను జీవించాలి. ఒకరి వలన ఒకరు పరిపూర్ణులు కావాలి. ఆ ఇద్దరికీ ఆధారభూతుడూ, ఇద్దరి గమ్యం ఒక్కడే - భగవంతుడు. వాళ్ళల్లో లింగభేదంవున్నా వాళ్ళిద్దరి స్వభావం వొకటే. విలువలోను, స్వేచ్ఛలోను ఇద్దరు సరిసమానులు. హీబ్రూ బైబులు ఆదాముని ఈష్ ఆనీ ఏవను ఈషా అనీ పిలుస్తుంది. అనగా అతడు నరుడు, ఆమె నారి. ఈ సందర్భంలో క్రీస్తు స్త్రీపురుషుల సమానత్వాన్ని సమర్థించినట్లుగానే మనం అర్థం చేసికోవాలి - మత్త 19, 1-5.

యూదుల భావం ప్రకారం స్త్రీకి వివాహం చేసికోవడం బిడ్డలను కనడం తప్పితే వేరే ధ్యేయం లేదు. క్రీస్తు ఈ భావాన్ని నిరసించాడు. పరలోక జీవితంలో పురుషునికీ స్త్రీకీ గూడ వివాహముండదు, అక్కడ దంపతులు బిడ్డలను కనరు అని చెప్పాడు. వివాహ వ్యవస్థ ఈ లోకానికి పరిమితం. పరలోకంలో దానికి విలువలేదు. కనుక వివాహిత కాకపోయినా స్త్రీకి విలువ వుంటుందని క్రీస్తు భావం. ఆమె తనంతట తాను విలువ కలది - మార్కు 12, 24-25. ఈ భావాలు నాటి యూదుల భావాలకు కేవలం భిన్నమైనవి.

క్రీస్తు ఏకపత్నీ వ్రతాన్ని పాటించమని యూదులకు బోధించాడు. ఇది సృష్టికర్త ఆశయం. భార్యాభర్తలు వివాహంద్వారా ఒకరితో ఒకరు నిబంధనం చేసికొని పరస్పర ప్రేమభావంతోను, ఐక్యభావంతోను, సహకార భావంతోను జీవించాలి. వాళ్ళిద్దరూ కలసి ఏకవ్యక్తి కావాలి - ఆది 2, 24. మత్త 19,6. సృష్టికర్త నిర్ణయించిన వివాహబంధం ఇది. ఈ బంధాన్ని నరమాత్రు లెవరూ త్రెంచివేయకూడదు. అనగా విడాకులు పనికిరావు.

ఈ సందర్భంలో పరిసయులు, మోషే భార్యాపరిత్యాగాన్ని అంగీకరించాడు కదా అని ఎదురు ప్రశ్న వేసారు. దానికి జవాబుగా ప్రభువు మీ హృదయ కాఠిన్యాన్ని బట్టి మోషే విడాకులను అంగీకరించాడుగాని సృష్ట్యాదిలో ఈ పద్ధతిలేదు అని చెప్పాడు. యూదులు స్త్రీలను న్యూనంగా చూచి క్రూరంగా హింసించేవాళ్ళు. పురుషులనుండి ఈ బాధలను భరించడంకంటె స్త్రీకి విడాకులే మేలు అన్న తలంపుతో మోషే భార్యా పరిత్యాగాన్ని అంగీకరించాడు. అంతే కాని ఇది దేవుని చిత్తంకాదు. యూద పురుషుల దుష్టత్వం వలన పుట్టిన దురాచారం.

పైగా మోషే విడాకులను అంగీకరించాడేగాని పునర్వివాహాన్ని అంగీకరించలేదు. కనుక విడాకులు పొందిన వాళ్ళు మళ్ళా అన్యులను పెండ్లాడితే అది వ్యభిచారం క్రిందే లెక్క అన్నాడు క్రీస్తు - మత్త 19, 7-9.

క్రీస్తునాడు యూద సమాజంలో స్త్రీలకు ఆదరణ లేదని చెప్పాం. ఐనా క్రీస్తు కొందరు పుణ్యస్త్రీలను శిష్యురాళ్ళనుగా చేర్చుకొన్నాడు. వీళ్ళు ప్రేషిత ప్రయాణాల్లో క్రీస్తు వెంట వెళ్ళేవాళ్ళు. తమ సొంత డబ్బునే వెచ్చించి క్రీస్తు మరియు శిష్యుల భోజనావసరాలను తీర్చేవాళ్ళు. వీళ్ళల్లో హెరోదు గృహనిర్వాహకుడైన ఖూజా అనేవాని భార్యయైన యోహాన్న కూడ వుంది. ఈమె సంపన్నవర్గం మహిళ - లూకా 8, 1-3. క్రీస్తు ఈ పుణ్యస్త్రీలను ఆదరంతో జూచాడు, స్త్రీ విద్య బొత్తిగాలేని ఆ రోజుల్లో వారికి బైబులు బోధలు నేర్పించాడు. యూదులు స్త్రీని సంతానాన్ని ఉత్పత్తి చేసేదాన్ని గాను, కాయకష్టంచేసి డబ్బు గడించే దాన్ని గాను మాత్రమే పరిగణించారు. కాని క్రీస్తు ఆమెను దేవుని రూపంగల మనుష్య వ్యక్తినిగా గుర్తించాడు. అతని దృష్టిలో పురుషుడెంతో స్త్రీ అంత. వారిద్దరి విలువ సరిసమానమే.

# 3. స్త్రీలపట్ల క్రీస్తు దృక్పథాలు

## 1. స్త్రీల గృహకృత్యాల్లో ఆసక్తి చూపడం

ప్రభువు దైవరాజ్య వ్యాప్తికి స్త్రీలు పులియబెట్టిన పిండిని వుపమానంగా తీసికొన్నాడు. కొంచెం పులిసిన పిండి మూడు కుంచాల మామూలు పిండిని పులియబెట్టింది. పులిసిన పిండి పెరుగుతుంది. ఈ పిండితోనే రొట్టెలు చేస్తారు. ఈలాగే దైవరాజ్యం క్రీస్తునాడు చిన్నదిగావున్నా తర్వాత విస్తారంగా వ్యాపిస్తుందని భావం - మత్త 13, 33.

ప్రభువు ప్రాతనిబంధనానికి క్రొత్త నిబంధనానికీ చాల తేడావుందని చెప్తూ స్త్రీలు బట్టలకు మాసికవేసే విధానాన్ని ఉపమానంగా తీసికొన్నాడు. ఆడవాళ్ళు ప్రాతగుడ్డను

క్రొత్త గుడ్డకు మాసికవేయరు. అలావేస్తే మాసిక నిలువదు. ఆలాగే ప్రాతనిబంధనకూ క్రొత్త నిబంధనకూ పొత్తు కుదరదని క్రీస్తు భావం - 9, 16.

మనం ఎడతెగక దేవుణ్ణి వేడుకొంటూండాలి అని చెప్పడానికి క్రీస్తు పదేపదే న్యాయాధిపతి దగ్గరికి వెళ్లిన పేదరాలిని వుపమానంగా తీసికొన్నాడు. ఆమె మళ్లామళ్లా న్యాయాధిపతిని సమీపించి తనకు న్యాయం చెప్పమని పీడించింది. కడన అతడు ఆమెకు అనుకూలంగా తీర్పు చెప్పాడు. మనం కూడా ఈ పేదరాలిలాగ విసుగూవిరామం లేకుండ దేవుణ్ణి అడుక్కోవాలని భావం - లూకా 18, 1-5.

ప్రజలు దైవరాజ్యంలో చేరడంలో ఆలస్యం చేయగూడదనీ వేగిరమే ఆ పనిని చేయాలనీ బోధించడానికి ప్రభువు పదిమంది కన్నెల కథ చెప్పాడు. వీరిలో ఐదుగురు సకాలంలో వివాహానికి వచ్చారు, ఐదుగురు ఆలస్యంగా వచ్చారు. ఈ రెండవ వర్గంవారికి ఆశాభంగం కలిగింది. ఈలాగ క్రీస్తు బోధలను సత్వరమే అంగీకరించని యూదులకు కూడా ఆశాభంగం కలుగుతుందని భావం - మత్త 25, 1-13. ఈలా స్త్రీల గృహకృత్యాలనుండీ సాంఘికాచారాలనుండీ ప్రభువు తన వుపమానాలను ఎన్నుకొన్నాడు. దీన్నిబట్టి అతనికి స్త్రీజాతి పట్ల ఎంతో ఆదరభావం వుందని అర్థంజేసికోవాలి.

## 2. స్త్రీలతో కలియడం

ఒకసారి తల్లులు పసిబిడ్డలను క్రీస్తు దగ్గరికి తీసికొని వచ్చి ఆ బిడ్డలను దీవించమని అడిగారు. మొదట శిష్యులు ఆ తల్లులను అడ్డగించారు. వాళ్ళను క్రీస్తు సమీపంలోనికి రానీయలేదు. మా గురువుగారు అలసిపోయి వున్నాడు వెళ్లిపొండి అన్నారు. కాని క్రీస్తు శిష్యులను కోపించి ఆ తల్లులను తనదగ్గరికి పిలిపించుకొన్నాడు. ఆ బిడ్డలను ఎత్తి కౌగిలించుకొని దీవించాడు. ఈలా అతడు స్త్రీలనీ చిన్నబిడ్డలనీ ఆదరణతో జూచాడు. శిష్యులు కూడ ఆ బిడ్డల్లాగే తయారు కావాలని మందలించాడు. శిశువులు తల్లిదండ్రుల మీద ఆధారపడి జీవించినట్లే వాళ్లూ దేవునిమీద ఆధారపడి జీవించాలని బోధించాడు. యూద రబ్బయులు స్త్రీలకు దూరంగా వుండేవాళ్లు. దీనికి భిన్నంగా ప్రభువు స్త్రీలతో కలిసాడు - మార్కు 10, 13-16.

పాపాత్మురాళ్ళయిన స్త్రీలతో మెలిగేప్పుడు గూడ క్రీస్తు చాల దయాపూర్వకంగా ప్రవర్తించేవాడు. వ్యభిచారంలో పట్టుబడిన మహిళతో "నేనుకూడా నీకు శిక్ష విధించను, ఇక వెళ్ళు. మళ్ళా పాపం చేయకు అని మృదువుగా పలికాడు - యోహా 8, 11. సమరయ స్త్రీతో మనసుకు నొప్పి కలగనట్లుగా సున్నితంగా మాట్లాడాడు. తన పాదాలను కన్నీటితో తడిపిన స్త్రీని ఈమె అధికంగా ప్రేమించి అధికంగా పాపపరిహారం పొందిందని

మెచ్చుకొన్నాడు - లూకా 7, 47. ఈ పాపాత్ములందరితోను ప్రభువు వీళ్ళు కూడ ముఖ్యమైనవాళ్ళే అన్నట్లుగా ప్రవర్తించాడు.

రబ్బయులు బహిరంగంగా స్త్రీలతో మాట్లాడకూడదు. ఈ నియమాన్ని మీరి క్రీస్తు అందరియెదుట మహిళలతో మాట్లాడాడు. అలా అతడు సమరయ స్త్రీతో మాట్లాడ్డం జూచి శిష్యులే విస్తుపోయారు - యోహా 4, 27. స్త్రీలు రబ్బయుల దగ్గరికి రానేకూడదు. రబ్బయులను ఎంతమాత్రం ముట్టుకోగూడదు. కాని రక్తస్రావ రోగంతో బాధపడుతూ అశుద్ధురాలుగా గణింపబడిన స్త్రీ ప్రభువు అంగీ అంచును ముట్టుకొన్నా అతడు కోపించలేదు - లూకా 8, 43-48. ఆలాగే పాపాత్మురాలు తన పాదాలను తాకినా అతడు నొచ్చుకోలేదు - 7, 38. అతనికి స్త్రీలపట్ల చిన్నచూపులేదు.

క్రీస్తు వ్యాధి నయంజేసిన మొదటి స్త్రీరోగి పేత్రు అత్త. ఆమె కృతజ్ఞతాపూర్వకంగా అతనికి భోజనం వడ్డించింది. అటుతర్వాత క్రీస్తు అనేక పర్యాయాలు పేత్రు అత్తనుండి ఆతిథ్యం స్వీకరించి వుండాలి - మత్త 8, 14-15. అలాగే అతడు బెతనీ గ్రామంలో వసించే మరియా మార్తల యింటిలో గూడ ఆతిథ్యం పుచ్చుకొన్నాడు - లూకా 10, 38-42. ప్రేషిత ప్రయాణాల్లో కొందరు స్త్రీలు తమ డబ్బుతోనే అతనికి భోజనం సమకూర్చేవాళ్ళని ముందే చెప్పాం - లూకా 8,3. ఈ వుదాహరణలను బట్టి అతడు స్త్రీలతో సులువుగా కలిసేవాడనీ వాళ్ళు పెట్టిన అన్నాన్ని గూడ ఆదరంతో భుజించేవాడనీ అర్థంజేసికోవాలి.

## 3. స్త్రీలను సమర్థించడం, ప్రశంసించడం

యూద సమాజంలో స్త్రీలకు చాల అన్యాయాలు జరుగుతుండేవి. కనుక క్రీస్తువారి కోపు తీసికొన్నాడు. వారిని మెచ్చుకొన్నాడు. ఒకోసారి తప్పుచేసిన స్త్రీలను గూడ సమర్థించాడు. వ్యభిచారంలో పట్టుబడిన స్త్రీని యూదులు రాళ్ళతో కొట్టి చంపడానికి సిద్ధమయ్యాడు. క్రీస్తు మీలో తప్పులేనివాడు ఆమెమీద మొదటిరాయి వేయండి అన్నాడు. ఎవడూ ఆమెమీద రాయి విసరడానికి సాహసించలేదు. ఇక్కడ క్రీస్తు ఆమె పాపాన్ని సమర్థించలేదు. కాని ఆ పాపాత్మురాలిని సమర్థించాడు. కరుణతో ఆమె తప్పిదాన్ని మన్నించాడు. కాని యూదుల పాపాలను మాత్రం వ్రేలెత్తి చూపాడు - యోహా 8, 7-11.

సీమోను ఇంటిలో క్రీస్తు పాదాలకు పరిమళ ద్రవ్యం పూసిన వ్యభిచారిణి మరియ కథకూడ ఈలాంటిదే. సీమోను ఈమెను పాపినిగా గణించి ఖండించాడు. కాని క్రీస్తు ఈమెను సమర్థించాడు. ఈమె క్రీస్తు బోధను విని విశ్వసించింది. సీమోను అలా విశ్వసించలేదు. ఈమె పశ్చాత్తాపపడ్డం వల్ల ప్రభువు ఈమె పాపాలను మన్నించాడు.

కాని సీమోను తన పాపాలకు పశ్చాత్తాపపడనూ లేదు, పాపక్షమను పొందనూలేదు. ఈమె క్రీస్తుకు మర్యాదచేసింది. సీమోను ఈ మర్యాద కూడ చేయలేదు. కనుక తాను నీతిమంతుణ్ణని యెంచే సీమోనుకంటె మరియయే ఉత్తమురాలని క్రీస్తుభావం - లూకా 7, 36-38.

యూదులు స్త్రీలను పనికత్తెలనుగా కొరగానివాళ్ళనుగా భావించేవాళ్ళు. కాని క్రీస్తు మాత్రం వాళ్ళను విలువతో జూచాడు. ఓసారి అతడు కానుకల పెట్టెవద్ద కూర్చుండి భక్తులు పెట్టెలో కానుకలు వేసే తీరును గమనిస్తున్నాడు. ఉన్నవాళ్ళు దానిలో పెద్దమొత్తాలే వేసారు. అంతలో ఓ పేద విధవ వచ్చి రెండు పైసలు మాత్రమే వేసింది. క్రీస్తు ఆమె త్యాగాన్ని మెచ్చుకొన్నాడు. ఈమె అందరికంటె ఎక్కువగా దానంజేసింది. తన జీవనాధారమంతా త్యాగం చేసింది అన్నాడు. ఆమె ఎవరికంటా బడకుండా, ఎవరిమెప్పు పొందకుండా దాటిపోయింది. కాని క్రీస్తు మాత్రం ఆమెను మెచ్చుకొన్నాడు - మార్కు 12, 41-44.

బెతనీ గ్రామంలో పాపాత్మురాలు పరిమళ తైలంతో ప్రభువు పాదాలు అభిషేకించింది. అక్కడి వాళ్ళకు ఆ కార్యం నచ్చలేదు. వాళ్ళు ఇంత పరిమళ ద్రవ్యాన్ని వృథాగా వ్యయంజేయడం దేనికి? దీనినమ్మి పేదవాళ్ళకు దానం చేయవచ్చుగదా అన్నారు. కాని క్రీస్తు ఆ భక్తురాలి కోపు తీసికొన్నాడు. "మీరు ఈమెను పీడించడం దేనికి? ఈమె నా భూస్థాపనాన్ని సూచిస్తూ నన్ను అభిషేకించింది. ఈ సువార్తను బోధించే తావులన్నిటిలోను ప్రజలు ఈమె పుణ్యకార్యాన్ని గూర్చి చెప్పుకొంటారు" అన్నాడు - మార్కు 12, 41-44.

ఓసారి అన్యజాతికి చెందిన స్త్రీ వొకతె వచ్చి తన బిడ్డకు పట్టిన దయ్యాన్ని పారదోలమని క్రీస్తుని వేడుకొంది. శిష్యులుకూడ ఆమె తరపున ప్రభువుకి సిఫార్సు చేసారు. క్రీస్తు ఇంటిలోని బిడ్డల రొట్టెను కుక్కలకు వేయకూడదన్నాడు. అనగా సొంతజాతి ప్రజలైన యూదులను వదలివేసి అన్యజాతి ప్రజలకు సేవలు చేయడం భావ్యం కాదని భావం. కాని ఆమె వినయంతో అయ్యా! భోజనపు బల్లమీదినుండి పిల్లలు పడవేసే రొట్టెముక్కలను ఆ బల్లక్రింది కుక్క పిల్లలు తింటాయికదా అంది. అనగా మీరు మొదట యూదులకే సేవలు చేయండి. అటుతర్వాత అన్యజాతి జనులమైన మాకు గూడ మీ సేవలు అందించండి అని భావం. ప్రభువు ఆమె వినయ విశ్వాసాలకు విస్తుపోయి అమ్మా! నీ విశ్వాసం గొప్పది. నీ బిడ్డ బ్రతుకుతుంది పో అని చెప్పాడు. ఇక్కడ క్రీస్తు ఈ యన్యజాతి స్త్రీ విశ్వాసాన్ని మెచ్చుకొన్నాడు - మత్త 15, 21-28.

క్రీస్తుని సిలువ వేయడానికి తీసికొని పోయేటప్పుడు యెరూషలేము పుణ్యస్త్రీలు అతనిపై సానుభూతి చూపిస్తూ పెద్దగా ఏడ్చారు. క్రీస్తు వారి సద్భావాన్ని గుర్తించి మీరు నా కొరకు సంతాపపడవద్దు, మీ బిడ్డలకొరకు దుఃఖించండి అన్నాడు. అనగా త్వరలోనే రోమనులు యెరూషలేమును నాశం చేస్తారు. అప్పుడు యూదస్త్రీలూ వారిబిడ్డలూ నానా యాతనలకు గురౌతారు. కనుక ఆ తల్లులు ముందుగానే తమ బిడ్డలకొరకు ఏడ్వాలని భావం. ఇక్కడ పుణ్యస్త్రీలు క్రీస్తుపట్ల చూపిన జాలికంటే అతడు వారిపట్ల చూపిన జాలిగొప్పది - లూకా 23, 27-28.

## 4. స్త్రీల కొరకు అద్భుతాలు చేయడం

ప్రభువు స్త్రీలపై జాలికలిగి అద్భుతాలుచేసి వాళ్ళ వ్యాధిబాధలను తొలగించాడు. మగ్దల మరియకు ఏడుదయ్యాలు పున్నాయి. ఇక్కడ ఏడు దయ్యాలంటే అర్థం ఏమిటి? యూదుల భావాల ప్రకారం ఏడు పరిపూర్ణతను తెలియజేస్తుంది. అనగా మరియ పూర్తిగా దయ్యం అధీనంలో వుందని భావం. కనుక ఆమె పరిస్థితి దారుణంగా వుండి వుండాలి. ప్రభువు ఆ స్త్రీపై జాలిగలిగి ఆమె నుండి పిశాచాన్ని పారదోలాడు - లూకా 8,2.

రక్తస్రావరోగి ప్రభువు దివ్యశక్తిని నమ్మి అతని అంగీ అంచుని ముట్టింది. వెంటనే ఆమెకు స్వస్థత కలిగింది. ప్రభువు ఆమె నమ్మకాన్ని మెచ్చుకొని కుమారీ! నీ విశ్వాసం నిన్ను స్వస్థపరచింది. ఇక సమాధానంగా వెళ్ళు అన్నాడు - లూకా 8, 48. ఆలాగే 18 ఏండ్ల పాటు పిశాచపీడనకు గురియై వంగిన నడుముతో బాధపడుతూన్న స్త్రీకి గూడ ప్రభువు ఆరోగ్యం దయచేసాడు - లూకా 13, 10-13.

కొన్నిసార్లు క్రీస్తు స్త్రీల మనవిని ఆలించి అద్భుతాలు చేసాడు. నయ్యీను విధవకు ఒక్కడే కొడుకు. అతడు చనిపోయాడు. ఇక ఆమెను ఆదుకొనేవాళ్ళు ఎవరూ లేరు. యూదసమాజంలో దిక్కూ మొక్కూలేని విధవ నానా యాతనలు పడుతుంది. పుత్రశోకంతో విలపిస్తూన్న ఆ వితంతువును జూచి ప్రభువు జాలి జెందాడు. అమ్మా యిక ఏడ్వవద్దని ఆమెను ఓదార్చాడు. ఆమె కుమారుణ్ణి అద్భుతంగా బ్రతికించాడు - లూకా 7, 13-17. ఆలాగే మరియా మార్తల దుఃఖాన్ని చూచి అతడు చనిపోయిన లాజరుని జీవంతో లేపాడు. యాయీరు కుమార్తెను గూడ జీవంతో లేపాడు. కానాపూరి అద్భుతంగూడ మరియ అడినందున చేసిందే. ఈ యద్భుతాలన్నీ ప్రభువుకి స్త్రీలపట్ల గల జాలినీ సద్భావాన్నీ సూచిస్తాయి.

## 5. స్త్రీలకు క్రీస్తుపట్ల ఆదరభావం

క్రీస్తు ఏ సందర్భంలోను స్త్రీలను చిన్నచూపు చూడలేదు. అనాదరం చేయలేదు. పురుషులలాగే స్త్రీలుకూడ దేవుని ప్రతిరూపాలని అతని నమ్మకం. అతడు వాళ్ళను మెచ్చుకొన్నాడు. ప్రోత్సహించాడు. ఆ స్త్రీలు కూడ కృతజ్ఞతాపూర్వకంగా అతన్ని ప్రశంసించారు. భక్తిశ్రద్ధలతో అతని బోధలు ఆలించారు. కొందరు అతనికి శిష్యులయ్యారు. కొందరు తమ సొంత సొమ్ముతో అతనికి భోజనాది అవసరాలను తీర్చారు.

పేత్రు అత్త క్రీస్తుకి ఆతిథ్యమిచ్చిందని చెప్పాం. అంతకంటె ఘనంగా మార్త ఆతిథ్యమిచ్చింది. ఆమె క్రీస్తుకి భోజనం సిద్ధంజేసేపుడు ఎన్నో పనులనుగూర్చి సతమతమైంది. అనగా శ్రమపడి చాల వంటకాలు తయారు చేసింది. అతనిపట్ల ఆమెకున్న ఆదరభావం అంత గొప్పది - లూకా 10, 38-42.

బెతనీ గ్రామంలో సీమోను ఇంటిలో యేసు పాదాలను కన్నీటితో తడిపి వాటికి పరిమళ ద్రవ్యం పూసిన మరియ భక్తికూడ చాల గొప్పది. ఆమె మరియ మగ్దలీనా కాదు, మార్త చెల్లెలు మరియాకాదు. మరో మరియ. వ్యభిచార వృత్తివల్ల కళంకితురాలై చెడ్డపేరు తెచ్చుకొంది. ఆమె క్రీస్తు బోధవిని పరివర్తనం చెందింది. పశ్చాత్తాపంతో గాఢభక్తితో అతని పాదాలపై కన్నీరు కార్చింది. వాటిని తన తలవెంట్రుకలతో తుడిచింది. పరిమళ తైలంతో అభిషేకించింది. ఆమె హృదయం కృతజ్ఞతా భావంతో నిండిపోయింది - లూకా 7, 36-38.

వ్యభిచారంలో పట్టుబడిన స్త్రీని ప్రభువు మరణంనుండి కాపాడాడు. కనుక ఆమె తన పాపాల కొరకు పశ్చాత్తాపపడి కన్నీరు కార్చింది. కృతజ్ఞతా పూర్వకంగా తన పాప జీవితాన్ని మార్చుకొంది - యోహా 8, 10-11. అలాగే సమరయ స్త్రీకూడ యేసు బోధలవల్ల పరివర్తనం చెందింది. కృతజ్ఞతా పూర్వకంగా వూళ్లోకివెళ్లి ప్రజలను పిల్చుకొని వచ్చి వారికి క్రీస్తుని చూపించింది - యోహా 4, 28-30.

క్రీస్తుని సిలువ వేసేప్పుడు ఒక్క యోహాను తప్ప తతిమ్మా శిష్యులంతా పారిపోయారు. కాని ప్రభువు శిష్యురాళ్లు అలా పారిపోలేదు. వాళ్లు సిలువ దగ్గరే నిలబడివున్నారు. ఆ భక్తురాళ్లు మరియమాత, ఆమె సోదరి, క్లోపాభార్యయైన మరియ, మగ్దల మరియ మొదలైనవాళ్లు. వీళ్ళంతా గలిలయ నుండి యెరూషలేముకి వచ్చారు. వీళ్లు పిలాతు తీర్పుని విన్నారు. సిలువ మార్గంలో క్రీస్తుని వెంబడించి వచ్చారు. అతడు సిలువపై చనిపోయేప్పుడు దాపులోనే వున్నారు. క్రీస్తుని సిలువవేసే సైనికులు అతని శిష్యురాళ్ళయిన ఈ స్త్రీలను దయతో చూచివుండరు. వాళ్లను కసురుకొని భయపెట్టి

వుంటారు. వాళ్లపట్ల మొరటుగా ప్రవర్తించి వుంటారు. ఐనా ఈ పుణ్యాంగనలు ఏమీ వెనుకాడలేదు. ప్రభువు చనిపోయే వరకు అతనికి సానుభూతి చూపుతూ, అతనికి అండగా దగ్గరే నిలుచున్నారు. చివరి గడియ వరకు అతనికి తమ ప్రేమనూ కృతజ్ఞతను తెలియజేసారు - యోహా 19, 25.

మరియ మగ్దలీన ఆదరమూ భక్తీ తక్కువేమికాదు. ఆమె క్రీస్తుకోసం తోటలో సమాధివద్ద గాలించింది. అతని శరీరం కన్పిస్తే ఎత్తుకొని పోవాలనుకొంది. ఆ కోరిక ఆమె గాఢభక్తికి నిదర్శనం. ఉత్థాన క్రీస్తు ఆమెను మరియా అని పేరెత్తి పిల్చాడు. ఆమె వెంటనే భక్తిభావంతో అతని పాదాలకు పెనవేసుకొంది - యోహా 19, 11-17.

# 4. క్రీస్తు శిష్యురాళ్లకు బోధ చేయడం

## 1. పశ్చాత్తాప బోధలు

ప్రభువు నానా రూపాల్లో శిష్యురాళ్లకు బోధ చేసాడు. వ్యభిచారిణియైన మరియ అతని బోధ వింది. "దైవరాజ్యం సమీపించింది. హృదయ పరివర్తనం చెంది సువార్తను విశ్వసించండి. తండ్రి ప్రేమను, దయను అర్థం చేసికొనండి. మీ పాపాలకు పశ్చాత్తాపపడి రక్షణ పొందండి". ఈ బోధవల్ల ఆమె పరివర్తనం చెందింది. క్రీస్తుపట్ల కృతజ్ఞత భక్తిభావం పెంపొందించుకొంది. అతడు సీమోను ఇంటిలో వుండగా అతని దర్శనం కొరకు వచ్చింది. ఆమె పాపపరిహారాన్ని పొందడానికి రాలేదు. ఆ కార్యం అంతకు ముందే జరిగింది. ప్రభువుకి కృతజ్ఞత తెలుపుకోవడానికి వచ్చింది. క్రీస్తు బోధ ఆమె పరివర్తనకు కారణం. ఆమె పాపాల ఘోరత్వాన్నీ, తండ్రి కరుణనీ, పశ్చాత్తాప మార్గాన్నీ ఆమెకు తెలియజేసింది ప్రభువు. హృదయశుద్ధిని పొంది దేవుణ్ణి ప్రేమించమని హెచ్చరించింది అతడే.

క్రీస్తు తనకు ఆతిథ్యమిచ్చే సీమోనుకి ఇద్దరు బాకీదారుల కథ చెప్పాడు. ఓ యజమానునికి ఇద్దరు బాకీదారులున్నారు. ఒకడు ఎక్కువగా బాకీపడి వున్నాడు, ఇంకొకడు తక్కువగా బాకీపడి వున్నాడు. యజమానుడు వీరిద్దరినీ క్షమించాడు. అప్పుడు ఆ యిద్దరిలో యజమానుణ్ణి ఎవరు ఎక్కువగా ప్రేమిస్తారు? ఎక్కువ సొమ్ము క్షమింపబడిన వాడేకదా? ఇది కథ. ఇక దీని భావమేమిటి?

ఈ కథలో ఎక్కువ సొమ్ము క్షమింపబడిన బాకీదారుడు మరియే. తక్కువ సొమ్ము క్షమింపబడిన బాకీదారుడు సీమోనే. మరియ ఎక్కువగా పాపాలు చేసింది. ఆమె పశ్చాత్తాపాన్ని జూచి తండ్రి ఆమెను ఎక్కువగానే మన్నించాడు. ఆమెకూడ కృతజ్ఞతా పూర్వకంగా దేవుణ్ణి ఎక్కువగానే ప్రేమించింది. కాని సీమోను తక్కువగా మన్నింప

బడినవాడు. దేవునిపట్ల అతని ప్రేమకూడ తక్కువే. ఈ విధంగా ఈ కథద్వారా ప్రభువు మరియ పశ్చాత్తాపాన్ని ప్రశంసించాడు - లూకా 7, 41-47.

వ్యభిచారంలో పట్టుబడిన స్త్రీ మొదట తన పాపాలకు పశ్చాత్తాపపడలేదు. యూదులు ఆమెను తలవని తలంపుగా పట్టుకొన్నారు. రాళ్లతో కొట్టడానికి సిద్ధమయ్యారు. కనుక అవమానమూ భయమూ ఆమెను ఆవహించాయి. ఇక పశ్చాత్తాపానికి వ్యవధి యెక్కడిది? ఆ సమయంలో క్రీస్తు ప్రత్యక్షమై ఆమె శత్రువులను వెళ్లగొట్టాడు. ఇక ఆమెకు మరణభీతి లేదు. కనుక కొంచెం తెప్పరిల్లింది. ప్రభువు అమ్మా ఇక వెళ్లి పాపం చేయకుండా బ్రతుకు అని ప్రోత్సహించాడు. ఆ మాటల వలన ఆమె తన పాపం ఎంత ఘోరమైందో అర్థం చేసికొంది. పశ్చాత్తాపపడింది. దేవుని ప్రేమను గ్రహించింది. మళ్లా పాపానికి వొడిగట్టలేదు - యోహా 8, 7-11. ఈ విధంగా పశ్చాత్తాప బోధల ద్వారా క్రీస్తు కొందరు స్త్రీల హృదయాలు మార్చాడు.

## 2. విశ్వాస బోధలు

క్రీస్తు తన అద్భుతాలతో కొందరు స్త్రీల విశ్వాసాన్ని పెంచాడు. రక్త స్రావంతో బాధపడే స్త్రీ క్రీస్తు దగ్గర ఏదో మాంత్రికశక్తి వుందనుకొంది. తానతన్ని తాకితే చాలు ఆ శక్తి తనలోకి ప్రవేశించి తనకు ఆరోగ్యదానం చేస్తుంది అనుకొంది. అలా అనుకొని అతన్ని ముట్టుకొంది. కాని క్రీస్తు ఆమెనుండి ఆ మూఢ భావాలను తొలగించాడు. కుమారీ! నీ విశ్వాసం నిన్ను స్వస్థపరచింది అని చెప్పాడు. ఆమెకు ఆరోగ్యాన్ని ప్రసాదించింది క్రీస్తులోని మాంత్రిక శక్తికాదు. ఆమె విశ్వాసమే ఆమెను స్వస్థురాలిని చేసింది. ఆమె విశ్వాసాన్ని జూచి దేవుడు క్రీస్తుద్వారా ఆమెకు ఆరోగ్యాన్ని దయచేసాడు. ఈ సత్యాన్ని ఆమె బాగా గ్రహించేలా చేసాడు ప్రభువు. ఈ విధంగా ఆమె విశ్వాసం పెరిగింది - లూకా 8, 48.

కననీయ స్త్రీకూడ క్రీస్తులో ఏదో అద్భుత శక్తివుందని భావించింది. కనుకనే తన కొమార్తెకు పట్టిన దయ్యాన్ని వదలించమని క్రీస్తుని పదేపదే అడుగుకొంది. కాని క్రీస్తు ఆమెను కుక్కతో పోల్చాడు. ఐనా ఆమె బాధపడలేదు. కుక్కపిల్లలుకూడ తమ యజమానిని బల్లమీది నుండి జారిపడే రొట్టెముక్కలు తింటాయికదా అని మరీ యెక్కువ విశ్వాసంతో మనవి చేసింది. అంతట క్రీస్తు ఆమె తన శక్తిని మాత్రమే కాక తన దయనూ ప్రేమనూ గూడ అర్థం చేసికొనేలా చేసాడు. అమ్మా! నీ విశ్వాసం మెచ్చదగింది. నీ కోరిక నెరవేరునుగాక అన్నాడు. ఇంటికి వెళ్లిచూడగా ఆమె బిడ్డ ఆరోగ్యంగా వుంది. ప్రభువు

దూరం నుండే ఆమె కొమార్తెకు ఆరోగ్యదానం చేసాడు. ఆ స్త్రీ క్రీస్తు వాక్యంలోని శక్తిని నమ్మింది. అతని దయనూ ప్రేమనూ గూడ నమ్మింది - మత్త 15, 28.

లాజరు చనిపోయినందున మార్త దుఃఖిస్తూంది. క్రీస్తు చనిపోయిన లాజరుని చూడ్డానికి వచ్చాడు. మార్త ప్రభూ! నీవు ఇక్కడున్నట్లయితే నా సోదరుడు చనిపోయేవాడుకాదు అని యేడ్చింది. క్రీస్తు ఆమెను ఓదారుస్తూ లాజరు మళ్లా లేస్తాడని చెప్పాడు. మార్త ఔను అతడు అంతిమ దినాన పునరుత్థానమయి మళ్లా లేస్తాడు అని బదులు చెప్పింది. ప్రభువు ఆమె విశ్వాసాన్ని పెంచగోరి "నేనే పునరుత్థానాన్ని, జీవాన్ని, నన్ను విశ్వసించేవాడు మరణించినా మళ్ళా జీవిస్తాడు" అని చెప్పాడు - యోహా 11, 25. మార్త క్రీస్తు అద్భుత శక్తిని నమ్మింది. ఆమె నమ్మినట్లే ప్రభువు లాజరుని జీవంతో లేపాడు. ఈ విధంగా క్రీస్తు రక్తస్రావ రోగి, కననీయ స్త్రీ, మార్త - ఈ ముగ్గురి విశ్వాసాన్ని పెంచాడు.

### 3. వాక్య బోధలు

మరియ మార్తల కథ చూస్తే క్రీస్తు వాళ్ళను వాక్యబోధ వినమని ప్రోత్సహించినట్లుగా అర్థమౌతుంది. అతడు మార్తను అనేక కార్యాలతో సతమతం కావద్దన్నాడు. ఒకటి మాత్రమే అవసరమని చెప్పాడు. అది క్రీస్తు బోధించే వేదవాక్యం విని పరలోకంలోని తండ్రిని ధ్యానించుకోవడం. ఈ విధంగా ప్రభువు ఆమె మనసును వేదవాక్యంవైపు త్రిప్పాడు. ఇక, మరియ మొదటినుడి అతని పాదాల చెంత కూర్చుండి అతని వాక్యబోధ వింటూనే వుంది.ఆమె వుత్తమమైనదాన్ని ఎన్నుకొంది. అనగా క్రీస్తు ఆమెను శిష్యురాలినిగా ఎన్నుకొని ఆమెకు వాక్యాన్ని బోధించాడు.

ఇక్కడ ఇంకో విశేషంకూడ వుంది. మార్త ఇంటి యజమానురాలు. క్రీస్తు చుట్టం. కనుక మార్త క్రీస్తుకి భోజనం పెట్టబోయింది. కాని ఆమె పెట్టేది మామూలు భోజనం. దానివల్ల పెద్ద ఫలితం వుండదు. కనుక క్రీస్తే మరియా మార్తలకు భోజనం పెట్టాడు. అతడు పెట్టింది మామూలు భోజనంకాదు. వాక్యభోజనం. ఈ వాక్యభోజనం పెట్టినపుడు క్రీస్తే యజమానుడయ్యాడు. మరియా మార్తలు చుట్టాలయ్యారు. ఈ గూఢార్థం కూడ ఈ కథలో వుంది - లూకా 10, 38-42.

ఓ దినం ఓ స్త్రీ క్రీస్తు బోధకు ముగ్ధురాలై నిన్నుమోసిన గర్భం ధన్యమైంది అంది. కాని ప్రభువు దేవుని వాక్కును ఆలించి పాటించేవాళ్లు మరీ ధన్యులు అని పల్కాడు. మరియ క్రీస్తుకి జన్మనీయడం ధన్యమైన కార్యమే. కాని ఆమె ఇదిగో నీ దాసురాలను అని పల్కి దేవుని వాక్యాన్ని విశ్వసించడం తక్కువ ధన్యత్వమేమీ కాదు. ఇప్పుడు ఈ స్త్రీకూడ

క్రీస్తు బోధను విని విశ్వసించడం ఎంతో ధన్యమైన కార్యం - లూకా 11, 27-28. ఈలా ప్రభువు తన బోధలద్వారా అద్భుతాలద్వారా అనేక స్త్రీల భక్తిని పెంచాడు. వారికి పశ్చాత్తాపం, విశ్వాసం, వాక్యశ్రవణం మొదలైన సుగుణాలను నేర్పాడు.

## 5. క్రీస్తు తానెవరో స్త్రీలకు తెలియజేయడం

క్రీస్తు తన్ను గూర్చి తాను స్త్రీలకే అధికంగా తెలియజేసికొన్నాడు. అతడు సొంత శిష్యులకు గూడ తన్ను గూర్చి తాను అంత వివరంగా తెలియజేసికోలేదేమో!

అతడు సమరయ స్త్రీకి తన్ను దేవుని వరంగా తెలియజేసికొన్నాడు. తన్ను దావీదుని కుమారునిగా, అబ్రహాముకి దేవుడు చేసిన వాగ్దానంగా ఎరుకపరచుకొన్నాడు. ఇంకా తన వాక్కు దేవుణ్ణి తెలియజేసే సందేశమని గూడ చెప్పాడు. పవిత్రాత్మే జీవజలమనీ ఆ జలం తననుండి బయలుదేరి భక్తుల హృదయాల్లోకి పారుతుందనీ చెప్పాడు. ఈ సత్యాలన్నిటినీ ఆ దశలో సమరయ మహిళ గ్రహించలేదు. ప్రభువు అనుగ్రహంవల్ల నేడు మనం ఈ వేదసత్యాలను కొంతవరకైనా గ్రహించగల్గుతున్నాం - యోహా 4, 7-14.

ప్రభువు సమరయ స్త్రీతో నిజమైన ఆరాధకులు ఆత్మయందూ సత్యమందూ తండ్రిని ఆరాధిస్తారని చెప్పాడు - యోహా 4,23. ఇక్కడ సత్యమంటే క్రీస్తే. మనం పవిత్రాత్మ శక్తితో ఉత్థాన క్రీస్తుద్వారా తండ్రిని ఆరాధిస్తాం. యూదులు యెరూషలేములోను, సమరయులు గిరిజం కొండమీదను దేవుణ్ణి ఆరాధిస్తున్నారు. ఆ యారాధనకు ఇక విలువలేదు. నిజమైన ఆరాధన ఆత్మద్వారా క్రీస్తుద్వారా క్రైస్తవులు తండ్రికి చేసే ఆరాధన. ప్రభువు ఈలాంటి నిగూఢమైన వేద సత్యాలను సమరయ స్త్రీకి తెలియజేసాడు. కడన తానే మెస్సీయానని కూడ ఆమెకు విశదం చేసాడు - 4, 26.

క్రీస్తు మార్తతో నేనే పునరుత్థానాన్ని జీవాన్ని. నన్ను విశ్వసించేవాడు మరణించినా జీవిస్తాడు. జీవముండగా నన్ను విశ్వసించేవాడు ఏనాటికీ మరణాన్ని చవిచూడడు అన్నాడు - యోహా 11, 25-26. ఇక్కడ క్రీస్తు తానే మన పునరుత్థానాన్నని తెలియజేసికొన్నాడు. అతని జీవంలో పాలుపొందితే మనకు నిత్యజీవం కలుగుతుంది. కనుక మనకు జీవమూ పునరుత్థానమూ మోక్షజీవమూ కూడ అతడే.

ఉత్థాన క్రీస్తు మొదట దర్శనమిచ్చింది అపోస్తలులకు గాదు, పుణ్యస్త్రీలకు. వీళ్ళ తర్వాతనే అతడు అపోస్తలులకూ పేత్రుకి కన్పించాడు. ప్రభువు మరియ మగ్దలీనకు దర్శనమిచ్చి ఆమెను ఓదార్చాడు. ఆమె మొదట అతన్ని గుర్తుపట్టలేదు. తోటమాలి అనుకొంది. కాని ప్రభువు మరియా అని పేరెత్తి పిలవగానే ఆమె అతన్ని గుర్తుపట్టింది. తర్వాత ప్రభువు ఆమెను అపోస్తలుల వద్దకు పంపి తాను వుత్థానమైనట్లు వారికి

తెలియజేయమన్నాడు. ఈ సందర్భంలో ఓ వాక్యం చాల ముఖ్యం. క్రీస్తు ఆమెతో "నేను నా తండ్రీ మీ తండ్రీ, నా దేవుడూ మీ దేవుడూ ఐన వానియొద్దకు ఆరోహణం చేస్తున్నాను" అన్నాడు - యోహా 20,17. క్రీస్తు మరణోత్థానాలద్వారా మనకు పాపపరిహారం జరిగింది. మనకు దేవునితో రాజీ కుదిరింది. క్రీస్తు తండ్రి ఆ క్రీస్తు ద్వారానే మనకుగూడ తండ్రి ఔతాడు. మనం అతనికి బిడ్డలమౌతాం. అనగా మనం పవిత్ర త్రీత్వంలోనికి ప్రవేశిస్తాం. ఆ త్రీత్వం దివ్యజీవనంలో పాలు పొందుతాం. ఇదంతా క్రీస్తుద్వారా జరుగుతుంది. ఇది గొప్ప వేదసత్యం.

స్త్రీలను గౌరవంతో జూడని యూద సమాజంలో క్రీస్తు మొదటిసారిగా వాళ్ళను గౌరవంతో జూచాడు. ప్రభువు స్త్రీలను ఆదరంతో జూచినందున తొలినాటి క్రైస్తవ సమాజంగూడ వాళ్ళను విలువతో జూచి ప్రోత్సహించింది. ఆనాటి సుప్రసిద్ధులైన స్త్రీల పేర్లను కొన్నిటిని నూత్నవేదం పేర్కొంటుంది. వీళ్ళల్లో కొందరు పౌలుకి వేదబోధలో సహాయం చేసారు. విశేషంగా అతడు ఫీబె, ప్రిస్కా అనే భక్తురాళ్ళను పేర్కొన్నాడు. వాళ్ళు "క్రీస్తు సేవలో నాకు తోడి పనివాళ్ళు" అని చెప్పుకొన్నాడు - రోమా 16, 1-3. ప్రిస్కా సుప్రసిద్ధ బోధకుడైన అపొల్లోకే ఉపదేశం చేసింది - అ.చ 18,26. ఫిలిప్పు కొమార్తెలు నల్గురు ప్రవచనం చెప్పడంలో దిట్టలు - అ.చ. 21,9. అప్పటికే స్త్రీలు కన్యలుగా, వివాహితలుగా, విధవలుగా గుర్తింపు పొందారు. వాళ్ళంతా ఆనాటి క్రైస్తవ సమాజాల్లో నానా పరిచర్యలు చేస్తుండేవాళ్ళు.

క్రీస్తు ఉత్థానానంతరం శిష్యులు యెరూషలేం నగరంలోని ఓ యింటి మీదిగదిలో ప్రార్థన చేసికొంటూ ఆత్మరాకడ కొరకు వేచియున్నారు. ఈ శిష్యులతోపాటు పుణ్యస్త్రీలుకూడ వున్నారు. కనుక శిష్యులతోపాటు వాళ్ళుకూడ ఆత్మనీ ఆత్మ వరాలనూ పొందారు - అ.చ. 1, 14.

## 6. మహిళాభ్యుదయం

ప్రభువు స్త్రీలను ఆదరంతో జూచాడు కదా! అతని నుండి మనం పాఠం నేర్చుకోవాలి. మనది పురుషాధిక్యం గల సమాజం. పెత్తనమంతా మగవాళ్ళదే. స్త్రీలను చిన్న చూపు చూస్తాం. ఇది క్రీస్తు భావాలకు విరుద్ధం.

ఇక్కడ మామూలుగా స్త్రీలకు జరిగే అన్యాయాలను కొన్నిటిని జ్ఞప్తికి తెచ్చుకొందాం. కొందరు స్త్రీశిశువుని తల్లి గర్భంలో వుండగానే చంపివేస్తారు. కొందరు ఆడపిల్ల పుట్టినందుకు విచారిస్తారు. చాలమంది బాలికలకు విద్య నేర్పరు. వాళ్ళను పనికత్తెలనుగా వాడుకొంటారు. కొంతమంది స్త్రీలను అశుద్ధురాళ్లనుగా ఎంచుతారు.

కట్నమిస్తేనేగాని అమ్మాయిని పెళ్లిజేసికోరు. వ్యక్తులను బట్టిగాక కట్నాన్నిబట్టి వాళ్ళకు విలువ కడతారు. స్త్రీలను పర్దాలతో కప్పివేస్తారు. భర్తల్లో భార్యలను పీడించేవాళ్ళూ తిట్టికొట్టేవాళ్ళూ కడకు చంపివేసేవాళ్ళూ అరేదేమీకాదు. మహిళలు కేవలం వంటింట్లో పనిచేసే దాసీలనీ, బిడ్డలను కనే యంత్రాలనీ చాలమంది మగవాళ్ళ భావన. ఆయా రంగాల్లో పురుషులతో సమానంగా పనిచేసినా స్త్రీలకు వేతనం తక్కువ. స్త్రీలను ఎగతాళి చేసి యేడ్పిస్తారు. మానభంగం చేస్తారు. వేశ్యావాటికల్లో అమ్మివేస్తారు. సినిమాలు ప్రకటనలు మొదలైన సమాచార సాధనాల్లో వారిని అసభ్యంగా చూపిస్తారు. స్త్రీ శరీరాన్ని నగ్నంగా చూపించి సొమ్ము జేసికొంటారు. ఈ యానాచారాలన్నిటిలోను మగవాడెక్కువ, స్త్రీ తక్కువ అనే భావన వుంది. పురుషులు స్త్రీలను బానిసలనుగా జేసి తమ స్వార్థానికి వాడుకోవచ్చుననే ఆలోచన వుంది. వాళ్ళమీద అధికారం నెరపి వాళ్ళను తమ యేలుబడిలో వుంచుకోవచ్చు అనే తలంపు వుంది. ఈలాంటి భావాలు క్రీస్తు మనసుకి వ్యతిరేకం.

ఆ మాటకొస్తే మన క్రైస్తవ సమాజంలోను శ్రీసభలోనుగూడ స్త్రీలకు సముచిత స్థానం లేదు. వాళ్ళను ఏదోవిధంగా అణచివుంచాలనే మన కోరిక. మనం వాళ్ళను సంప్రతించకుండానే నిర్ణయాలు చేస్తాం. ఒకోసారి స్త్రీల సొంత సమస్యలను గూర్చి జీవితాలను గూర్చికూడ పురుషులే నిర్ణయాలు చేస్తారు. వాళ్ళను దేవుని రూపం ధరించిన వ్యక్తులనుగా పరిగణించరు. ఏవో వస్తువుల క్రింద లెక్క కడతారు.

మన విచారణల్లో సిస్టర్లు బోలెడంత సేవ చేస్తారు. తరచుగా దేవాలయంలోని పనులన్నీ వాళ్లే చేస్తారు. కాని విచారణను నడిపించడంలో మాత్రం మన గురువులు సిస్టర్లను సంప్రతించరు. వాళ్ళతో కలసి నిర్ణయాలు చేయరు. ఇది మంచిపద్ధతి కాదు.

తిరుసభ తన సేవా కార్యక్రమాల్లో పురుషులనేగాక స్త్రీలనుగూడ అధికంగా వినియోగించుకోవాలి. వాళ్లకు ఉన్నత పదవులనూ బాధ్యతలనూ ఒప్పజెప్పాలి. వారిచేత గూడ వేదబోధ చేయించాలి. తిరుసభ తన అవివేకంవల్ల 19వ శతాబ్దంలో శ్రామిక వర్గాన్ని కోల్పోయింది. ఈ శతాబ్దంలోనే యువతను కోల్పోయింది. అనతికాలంలోనే స్త్రీలను గూడ కోల్పోయే ప్రమాదం వుంది.

మనం భగవంతుణ్ణి తండ్రిగాను, పురుషుణ్ణిగాను భావిస్తాం. అతన్ని తల్లినిగా స్త్రీనిగాగూడ భావించవచ్చు. దీనికి ఆధారాలు బైబుల్లోనే వున్నాయి.

క్రీస్తు ఈనాడు మన మధ్యలోకి వస్తే నేటి తిరుసభలో స్త్రీలకున్న స్థానాన్ని తప్పకుండా హెచ్చిస్తాడు. క్రైస్తవ సమాజంలో స్త్రీల విలువను తప్పక పెంచుతాడు. ఈ యంశాన్ని మన వేదాంతులు కూడ అంగీకరిస్తారు. కనుక మనం స్త్రీలను అధికాదరంతో జూడాలి. ప్రపంచంలో జాతి వర్ణ లింగభేదాలు సమసిపోతున్న ఈ శుభకాలంలో మనం విశాల హృదయంతో ప్రవర్తించి మహిళాభ్యుదయానికి చేయూత నివ్వాలి.

# 10. క్రీస్తు సామెతలు

## మనవిమాట

ఈ పుస్తకాన్ని ఇంతకుముందే బైబులు భాష్యం 27,31, 33 సంచికల్లో ప్రచురించాం. క్రీస్తు చెప్పిన పెద్ద సామెతలు ఇంచుమించు 45 దాకా ఉన్నాయి. ఇవికాక చిన్న సామెతలు లేక ఉపమాన వాక్యాలు ఎన్నో ఉన్నాయి. ఇవన్నీ కలిసి తొలి మూడు సువిశేషాల్లో చాల భాగం ఆక్రమించుకొంటాయి, బైబులు విద్వాంసులు సామెతలను చాల వర్గాలుగా విభజించారు. ప్రస్తుత పుస్తకంలో యెన్మిది రకాల సామెతల మీద సంగ్రహమైన వ్యాఖ్య చెప్పాం. సామాన్య ప్రజలను మనసులో పెట్టుకొని ఈ వివరణను సులభపద్ధతిలో రచించాం.

బైబులు సామెతలు మన ప్రజలందరికీ తెలిసినవే ఐనా, వాటి అర్థం మాత్రం చాలమందికి తెలియదు. అందుచేత వాటికి వ్యాఖ్య అవసరం. సామెతల్లోని ప్రధానాంశం పోలిక లేక ఉపమానం. శ్రోతల మనసును ఆకట్టుకొనేది ఈ పోలికే. ఇవి పిట్టకథల్లాగ ఉంటాయి. కథల్లాగ వుంటాయి కనుకనే వీటిద్వారా సామాన్య ప్రజలకూ పిల్లలకూ గూడ క్రీస్తు బోధలను సులభంగా వివరించి చెప్పవచ్చు. కాని ఈ సామెతలను మన బోధల్లో వాడుకోవాలంటే మన తరపున మనం వీటి భావాన్ని చక్కగా గ్రహించి ఉండాలి. అందుకోసమే ఈ వ్యాఖ్య. కొబ్బెరకాయను పగులగొడితేనేగాని కొబ్బెర రాదు. శ్రద్ధతో చదువుకొంటేనేగాని సామెతల్లో దాగివున్న భావం అర్థంకాదు. కాని ఓమారు వీని సందేశాన్ని జాగ్రత్తగా గుర్తించామో, ఇక యివి మన సొంత ప్రార్థనకుగాని ఇతరులకు బోధించడానికిగాని చక్కగా ఉపయోగపడతాయి.

క్రీస్తు రెండువేల యేండ్లనాడు చెప్పిన ఈ చిన్న కథలు నేటికీ వినాలి అనే కుతూహలాన్ని పుట్టిస్తున్నాయి. ఆ ప్రభువు బోధల్లో మనకు విశేషంగా జ్ఞప్తికి వచ్చేవీ,కళాత్మకంగా మన హృదయానికి హత్తుకొనేవీ, ఈ సామెతలేనేమో! ఇది ఆరవ ముద్రణం.

## విషయసూచిక

# ఎన్మిది వర్గాల సామెతలు

సామెతల వర్గం సువిశేషకారులు

## 1. కారుణ్యపు సామెతలు

| | సామెత | మత్తయి | మార్కు | లూకా |
|---|---|---|---|---|
| 1. | తప్పిపోయిన గొర్రె | 18,12-24 | | 15, 4-7 |
| 2. | జారిపోయిన నాణెం | | | 15, 8-10 |
| 3. | తప్పిపోయిన కుమారుడు | | | 15, 11-32 |
| 4. | పరిసయుడూ సుంకరీ | | | |
| 5. | ద్రాక్షతోట యజమానుడు | 20, 1-16 | | |
| 6. | క్షమింపనొల్లని సేవకుడు | 18, 21-25 | | |
| 7. | ఇద్దరు బాకీదారులు | | | 7, 41-47 |
| 8. | ఇద్దరు కుమారులు | 21,28-32 | | |

## 2. శిష్యధర్మాలను గూర్చిన సామెతలు

| | సామెత | మత్తయి | మార్కు | లూకా |
|---|---|---|---|---|
| 1. | మంచి సమరయుడు | | | 10,25-37 |
| 2. | పొలంలోని యిల్లూ, యుద్ధమూ | | | 14,28-33 |
| 3. | రాతిపునాది, ఇసుక పునాది | 7,24-27 | | 6,47-49 |
| 4. | యజమానుడు, సేవకుడు | | | 17, 7-10 |
| 5. | నడిరేయి వచ్చిన స్నేహితుడు | | | 11, 5-10 |
| 6. | వితంతువు, న్యాయాధిపతి | | | 18, 1-8 |
| 7. | తండ్రి కుమారుడు | 7, 9-11 | | |
| 8. | మేకలు, గొర్రెలు | 25, 31-46 | | |

## 3. దైవరాజ్యపు సామెతలు

| | సామెత | మత్తయి | మార్కు | లూకా |
|---|---|---|---|---|
| 1. | ఆవగింజ | 13,31-32 | 4,30-32 | 13,18-19 |
| 2. | పులిసిన పిండి | 13,33 | | 13,20-29 |
| 3. | విత్తేవాడు | 13,3-9 | 4, 4-9 | 8,4-8 |
| 4. | పండిన పంట | | 4,26-29 | |
| 5. | నిధీ, ఆణిముత్యమూ | 13, 44-46 | | |
| 6. | దుష్టాత్మ | 12,43-45 | | |

## 4. త్వరపడాలి అనే సామెతలు

| | | మత్తయి | మార్కు | లూకా |
|---|---|---|---|---|
| 1. | విందు | 22, 1-10 | | 14, 15-24 |
| 2. | వివాహవస్త్రం లేని అతిథి | 22, 11-14 | | |
| 3. | భూస్వామి, కౌలుదార్లు | 21, 33-46 | 12, 1-12 | 20, 9-19 |
| 4. | యుక్తిగల గృహనిర్వాహకుడు | | | 16, 1 -13 |
| 5. | అవివేకియైన ధనికుడు | | | 12, 13-21 |
| 6. | ధనికుడు, లాజరు | | | 16, 19-31 |
| 7. | ముఖ్యాసనాలు | | | 14, 7-19 |
| 8. | కాపుపట్టని అంజూరం | | | 13, 6 - 9 |
| 9. | మూసిన ద్వారం | | | 13, 24-30 |
| 10. | చిన్నపిల్లల విమర్శలు | 11, 16-19 | | 7, 31-35 |

## 5. వేచివుండాలి అనే సామెతలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | అకస్మాత్తుగా వచ్చే దొంగ | 24, 43-44 | | 12, 39-40 |
| 2. | మేల్కొనివుండే సేవకులు | | | 12, 35-38 |
| 3. | అధికారంగల సేవకుడు | 24, 45-51 | | 12, 35-38 |
| 4. | పదిమంది కన్నెలు | 25, 1-13 | | |
| 5. | ముగ్గురు సేవకులు | 25, 14-30 | | 19, 12-27 |
| 6. | రాజ్యం సంపాదించుకొన్నవాడు | | | 19, 12-27 |
| 7. | వల | 13,47-50 | | |
| 8. | గోదుమలు, కలుపు | 13,24-30 | | |

## 6. మెస్సీయాను గూర్చిన సామెతలు

## 7. నటనాత్మకమైన సామెతలు

## 8. క్రీస్తు శ్రమలను గూర్చిన సామెతలు

# 1. కారుణ్యపు సామెతలు

క్రీస్తు సామెతలను కొన్ని వర్గాలుగా విభజించవచ్చు. "కారుణ్యపు సామెతలు" ఓ ప్రత్యేక వర్గం. ఈ వర్గంలో ఇంచుమించు పది సామెతలుదాకా వున్నాయి. తప్పిపోయిన గొర్రె, జారిపోయిన నాణెం, తప్పిపోయిన కుమారుడు, పరిసయుడు సుంకరి, ద్రాక్షతోట యజమానుడు, క్షమింపనొల్లని సేవకుడు, ఇద్దరు బాకీదారులు, ఇద్దరు కుమారులు మొదలైన సామెతలన్నీ ఈ కోవకు జెందినవే. పరలోకపు తండ్రి పాపాత్ముల యెడల కరుణ జూపుతాడు అనేది వీటిల్లోని ప్రధానాంశం. ఇక, యీ శాఖకు జెందిన సామెతలను క్రమంగా పరిశీలించి చూద్దాం.

## 1. తప్పిపోయిన గొర్రె - లూకా 15, 1-7 (మత్త 18, 11-14)

### 1. సామెత సందర్భం

యూదుల్లో ఒక తెగవాళ్ళు సుంకరులు. వీళ్ళు పాలస్తీనా దేశంనుండి పన్నులు వసూలుజేసి రోమను ప్రభుత్వానికి అప్పజెప్పేవాళ్ళు. కాని వీళ్ళు లోభబుద్ధితో మితంమీరిన పన్నులు వసూలుజేసి కొంత సొమ్ము తాము కొట్టేసి మిగిలిన సొమ్ము రోమను ప్రభుత్వానికి ముట్టజెప్పేవాళ్లు. అందువల్ల ఈ వర్గం వాళ్ళంటే మిగతా యూదులు కొరకొరలాడేవాళ్లు. ఇంకా, పాలస్తీనా దేశంలో గొర్రెలనూ గాడిదలనూ మేపేవాళ్ళూ, చర్మకారులూ, అంగడిదారులూ మొదలైనవాళ్ళంతా పై సుంకరులతో సమానంగానే లెక్కగట్టబడ్డారు. వీళ్ళందరికీ కలిపి "పాపాత్ములు" అని పేరు. ఎందుకంటే వీళ్ళు మోషే ధర్మశాస్త్రాన్ని పాటించేవాళ్ళు కాదు. మోసానికీ దగాకోరుతనానికీ పూనుకొనేవాళ్లు. అందుచే యూద సమాజంలో అగ్రవర్గానికి చెందిన పరిసయులూ, ధర్మశాస్త్ర బోధకులూ ఈ పాపాత్ములను చిన్నచూపు చూచేవాళ్లు. మోషే ధర్మశాస్త్రాన్ని బోధించడానికిగూడ వీళ్ళదగ్గరికి వెళ్ళగూడదని పై శిష్టుల భావం. ప్రభు నిబంధనలను పాటించని దుర్మార్గులు నాశమైపోతే ఆ ప్రభువు సంతోషిస్తాడని వాళ్ళ బోధ. కాని భగవంతుని హృదయం అదికాదు.

ఈలాంటి సంకుచిత భావాలతో నిండిన యూద నాయకులకు క్రీస్తు చర్యలు విడ్డూరంగా కన్పించాయి. క్రీస్తు సుంకరుల కోపు దీసికొన్నాడు. పాపాత్ములనబడేవాళ్ళ యిండ్లల్లో భోజనం చేస్తున్నాడు. ఇది యూదనాయకులకు ససేమి గిట్టలేదు. వాళ్ళు "ఇతగాడు పాపాత్ములతో భోజనం చేయడం దేని"కని క్రీస్తుమీద గొణిగారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని క్రీస్తు చెప్పినవే తప్పిపోయిన గొర్రె, తప్పిపోయిన నాణెం, తప్పిపోయిన కుమారుడు అనే సామెతలు. ఈ మూడు గూడ భగవంతుడు పాపాత్ముల పట్ల కరుణ జూపుతాడు అనే సత్యాన్ని బోధిస్తాయి.

## 2. వివరణం

ఓ కాపరి వున్నాడు. అతనికి నూరు గొర్రెలుండేవి. క్రీస్తునాడు పాలస్తీనా దేశంలో మూడు వందల గొర్రెలు పెద్ద మందగా భావింపబడేవి. ఈ సామెతలోని కాపరికి నూరు గొర్రెలు ఉన్నాయంటే, అది ఓపాటి మంద అనుకోవాలి. అతడు గొర్రెలను పొలంలో మేపుకొంటూ హఠాత్తుగా ఓ గొర్రె జారిపోయిందని గుర్తించాడు. పాలస్తీనా కాపరులు సాయంకాలం గొర్రెలను దొడ్డిలోనికి చేర్చేపుడుగాని వాటిని లెక్కవేయరు. ఐనా ఇతడు మితంమీరిన జాగరూకత కలవాడు కావడంచే గాబోలు గొర్రె తప్పిపోయిందని వెంటనే గుర్తించాడు. ఈలా గొర్రె తప్పిపోవడంలో వింతేమీలేదు. ఆ దేశంలో ఎగుడుదిగుళ్ళూ, ముళ్ళపొదలూ, కట్టలూ, చుట్టూ గడ్డిగాదం పెరిగి గుర్తించడానికి వీలుగాకుండా వుండే గోతులూ మిక్కుటంగా వుంటాయి. గొర్రె ఈలాంటి గోతుల్లో జారిపడవచ్చు. లేదా ముళ్ళపొదల్లో చిక్కుకొని బయటికి రాలేకపోవచ్చు.

కాపరి గొర్రె తప్పిపోయిందని గుర్తించగానే మిగిలిన తొంబైతొమ్మిదింటిని తోడికాపరులకు ఒప్పజెప్పి ఆ వొక్కదాన్నీ వెదకడానికి ఆతురతతో వెళ్ళాడు. ఆతురత దేనికంటే, చీకటి పడితే నక్కలూ తోడేళ్ళూ మొదలైన వన్యమృగాలు గొర్రెను మ్రింగి వేస్తాయి. అది ఒకవేళ ఎక్కడైనా జారిపడిపోయిందంటే పట్టపగలే రాబందులూ గ్రద్దలూ దాన్ని చీల్చివేస్తాయి. కావున కాపరి గొర్రె కోసం దీక్షతో వెదకాడు. సాయంకాల మయ్యేటప్పటికల్లా ఎక్కడో వోతావులో అది కంటబడింది. గొర్రెను జూడగానే అతడు కోపగించుకోలేదు. కూలివాడైతే నా కెంత శ్రమ గలిగించావని దానిని కఱ్ఱతో చావమోదేవాడే. కాని సొంత కాపరి అలా చేయడు. పైపెచ్చు గొర్రె దొరికిందిగదా అని ఎంతో ఆనందించాడు. ఈ యానందం అనేది ప్రస్తుత సామెతలో ముఖ్యపదం.

అది యెదిగిన గొర్రే. ఐనా కాపరి దాన్ని ఓ చిన్న పిల్లలా భావించి మితిమీరిన జాలితో యెత్తి భుజాలమీద పెట్టుకొన్నాడు. దాని నాల్గుకాళ్ళూ జోడించి యెడమచేతితో బట్టుకొని కుడిచేతితో కఱ్ఱ ఊతవేసికొంటూ చరచరా తిరిగి వచ్చాడు. ఆనందంతో ఇల్లుజేరి తన స్నేహితులైన తోడి కాపరులను బిలిచి తప్పిపోయినగొర్రె దొరికిందని చెప్పాడు. వాళ్లూ అతనితోపాటు సంతోషించారు. సురక్షితంగా వున్న తొంబై తొమ్మిది గొర్రెల వలన గలిగే సంతోషంకంటె తప్పిపోయి మళ్ళా దొరికిన ఈ వొక్క గొర్రెవలన గలిగిన సంతోషం గొప్పది. ఆ రీతినే మోక్షంలోని దేవుడు కూడ పరివర్తనంతో అవసరంలేని తొంబైతొమ్మిదిమంది నీతిమంతుల కంటె, పరివర్తనం చెందిన ఒక్క పాపినిజూచి ఎక్కువ ఆనందం పొందుతాడు. కనుక పాపాత్ములనబడే వాళ్ళను చిన్నచూపు జూడగూడదని క్రీస్తు భావం. పరలోకంలోని తండ్రిలాగే యూదనాయకులుగూడ వాళ్ళను కరుణతో ఆదరించాలని అతని ఉద్దేశం.

పరలోకపిత ఈ కాపరిని బోలినవాడు. అతడు పాపాత్ముల పట్ల ఎంతో ఓర్పు జూపుతాడు. వాళ్ళ వినాశాన్ని గాక పరివర్తనాన్ని ఆశించే దయార్ధ్ర హృదయుడు. ఇక క్రీస్తు అంటే ఆ తండ్రి పంపగా వచ్చిన మెస్సీయా. నీతిమంతుల కోసంగాక పాపాత్ముల కోసం విచ్చేసిన వైద్యుడు - మార్కు 2, 17. కావుననే తాను పాపాత్ములతో కలసి తిరుగుతున్నాడు. వాళ్ళతో భుజిస్తూన్నాడు. వాళ్ళను మళ్ళా త్రోవకు మరల్చుతున్నాడు. కరుణామయుడైన ఆ కాపరిని బోలినవాడు పరలోకపు తండ్రి. ఆ తండ్రిని తనయందూ తన చర్యలందూ ప్రతిబింబించుకొంటున్నవాడు క్రీస్తు. ఈ క్రీస్తునిజూచి పరిసయులూ ధర్మశాస్త్రోపదేశకులూ గొణుగుకోగూడదు. ఈ నాయకులు పాపాత్ములపట్ల జూపే క్రూర స్వభావాన్ని మార్చుకొని, వాళ్ళ బలహీనతలను సానుభూతితో అర్థం జేసికోవాలి. ఇది యీ సామెతలోని ప్రధాన భావం.

కడన ఓ చిన్న విషయం. లూకా 15, 7కి మారుగా మత్తయి 18, 14లో "ఈ పసివారిలో ఒక్కడైన నాశమైపోవడం పరలోకంలోని మీ పిత చిత్తంగాదు" అని వుంది. అనగా ఈ సామెతకు లూకా జూపిన పర్యవసానం వేరు. మత్తయి చూపిన పర్యవసానం వేరు. లూకా పాపాత్ములు నిరుత్సాహపడనక్కరలేదనీ ప్రభువు వాళ్ళను ఆదిరిస్తాడనీ బోధించాడు. కాని మత్తయి శ్రీసభలోని క్రైస్తవ నాయకులు పాపాత్ములను వెదకి మళ్ళా దారికి దీసికొని రావాలని బోధించాడు. క్రీస్తు చెప్పిన సామెతలు సువిశేషకారుల రచనల్లో కెక్కేటప్పటికల్లా కొద్దిగా మార్పు జెందాయి.

### 3. అన్వయం

1. క్రీస్తు సామెతల్లో యిది చాల సుప్రసిద్ధమైంది. తొలి శతాబ్దిలోని క్రైస్తవులు నిర్మించిన రోమాపురి సొరంగాల్లో మంచి కాపరి చిత్రాలు నూరింటికిపైగా కన్పించాయి. అనగా తొలి శతాబ్దికే యిది చాల ప్రసిద్ధిలోకి వచ్చిందనుకోవాలి. అంతియోకయ ఇన్యాసివారు, హెర్మసు మొదలైన ప్రాచీన క్రైస్తవ రచయితలు గూడ క్రీస్తుని మంచి కాపరిగా వర్ణించారు. ఒకోమారు మనం మనపాపాలను ఇక జయించలేము గాబోలు అని విచారిస్తూంటాం. అలాంటప్పుడు ఈ సామెత క్రీస్తు కారుణ్యాన్ని జ్ఞాప్తికిదెచ్చి మనకు మళ్ళా ధైర్యం కలిగిస్తుంది. ఆ ప్రభువు కారుణ్య హృదయాన్ని మననం చేసికోవడానికి ఇది చక్కగా ఉపయోగపడుతుంది. పాపోచ్చారణకు తయారయ్యేపుడుగూడ ఈ సామెతను ధ్యానించుకోవచ్చు.

2. నాల్గవ శతాబ్దంలో మిలాను నగరంలో భక్తుడు ఆంబ్రోసు ఈ సామెతమీద ఒక ఉపన్యాస మిచ్చాడు. అతని భావాల ప్రకారం క్రీస్తు మన మంచి కాపరి. మనమంతా పాపపు పొదల్లో జిక్కి దిక్కుమాలి వుండగా ఆ కాపరి జాలితో మనలను వెదకుకుంటూ వచ్చాడు. అతడు సిలువమీద తాను చాచిన భుజాలమీదికి మనలను ఎక్కించుకొన్నాడు. మనకు పాప విముక్తి కలిగించాడు. ఆ నెనరుగల కాపరికి మనం చేయెత్తి మ్రొక్కాలి.

## 2. జారిపోయిన నాణెం - లూకా 15, 8 -10

### 1. వివరణం

ఈ సామెత లూకా సువిశేషంలో మాత్రమే కన్పిస్తుంది. దీని సందర్భంగూడ మొదటి సామెత సందర్భం లాంటిదే. ఓ ఆవిడకు పది నాణాలున్నాయి. యూద స్త్రీలకు పెండ్లి అయ్యేపుడు పుట్టింటివాళ్లు కొన్ని బంగారు లేక వెండి నాణాలు కానుకగా యిస్తారు. ధనవంతులైతే నూరునాణాల దాకా, పేదలైతే పది నాణాలదాకా యిస్తారు. స్త్రీలు ఈ కానుకలను పైట చెంగున గట్టుకొని ఆ చెంగును అలంకరణ కోసం తలమీద కప్పుకొనేవాళ్ళు. రాత్రి నిద్రించేప్పుడు గూడ ఆ చెంగును తొలగించేవాళ్లుకాదు. ఈ సామెతలో పేర్కొనబడిన స్త్రీ పేదరాలు. ఆమెకు పుట్టింటివాళ్ళు ఇచ్చింది పది నాణాలే. ఐనా ఆమె వాటిని ప్రాణప్రదంగా చూచుకొంటూంది. ఓ దినం చెంగుముడి వదులై వాటిల్లో వొకటి జారిపోయింది. వెంటనే ఆమె దీపం వెలిగించి ఇల్లంతా గాలించింది. ఇక్కడ దీపం వెలిగించింది రాత్రైగాదు. పాలస్తీనా యిండ్లకు చిన్న తలుపులూ చిన్న కిటికీలు వుంటాయి. కనుక వెలుతురు లోపలకు ప్రవేశించేదిగాదు. అంచేత కాసుల్లాంటి చిన్న వస్తువులను చూడాలంటే పట్టపగలుగూడ దీపం వెలిగించవలసిందే. కనుక ఆమె దీపం వెలిగించింది. ఇల్లంతా ఊడ్చింది. ఊడ్వడం దేనికంటే నాణెం ఇంటి నేలలో పాతుకొనివున్న చిన్నచిన్న రాళ్ళకు దగిలి టంగున మ్రోగుతుంది. అప్పుడు దాన్ని గుర్తుపట్టవచ్చు. అలా ఆమె ఇల్లు వూడ్చి నాణాన్ని గుర్తుపట్టి సంతోషంతో ఇరుగుపొరుగు అమ్మలక్కలను చేరబిలచి "నేను పోగొట్టుకొన్న నాణెం దొరికింది, మీరూ నాతోపాటు సంతోషించండి" అంది. ఈ "సంతోషం" అనేది ఈ సామెతలో ముఖ్యాంశం. కాపరి గొర్రె దొరికినందున సంతోషిస్తాడు. పేదరాలు నాణెం దొరికినందున సంతోషిస్తుంది. ఆలాగే ఒక్క పాపాత్ముడు పరివర్తనం జెందినపుడు దేవుడు సంతోషిస్తాడు. (ఈ సామెతలో దేవదూతలంటే దేవుడే. యూదులు దేవుని పేరు ఉచ్చరించడానికి ధైర్యం చాలక దేవదూతలు అని వుచ్చరించేవాళ్లు.)

ఆ తప్పిపోయిన గొర్రెలాగే ఈ జారిపోయిన నాణెం గూడ పాపాత్ములకు పోలికగా వుంటుంది. ఈ పాపాత్ములు పశ్చాత్తాపపడ్డంవల్ల ప్రభువు ఆనందిస్తాడు. ఎందుకంటే అతడు పాపుల నాశంగాక, వాళ్ళ పరివర్తనం కోరుకొనే కరుణామయుడు. పాపులను క్షమించడమంటే అతనికి పరమానందం. ఇక క్రీస్తు పరలోకంలోని తండ్రి పంపగా వచ్చినవాడు. ఆ తండ్రిలాగే ఇతడుగూడ దయాపరుడు. పాపాత్ముల వర్గానికి చెందిన సుంకరులు మొదలైనవాళ్ళను దారికి తీసుకొనిరావడం అతని బాధ్యత. దీనికోసమే తండ్రి అతన్ని అధికారపూర్వకంగా పంపాడు. పరిసయులూ ధర్మశాస్త్ర బోధకులూ ఈ సత్యాన్ని గుర్తించాలి. ఇది సామెత భావం.

## 2. అన్వయం

యెహెజ్కేలు ప్రవచనంలో ప్రభువు "పాపాత్ముడు మరణించడం వలనగాక, పాపకార్యాలను విసర్జించి మరల బ్రతకడం వలన నాకు సంతృప్తికలుగుతుంది" అంటాడు – 18,23. మనం పాపంజేసినపుడు ప్రభువు మనలను శిక్షించాలని కోరుకోడు. మనం నాశమైపోవాలని అనుకోడు. కాని మనం పాపం నుండి వైదొలగి దైవప్రేమతోగూడిన వరప్రసాద జీవితాన్ని జీవించాలనిమాత్రంకోరుకొంటాడు. అతడు జాలిగుండెలుకలవాడు. తన బిడ్డలమైన మన శ్రేయస్సు తప్పితే అతడు కోరుకునేదేమీలేదు. భక్తుడు ఈ సామెతలు చిత్రించే భగవంతుని కరుణాహృదయాన్ని అర్థం చేసికోవాలి.

# 3. తప్పిపోయిన కుమారుడు - లూకా 15, 11-32.

## 1. సందర్భం

క్రీస్తు సుంకరులనూ పాపులనూ చేరదీస్తుండగా యూద నాయకులు అతనిమీద గొణగారు. అందుకు క్రీస్తు ఆ క్రింది వర్గం వాళ్ళని సమర్థిస్తూ మూడు సామెతలు చెప్పాడన్నాం. అవే తప్పిపోయిన గొర్రె, జారిపోయిన నాణెం, తప్పిపోయిన కుమారుడునూ. ప్రస్తుత సామెతను తప్పిపోయిన కుమారుడు అనడం కంటె "కరుణాళువైన తండ్రి సామెత" అనడం మేలు. ఇందలి ప్రధానపాత్ర కుమారుడు కాదు. అతని తండ్రి. తన తండ్రి మంచి గుణాన్ని జ్ఞప్తికి దెచ్చుకొనే కుర్రవాడు పశ్చాత్తాపపడ్డాడు. కారుణ్య ప్రదర్శనంలో ఈ తండ్రి ఆ పరలోకపు తండ్రికి ప్రతిబింబం.

## 2. వివరణం

తప్పిపోయిన కుమారుడు తన ఆస్తిని తాను పంచుకోగోరాడు. యూదుల ఆచారం ప్రకారం తండ్రి ఆస్తిలో రెండు వంతులు పెద్ద కుమారునికి, ఒక వంతు చిన్న కుమారునికి లభిస్తాయి – ద్వితీయోప 21, 17. కనుక ఇక్కడ చిన్నవానికి తండ్రి యాస్తిలో మూడవ వంతు వచ్చి వుండాలి. చిన్నవాడు తన వాటాను వెంటనే విక్రయించి వచ్చిన ధనంతో దూరపు పట్టణాలకు వెళ్ళిపోయాడు. క్రీస్తు నాడు ఇంచుమించు పది లక్షలమంది యూదులు ఉండేవాళ్ళు. వాళ్ళల్లో ఐదు లక్షలమంది పాలస్తీనా దేశంలో, ఐదు లక్షలమంది అన్యదేశాల్లో వసిస్తూండేవాళ్ళు. కావున ఈ చిన్న కుమారుడు దూరదేశాలకు వెళ్ళిపోవడంలో వింతేమీలేదు. కాని అలా వెళ్ళి పెండ్లిజేసుకొని సొంతకుటుంబాన్ని నెలకొల్పుకొని డబ్బు జేసికోవడానికి మారుగా భోగలాలసుడై తిరుగుతూ చేతిలో వున్నదికాస్త ఖర్చు జేసికొన్నాడు.

బెల్లానికి ఈగల్లాగ డబ్బు కన్పించినన్నాళ్ళు అతని చుట్టూ మూగిన స్నేహితులంతా ఎవరిత్రోవన వాళ్ళు సాగిపోయారు. ఇక కుమారునికి ఆ దూరపు భూముల్లో "నా" అనే వాళ్ళెవరూ లేరు. గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు అంతలోనే ఆ గడ్డమీద పెద్ద కరువుగూడ

దాపురించింది. ఉంటానికి ఇల్లులేక, తింటానికి తిండిలేక మలమల మాడిపోతూ చివరికి ప్రాణాలైన నిలుపుకొందామనుకొని అతడు ఓ భూస్వామి యింట పందులుగాసే ఒప్పందంమీద జీతానికి గుదిరాడు. దీనివల్ల ఆ చిన్నవానికి రెండవమానాలు సిద్ధించాయి. మొదటిది, యూదులు అన్యమతస్థుల వద్దకు పోరు. అతని యింటిలో ఇతడు సబ్బాతు ననుసరించలేడు. శుద్ధిగల భోజనం భుజించనూలేడు. కనుక ఓ సనాతన బ్రాహ్మణుడు దళితునింట సేవకు కుదిరినట్లయింది. రెండవది, యూదులకు పందులు అపవిత్ర మృగాలుగాన వాటి దగ్గరికైన పోరు - లేవీ 11,7. ఐనా తానీ పందులను కాయవలసి వచ్చింది. ఈ నీచవృత్తిలోగూడ అతనికి కడుపునిండ కూడు దొరకలేదు. ఆ పందులకు ఒక జాతి చిక్కుడుగాయలు పోసేవాళ్ళు. కనీసం ఆ పందులు నమిలే చిక్కుడు గింజలతోనైనా కడుపు నింపుకొందామనుకొన్నాడు చిన్నవాడు. కాని పందుల దగ్గరికి వెళ్ళి అవి చప్పరించే గింజలు తీసికోవాలంటే అతనికి ఏవగింపు పుట్టింది.

ఈ కష్టాలన్నీ అతని కండ్లు విప్పాయి. ఎంత బ్రతికి చెడినా తానేమో గొప్పవారియింటి బిడ్డడాయె! మహారాజును బోలిన తన తండ్రి యింట పనిచేస్తున్న ఊడిగపుదారులు తన కంటే గొప్ప స్థితిలో వున్నారు. తాను ఆ సేవకుల్లో చేరితే పొట్టనిండా కమికెడు కూడు తిని బ్రతికిపోవచ్చు. చిన్నవాడు ఈలా తలపోసికొంటూ తండ్రివద్ద వల్లెవేయడానికై ఓ చిన్న ఉపన్యాసం తయారుచేసికొని యింటిదారి పట్టాడు.

అక్కడ తండ్రి తప్పిపోయిన కుమారుణ్ణి మాటిమాటికి స్మరించుకొంటూ, బిడ్డ ఏలాంటి బాధలకు గురౌతున్నాడో అని చింతిస్తూ, ఏనాడైనా మనసు మార్చుకొని మరలిరాక పోతాడా అని కొండంత ఆశతో కుమారుని రాకకై తెన్నులు జూస్తూన్నాడు. నాడు తోబియా గారాబుతల్లి అన్నాగూడ పుత్రుని రాకకై యీలాగే దారులు కాచుకొని వుండేదని వింటున్నాం - తోబి 11, 5-6.

చిన్నవాడు మరలివచ్చాడు. అలా వస్తున్నవాణ్ణి అల్లంత దూరంనుండే గుర్తుపట్టి గబగబ పరుగెత్తుకొనిపోయి ఆలింగనం జేసికొన్నాడు ఆ తండ్రి. ఈ యాలింగనం తండ్రి కుమారుణ్ణి క్షమించాడనడానికి చిహ్నం. ఈలాగే ఓమారు అపరాధియై తన యెదుటికి వచ్చిన కుమారుడు అబ్షాలోముని దావీదు ఆలింగనం జేసికొని క్షమించాడు-2 సమూ 14, 33. కుమారుడు తాను జాగ్రత్తగా తయారుజేసికొని వచ్చిన ఉపన్యాసాన్ని ముగించక పూర్వమే తండ్రి అతన్ని యింటిలోనికి తోడ్కొని వచ్చాడు. బికారిలాగ వచ్చిన బిడ్డనికి శ్రేష్ఠమైన శాలువ గప్పించాడు. కాళ్ళకు చెప్పులూ చేతికీ ఉంగరమూ తొడిగించాడు. మాంసం వండించి విందులు చేయించాడు.

ఇక్కడ మూడంశాలు గుర్తించాలి. 1) కప్పుకోవడానికి శ్రేష్ఠమైన శాలువ నీయడమంటే మర్యాదనూ క్రొత్త జీవిత ప్రారంభాన్నీ సూచించడం - మత్త 9,16. అనగా

చిన్నవాడు తండ్రి యింట సేవకుల్నాగాక, గౌరవమర్యాదలతో స్వీకరింపబడ్డాడు. ఇకమీదట అతని నడవడికలో గూడ క్రొత్తదనం గోచరిస్తుంది. 2) జోళ్లూ ఉంగరమూ అధికారాన్నీ స్వాతంత్ర్యాన్నీ సూచిస్తాయి. అనగా చిన్న కుమారుడు ఇక మీదట అన్య యజమానులకు బానిసగాడు. తండ్రి యింట అతనికి అన్ని అధికారాలూ లభించాయి. ఐగుప్తున ఫరోప్రభువు అధికారిగా నియమింపబడిన యోసేపునకు శాలువా ఉంగరమూ బంగారు గొలుసూ బహూకరింపబడ్డాయని చదువుతున్నాం - ఆది 41, 42. 3) బలిసిన దూడనుగోసి మాంసం వండించడం గూడ రోజురోజు జరిగే పనిగాదు. పాలస్తీనాలో ఎవరో గొప్ప అతిథులు వచ్చినపుడుగాని మాంసపు విందులు జరుగవు. కనుక ఈ విందు తండ్రికి చిన్నవానిపట్ల గల ఆదరాన్ని సూచిస్తుంది. ఈ మూడు కార్యాలద్వారా తండ్రి తన దుడుకు బిడ్డను పూర్తిగా క్షమించాడని అర్థంజేసికోవాలి. ఇంతటితో ఈ సామెత ముగియవలసింది. కాని ముగియలేదు. ఇంకా పెద్దకుమారుని కథ గూడ వుంది. అది చిన్నకుమారుని కథకంటెగూడ ముఖ్యమైనది.

పెద్దకొడుకు తండ్రిమాట జవదాటనివాడు. అతడు పొలం పనినుండి మరలివచ్చేటప్పటికల్లా ఇంటిలో విందులూ ఆటపాటలూను. ఇదేమిటా అని దిగ్భ్రాంతి జెందాడతడు. సేవకులు తమ్ముని రాకను తండ్రి ఉత్సాహాన్ని వివరించి చెప్పగా విని కోపావేశుడయ్యాడు. ఇంటిలోనికి అడుగుపెట్టక వెలుపలనే వుండి తన అసమ్మతిని వెలిబుచ్చాడు. తండ్రి తన్ను పిలువవచ్చి బతిమాలినా విన్పించుకోలేదు. "నేనిన్నాళ్ళబట్టి నీవు గీసిన గిరి దాటకుండా ఈ యింటిలో ఓ బానిసలా పనిజేస్తున్నాను. ఐనా నా మిత్రులతో విందారగించడానికై ఏనాడైనా ఓ చిన్న మేక కూననైనా యిచ్చి యెరుగుదువా? మరి ఇప్పుడు నీ యీ కొడుకు తన ఆస్తినంతా ఉంపుడుగత్తెల వాతగొట్టి ఈలా వచ్చాడో లేదో, గబగబ క్రొవ్విన దూడను గోయించి మాంసం వండించి విందు జేయిస్తావా?" అని బగబగ మండిపోయాడు. కాని తండ్రి ఆ కుమారుణ్ణి సముదాయిస్తూ నాయనా! నీవు నిత్యం నాతో వుండేవాడివే గదా! నావన్నీ నీవే. మరి నీ యీ తమ్ముడో అంటే చచ్చి బ్రతికాడు. ఈ మంచి రోజున మనం పండుగ జేసికోవద్దా? అని మృదువుగా మందలించాడు. ఇక్కడ ఈ తండ్రీ కొడుకుల సంభాషణంలో ఒక్క విషయం గమనించాలి. పెద్దకొడుకు కోపావేశుడై చిన్నవాణ్ణి "తమ్ముడు" అని పిలువడు. మరి "నీ కుమారుడు" అంటాడు. కాని తండ్రి అతని వాగ్ధోరణిని సవరిస్తూ "నీ తమ్ముడు" అని సవరిస్తాడు.

ఈ సామెతమీద ఇన్ని పుటల వివరణం జూచాం. కాని దీనిలో ప్రధాన భావం ఏమిటి? ఈ సామెతలోని తండ్రి పరలోకపు తండ్రిని సూచిస్తాడు. పెద్దకుమారుడు పరిసయులనూ చిన్న కుమారుడు పాపాత్ములనబడు సుంకరులనూ సూచిస్తారు. తండ్రి తప్పిపోయిన కుమారుని పట్లలాగ, పరలోకపు తండ్రి పాపాత్ములపట్ల కనికరమూ జాలీ జూపుతాడు. కావున ఆయన్నలాగా ఈ పరిసయులునూ సుంకరులనబడే ఈ తప్పుడు

తమ్ముళ్ళను అనాదరబుద్ధితో జూడరాదు. పైగా నీవు ఈ పాపాత్ములతో భుజించి వాళ్ళను ఆదరించడం దేనికని పరిసయులు క్రీస్తుని విమర్శించరాదు. ఎందుకంటే దయామయుడైన ఆ పరలోకపు తండ్రి ప్రతినిధి క్రీస్తు. ఆ తండ్రి పాపులపట్ల తనకుగల దయను ఈ క్రీస్తు ద్వారా ప్రదర్శిస్తున్నాడు. కావున క్రీస్తుని దయాభావాన్ని విమర్శించడమంటే పరలోకపు తండ్రి దయాగుణాన్ని విమర్శించడమే.

ఈ సామెతలోని ప్రధాన భావం ఆ తండ్రి కరుణ. కావుననే దీన్ని "కరుణాళువైన తండ్రి సామెత" అని పిలవాలని చెప్పాం. చిన్న కుమారుని ఆగడమూ, పరితాపమూ, పెద్ద కుమారుని యీసూ - ఇవన్నీ ఆ తండ్రి జాలిని వ్యక్తం జేయడానికి కల్పింపబడిన సన్నివేశాలు మాత్రమే.

### 3. అన్వయం

1. ఈ సామెతలో చిన్నవాని తప్పు ఆస్తిని దూబరాగా ఖర్చు చేయడంగాదు. ప్రేమమయుడైన తండ్రిని ధిక్కరించి అతని యింటినుండి వెళ్ళిపోవడం. బైబుల్లో పాపమంటే సృష్టికర్తయైన దేవుని సన్నిధినుండి వెళ్ళిపోవడం. సృష్టి వస్తువులు మనలనేమో సుఖపెడతాయని వాటి దగ్గరకు వెళ్ళడం. దుడుకు చిన్నవాడు చేసింది అచ్చంగాయిదే. ఇక, పశ్చాత్తాపమంటే ఆ సృష్టి వస్తువులను విడనాడి మళ్ళా తండ్రివంటివాడైన సృష్టికర్త యింటికి తిరిగిరావడం. ఆ తండ్రిని మన్నింపు అడుగుకొని మళ్ళా అతని ప్రేమకు పాత్రుడు కావడం. చిన్నకుమారుడు తిరిగి రావడంలో భావం యిదే. కనుక ఈ సామెత మన జీవితంలో గూడ నిజమైన పశ్చాత్తాపానికి మార్గదర్శకంగా వుంటుంది. దేవుని కారుణ్యాన్ని అతడు పంపిన క్రీస్తు దయాగుణాన్ని ధ్యానం చేసికోవడానికి చక్కగా ఉపయోగపడుతుంది.

2. ఈ సామెతలో పెద్దకొడుకు చిన్నవాణ్ణి చిన్నచూపు చూచాడు. అలాగే పరిసయులూ ధర్మశాస్త్రోపదేశకులూ సుంకరులనూ పాపాత్ములనూ చిన్నచూపు చూచారు. మనంగూడ ఈలాగే చేస్తుంటాం. తరచుగా మనం పుణ్యాత్ములమనీ ఇతరులు పాపాత్ములనీ భావిస్తూంటాం. ఈ భావంతోనే తోడి జనాన్ని ఆడిపోసుకొంటూంటాం. కాని ఇది పెద్ద పొరపాటు. ఇతరులను తృణీకరించడమనేది డాంబికులైన పరిసయుల దృష్టి. భగవంతుని దృష్టి, అతని పుత్రుడైన క్రీస్తు దృష్టి అదికాదు. ఆ తండ్రీకొడుకులు కరుణామయులు. క్రైస్తవులమైన మనం తోడి జనుల కంటిలోని నలుసును వ్రేలెత్తి చూపడానికి సిద్ధంగా వుండగూడదు.

## 4. పరిసయుడూ, సుంకరీ - లూకా 18, 9-14.

### 1. సందర్భం

లూకా మాత్రమే ఈ సామెతను ఉదాహరించాడు. పరిసయులు మోషే ధర్మశాస్త్రాన్ని తుచ తప్పకుండ పాటించేవాళ్లు. ధర్మశాస్త్రాన్ని పాటిస్తే పుణ్యకార్యాలు చేసి

నట్లేగదా? అందుచేత వాళ్లు తాము చేసిన పుణ్యకార్యాలే తమ్ము రక్షిస్తాయనీ వాటివల్లనే తాము నీతిమంతులమౌతామనీ, ఇక భగవంతుని కారుణ్యంతోగాని వరప్రసాదంతోగాని అవసరము లేదనీ భావించారు. భవనం పునాదులమీద నిల్చినట్లు తామూ తమ సత్కార్యాలమీద నిలుస్తామనుకొన్నారు. ఇక సుంకరులూ పాపాత్ములూ ధర్మశాస్త్రం పాటించరు గనుక వాళ్ళకు రక్షణం లేదు. కనుక పరిసయులు ఈ వర్గంవాళ్ళను చిన్నచూపు జూస్తూ తామే పుణ్యాత్ములమన్న భావంతో విర్రవీగుతుండేవాళ్ళు. ఈలాంటివాళ్ళ నుద్దేశించి క్రీస్తు ప్రస్తుత సామెత చెప్పాడు - 18,9.

## 2. వివరణం

ప్రార్థనం జేసికోవడానికై ఇద్దరు జనులు దేవాలయానికి ఎక్కి వెళ్ళారు. యెరూషలేం దేవాలయం కొండమీద వుంది. ఉదయం తొమ్మిదవగంటా సాయంకాలం మూడవ గంటా యూదుల ప్రార్థనా సమయం. ఇక్కడ ఈ ఇద్దరూ వెళ్ళింది మూడవగంట సమయంలో గావచ్చు. నిలుచుండి ప్రార్థించడం యూదుల ఆచారం. యెరూషలేము దేవాలయంలో చాలా భాగాలున్నాయి. పరిసయుడు గార్భాగారం ముందుగల మొదటి తెరదాకా పోయివుండవచ్చు. వాళ్లు అంతవరకూ పోవచ్చు. సుంకరులు, స్త్రీలు లేక అన్యమతస్థులు నిలుచుండే తావుదాకా మాత్రమే వెళ్ళేవాళ్లు. కనుక ఈ సుంకరిగూడ ఆతావు దాటి ముందుకు అడుగుపెట్టి వుండడు.

పరిసయుని ప్రార్థనకీ సుంకరి ప్రార్థనకీ గల తారతమ్యం ఈ సామెతలో చక్కగా చిత్రించబడింది. యూదుల ప్రార్థన సాధారణంగా భగవత్ స్తుతితోను, ప్రార్థనకారుని అయోగ్యతా వర్ణనతోను ప్రారంభమౌతుంది. చాల కీర్తనల్లో ఈ పద్ధతి గోచరిస్తుంది. కాని ఈ పరిసయుడు మాత్రం దేవుని స్తుతించడు. తన అపవిత్రతను వ్యక్తం జేసికోడు గూడ. పైపెచ్చు తాను నీతిమంతుణ్ణని చెప్పుకొన్నాడు. అన్యప్రజలు ఆసబోతులూ మోసగాళ్ళూ వ్యభిచారులూను. ఆ ప్రక్కనున్న సుంకరే ఇందుకు ఉదాహరణం. తాను మాత్రం పుణ్యశీలుడు! ఇక్కడ ఓ విశేషం గమనించాలి. ఇతడు తన తప్పిదాన్ని వెల్లడి జేయడు. అసలు తాను తప్పుజేసినట్లే తోచలేదతనికి. అతడు భగవంతుణ్ణి మన్నింపు అడుగుకొననేలేదు గనుక, భగవంతుడుగూడ అతణ్ణి మన్నించనేలేదు.

పరిసయుడు తాను సల్పే నీతికార్యాలను రెండిటిని పేర్కొన్నాడు. 1. యూదుల నిబంధనం ప్రకారం ఏడాది కొక తూరి మాత్రమే ఉపవాసముండాలి. అది కిప్పూర్ అనే ప్రాయశ్చిత్తదినాన. మరి యితడో వారానికి రెండుసారులు, సోమ గురువారాలు తనకైతానే ఉపవాస ముండేవాడు. ఎందుకు? దుర్మార్గులైన సుంకరుల పాపాలకు పరిహారం చేయడం కోసం. 2. అంగడిలో అమ్మే భోజన పదార్థాలకు వాటిని పండించిన సేద్యగాళ్ళే దేవాలయపు పన్ను చెల్లించాలి. కాని యితడు తానుగొన్న కాయగూరలన్నిటికీ స్వయంగానే

పదియవవంతు పన్ను చెల్లించాడు. ఎందుకు? ఆ మోసపు సేద్యగాళ్ళు పన్ను చెల్లించారో లేదో అన్న అనుమానంచేత. పొలంలో పండే పునాసపంట మీదానూ జంతువుల మందలమీదానూ మాత్రమే యూదులు దేవాలయపు పన్ను చెల్లించాలి. ఇతడోంటే, తాను తోటలో పండించుకొనే దుంపలూ కూరగాయలూ మొదలైన అల్ప వస్తువుల మీదగూడ పన్ను చెల్లించాడు. అతని మనస్సాక్షి అంత సున్నితమైంది మరి.

ఇక్కడ ఓ విషయం చక్కగా అర్థం జేసికోవాలి. ఉపవాసాన్ని గూర్చిగాని పన్ను చెల్లించడాన్ని గూర్చిగాని ఈ పరిసయుడు అబద్ధమేమీ చెప్పలేదు. అతడు చెప్పిందంతా నిజమే. మరి అతని తప్పేమిటి? నేనింతటివాణ్ణి అంతటివాణ్ణి అనుకోవడం ఎవరికి జెల్లుతుంది? దేవుని యెదుట మన తప్పులను ఒప్పుకొని మన్నింపు అడుగుకోవాలిగాని, నేను ఆ పుణ్యకార్యాలు చేసాను, ఈ పుణ్యకార్యాలు చేసాను అని గొప్పలు చెప్పుకుంటే సరిపోతుందా? భగవంతుని కృపపై ఆధారపడాలిగాని మన పుణ్యకార్యాలమీదనే మనం ఆధారపడితే రక్షణం కలుగుతుందా? పైగా ఇతనిలాగా తోడి ప్రజలు పాపాత్ములు అనుకోవడం పాడియేనా? అహంభావమంటే యిదిగాదా?

ఈ యహంభావానికి పరిసయులు పెట్టింది పేరు. టాల్మడ్ అనే యూదుల ఆచార గ్రంథంలో రబ్బయి నెఖోనియాసు చేర్చిన జపమిది. యావే ప్రభూ! వీధుల్లో గూర్చొని సుద్దులతో కాలం వెళ్ళబుచ్చే గాలిజనంతో నన్ను జేర్చావు గావు. దేవాలయంలో గూర్చొని మోషే ధర్మశాస్త్రాన్ని చదువుకొనే భాగ్యాన్ని నాకు ప్రసాదించావు. ఇందుకు నీకు వందనాలు చెప్తున్నాను. ఆ గాలిజనమూ నేను వేకువనే లేస్తున్నాం. ఐనా నేను టోరా గ్రంథాన్ని చదువుకోవడానికి : వాళ్ళో వ్యర్థంగా కాలం వెళ్ళబుచ్చడానికి. వాళ్ళూ నేనూ ప్రయాసలకు గురౌతున్నాం. ఐనా నేను శాశ్వతభాగ్యం పొందడానికి : వాళ్లో నిరర్థకంగా రోజులు సాగించడానికి. వాళ్ళూ నేనూ పరుగెత్తుతూన్నాం. ఐనా నేను నిత్యజీవం లభించే మరో లోకంవైపు : వాళ్లో నిత్యమృత్యువునకు కారణమైన గుంటవైపు. సిమ్యన్‌బెన్ జొక్కై అనే మరో రబ్బై ఈ క్రింది జపాన్ని చేర్చాడు. "ఈ ప్రపంచంలో ఇద్దరే యిద్దరు నీతిమంతులుంటే, వాళ్ళు నేనూ నా కుమారుడు మాత్రమే. ఒకే వొక్క నీతిమంతుడుంటే, అతడు నేను మాత్రమే!" ఈలాంటి భావాలతోగూడిన పరిసయుల మూకకు జెందిన నరుడొకడు దేవాలయంలో అడుగుపెట్టి పైరీతిగా ప్రార్థించాడనడంలో వింతేముంది?

ఇక, సుంకరి ప్రార్థనను పరిశీలిద్దాం. అతడు పీఠానికి దూరంగా నిలుచుండి అపాత్రుడనన్న భావంతో పరలోకం వైపు కండ్లెత్తి చూడ్డానికిగూడ జంకి గుండెలు బాదుకొంటూ "ప్రభూ! పాపిని, నాపై కృపజూపు" అని మాత్రం ప్రార్థించాడు. ఇక్కడ సుంకరి తన ప్రత్యేక పాపాలేమిటో తెలియజేయలేదు. అక్కరలేదు కూడ. ఏమంటే, ఇతని పాపాల జాబితానుగూడ పరిసయుడే వెల్లడిజేసాడు. ఆ పరిసయుని వలె ఈ సుంకరి

తన పుణ్యకార్యాలను వల్లించుకోలేదు. అసలతనికి తాను పాపాత్ముణ్ణి అనుకోవడం తప్పితే వేరే తలంపు తట్టనేలేదు. కావున అతడు తన పుణ్యకార్యాలమీద గాక, భగవంతుని కరుణమీద ఆధారపడి "ప్రభో! ఈ పాపిని మన్నించు" అని ప్రార్థించాడు. వినయంతో గూడిన అతని యీ ప్రార్థన భగవంతునికి ప్రియపడింది. నమ్మికతో తన చేతుల్లోనికి సమర్పించుకొన్నవాళ్ళని ఆ ప్రభువు త్రోసివేస్తాడా? పరిసయుడు పీఠానికి దాపులో నిలిచినా హృదయశుద్ధి లేనివాడు గనుక దైవసాన్నిధ్యానికి దూరమయ్యాడు. సుంకరి పీఠానికి దూరంగా నిలిచినా దైన్యభావం గలవాడు గనుక దైవసాన్నిధ్యానికి చేరువయ్యాడు. బైబులు భగవంతుడు గర్వాత్ములను అణగద్రొక్కి దీనులను ఆదరించేవాడు - యాకో 4,6.

క్రీస్తు నోటినుండి ఈ సామెతను వింటున్న పరిసయులు పరలోక ప్రభువు ఆ పరిసయుని మన్నించి సుంకరిని తిరస్కరిస్తాడని అనుకొన్నారు. వాళ్ళ తలపోతల ప్రకారం దేవుడు పాపాత్ముల మొర ఆలించడు. ఆలించగూడదు గూడ. ఒకవేళ సుంకరిగూడ మన్నింపుబొందితే, అది కేవలము ఆ పరిసయుని ప్రార్థనా ఫలితంగానే. కాని పరలోకపు తండ్రి సుకరిని మన్నించి పరిసయుని తిరస్కరించాడని క్రీస్తు చెప్పేటప్పటికల్లా శ్రోతలైన పరిసయులంతా నిశ్చేష్టులయ్యారు. ప్రభువు పరిసయుల గర్వభావాన్ని అణచివేయడం కోసం ఈ సామెతలో దేవుని కారుణ్యాన్ని వర్ణించి చెప్పాడు. కాని గ్రుడ్డి ప్రజలను గోతిలోనికి నడిపించుకొని పోతున్న ఆ గ్రుడ్డి నాయకులు ప్రభువు పలుకులను ఆదరించలేదు.

ఈ సామెత భావం ఏమిటి? కొందరనుకొన్నట్లు ఇందలి ముఖ్య విషయం వినయమూగాదు, జపమూగాదు. మరి పాపాత్ములపట్ల భగవంతుడు జూపే కారుణ్యం ఇక్కడ ప్రముఖాంశం. ఆత్మశుద్ధితో పశ్చాత్తాప హృదయంతో తన్ను సమీపించే పాపాత్ములను భగవంతుడు నిరాకరించడు. కరుణతో వాళ్ళ తప్పిదాలను క్షమిస్తాడు. పరలోక పితయొక్క ఈ కృపాగుణాన్నే క్రీస్తు గూడ తన చర్యలందు వ్యక్తం జేస్తున్నాడు. కనుక పరిసయులు క్రీస్తు కారుణ్యాన్ని తప్పుగా ఏంచరాదు - ఇది సామెత భావం.

## 3. అన్వయం

1. "ప్రభో! పాపినైన నామీద కృపజూపు" అనే యీ సుంకరి ప్రార్థనం 51వ కీర్తనం మొదటి చరణం నుండి గ్రహించబడింది. ఇదే కీర్తన 19వ చరణంలో "ప్రభో! నేను సమర్పించుకొనే బలి పశ్చాత్తాప హృదయమే. పశ్చాత్తాపంతో సంతాపపడే హృదయాన్ని నీవు అనాదరం జేయవు" అని చెప్పబడింది. ఇంతకంటె యోగ్యమైన పశ్చాత్తాప జపం మరొకటి లేదు. ఈలాంటి ప్రార్థలనద్వారా భక్తుడు ప్రభువు నుండి పాప క్షమాపణం అడుగుకోవాలి. అప్పుడు కరుణామయుడైన భగవంతుడు ఆ సుంకరి పాపాలను క్షమించినట్లే మన పాపాలను గూడ క్షమిస్తాడు. భక్తుని పశ్చాత్తాపమూ భగవంతుని కారుణ్యమూ - ఇది ఈ సామెతలోని ప్రధానాంశం.

2. ఈ సామెత నేర్పే మరో సత్యం, తోడి జనాన్ని చిన్నచూపు చూడకుండా వుండడం. ఆత్మస్తుతి పరనింద అనేది జనులందరిలోను కన్పించే దుర్గుణమే. మనకంటే మీదివాళ్ళు మనలను తూలనాడుతూంటే మనకంటె క్రింది వాళ్ళను మనం తూలనాడుతూంటాం. కాని కన్ఫూష్యస్ చెప్పినట్లు, మొదట మన యిల్లు శుభ్రం చేసికోందే ఎదుటి వాళ్ళ యింటి గడప అశుభ్రంగా వుందని వదరడందేనికి? కావున క్రైస్తవ భక్తుడు వినయమూ ఆత్మసంస్కారమూ మొదలైన సద్గుణాలు అలవర్చుకొనే ప్రయత్నం చేయాలి.

## 5. ద్రాక్షతోట యజమానుడు – మత్త 20, 1-16

### 1. సందర్భం

ఈ సామెతగూడ కారుణ్యపు సామెతల వర్గానికి చెందిందే. దీనిలో ప్రధానపాత్ర తోట యజమానుడు. అతడు దయగల కాపు. కొద్దికాలం పనిజేసిన కూలీలకుగూడ వాళ్ళ కుటుంబాలకు సరిపొయ్యేటంత కూలియిచ్చే మహానుభావుడు. ఇతడు పాపాత్ములపట్ల దయజూపే తండ్రికి ప్రతిబింబంగా వుంటాడు.

### 2. వివరణం

ద్రాక్షతోట యజమానుడు ఒకడున్నాడు. అతని తోటలు బాగా కాసాయి. కాయ కోతకు వచ్చింది. ఆలస్యం చేస్తే ఏ చెడివానో కురిసి పండిన పండ్లను నాశం చేయవచ్చు. అంచేత శీఘ్రంగా కాయలు గోయించడానికి కూలివాళ్ళ కోసం తిరుగుతున్నాడు. వేకువజాము నుండి పట్టణమంతా గాలించి ఉదయం ఆరింటికి ఓ కూలీల జట్టును తోటల్లోకి పంపాడు. మళ్ళా తొమ్మిదింటికి జట్టును పంపాడు. ఈ విధంగా ఆ రోజు నాల్గుతడవల నాల్గు జట్టులను పంపాడు. ఐదవతూరిగూడ వీధుల్లోకి వెళ్ళిచూడగా అక్కడ సోమరి కూలీలు కొంతమంది కబుర్లు చెప్పుకొంటూన్నారు. అప్పటికే సాయంకాలం ఐదుగంటలయింది. ఇక వాళ్లు పని చేయగలిగేది ఒక్క గంట మాత్రమే. ఐనా ఏదో తోచింది ఇస్తానని ఒప్పందం చేసికొని ఆ యైదవ జట్టునుగూడ తోటలకు పంపాడు.

ప్రొద్దు క్రుంకింది. కూలివాళ్ళకు ఏరోజు కూలి ఆరోజు చెల్లించాలి. ఆ కాపు ధనవంతుడు గనుక ఓ గృహనిర్వాహకుడు అతని యిల్లు చక్కబెడుతూండేవాడు. యజమానుని అనుమతిపై అతడు కూలీలకు జీతం చెల్లిస్తున్నాడు. అతడు మొదట చివరి జట్టువాళ్ళను బిలిచి ఒక్కొక్కరికి ఒక్క దీనారం చెల్లించాడు. దీనారమంటే ఆ రోజుల్లో ఒక కూలివానికి ఒకరోజు కూలికి చెల్లించే వేతనం. ఇప్పటి మన ధరల ప్రకారం ఇంచుమించు 50-60 రూపాయలు ఉండవచ్చు. సరే, అది చూచేటప్పటికల్లా మొదట వచ్చినవాళ్లకు పండ్లు పులిసాయి. వీళ్ళతో బోల్చుకుంటే వాళ్లు చాల గంటలు పనిజేసారు గనుక తమకు ఎక్కువకూలి గిడుతుందనుకొన్నారు. కాని గృహనిర్వాహకుడు వాళ్ళకు

గూడ ఒక దీనారమే చెల్లించాడు. ఆ మొదటివాళ్ళకు కడుపు మండింది. మండదా మరి? వాళ్ళ కోపానికి రెండు కారణాలున్నాయి. మొదటిది, ఈ చివరన వచ్చినవాళ్లు గంటకాలం పనిజేస్తే వాళ్లు పండ్రెండు గంటలు పనిజేసారు - ఉదయం ఆరునుండి సాయంకాలం ఆరుదాకానూ. రెండవది, ఈ చివరి జట్టువాళ్ళు సాయంకాలపు చల్లగాలిలో పనిజేస్తే వాళ్లు మధ్యాహనపు మండుటెండలో చెమటోడ్చి పని జేసారు. మరి యిప్పుడు గుఱ్ఱాన్నీ గాడిదనీ ఒకగాట కట్టివేయడం ఏమి ధర్మం?

ఇదంతా ద్రాక్షతోటలో జరిగిన వ్యవహారం. యజమానుడు అక్కడలేడు. ఇంటి దగ్గర ఉన్నాడు. కనుక వాళ్లు ఆ చివరి జట్టువాళ్ళని ఇద్దరుముగ్గురిని బలత్కారంగా తమవెంట దీసికొని పెద్దగా అరచుకొంటూబోయి యజమానుని యిల్లుచేరి అక్కడ గొడవబెట్టారు. యజమానుడు వాళ్ళ ఫిర్యాదు విన్నాడు. ఆ ముఠా నాయకుణ్ణిజూచి కాపు "ఓయి! నేను మీకేమి అన్యాయం జేసాను? మీకు ఒక దీనారమే యిస్తానని ఒప్పుకొన్నాను. ఒప్పుకొన్నంత యిచ్చాను. నేను దయగలవాణ్ణి కనుక ఈ చివరిజట్టువాళ్ళకి గూడ ఒక దీనారమిచ్చాను. దానివల్ల మీకు వచ్చిన నష్టమేమిటి? నా మంచితనాన్ని జూడగా మీకు కన్ను కుట్టింది కాబోలు! మీకూలి మీరు తీసుకొని ఇక వెళ్ళిపొండి" అన్నాడు.

ఇక్కడ భావం ఏమిటి? ఆ రోజుల్లో ఒకరోజు కూలి ఒక దీనారమని చెప్పాం. ఒక దీనారమైనా దొరికితేగాని యింటివద్ద కూలివాని కుటుంబానికి పొట్టగడవదు. చివరి జట్టువాళ్లు ఒక దీనారం కూలికి అర్హులుగారు. ఐనా ఒక దీనారంతో వెళ్ళకపోతే ఇంటివద్ద వాళ్ళ భార్యాపిల్లలు వస్తుండవలసిందే. అందుచేత ఆ కాపు ఎంతో దయగలవాడు కనుక ఒక గంటకాలమే పనిజేసినా వాళ్ళకుగూడ కుటుంబ వేతన మిప్పించాడు. కాని అతని ఉదారగుణాన్ని జూచి మొదట వచ్చినవాళ్ళు అసూయపడ్డారు. కండ్లల్లో నిప్పులు పోసికొన్నారు. వాళ్ళ జీతం వాళ్ళకి ముట్టినా వాళ్ళూ కడపట వచ్చినవాళ్ళూ సమానమైతే ఎలాగ? వేరే వాళ్లుగూడ మనపాటి వాళ్లైతే ఇక మన గొప్పేముంది? అందుకే వాళ్ళ వాగుడూ, గొణుగుడూను.

ఇక సామెత భావమిది. ఇక్కడ తోటయజమానుడు పరలోకపు తండ్రినీ, మొదట వచ్చిన కూలీలు పరిసయులనూ, కడపటవచ్చిన కూలీలు సుంకరులనూ సూచిస్తారు. తోటయజమానుడు కడపటవచ్చిన కూలీలమీదా వాళ్ళ కుటుంబాల మీదా జాలిజూపినట్లే పరలోకంలోని తండ్రి సుంకరుల మీదా పాపాత్ములమీదా జాలిజూపుతాడు. వాళ్ళు అర్హులు కాకపోయినా తన రక్షణనూ తన మోక్షసామ్రాజ్యాన్నీ వాళ్ళకూ ప్రసాదిస్తాడు. ఈలా ప్రసాదించేదిగూడ తన ప్రతినిధియైన క్రీస్తు ద్వారా. కనుకనే క్రీస్తు ఈ పాపులను ఆదరిస్తూంది. అందుచే ఆ మొదటి జట్టు వాళ్ళలాగే, పరిసయులు క్రీస్తుమీద గొణగకూడదు.

## 3. అన్వయం

1. కారుణ్యపు సామెత లన్నిటిల్లోలాగే దీనిలో గూడ భగవంతుని దయాగుణం ప్రధానమైంది. ఆ ప్రభువు జాలిగుండెలు కలవాడు. అతడు ఎవ్వరినీ కేటాయించడు. సజ్జనుల పైనీ దుర్జనులపైనీగూడ తన సూర్యుణ్ణి ఒకేవిధంగా ప్రకాశింపజేస్తుంటాడు. దుర్మార్గులకూ సన్మార్గులకూగూడ తన వర్షాన్ని ఒకేవిధంగా కురిపిస్తూంటాడు – మత్త 5,45. అందువల్ల దేవుడు చెడ్డవాళ్ళకుగూడ మేలు చేస్తున్నాడే అని మనమెప్పుడూ బాధపడగూడదు. అలా ఉపకారం చేయడం భగవంతుని లక్షణం. నరుల్లో లేందీ భగవంతునిలోవుందీ, దయాగుణం. ఈలాంటి సామెతలద్వారా మనం విశేషంగా ధ్యానించుకోవలసింది గూడ ఈ కారుణ్యగుణమే.

2. ఆ మొదట వచ్చిన కూలీలు చివరిజట్టు కూలీలను జూచి అసూయ పడిపోయారని చెప్పాం. ఈ యసూయాగుణం మనలను రకరకాల రూపాల్లో బాధిస్తుంది. వేరేవాళ్లు కాస్త పచ్చగా వుంటే ఓర్చుకోలేం. వాళ్లూ మనంతటివాళ్లైతే ఇక మనకేమి విలువ వుంటుందని బాధపడిపోతాం. ఈలాంటప్పుడు ఒక్క సత్యం గుర్తించాలి. మనం వృద్ధిలోకి వచ్చినా మన పొరుగువాళ్ళు వృద్ధిలోకి వచ్చినా అంతా భగవంతుని అనుగ్రహంవల్లనే. ఆ దయామయుడు తోడి జనాన్ని దీవించకుండా వుండాలి అనడానికీ అతని అనుగ్రహానికి హద్దులు పెట్టడానికీ మనమెవ్వరం? అందుచేత మనం ఇతరులతో పోల్చిచూచుకొని వాళ్ళంతటివాళ్ళయ్యారు ఇంతటి వాళ్ళయ్యారు అని అసూయతో క్రుగ్గిపోగూడదు. మనం నమ్మికతో అడుగుకొంటేచాలు, ఆ ప్రభువు మనలనుగూడ దీవించి తీరతాడు. తప్పిపోయిన కుమారుని సామెతలోలాగే ఈ సామెతలోగూడ మొదటి భాగంకంటె రెండవ భాగం ముఖ్యమైంది. అందువల్ల ఈ రెండవభాగంలో వర్ణింపబడిన తోట యజమానుని కారుణ్యగుణమూ, అసూయా ఖండనమూ మళ్లామళ్లా స్మరించుకోదగ్గవి.

# 6. క్షమింపనొల్లని సేవకుడు – మత్త 18, 21-35.

## 1. సందర్భం

ఓ మారు పేత్రు క్రీస్తునిజూచి పొరుగువారిని ఎన్నిసార్లు క్షమించాలి? ఏడుసార్లు క్షమిస్తే చాలా అని అడిగాడు. క్రీస్తు డెబ్బైయేడుసార్లు క్షమించమని సమాధానం జెప్పాడు. అనగా లెక్కలేనన్నిసార్లు క్షమించాలని భావం. ఆదికాండం 4, 24లో లేమెక్ అనునతడు తన్నుకొట్టినవాణ్ణి డెబ్బైయేడు రెట్లు అదనంగా శిక్షించి పగతీర్చుకొన్నానని ప్రగల్భాలు పలికాడు. కాని నూత్నవేదంలో ఈలాంటి పగకు ఆస్కారంలేదు. క్రీస్తు శిష్యులు ఒకరినొకరు క్షమిస్తూండాలి అనడానికి ఈ సామెత చెప్పబడింది. ఈ సామెతను మత్తయి ఒక్కడే ఉదాహరించాడు.

## 2. వివరణం

ఓ రాజు తన సేవకులనుండి లెక్కలు రాబట్టుకొంటున్నాడు. ఇక్కడ సేవకులంటే మామూలు సేవకులుగారు. వీళ్లు శాత్రపులు లేక రాష్ట్రాధిపతులు. ఈ గవర్నర్లు తమ తమ రాష్ట్రాల్లో పన్నులు వసూలుజేసి రాజుకు కప్పం బంపుతూండేవాళ్ళు. ఈ కప్పం కొన్ని లక్షల దీనారాలదాకా వుండేది. సరే ఈలాంటి సేవకుడొకడు రాజుకి పదికోట్ల దీనారాలు అప్పుపడి వున్నాడు. ఆ డబ్బుకోసం అతన్ని అదివరకే చెరలో వేసారు. చెరనుండి అతన్ని రాజు సన్నిధికి తీసికొని వచ్చారు. అతడా డబ్బంతా అప్పటికే దుర్వ్యయంచేసాడు. మరి యిప్పుడు అంత సొమ్ము ఏలా చెల్లించగలడు? రాజు అతని భార్యాబిడ్డలను బానిసలనుగా అమ్మివేయండని ఆజ్ఞాపించాడు. అలా అమ్మితే మాత్రం ఎంత వచ్చేను? ఆ రోజుల్లో బానిసవెల 500 నుండి 2000 దీనారాల దాకా వుండేది. కనుక ఈ సేవకుని కుటుంబాన్నంతటిని అమ్మినా ఓ పదివేల దీనారాలు రావు. మరి అతని అప్పు పదికోట్ల దీనారాలాయె! సేవకుడు రాజు కాళ్ళమీదబడి కొంత పస్తాయించారంటే మీ అప్పంతా తీరుస్తానని మొరపెట్టుకొన్నాడు. కాని అంత అప్పు అతడు ఏలా తీర్చగలడు? ఏమైతేనేం, అతని అడిగింది కొంతకాలం గడువు ఇప్పించమని మాత్రమే. కాని ఆ రాజు ఎంతో దయగలవాడు. అతడు ఈ సేవకుడెటూ అప్పు తీర్చలేడని గుర్తించి, జాలిగలవాడు గనుక, గడువు నీయడానికి మారుగా అసలు అప్పునంతటినీ క్షమించాడు. కొలువులోవున్న సేవకులందరూ రాజు ఔదార్యాన్ని మెచ్చుకొన్నారు.

ఈ సేవకునికి మరో సేవకుడు నూరు దీనారాలు మాత్రమే అప్పుపడి వున్నాడు. ఇతడు ఓ వీధిలో అతనిమీద తారసిల్లి వాని కుతిక పట్టుకొన్నాడు. తన అప్పు చెల్లించమని దబాయించాడు. గొంతు పట్టుకోవడం దేనికంటే, ఆ రెండవవాడు తప్పించుకొని పోకుండా వుండేందుకు. ఆ రెండవ సేవకుడు అయ్యా! కొంచెం గడువు ఇప్పించు నీ ఋణం తీరుస్తానని ప్రాధేయపడ్డాడు. ఇక్కడ ఓ విశేషం గమనించాలి. 29వ వచనంలోని ఈ రెండవ సేవకుని మనవి అచ్చంగా 26వ వచనంలోని ఆ మొదటి సేవకుని మనవి లాంటిదే. కాని ఆ మొదటి సేవకుని అప్పు చాల పెద్దది గనుక అతడు దాన్ని తీర్చలేడు. ఈ రెండవ సేవకుని అప్పు నూరు దీనారాలే గనుక ఇతడు దీన్ని తీర్చగలడు. ఇతడడిగింది గూడ కొన్ని నాళ్ళ గడువు మాత్రమే. ఐనా మొదటి సేవకుని హృదయంలో దయలేదు. స్వయంగా దయను పొందినా తాను మాత్రం నిర్దయుడు. కనుక ఆ రెండవ సేవకుణ్ణి క్షమించనొల్లక చెరలో త్రోయించాడు. తాను అతన్ని బానిసగా ఎందుకు అమ్ముకోగూడదు? ఆనాటి నియమం ప్రకారం కనీసం ఐదువందల దీనారాలైనా అప్పుపడితేగాని ఎవర్నయినా బానిసగా అమ్మడానికి వీల్లేదు. మరి ఇతని అప్పు నూరు దీనారాలే!

సరే, రాజుకి ఈ సంగతి తెలిసింది. అతడు మొదటి సేవకుణ్ణి పిలిపించి కఠినశిక్ష విధించాడు. ఔను, పదికోట్ల దీనారాలకు మన్నింపు పొందినా, తాను నూరు దీనారాల

అప్పును మన్నించలేకపోయాడు మరి! అందుచేత రాజు అతణ్ణి తలారులకు అప్పగించాడు. వీళ్ళు ఆ రోజులలో చెరసాల అధికారులు, మహా క్రూరులు. మామూలు జనానికి వాళ్ళను చూస్తేనే మొచ్చెమటలు పోసేవి. కనుక ఆ సేవకుడు వాళ్ళ చేతుల్లో దారుణబాధలు అనుభవించి వుండాలి. ఆ సేవకుడెటూ అంత అప్పును తీర్చుకోలేడు. కనుక అతనికి విధింపబడిన దారుణ శిక్షకు గూడ ముగింపు లేదు. అనగా అతడు జీవితాంతం బాధలనుభవిస్తూ చివరకు ఆ చెరలోనే చనిపోయి వుండాలి.

ఈ సామెత చివరి వచనంలో పొరుగువాళ్ళని హృదయపూర్వకంగా క్షమించాలని చెప్పబడింది. కొందరు పైకి మాత్రం శత్రువుని క్షమించినట్లే నటిస్తూ లోలోపల అతనిమీద పగదీర్చుకోవడానికి సమయం వెదుకుతూంటారు. ఈలాంటి మనస్తత్వం ఈ సామెత బోధకు వ్యతిరేకమైంది.

సామెత భావం యిది. ఈ సామెత లోని రాజులాగే భగవంతుడు కరుణామయుడు. మనం తనకు జేసిన అపరాధాలన్నీ ఆ ప్రభువు నెనరుతో క్షమిస్తూంటాడు. కాని ఆ ప్రభువులాగే మన తరపున మనం గూడ తోడి జనుల అపరాధాలను క్షమిస్తూండాలి. ఎందుకంటే దయామయుడైన ఆ భగవంతుని బిడ్డలం గనుక, మనం గూడ ఆ తండ్రి లాగే ప్రవర్తించాలి. ఆ ప్రభువు కారుణ్యమే కనుక మన జీవితంలో కన్పించకపోతే మనం అతని బిడ్డలంగాము. అతడు మనలను కఠినంగా శిక్షిస్తాడు గూడ.

## 3. అన్వయం

1) భగవంతునిలో వుందీ నరునిలో లేందీ దయాగుణం అని చెప్పాం. ఆ ప్రభువు దయగలవాడు. నరుడు ఆ దయామయుడైన భగవంతునికి పోలికగా సృజించబడ్డాడు. కనుక మనం గూడ దయాగుణం ప్రదర్శించాలి. తోడి జనులను క్షమిస్తూండాలి. అందుకే సువిశేషం "ఇతరుల తప్పులను మీరు క్షమిస్తే పరంలోకంలోని మీ తండ్రి మీ తప్పులను క్షమిస్తాడు. పరుల తప్పులను మీరు క్షమించకపోతే మీ తండ్రి మీ తప్పులను క్షమించడు" అని చెప్తుంది - మత్త 6, 14-15.

2) ఒకోమారు ఇతరులను క్షమించాలంటే మన అభిమానము కోపతాపాలు అడ్డువస్తాయి. అటువంటప్పుడు క్షమించాలని కోరుకొన్నా క్షమించలేం. ఐనా భగవంతుడు అనుగ్రహించినట్లయితే ఈలాంటి కష్టమైన క్షమాపణలు గూడ సులభమౌతాయి. ఆ ప్రభు వరప్రసాదం మన హృదయంలోని పగ ద్వేషం మొదలైన అనిష్టగుణాలను కడిగివేస్తుంది. ప్రభు వరప్రసాదమంటే పరిశుద్ధాత్మ గూడ. ఈ యాత్మ ద్వారా దేవుని ప్రేమ మన హృదయాల్లోనికి కుమ్మరింపబడుతుంది – రోమా 5,5. ఈ ప్రేమ శక్తితో మనం శత్రువులను క్షమించగలం. కావున భక్తుడు ఈ వరప్రసాదబలం కోసం భగవంతుణ్ణి ప్రార్థించాలి. శత్రుక్షమాపణ మనేది క్రైస్తవ జీవితానికి అత్యవసరం. అది లేందే క్రీస్తు శిష్యులం కాలేం.

# 7. ఇద్దరు బాకీదారులు - లూకా 7, 41-47.

## 1. సందర్భం

ఓ మారు క్రీస్తు ఓ ప్రార్థనా మందిరంలో బోధించాడు. అక్కడ వున్న వారిలో పరిసయుడైన సీమోను ప్రముఖుడు. అతడు క్రీస్తుని విందుకు ఆహ్వానించాడు. రబ్బాయిలను భోజనానికి పిలవడం యూదుల ఆచారం. అతిథులు విందు ఆరగిస్తూండగా తలవని తలంపుగా ఓ స్త్రీ వచ్చింది. ఆమె పాపాత్మురాలు. అంటే యిక్కడ వ్యభిచారిణి అనే భావం. ఈమె మరియ మగ్దలీనా గాదు, లాజరు సోదరి మరియా గాదు. మరో ఆవిడ. ఎవరైతేనేం, అంతకుముందే ఆమె ప్రభువుని కలుసుకొని తన పాపాలకు పశ్చాత్తాపపడింది. ప్రభువు ఆమె తప్పిదాలను క్షమించి ఆమెను ఓదార్చాడు. అందువల్ల ఆమె కృతజ్ఞతాభావంతో పరిమళ ద్రవ్యం తీసికొని వచ్చి ప్రభువు పాదాలకు పూసింది. ఎనలేని కృతజ్ఞతతోను పూజ్యభావంతోను ఆ పవిత్ర పాదాలను ముద్దు పెట్టుకొంది. వాటిమీద కన్నీళ్ళు కార్చింది. ఆ మహానుభావుని పాదాలను కన్నీటితో తడిపానే అని ఆందోళనం జెంది గబగబ తన తలమీది ముసుగుదీసి తన తలవెంద్రుకలు విప్పి వాటిని తుడిచింది. యూద స్త్రీ మగవాళ్ళ యెదట తల వెంద్రుకలు విప్పడం అమర్యాద. అలా చేసిన స్త్రీకి భర్త విడాకులు ఈయవచ్చు. కాని యిక్కడ ఈమె భక్తిపారవశ్యం వల్ల ఈ నియమాలను పాటించలేదు.

సీమోనుకు ఆ స్త్రీ హృదయంలో క్రొత్తగా గలిగిన మార్పేమీ తెలియదు. పైగా ఆమెలాంటి పాపాత్మురాలు పదిమంది యెదుటికి రావడం, ఓ రబ్బాయిని చేతులతో తాకడం ఎంతో అమర్యాద. కనుక సీమోను ఆమెను గూర్చి చెడ్డగా భావించడం మొదలెట్టాడు. ఆ స్త్రీ తన్ను అలా తాకుతూంటే చూస్తూ ఊరకున్న ఈ రబ్బాయి ఏపాటి వాడా అని గూడ శంకించాడు. ఆ సందర్భంలో క్రీస్తు చెప్పిన సామెత యిది.

## 2. వివరణం

ఓ ఋణదాతకు ఇద్దరు బాకీదారులున్నారు. ఒకడు పెద్ద మొత్తము ఇంకొకడు చిన్న మొత్తమూ బాకీపడి వున్నారు. వాళ్లు బాకీ తీర్చలేని పరిస్థితికి రాగా ఋణదాత యిద్దరినీ క్షమించి వదలివేసాడు. ఆ యిద్దరిలో ఎవరు ఋణకర్త పట్ల అధిక కృతజ్ఞతాభావం చూపుతారు? యజమానుడు ఎవరికి ఎక్కువ ఋణం మన్నించాడో అతడే గదా?

ఈ సామెతలో ఋణదాత పరలోకంలోని తండ్రి వంటి వాడు. అతని బాకీదారులు సీమోనూ పాపాత్మురాలైన స్త్రీ. కాని అతనికంటె ఆమె ఋణం ఎక్కువ. కాని దేవుడు దయతో ఆ యిద్దరి తప్పిదాలూ మన్నించాడు. ఐనా ఆ పాపాత్మురాలి తప్పిదాలు గొప్పవి గనుక ఆమె అధిక కృతజ్ఞతా భావం ప్రదర్శించింది. క్రీస్తు పట్ల ఆమె చూపిన కృతజ్ఞత దేవునిపట్ల చూపినట్లే.

సీమోనులో ఆమెలో వున్నంత భక్తిభావంగాని కృతజ్ఞతాభావం గాని లేదు. అతడు పరపతి కోసం క్రీస్తుని విందుకు ఆహ్వానించాడు అంతే. తన యింటికి వచ్చిన క్రీస్తుకి చేయవలసిన మర్యాదలు కూడ సరిగా చేయలేదు. పైగా అతడు ఆ స్త్రీని తప్పుబట్టాడు. పాపాత్మురాలు గదా అని ఆమెను శంకించాడు. ఈ విధంగా అతడు పరిసయులందరు చేసే దుర్విమర్శే చేసాడు. అందుచే క్రీస్తు అతన్ని హెచ్చరించి పాపాత్ముల పట్ల కనికరం జూపాలి గాని వాళ్ళను విమర్శించగూడదని బోధించాడు. అందుకే యిది గూడ కారుణ్యపు సామెతల వర్గానికి చెందిన సామెత ఐంది.

### 3. అన్వయం

47వ వచనంలో "ఆమె అధికంగా ప్రేమించింది" అంటే అధికంగా కృతజ్ఞతా భావం చూపింది అని భావం. క్రీస్తు పాదాలను కన్నీటితో తడపడంలో వాటిని తల వెంద్రుకలతో తుడవడంలోను ఆమె కృతజ్ఞత వ్యక్తమైంది. ఈ గాఢ కృతజ్ఞతకు కారణం ప్రభువు ఆమె విస్తార పాపాలను మన్నించడమే. ప్రభువు కరుణామయుడు గాన మన పాపాలను క్షమిస్తూంటాడు. అలా క్షమాపణం పొందిన మనం ఆ ప్రభువు పట్ల కృతజ్ఞతాభావంతో మెలగాలి. ఆ ప్రభువు కారుణ్యాన్ని అర్థం జేసికొని అతన్ని వేనోళ్ళ కొనియాడాలి. అంతేగాని ఆ సీమోను లాగ మన తప్పిదాలను మనం కప్పిపెట్టుకొని వేరేవాళ్ళను గూర్చి చెడుగా భావించడం పాడిగాదు.

## 8. ఇద్దరు కుమారులు - మత్త 21,28-32

### 1. వివరణం

తండ్రి తన కుమారులిద్దరినీ ద్రాక్ష తోటకు వెళ్ళి పని చేయమన్నాడు. పెద్దవాడు మొదట నేను వెళ్ళనన్నాడు. కాని తర్వాత అతడు తండ్రి యాజ్ఞ మీరినందుకు పశ్చాత్తాపపడ్డాడు. తోటకు వెళ్ళి పనిచేసాడు. ఈ పెద్ద కమారుడు సుంకరులకూ జారిణులకూ పోలికగా వుంటాడు. వాళ్ళంతా మోషే ధర్మశాస్త్రాన్ని పాటించని పాపపుమూక. అందుకే పరిసయులు వాళ్ళను అంతగా చిన్నచూపు చూస్తున్నారు. ఐనా వీళ్ళు స్నాపక యోహాను బోధలనూ క్రీస్తు బోధలనూ విని పశ్చాత్తాపపడుతున్నారు. ఈ పశ్చాత్తాపం వల్ల వీళ్ళు దేవునికి ప్రియపడ్డారు. దేవుడు వీళ్ళ పాపాలను క్షమించాడు. కనుక వీళ్ళు దైవరాజ్యంలో ప్రవేశిస్తారు.

ఇక రెండవ కుమారుడు మొదట నేను తోటకు వెళ్తానన్నాడు కాని అతడు టక్కరివాడు. కనుక చివరికి వెళ్ళనే లేదు. యూదుల నాయకులయిన పరిసయులకూ ధర్మ శాస్త్రోపదేశకులకూ ఇతడు పోలికగా వుంటాడు. వీళ్లు మోషే ధర్మశాస్త్రాన్ని పాటిస్తూన్నట్లు నటిస్తున్నారే గాని దైవాజ్ఞలను మీరుతున్నారు. ఏవేవో బాహ్యాచారాల్లో

మునిగిపోయి హృదయంలో భగవంతుని ఆరాధించుకోలేకపోతున్నారు. పైగా వీళ్లు తాము పుణ్యాత్ముల మనుకొనేవాళ్లు గనుక తమ పాపాలకు పశ్చాత్తాపపడరు. పాపక్షమాపణం పొందరు. కనుక వీళ్ళకంటె సుంకరులూ జారిణులూ మేలు. పరిసయులు నిత్యం దేవాలయంలో తిరుగుతున్నా దేవునికి దూరమయ్యారు. సుంకరులు దేవాలయానికి వెళ్ళకున్నా దేవుని సన్నిధిని జేరుతూన్నారు. కనుక పరిసయులు అవస్యం పశ్చాత్తాపపడాలనీ, పాపులనబడేవాళ్ళను కనికరంతో చూడ్డం నేర్చుకోవాలనీ క్రీస్తు భావం.

## 2. అన్వయం

స్నాపక యోహాను బోధించగా పరిసయులూ విన్నారు. సుంకరులూ విన్నారు. కాని సుంకరులు పశ్చాత్తాపపడి అతని నుండి జ్ఞానస్నానం పొందారు. ఐనా పరిసయులూ ధర్మశాస్త్ర బోధకులూ మాత్రం యోహానునీ అతని జ్ఞానస్నానాన్నీ నిరాకరించారు - లూకా 7, 29-30. మనమే తెలివైన వాళ్ళమూ పుణ్యాత్ములమూ అనుకొంటే చాలదు. దేవుని యెదుట ఈలాంటి భావాలేమీ అక్కరకురావు. ఆ ప్రభువుకి నచ్చేది మన హృదయశుద్ధీ పశ్చాత్తాపమూను. కనుక నేను నీతిమంతుణ్ణి అనుకొని విర్రవీగేవాని కంటె పాపియైనా గూడ తన పాపాల కోసం పశ్చాత్తాపపడేవాడు దేవుని దీవెనలు పొందుతాడు. ఈ సత్యాన్ననుసరించి మన ప్రవర్తనను గూడ చక్కదిద్దుకోవాలి.

# 9. వైద్యుడు వ్యాధిగ్రస్తుల కొరకు - మార్కు 2, 17.

"17 యేసు ఇట్లనెను : వ్యాధిగ్రస్తులకే గాని ఆరోగ్యవంతులకు వైద్యుడక్కరలేదు. నేను పాపులను పిలువ వచ్చితినిగాని, నీతిమంతులను పిలుచుటకు రాలేదు."

## వివరణం

సామెతలు కథల్లాగ సాగిపోతాయి. కొంత విస్తృతిని గూడ కలిగివుంటాయి. కాని కొన్ని సామెతల్లో మాత్రం ఈ విస్తృతి వుండదు. అవి ఏక వాక్యంలాగ కన్పిస్తాయి. ఐనా ఈలాంటివి గూడ సామెతలే. ప్రస్తుత వాక్యం ఈ కోవకు చెందింది.

ఇక్కడ వ్యాధిగ్రస్తులంటే పాపులూ సుంకరులూ మొదలైనవాళ్ళు. ఆరోగ్యవంతులంటే పరిసయులూ ధర్మశాస్త్ర బోధకులూను. క్రీస్తు వచ్చింది వ్యాధిగ్రస్తులు లేక పాపాత్ముల కోసం. అతడు వాళ్ళకు పరలోకం లోని తండ్రిని గూర్చి వివరిస్తున్నాడు. వాళ్ళపట్ల కనికరం జూపుతున్నాడు. ప్రజా నాయకులైన పరిసయులు అతని చర్యలను తప్పుగా దీసికోగూడదు - ఇది భావం.

## ముగింపు

ఈ కారుణ్యపు సామెతలన్నీటిని క్రీస్తు మొదట యూద నాయకులైన పరిసయులకూ ధర్మశాస్త్ర బోధకులకూ చెప్పాడు : ఈ నాయకుల్లో మూడు ప్రధాన దుర్గుణాలు కన్పిస్తాయి.

1) వీళ్ళు ఆచారవాదులు. ఏవేవో బాహ్యాచారాలకు మాత్రమే విలువనిచ్చి న్యాయము, దయ, సత్యం మొదలైన ప్రధానాంశాలను విస్మరించారు. ఇదంతా ఏలాగుందంటే దోమను వడకట్టి ఒంటెను మ్రింగినట్లుగా వుంది - మత్త 23, 23-24.

2) పరిసయులు గొప్ప దుర్గుణం, వాళ్ళ గర్వం. వాళ్లు ప్రజానాయకులమని చెప్పుకొంటూండేవాళ్లు. కాని ఈ నాయకులు గ్రుడ్డివాళ్లు కనుక వాళ్ళేగాదు, వాళ్లు నడిపించిన వాళ్లు గూడ గోతిలో బడ్డారు - 15, 14. వీళ్లు విందుల్లో ప్రార్థనా మందిరాల్లో ప్రముఖ స్థానం కోరుకొనేవాళ్లు - 23,6. పై పెచ్చు సుంకరులను గడ్డిపోచతో సమానంగా జూచేవాళ్లు. తాము దప్పితే మరెవ్వరూ నీతిమంతులు కారని భావించేవాళ్లు.

3) పరిసయులు తమ బోధలను తామే అనుసరించలేదు. కనుకనే క్రీస్తు వీళ్ళను సున్నం కొట్టిన సమాధులతో పోల్చాడు. ఈ సమాధులు వెలుపలికి శుభ్రంగా కనిపించినా లోలోపల దుర్గంధవస్తువులతో నిండి వుంటాయి. ఈ డాంబికుల ప్రవర్తనం గూడ ఈలాంటిదే - 23,37. మన మాచరించని నీతులు ఇతరులకు బోధించడం సులభం. అలాగే వీళ్ళుగూడ ప్రజల భుజాలమీద మోషే కట్టడలనే పెద్ద బరువులను మోపారు కాని ఆ భారాలను మోయడంలో వాళ్ళకు ఏ మాత్రమూ సాయపడలేదు - 23,4.

ఈ పరిసయుల తప్పులు మనం కూడ చేస్తూనే వుంటాం. తోడి మానవుల పట్ల కరుణ జూపడం మాని ఏవేవో అర్థంలేని నియమాలను పాటించాలని తాపత్రయ పడుతూంటాం. కాని అన్ని నియమాల కంటె పెద్ద నియమం తోడి మానవుణ్ణి ప్రేమించడం. క్రీస్తు బోధల్లో ఇంతకంటె గొప్ప సత్యం లేదు.

# 2. శిష్య ధర్మాలు

క్రీస్తు సామెతల్లో కొన్ని శిష్యధర్మాలను బోధించేవి. ఈ సామెతలన్నీ క్రీస్తు శిష్యులు ఏలా మెలగాలో చెప్తాయి. శిష్యులు అక్కరలో వున్న వాళ్ళను ఆదుకోవాలి. స్వార్థాన్ని త్యజించాలి. ప్రభువు ఆజ్ఞలను పాటించాలి. వినయంతో మెలగాలి. పరలోకం లోని తండ్రిమీద నమ్మిక పెట్టుకోవాలి. తోడిజనం పట్ల ప్రేమభావంతో ప్రవర్తించాలి. శిష్యులకు కన్ను, ఉప్పు, దీపం ఉపమానాలు. ఒకే యజమానుణ్ణి సేవించాలి. ఇరుకు మార్గంలో పయనించాలి. మేడిపట్టి మళ్లా వెనక్కు చూడకూడదు. ఈలాంటి శిష్యధర్మాలను బోధించే సామెతలు పెద్దవి ఎన్మిదిదాకా, చిన్నవి పండ్రెండుదాకా వున్నాయి. ఈ క్రింద వాటిని సంగ్రహంగా పరిశీలించి చూద్దాం.

## 1. మంచి సమరయుడు - లూకా - 10, 25-37

### 1. సందర్భం

ఓమారు ఓ ధర్మశాస్త్ర బోధకుడు మోక్షం పొందాలి అంటె నేనేమి చేయాలి అని క్రీస్తుని ప్రశ్నించాడు. క్రీస్తు అతనికి మళ్ళా ప్రతిప్రశ్న వేసి ధర్మశాస్త్రంలో ఏముంది అని

అడిగాడు. ఆ బోధకుడు భగవంతుణ్ణి పూర్ణ హృదయంతో ప్రేమించాలి. మనలను మనం ప్రేమించుకొన్నట్లే పొరుగువాణ్ణీ ప్రేమించాలి అనివుంది అని చెప్పి ఇక్కడ "పొరుగువాడు" అంటే ఎవరో నాకర్థం కావడం లేదు అని అన్నాడు. యూదుల భాషలో పొరుగువాడు అంటె దగ్గరివాడు, సజాతీయుడు, బంధువు అని భావం. ఆ రోజుల్లో యూదుల్లోని రకరకాల శాఖలవాళ్ళు "పొరుగువాడు" అన్న పదాన్ని రకరకాల విధాలుగా అర్థం జేసికొనేవాళ్లు. ఉదాహరణకు, పరిసయులు తమ శాఖవాళ్ళను మాత్రమే పొరుగువాళ్ళనుగా గుర్తించారు. కనుక ఇతరులైన యూదుల నెవ్వరినీ తాము ప్రేమించనక్కరలేదు అనుకొన్నారు. కుమ్రానులో వసించిన ఎస్సీనులనబడే మరో శాఖవాళ్ళు తమ శాఖకు చెందని యూదుల నందరినీ చీకటి పుత్రులనుగా భావించి నిరసించారు. కనుక వాళ్లు ఎస్సీను శాఖకు చెందని యూదులను ప్రేమింపనక్కరలేదు అనుకొన్నారు. ఈవిధంగా క్రీస్తునాటి యూదులు యూదులను మాత్రమే – మళ్ళా ఈ యూదుల్లో తమ శాఖకు చెందినవాళ్ళను మాత్రమే – ప్రేమించాలి అని బోధించేవాళ్లు. యూదులు కాని అన్యజాతి జనులను కూడ ప్రేమించాలి అన్న భావం అసలు వాళ్ళకు తట్టనేలేదు. అందుకే టాల్మడ్‌లో ఉదాహరింపబడిన ఒకానొక రబ్బయి వాక్యం యూదులు కాని అన్యజాతి వాళ్ళందరినీ గోతిలో తోయాలనీ వాళ్ళను మళ్ళా పైకి లాగకూడదనీ బోధిస్తుంది. ఈలాంటి వాతావరణంలో పై ధర్మశాస్త్ర బోధకుడు నా పొరుగువాడు ఎవడు అని ప్రశ్నించడంలో వింత ఏముంది? ఈ శబ్దాన్ని గూర్చిన యూదుల వాదోపవాదాలు ఈలా వున్నాయి. మరి ఈ క్రొత్త రబ్బయి క్రీస్తు ఈ పదానికి ఏలా అర్థం చెప్తాడో చూద్దామని అతని కుతూహలం.

## 2. వివరణం

పై వేదశాస్త్రి ప్రశ్నకు క్రీస్తు నిర్వచన రూపంలో గాక, కథ రూపంలో జవాబు చెప్పాడు. యెరూషలేము నుండి యెరికోకు పోయే త్రోవ పొడవు 17 మైళ్లు. కొండలగుండ 3000 అడుగులు క్రిందికి దిగిపోతుంది. క్రీస్తునాడు ఈ మర్గం దొంగలకూ బందిపోటులకూ నిలయంగా వుండేది. నేడుకూడ ఈ త్రోవవెంట ప్రయాణం చేయడం అపాయంతో గూడిన పని. కనుక ఈ కథలోని బాటసారి దొంగలకు చిక్కడంలో ఆశ్చర్యమేమీ లేదు.

యెరూషలేము దేవాలయంలో అర్చన ముగించుకొని వస్తున్న యాజకుడూ లేవీయుడూ దెబ్బలుతిని త్రోవప్రక్కన కొన ఊపిరితో పడివున్న బాటసారిని చూచారు. ఐనా వాళ్ళకు దయ కలుగలేదు. పైగా అతని దగ్గరకు వెళ్తే ఏమి చిక్కు వచ్చిపడుతుందో! త్రోవకు రెండు వైపులు వుంటాయి గదా! వాళ్ళిద్దరు మొదట ఆ బాటసారి పడివున్న వైపుననే వస్తున్నారు. కాని అతన్ని చూడగానే త్రోవ అవతలి వైపునకు తప్పుకొని తిన్నగా సాగిపోయారు.

మూడవసారి వచ్చినవాడు సమరయుడు. యూదులు ఈలాంటి నీతికథల్లో మామూలుగా మూడు పాత్రలను ప్రవేశపెట్టేవాళ్లు. మొదటి ఇద్దరూ యాజకులు గనుక,

ఇక మూడవవాడు గృహస్థు ఐయుండాలి. కనుక క్రీస్తు కథ నాలకించే శ్రోతలు ఇద్దరు యాజకుల తర్వాత తమలాంటి యూదగృహస్థుడు కథలో ప్రవేశిస్తాడు అనుకొన్నారు. కాని క్రీస్తు తలవని తలంపుగా ఈ మూడవ పాత్రను సమరయుని చేసాడు. యూదుల దృష్టిలో సమరయులు సంకరజాతివాళ్ళు, అల్పులు. వాళ్ళకు వీళ్ళకు మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గున మండుతుండేది. క్రీస్తు జననానికి కొంచెం పూర్వం సమరయులు పాస్కపండుగకు ముందటి రాత్రి యెరూషలేము దేవాలయంలో ప్రవేశించి మృతుల అస్థులు చల్లిపోయారు. అలా వాళ్ళు యూదుల పవిత్ర స్థలాన్ని అమంగళపరచారు. ఈలాంటి నీచుల తెగకు చెందిన వొకడు క్రీస్తు చెప్పే సామెతలో కథానాయకుడు కావడం చూచి శ్రోతలంతా తెల్లబోయారు.

ఐనా పీఠం చెంత నిలచి దేవుణ్ణి ఆరాధించే యాజకుల్లో కన్పించని గొప్ప గుణం ఒకటి ఈ సమరయునిలో వుంది. అదే కరుణ. అతడు ఆ బాటసారి వద్దకు వెళ్ళి వాని గాయాలకు కట్టుకట్టాడు. ద్రాక్ష సారాయం పోయడం గాయంలోని క్రిములను చంపటం కోసం. నూనె పోయడం గాయం ఎండిపోకుండా మెత్తగా వుంచడం కోసం. ప్రాచీన పాలస్తీనా ప్రజలు ఎరిగిన వైద్యవిధానం ఇది. ఈ సమరయుడు ఒక బేహారి. తన వస్తువులను కంచర గాడిద మీది కెక్కించుకొని పోతున్నాడు. అతడు క్రిందికి దిగి ఆ బాటసారిని గాడిదమీద కూర్చోబెట్టాడు. అనగా తాను నడుస్తూ ఆ బాటసారిని వాహనం మీద కూర్చోబెట్టి మెల్లగా సత్రానికి తీసుకవెళ్ళాడు.

సమరయుడు సత్రపు యజమానునికి రెండు దీనారాలు ఇచ్చి బాధితుని పరామర్శించమని చెప్పాడు. ఆ రోజుల్లో ఒక్క దీనారానికి పండ్రెండు రోజులపాటు సత్రంలో అన్నం పెట్టేవాళ్ళు. అనగా ఈ బాటసారి 24రోజులు ఆ సత్రంలో వుండవచ్చు. అప్పటికల్లా కోలుకోవచ్చు గూడ. సమరయుడు సత్రపు యజమానుని దానధర్మాల మీద ఆధారపడ దల్చుకోలేదు. కనుక ముందుగనే మట్టసరిగా డబ్బు చెల్లించాడు. అతనికి ఆ త్రోవ, ఆ సత్రం, అక్కడి జనం తెలుసు. తన వ్యాపారంలో ఆ త్రోవ వెంట వస్తూ పోతూ వుండేవాడు. పాఠకులు ఈ సమరయుని ప్రవర్తనను జాగ్రత్తగా గుర్తించాలి. అతని గాడిద, నూనె, ద్రాక్షసారాయం, డబ్బు, శ్రమ, సద్భావం అన్నీ బాధితుని కోసం వినియోగింపబడ్డాయి. కరుణ అంటే ఈలా వుండాలి గదా!

క్రీస్తు కథ ముగించి దొంగల చేతిలో పడ్డవాడికి పొరుగువాడెవడు అని శాస్త్రిని ప్రశ్నించాడు. సమరయుడు అని చెప్పడానికి నోరురాక శాస్త్రి "ఆ కనికరం చూపినవాడే" అని జవాబిచ్చాడు. ఇక్కడ ధర్మశాస్త్ర బోధకుడు అడిగిన ప్రశ్న నా పొరుగువాడెవడు అని. అనగా నేనెవరిని ప్రేమించాలి? ఎవరిని ప్రేమించనక్కరలేదు? అని అతని ప్రశ్న. ఈ ప్రశ్నకు క్రీస్తు వేసిన ప్రతిప్రశ్న దొంగల చేతిలో పడ్డవానికి పై ముగ్గురిలో పొరుగువాడెవడు అని. అనగా ఆ ముగ్గురిలో బాటసారిని ప్రేమించినవాడెవడు అని క్రీస్తు ప్రశ్న. కనుక శాస్త్రి నేనెవరిని ప్రేమించాలి అని. అడగ్గా, క్రీస్తు అసలు ప్రేమించినవాడెవడు అని

ప్రశ్నించాడు. ఇక్కడ క్రీస్తు భావం ఇది. ఎవరిని ప్రేమించాలి అన్నది ప్రశ్న కాదు. అసలు మనం ఎవరినో ఒకరిని ప్రేమించగలమా అన్నది ప్రశ్న. అక్కరలో వున్న వాళ్లందరూ మన పొరుగువాళ్లే. కనుక అక్కరలో వున్న వాళ్ళనందరినీ ప్రేమతో అంగీకరింపవలసిందే. యూదులు వాళ్ళను గాదు వీళ్ళను ప్రేమించాలి, వీళ్ళను గాదు వాళ్ళను ప్రేమించాలి అనే వ్యర్థవాదాలతో కాలం వెళ్ళబుచ్చుతున్నారు. సంకుచితమైన జాతి మత భేదాలతో సతమతమౌతున్నారు. ఆ సమరయుళ్లాగ ఆపదలో వున్నవాణ్ణి - వాడు ఏ జాతివాడైనా ఏ మతం వాడైనా - ఆదుకోవడం ప్రధానం. ఇదే శిష్యధర్మం.

### 3. అన్వయం

ఈ సామెతలోని మంచి సమరయుడు ఎవరు? క్రీస్తే. మానవజాతి పాపం వలన గాయపడి కొనవూపిరితో పడివుండగా అతడు జాలితో తన ప్రాణాలు ఒడ్డాడు. తన ప్రాణాలర్పించి మన ప్రాణాలు కాపాడాడు. క్రీస్తు ఎవరిని ప్రేమించాలి ఎవరిని ప్రేమించనక్కరలేదు అనే శుష్క ప్రశ్నలతో కాలం వెల్లబుచ్చలేదు. ఈ విశ్వమానవాళి కోసం తన ప్రాణాలు ధారపోసాడు. ఆ ప్రభువులాగే మనం కూడ తోడి జనాన్నందరినీ ప్రేమించాలి. కుల మత భేదాలు పాటించకుండా బాధపడే వాళ్ళందరికీ మనకు చేతనైన సహాయం చేయాలి. మహానుభావులు ఈ ప్రపంచమంతా మా కుటుంబమేనని భావిస్తారు

ఈ సామెతలో బాటసారికి త్రోవ వెంట వచ్చినవాళ్లు ముగ్గురూ పొరుగువాళ్ళే. కాని బాటసారి ఆ ముగ్గురిలో సమరయునికి మాత్రమే పొరుగువాడయ్యాడు. లోకంలో మనకు పొరుగువాళ్లైనవాళ్లు ఎంతమంది?

## 2 పొలములోని ఇల్లూ, యుద్ధమూ - లూకా 14,28-32

### 1. సందర్భం

క్రీస్తు స్వార్థత్యాగం శిష్యలక్షణాల్లో ఒకటిగా పేర్కొన్నాడు. శిష్యుడు కాగోరేవాడు తన సిలువ నెత్తుకొని తన అడుగుజాడల్లో నడవాలి అని చెప్పాడు. ఈ స్వార్థ త్యాగాన్నే రెండు ఉపమానాలతో వివరించాడు ప్రభువు.

### 2. వివరణం

మొదటి ఉపమానం పంటపొలంలో కట్టే యిల్లు. ఈ యిల్లు ధాన్యాన్ని తొక్కించి నిల్వజేసికోవడానికీ, పశువులను ఉంచుకోవడానికీ, పొలానికి కాపుండడానికి ఉపయోగపడుతుంది. భూస్వామికి ఇంటిని కట్టి ముగించే స్తోమత వుంటేనే దాన్ని ప్రారంభించాలి. డబ్బులేక మధ్యలో ఆపివేస్తే నగుబాట్ల పాలౌతాడు. రెండవ ఉపమానం, శత్రురాజు మన మీదికి దండెత్తి వస్తున్నాడు. మనం ఏం చేయాలి? బలముంటే అతన్ని ఎదిరించి పోరాడవచ్చు. బలం లేకపోతే అతనితో ముందుగానే సంధి చేసికోవడం మంచిది.

ఈ రెండు సామెతల భావం ఇది. డబ్బుంటేనే ఇల్లు కట్టడం ప్రారంభించాలి. బలముంటేనే శత్రురాజుని ఎదిరించాలి. అలాగే స్వార్థత్యాగం వుంటేనే క్రీస్తు శిష్యులం కావడానికి పూనుకోవాలి. లేకపోతే మానుకోవాలి. సగం పనిజేసి దాన్ని మధ్యలో ఆపివేయడం కంటె అసలు ఆ పనినే ప్రారంభించకుండా వుండడం మేలు. అలాగే క్రీస్తు శిష్యుడు మళ్లా స్వార్థజీవితం జీవించడం కంటె అసలు అతని శిష్యుడు కాకుండ వుండడమే మేలు.

### 3. అన్వయం

ఇది వినడానికి కొంచెం కటువైన సామెత. ఐనా మన గురువు సిలువ మార్గంలో నడచిపోయినవాడు. సిలువ మార్గమంటే స్వార్థాన్ని చంపుకోవడం. ఆ గురువు ఒక త్రోవలో పోతూంటే శిష్యులమైన మనం మరో త్రోవలో పోగూడదు. ఇక ఈ సిలువ మార్గంలో నడిచే శక్తి మనంతట మనకు అలవడదు. ప్రభువే ఆ శక్తిని మనకు ప్రసాదిస్తాడు. కనుకనే అతడు పౌలుతో "నా కృప నీకు చాలు. నీవు బలహీనుడవుగా వున్నపుడు నా శక్తి నీమీద సమృద్ధిగా పని చేస్తుంది" అని చెప్పాడు- 2కొరి 12,9.

## 3. రాతి పునాది, ఇసుక పునాది - మత్త 7,24-27

### 1. సందర్భం

పర్వత ప్రసంగాంతంలో ప్రభువు తన బోధలను ఆలించడం మాత్రమే గాదు వాటిని పాటించడం గూడ అవసరమని సెలవిచ్చాడు. మంచి శిష్యుడు ప్రభు బోధలను ఆలించి వాటిని పాటిస్తాడు. చెడ్డ శిష్యుడు ప్రభు బోధలను ఆలిస్తాడే గాని పాటించడు.

### 2. వివరణం

ఓ తెలివైన జనుడున్నాడు. అతడు రాతిమీద పునాది తీసి ఇల్లు కట్టాడు. పెనుగాలీ జడివానా వరదలూ వచ్చాయి. కాని పునాది భద్రంగా వున్నందున ఆ యిల్లు కూలిపోలేదు. ప్రభువు బోధలు విని వాటిని నిత్యజీవితంలో ఆచరించే మంచి శిష్యుడు ఈలాంటివాడు. ఇంకో మందమతి వున్నాడు. అతడు వరదపారే ఇసుక ప్రదేశంలో ఇల్లు కట్టాడు. పెనుగాలీ జడివానా వచ్చాయి. పెద్ద వరద పారింది. ఆ మందమతి యిల్లు ఈ వరదలో ఇసుక పునాది మీద వుంది. వరద ఆ యిసుకను కాస్త కోసుకొని పోయింది. ఇంక ఆ యిల్లెక్కడ నిలుస్తుంది? అది నేల మట్టమయింది. ప్రభు బోధలు విన్నా నిత్యజీవితంలో వాటిని ఆచరించకుండా అశ్రద్ధచేసే చెడ్డ శిష్యుడు ఈ బుద్ధిహీనునిలాంటి వాడు.

పాలస్తీనా దేశంలో నీటి వెల్లువపారే పల్లపు నేలను "వాడి" అంటారు. జడివాన కురిసినప్పుడు మాత్రం ఈ పల్లంలో గుండా నీళ్ళు వాగులాగ పారతాయి. వానలేనప్పుడు ఈ పల్లపు నేల మామూలు నేలలాగే ఎండి వుంటుంది. ఇక్కడ బుద్ధిహీనుడు ఈలాంటి "వాడి"లో ఇల్లు కట్టాడు. అది వరదకు తట్టుకోలేక కూలిపోయింది.

### 3. అన్వయం

క్రీస్తు "నన్ను ప్రభూ! ప్రభూ! అని పిలచ్చేవాడు కాదు, నా తండ్రి చిత్తానుసారంగా జీవించేవాడు పరలోక రాజ్యంలో ప్రవేశిస్తాడు" అని నుడివాడు - మత్త 7,21. మనం జీవితంలో క్రైస్తవ సూత్రాలను పాటించం. బద్దకింపు కొద్దీ ప్రభువు ఆజ్ఞలను ఉల్లంఘిస్తాం. ఈలాచేస్తే పై మందమతిని పోలినవాళ్ళ మౌతాం.

పైగా మన రాయి క్రీస్తే - 1కొ 10,4. కనుక క్రీస్తు అనే పునాది రాతిమీద నిల్చేవాడు నిలుస్తాడు. ఆ రాతి మీద నిలువనివాడు నిలువడు. క్రైస్తవుల్లో కొందరు డబ్బు మీదా, మరికొందరు అధికారం మీదా, ఇంకా కొందరు పలుకుబడి మీదా, వేరుకొందరు కులగౌరవం మీదా నిలుస్తారు. కాని ఈలాంటి వాళ్ళంతా కాలక్రమేణ కూలిపోతారే గాని యథార్థంగా నిలువరు.

## 4. యజమానుడు - సేవకుడు - లూకా 17,7-9.

### 1. సందర్భం

పరిసయులు మోషే ధర్మశాస్త్రాన్ని తుచ తప్పకుండా పాటించేవాళ్ళు. ఈలా ధర్మశాస్త్రాన్ని పాటించడం వల్లనే తాము నీతిమంతులమయ్యామని వాళ్ళు విఱ్ఱవీగేవాళ్లు. కాని మనలను పుణ్యాత్ములను జేసేది మనం చేసిన సత్కార్యాలు కాదు. మరి ఆ సత్కార్యాలను కరుణతో బహూకరించే ప్రభువు. ఈ సత్యాన్ని బోధించేదే ఈ క్రింది సామెత.

### 2. వివరణం

ఒక యజమానునికి ఒక్కడే బానిస వున్నాడు. వాడే పొలం దున్నాలి, గొఱ్ఱెల మందలు కాయాలి, అన్నం వండాలి, వడ్డించాలి గూడ. ఈ పనులన్నీ చేసాక గూడ యజమానుడు అతనికి కృతజ్ఞత తెలుపడు. ఎందుకంటే పనులన్నీ చేయడం అతని విధి. మనకూ భగవంతునికి వుండే సంబంధం గూడ ఈలాంటిదే. మనం ఆ ప్రభువుకి దాసులం. మనం ప్రభువు పనులన్నీ చేసిన పిమ్మట గూడ మేము ఇది చేసాం అది చేసాం అని డప్పు వాయించుకోగూడదు. మేము పుణ్యాత్ములం అని విఱ్ఱవీగగూడదు. మనకు మోక్ష బహుమానాన్ని ప్రసాదించేవాడు ప్రభువు. ఆ బహుమానం మీద మనకేమీ హక్కులేదు. కనుక కండ్లు నెత్తిమీద కెక్కగూడదు. అసలు మనకు వినయం ఒక్కటి తగుతుంది, అంతే.

### 3. అన్వయం

కొంతమంది తమ్ము తామే నీతిమంతులనుగా ఎంచుకొని ఇతరులను చిన్నచూపు చూస్తూంటారు - లూకా 18,9. వీళ్ళే గర్వాత్ములు. మనం గూడ ఈ వర్గానికి చెందే అవకాశం వుంది. ఈలాంటి మనస్తత్వానికి విరుగుడు పై సామెత. ఎప్పుడు గూడ మనలను రక్షించేది మన పుణ్యకార్యాలు గాదు. మరి ఆ పుణ్యకార్యాలకు ప్రభువు కరుణతో ఇచ్చే మోక్ష బహుమానం మనలను కాపాడుతుంది. కనుకనే నేనింతటివాణ్ణి అంతటివాణ్ణి అనుకోవడం మనకు తగదు. క్రైస్తవ సమాజానికి నాయకులుగా వుండేవాళ్ళకు ఈ

మనస్తత్వం అసలే తగదు. మన తరపున మనం ఎప్పుడు గూడ మేము దీనులమైన ప్రభు సేవకులం అనుకొంటూండాలి. ఇది శిష్య ధర్మం.

## 5. నడిరేయి వచ్చిన స్నేహితుడు - లూకా 11,5-10.

### 1. వివరణం

ఈ సామెతను అర్థం చేసికోవాలంటే ఆనాటి పాలస్తీనా గృహమర్యాదలు తెలిసి వుండాలి. పాలస్తీనా స్త్రీలు వేకువనే లేచి ఏ రోజుకు సరిపడే రొట్టెలు ఆ రోజే పొయ్యి మీద కాల్చుకొనేవాళ్ళు. మామూలుగా ఒక్కో మనిషికి ఒక్కోసారి భోజనానికి మూడు రొట్టెలు పడతాయి. ఏ యింటిలోనైనా ఆ రోజు కాల్చుకొన్న రొట్టెలు చాలక పోతే ప్రక్కవాళ్ళ యింటిలో అరువు తెచ్చుకొనేవాళ్ళు. మరుసటి రోజు కాల్చిన రొట్టెలు తిరిగి యిచ్చి ఆ యప్పు తీర్చుకొనేవాళ్లు. ఇక్కడ మన కథలోని గృహస్థు ఇంటికి తలవని తలంపుగా ఓ అతిథి వచ్చాడు. అతనికి భోజనం పెట్టడానికి ఆనాడు ఆ యింటిలో రొట్టెలేమీ మిగలలేదు. కనుకనే ఆ గృహస్థు పొరుగు ఇంటికి వెళ్ళి అరువు అడిగాడు.

పాలస్తీనా ఇండ్లలో ఒక్కటే పెద్ద గది వుండేది. ఆ గదిలో మధ్యన అరుగు వుంటుంది. ఇంటిలోని వాళ్ళంతా రాత్రిపూట ఆ యరుగుమీద చాపలు వేసికొని పండుకొంటారు. గొడ్డూగోదాకూడ అదే గదిలో ఓ ప్రక్కన పండుకొంటాయి. రాత్రి పండుకొనే ముందు ఇంటి తలుపులను లోపలినుండి గడవేసి బిగిస్తారు. ఆ గడె తీసేపుడు కిర్రుమని శబ్దం చేసి అరుగుమీద నిద్రించేవాళ్ళను మేల్కొలిపేది. అందుకే ఈ కథలోని వ్యక్తి పిల్లలు లేస్తారన్న భయంతో గడెతీసి తలుపు తెరవడానికి అంగీకరించడు.

యూదప్రజలు అతిథి మర్యాదను చాల గొప్పగా ఎంచేవాళ్ళు. ఇంటికి వచ్చిన మనిషికి అన్నపానీయాలు అందీయని గృహస్థును అంతా చీకొట్టేవాళ్ళు. ఈ కథలోని వ్యక్తికి పడకమీద నుండి లేచి మిత్రభావంతో రొట్టె లీయాలన్న తలంపు లేదు. ఐనా అతడు రొట్టెలీయకపోతే అతిథి మర్యాదను మీరినట్లవుతుంది. ఊళ్లో జనమంతా తన్ను చిన్నచూపు చూస్తారు అని భయపడ్డాడు. పైగా ఆ వచ్చిన వ్యక్తిగూడ పట్టినపట్టు వదలకుండా తలుపు దగ్గరే నిలబడి అడుగుతున్నాడు. అతని పోరు వదిలించుకోవాలి. కనుక అతడు లేచి ఒకసారి భోజనానికి అవసరమైన మూడు రొట్టెలూ ఇచ్చి పంపాడు.

ఈ సామెత భావం ఏమిటి? ఇందలి గృహస్థు మిత్ర భావంతో రొట్టె లీయలేదు. అతిథి అవమానానికి భయపడి, ఎదుటి వ్యక్తి పోరు వదలించుకోగోరీ కాస్త సహాయం చేసాడు - అంతే. ఇక చెడ్డవాళ్ళైన భూలోకంలోని నరులే ఈలా సహాయం చేస్తుంటే, ఇంతకంటె అన్ని విధాల మంచివాడైన పరలోకంలోని తండ్రి మనం అడిగినపుడు ఎంతగా సహాయం చేయడు? ఇది సామెత భావం. ఇక్కడ దేవుడు ఈ సామెతలోని గృహస్థులాంటివాడు అని చెప్పగూడదు. అతనికంటె భిన్నమైనవాడు అని చెప్పాలి. ఈ సామెత బోధించేది సామ్యంగాదు, భేదం. అనగా భగవంతుడు ఈ గృహస్థులాంటివాడు కాదు, అతనికంటె భిన్నుడు. అతనికంటె మంచివాడు.

ఇంకా, ఈ సామెతలోని ప్రధాన పాత్ర రొట్టెలు అడగడానికి వచ్చినవాడు కాదు, వాటిని ఇచ్చినవాడు. క్రీస్తు భేదం చెప్పింది ఈ రొట్టెలిచ్చినవాడికీ దేవునికీని. ఈలాంటి పాడు నరుని నుండే సహాయం లభిస్తుంటే ఇంతకంటె మంచివాడైన దేవుని నుండి తప్పక సహాయం లభిస్తుందని క్రీస్తు బోధ. కనుక శిష్యులు నమ్మికతో దేవుణ్ణి అడుగుకొంటూండాలి - ఇది సామెత నీతి.

## 2. అన్వయం

కొందరు భక్తులు మనం భగవంతుని పట్ల ఓ బిచ్చగాడి లాగా ప్రవర్తించాలని నుడివారు. ఇది మంచి ఉపమానం. బిచ్చగాడు నమ్మకంతో పట్టుదలతో మన ఇంటిముందు వేచివుంటాడు. అలాగే మనం కూడ నమ్మికతో దేవుణ్ణి అడుగుకోవాలి. పట్టుదలతో ప్రార్థన చేయాలి. అలా చేస్తే ప్రభువు తప్పకుండా మన మొర ఆలిస్తాడు. కీర్తనకారుడు కూడ "ఈ పేద నరుడు మొర్ర పెట్టగా ప్రభువు ఆలించాడు" అంటాడు - 34,6.

# 6. వితంతువు - న్యాయాధిపతి - లూకా 18, 1-8

## 1. వివరణం

ఓ న్యాయాధిపతి ఉండేవాడు. అతడు అధార్మికుడు. అతనికి దేవుని పట్ల భక్తీ లేదు. తోడి నరులంటే లక్ష్యమూ లేదు. ఓ వితంతువు అతని వద్దకు వ్యాజ్యెం తెచ్చింది. ఆమెకు ఎవరో అపకారం చేసారు. కనుక తనకు న్యాయం చేకూర్చి పెట్టమని న్యాయాధిపతిని అడిగింది. కాని అతడు పట్టించుకోలేదు. న్యాయం ఆమె ప్రక్కనే వుంది గాని ఆమె ప్రత్యర్థి మాత్రం బలవంతుడు. అతనికి వ్యతిరేకంగా తీర్పు చెప్పే సాహసం న్యాయాధిపతికి లేదు. పైగా ఆమె వూరుపేరూ లేని పేదరాలు. తనకేమీ లంచం గూడ ఈయలేదు. ఇక ఆమె గోడు తానెందుకు పట్టించుకోవాలి? లంచాలు తీసికొని న్యాయం చెరిచే న్యాయాధిపతులనూ, విధవల గోడులనూ పూర్వవేదం చాల తావుల్లో వర్ణిస్తుంది. ఈ సామెత గూడ అలాంటి సందర్భాలకు చెందిందే.

ఇక, ఈ వితంతువులో ఒక గొప్ప గుణముంది. ఆమె న్యాయాధిపతిని ఊపిరి పీల్చుకోనీకుండా తొందరపెట్టేది. నాకు న్యాయం జరిగించమని వేధించేది. చివరికి అతడు విసిగి వేసారిపోయాడు. ఆమె గోడు పడలేక తనకు ఇష్టం లేకపోయినాసరే ఆమెకు న్యాయం చెప్పాడు. ఆ వితంతువు పక్షమే నెగ్గేలా చేసి ఆమెను వదలించుకొన్నాడు.

ఈ విధవలాగే మనం కూడ నమ్మికతో, పట్టుదలతో దేవుణ్ణి అడుగుకోవాలని సామెత భావం. కాని దేవుడు ఈ యధార్మికుడైన న్యాయాధిపతిలాంటివాడా? ఈ సామెత దేవుడు ఈ యన్యాయపు న్యాయాధిపతిలాంటివాడని చెప్పదు, అతనికంటె భిన్నమైన వాడు అని చెప్తుంది. అనగా ఆ అధార్మికుడైన న్యాయాధిపతే నరుల మొర వింటూంటే, మంచివాడైన దేవుడు నరుల మొర ఇంకా అధికంగా వింటాడు గదా అని సామెత భావం. కనుక శిష్యులు పట్టుదలతో ప్రభుని మనవి చేసికోవాలి అని సామెత నీతి.

ఈ సామెత లోని ప్రధానపాత్ర వితంతువు గాదు. న్యాయాధిపతి. కనుక ఇక్కడ ప్రధానాంశం మనం ఏలా ప్రార్థన చేయాలి అని కాదు. దేవుడు మన ప్రార్థన తప్పక వింటాడు అని. పూర్వపు సామెత లాగే ఇది కూడ నరుల పక్షాన్ని గాదు, దైవపక్షాన్ని వర్ణిస్తుంది. దానిలాగే ఇదికూడ భగవంతుడు నరులలాంటివాడు అని చెప్పదు. నరులలాంటి వాడు కాదు అని చెప్తుంది.

### 2. అన్వయం

బైబులు భగవంతుణ్ణి తల్లితోను తండ్రితోను స్నేహితునితోను పోలుస్తుంది. ఈ వుపమానాలన్నీ మనకు ఆ ప్రభువు పట్ల నమ్మిక ఉండాలని సూచిస్తాయి. భగవంతుణ్ణి నమ్మినవాళ్ళకు చెరుపులేదు. పై రెండు సామెతల్లోని సారం ఇదే. "ఐగుప్తీయులు రథాలనూ గుర్రాలనూ నమ్ముకున్నారు, మేమైతే ప్రభువుని నమ్ముకొన్నాం" అన్న కీర్తన కారుని వాక్యం ఈ పట్టున స్మరింపదగ్గది - 20,7.

## 7. తండ్రీకుమారులు - మత్త 7,9-11

### 1. వివరణం

ఈ చిన్న సామెతలో బైబుల్లోని సారమంతా యిమిడి ఉంది. భగవంతుడు తండ్రిలాంటి వాడు. నరుడు అతని బిడ్డలాంటివాడు - ఇది బైబుల్లోని ప్రధాన సత్యం. ఈ సామెత బోధించేది కూడ యిదే. కుమారుడు రొట్టె నడిగితే తండ్రి రాతి నివ్వడు. చేప నడిగితే పాము నివ్వడు. రాయి పాము చిన్న బిడ్డలకు హానికరమైనవి. తండ్రి బిడ్డలకు హితకరమై భోజనంగా ఉపయోగపడే రొట్టె చేపలు మాత్రమే అందిస్తాడు. ఇక, భూలోకంలోని తండ్రులు అపరిపూర్ణులు, చెడ్డవాళ్ళు కూడ. చెడ్డవాళ్లైన తండ్రులే తమ బిడ్డలకు ఇంత మేలు చేస్తుంటే, పరిపూర్ణుడూ మంచివాడూ ఐన పరలోకపు తండ్రి నరులకు ఇంకా యెంత మేలు చేస్తాడో ఊహించండి! కనుక బిడ్డలు తండ్రిని నమ్మినట్లే శిష్యులు కూడ పరలోక పితను నమ్మాలి అని సామెత భావం.

### 2. అన్వయం

ప్రార్థనను గూర్చి చెప్పవలసి వచ్చినపుడు ఈ సామెత కంటె గొప్పది మరొకటి బైబుల్లో లేదు. భక్తుడు భగవంతుని తండ్రిలాగానూ తన్ను బిడ్డనులాగానూ భావించుకొని ప్రార్థనం చేసికోవాలి. కీర్తనకారుడు "పాలు త్రాగి తల్లి రొమ్ము మీద ప్రశాంతంగా పండుకొన్న పసిబిడ్డలాగే నా హృదయం కూడ నిమ్మళంగా ఉంది" అన్నాడు - 131,2. తల్లి రొమ్ము మీదలాగే ఆ భగవంతుని రొమ్ము మీద పండుకోవడం - ఇది యెంత చక్కని భావం!

## 8. మేకలు - గొర్రెలు - మత్త 25, 31-46

### 1. సందర్భం

క్రీస్తు శిష్యులకు కడతీర్పు జరుగుతుంది. ప్రభువు ఆజ్ఞలను పాటించారా లేదా అన్నదాన్ని బట్టి వాళ్ళకు న్యాయవిచారణం జరుగుతుంది. కాని క్రీస్తు శిష్యులు కాని

అన్యమతస్థుల సంగతి యేమిటి? వాళ్ళకు ప్రభుని గూర్చి తెలియదు. మరి వాళ్ళకు ఏలాంటి తీర్పు జరుగుతుంది? ఆ ప్రశ్నకు సమాధానమే ప్రస్తుత సామెత.

ఈ సామెత మత్తయి సువార్తలో మాత్రం కనిపిస్తుంది. ఈ సువిశేషంలో ఇది క్రీస్తు పలికిన కడపటి మాటలుగా వర్ణింపబడింది. ఈ సువార్త ప్రకారం ఈ సామెత ప్రభువు తుది సందేశం కనుక దీనికి గొప్ప విలువ నీయాలి. అనగా దీని బోధలను జాగ్రత్తగా గుర్తించాలి. కడతీర్పు ఇక్కడ ఓ సామెతగా వర్ణింపబడింది. ఈ సామెతలో మత్తయి క్రీస్తు బోధల సారాంశాన్ని చెప్పాడు.

## 2. వివరణం

ఈ సామెతలోని న్యాయమూర్తి ఉత్థాన క్రీస్తు. ఈ క్రీస్తుకు ఇక్కడ రాజు, కాపరి, న్యాయమూర్తి అనే మాటలు వాడబడ్డాయి. ఈ న్యాయమూర్తి తీర్పు తీర్చేది సకల జాతుల వాళ్ళకూను. అనగా క్రైస్తవులు కాని అన్యమతస్థులకు.

ఈ యన్యమతస్థుల్లో కొందరు గొర్రెలూ కొందరు మేకలూ. పాలస్తీనా దేశంలో గొర్రెలూ, మేకలూ పగలు కలసే మేస్తాయి. కాని రాత్రి వాటిని వేరుపరుస్తారు. రేయి మేకలను కొండ గుహల్లో మూసి ఉంచుతారు. వాటికి వేడి కావాలి. గొర్రెలను మాత్రం పొల్లాల్లోనే ఉంచుతారు. వాటికి స్వచ్ఛమైన గాలి అవసరం. ఇక్కడ న్యాయాధిపతికి కుడివైపున గొర్రెలను ప్రోగుజేసారు. గొర్రె విలువైన జంతువు. దాని తెలుపురంగు కూడ నీతిన్యాయాలకు పావిత్ర్యానికి చిహ్నం. అనగా న్యాయాధిపతికి కుడిప్రక్క ప్రోగైనవాళ్ళు పుణ్యాత్ములని భావం. అతనికి ఎడమ ప్రక్కన మేకలను ప్రోగుజేసారు. గొర్రెకంటె మేక తక్కువ విలువ కలది. దాని నలుపురంగు దొంగతనానికి చిహ్నం. కనుక న్యాయాధిపతికి ఎడమ ప్రక్కన ప్రోగైన వాళ్ళు దుర్మార్గులని భావం.

ప్రభువు తన కుడి ప్రక్కన ఉన్న పుణ్యాత్ములను దీవించి వాళ్ళకు మోక్షాన్ని బహుమానంగా యిచ్చాడు. ఎందుకంటే వాళ్ళు తోడి పేదజనానికి కరుణకార్యాలు చేసారు గనుక. 40వ వచనంలో న్యాయాధిపతి "నా సోదరులకు మీరు మేలు చేసారు" అంటాడు. ఈ "సోదరులు" పండ్రెండుమంది శిష్యులూ కాదు, క్రైస్తవులూ కాదు. అక్కరలో నున్న పేదసాదలు ఏ మతం వాళ్ళైనా ప్రభువు సోదరులే. బైబులు భగవంతుడు దీనుల భగవంతుడు. పేదసాదల్లో నెలకొని వుండేవాడు.

అలాగే ప్రభువు తనకు ఎడమప్రక్కన ఉన్న దుర్మార్గులను శపించి వాళ్ళకు నరకాన్ని దండనగా విధించాడు. వాళ్ళను దయ్యాలతో తుల్యం జేసాడు. ఎందుకంటే వాళ్ళు తమ చుట్టూరా వున్న పేదజనాన్ని ఆదుకోలేదు. వాళ్ళ పట్ల కరుణ జూపలేదు. ఇక్కడ ప్రభువు వీళ్ళకు శిక్ష విధించింది ఏదో చెడ్డ కార్యం చేసినందుకు గాదు. చేయవలసిన మంచి కార్యం చేయక విడిచిపెట్టినందులకు. ఈలాగే అబ్రాహాము లాజరు సామెతలోని

ధనవంతునికి గూడ పేదవానికి చేయవలసిన సహాయం చేయనందుకు శిక్ష కలిగింది - లూకా 16,21. పై 40వ వచనంలో లాగా 45వ వచనంలో గూడా ప్రభువు "ఈ యత్యల్పులలో ఒకనికి గూడ మీరు మేలు చేయలేదు" అంటాడు. ఈ యత్యల్పులు పండ్రెండుమంది శిష్యులూ కాదు, క్రైస్తవులూ కాదు. అక్కరలో వున్న పేదసాదలు ఎవరైనాసరే.

ఈ సామెత భావం ఏమిటి? క్రీస్తు తోడి జనంలో నెలకొని ఉంటాడు. ఏ మతం వాళ్ళయినా సరే నరులందరిలోను భగవంతుడు ఉంటాడు. విశేషంగా పేదసాదల్లో అతడు బాధలు అనుభవిస్తూంటాడు. కనుక మనం ఈ తోడి జనాన్ని పరామర్శించాలి. వాళ్ళల్లో భగవంతుడు వసిస్తూన్నాడు. కనుక వాళ్ళకు ఎక్కడలేని విలువ వుంది. అందుచేత తోడి జనాన్ని దయతో ఆదరించినవాడు, ప్రేమతో ఆదుకొన్నవాడు, భగవంతుని మన్నన పొందుతాడు. అలా చేయనివాడు అతని శిక్షకు పాత్రుడు ఔతాడు.

ప్రభువు తోడి జనంలో వసిస్తాడు అని చెప్పాం. కనుక తోడి జనాన్ని పరామర్శిస్తే ప్రభువు తన్ను పరామర్శించినట్లే భావిస్తాడు. తోడి జనాన్ని చిన్నచూపు చూస్తే తన్ను చిన్నచూపు చూచినట్లే భావిస్తాడు. కనుక తోడి జనంతో మనం పెట్టుకొనే సఖ్యసంబంధాలు కాని, వైరవిద్వేషాలు కాని ఆ భగవంతునితో పెట్టుకొన్నట్లే ఔతుంది. ఆ భగవంతుణ్ణి మనం ఏనాడూ కంటితో చూడలేం. కాని అతనికి పోలికగా ఉన్న తోడి నరుణ్ణి మాత్రం ఇరవై నాలుగు గంటలు చూస్తూనే వుంటాం. కాబట్టి ఆ భగవంతుణ్ణి గౌరవించదలచుకొంటే ఈ తోడి నరుణ్ణి గౌరవించాలి. మదర్‌తెరీసా, వినోబాభావే వంటి మహానుభావులు పేదజనాన్ని ఆదరించి వాళ్ళకు సేవ చేయడంలో అంతరార్థం యిదే.

ఇక ఈ సామెత అన్యమతస్థులను గూర్చింది అన్నాం. క్రైస్తవులు కాని, తన్ను ఏ మాత్రం ఎరుగని, అన్యమతస్థులకు క్రీస్తు తీర్పు ఏలా విధిస్తాడు? వాళ్ళు తోడిజనాన్ని ప్రేమతో చూచినట్లయితే ప్రభువు వాళ్ళను దీవిస్తాడు. తోడి జనాన్ని ప్రేమించక పోయినట్లయితే ప్రభువు వాళ్ళను శిక్షిస్తాడు! అన్య మతస్థుల తీర్పు వాళ్ళు చూపే ప్రేమను బట్టి ఉంటుంది. ఇక ప్రభువు క్రైస్తవులమైన మనకు తీర్పు చెప్పేటపుడు గూడ ఈ ప్రేమనే ప్రధానంగా తీసికొంటాడు. అసలు క్రైస్తవ మతంలో ప్రధానమైన సూత్రం సోదర ప్రేమే. మరి ఈ ప్రధాన సూత్రాన్ని అన్యమతస్థుల కంటె మనం అధికంగా పాటించవద్దా? పైగా, మత్తయి సువిశేషం ప్రకారం ఇది ప్రభువు తుది సందేశం అని చెప్పాం.

### 3. అన్వయం

యాకోబు 2, 8 సోదర ప్రేమను "రాజశాసనం" అని పేర్కొంటుంది. అనగా అది బైబుల్లో కల్ల ప్రధానమైన నియమం అని భావం. క్రీస్తు కూడ తన శిష్యులకు ఏకైక చిహ్నం సోదర ప్రేమేనని చెప్పాడు - యోహా 13,35. కాని మనం అన్ని ఆజ్ఞలకంటె

ముందుగా ఈ యాజ్ఞను మీరుతూంటాం. దీన్నిబట్టే మన క్రైస్తవ జీవితం ఎంత నిస్సారమైందో ఊహించుకోవచ్చు. కనుక ఈ రంగంలో మనమందరమూ ఆత్మ సంస్కరణకు పూనుకోవలసి ఉంటుంది.

## 9. ఉపమాన వాక్యాలు

శిష్య లక్షణాలను గూర్చి కొన్ని ఉపమాన వాక్యాలు గూడ ఉన్నాయి. ఈ వాక్యాలు సామెతల్లాగ విస్తృతి చెందకుండా సంగ్రహంగా ఉండిపోయాయి. ఐనా ఇవి కూడ చిన్న చిన్న సామెతలే. ప్రభువు ఆకాశంలోని పక్షులను పోషించేవాడు. అవి పైరు వేయవూ, ధాన్యం చేకూర్చుకోవు. ఐనా పరలోక పిత వాటిని పోషిస్తూన్నాడు. అలాగే గడ్డి మొక్కలు కూడాను. అవి నూలు వడికి వస్త్రాలు నేసికోవు. ఐనా ప్రభువు వాటికి రంగురంగుల బట్టలిచ్చాడు. ఆ వస్త్రాలు సోలోమోను తాల్చిన విలువగల బట్టలకంటె అందంగా ఉంటాయి. అవే వాటి పూలు. కాని ప్రభువు ఈ పక్షుల కంటె, ఈ గడ్డి మొక్కల కంటె నరులను ఇంకా అధికంగా ఆదరిస్తాడు గదా! కనుక శిష్యులు అతన్ని నమ్మడం నేర్చుకోవాలి - 6, 26-30.

కన్ను దేహానికి దీపం. కనుకనే శరీరానికి నయనం ప్రధానం. ఈ కంటికి చూపు బాగా ఉంటే దేహమంతా వెలుగులో ఉన్నట్లుగా ఉంటుంది. లేకపోతే చీకటిలో ఉన్నట్లుగా ఉంటుంది. ఇక, దేహానికి మంచి దృష్టిగల నేత్రం ఏలాగో, మన జీవితానికి గూడ భగవంతుని మీదనే మనసు నిలుపుకోవడం అలాంటిది. శిష్యులు ఏకమనస్కులై ఆ ప్రభువునే సేవించాలి గాని ఇహలోక వస్తువుల మీద హృదయం లగ్నం చేసికోగూడదు - మత్త 6,22-23.

భోజనానికి రుచిని ఇచ్చేది ఉప్పు. కనుక భోజనానికి ప్రధానమైంది లవణం. ఇక అన్నానికి ఉప్పు ఏలాగో లోకానికి శిష్యులూ అలాగు. వాళ్ళ తమ సత్కార్యాల ద్వారా ప్రపంచానికి దేవుణ్ణి గూర్చి సాక్ష్యమిస్తారు. అందుకే వాళ్ళ మంచి పనులను జూచి లోకంలోని జనం దేవుణ్ణి కొనియాడతారు అని చెప్పబడింది. ఇంకా దీపస్తంభం మీద వెలిగే దీపమూ పర్వతం మీద కట్టబడి అందరికీ కన్పించే నగరమూ కూడ శిష్యులకు ఉపమానంగా ఉంటాయి. అనగా వాళ్ళ ప్రముఖులుగా ఉంటారనీ, వాళ్ళ మంచి పనులు ఓ వెలుగులా ప్రకాశిస్తాయనీ భావం - మత్త 5, 14-16.

శిష్యులు ఇద్దరు యజమానులను సేవింపగూడదు. ఆ యిద్దరూ దేవుడూ, డబ్బూను. క్రైస్తవ నాయకులు ఈ నియమాన్ని మీరడం వల్ల కలుగుతున్న అనర్థకాలు రోజురోజు చూస్తూనే ఉన్నాం - మత్త 6,24. ఈలాంటిదే ధనవంతుడు దైవరాజ్యాన్ని చేరుకోవడం కంటె ఒంటె సూది బెజ్జంలో దూరడం సులభం అనే సామెత - మార్కు 10, 25. శిష్యులు ధనానికి గాక, దేవునికి దైవరాజ్యానికి దాసులు కావాలి అని ఈ సామెత భావం.

శిష్యులు కుటుంబపు గొడవలతో సతమతమౌతుండ కూడదు. లోకంలో ఉన్నవాళ్ళు లోకంలో ఉన్నవాళ్ళను సమాధి చేసికొంటారు. శిష్యులు మాత్రం దైవరాజ్య సంబంధమైన కార్యాల్లో నిమగ్నులు కావాలి - మత్త 8,21. ఇంకా నాగటి మేడిమీద చేయిమోపి మళ్ళా వెనకతట్టుకు చూచేవాడు దైవరాజ్యానికి అర్హుడు కాడు - లూకా 9,62. అనగా శిష్యులు ఓమారు క్రీస్తుని అనుసరించడం మొదలు పెట్టాక ఇక సందేహించగూడదు.

ప్రపంచం బోధించే సిద్ధాంతాలు విశాలమైన మార్గం లాంటివి. కాని ఆ మార్గాన్ని బట్టి పోయేవాళ్లు వినాశనానికి గురౌతారు. క్రీస్తు బోధించే సిద్ధాంతాలు ఇరుకైన మార్గం లాంటివి. కాని అందరూ ఈ మార్గాన్ని ఎన్నుకోరు. ఐనా ఈ త్రోవ వెంట వెళ్లేవాళ్లు జీవాన్ని పొందుతారు. కనుక శిష్యులు ఈ యిరుకు త్రోవలోనే పయనం చేయాలి - మత్త 7, 13-14.

కడన శిష్యులకు మేము గొప్పవాళ్ళం అనే భావం పనికి రాదు. వాళ్లు చిన్నబిడ్డల్లాగ తయారు కావాలి. బిడ్డలు తల్లిదండ్రుల మీద ఆధారపడినట్లే వాళ్ళూ దేవుని మీద ఆధారపడి జీవించాలి - లూకా 9,46-48. ఇవి ఉపమాన వాక్యాల్లో కన్పించే కొన్ని శిష్యధర్మాలు.

# 3. దైవరాజ్యం

ప్రభువు దైవరాజ్యాన్ని గూర్చి చాల సామెతలు చెప్పాడు. దైవరాజ్యమంటే దేవుడు ప్రజల జీవితంలోనికి అడుగుపెట్టడమే. భగవంతుడు మెస్సీయా ద్వారా తన ప్రజలతో సంఖ్యసంబంధాలు ఏర్పరచుకొంటాడు. కనుక దైవరాజ్యమంటే క్రీస్తు మన మంటిమీదకి దిగిరావడమే. ఆ ప్రభువు బోధించిన బోధల్లో నైతేనేమి, చేసిన అద్భుత కార్యాల్లోనైతేనేమి దైవరాజ్యం ఇమిడి ఉంది. అసలు అతడే దైవరాజ్యం అనాలి.

ఈ దైవరాజ్యం నరుల హృదయాల్లో నెలకొంటుంది. ఎవరు క్రీస్తుని అంగీకరించి విశ్వసిస్తారో వాళ్ళే దైవరాజ్యానికి చెందినవాళ్లు. ఈ దైవ సామ్రాజ్యం నిరాడంబరంగా, సద్దు చేయకుండా, మెల్లమెల్లగా వ్యాప్తిలోనికి వస్తుంది. దాని పెంపు చెట్టు పెరిగి పెద్దదైనట్లుగా, పైరు పంటకు వచ్చినట్లుగా, పులియబారిన పిండి పొంగినట్లుగా ఉంటుంది. బుద్ధిమంతులు ఈ రాజ్యానికి విలువనిస్తారు. దాన్ని ఓ నిధిలాగ, ఓ ముత్యంలాగ ఆదరంతో స్వీకరిస్తారు.

ఈ దైవరాజ్యాన్ని గూర్చిన సామెతలు సువిశేషాల్లో ఏడింటిదాకా ఉన్నాయి. వాటిని ఈ క్రింద క్రమంగా పరిశీలిద్దాం.

## 1. ఆవగింజ - మత్త 13,31-32

### 1. వివరణం

ఈ సామెత దైవరాజ్య విస్తరణాన్ని గూర్చి చెప్తుంది. పూర్వవేదం బాబిలోను లాంటి గొప్ప సామ్రాజ్యాలను కొమ్మలు చాచి పక్షులకు ఆశ్రయమిచ్చే మహావృక్షాలతో పోలుస్తుంది - దాని 4,12. ప్రస్తుత సామెతలో కూడ ఈ భావం ఇమిడి ఉంది. ఆవగింజ మిర్రివిత్తనం లాగ చాల చిన్నది. ఐనా ఆ విత్తనంలో నుండి పెద్ద చెట్టు ఎదిగి వస్తుంది. పాలస్తీనా దేశంలో ఆవచెట్టు పదడుగుల వరకూ పెరుగుతుంది. దానిమీద పక్షులు వ్రాలడం కూడ కద్దు. అంత చిన్న బీజం నుండి అంత పెద్ద చెట్టు పెరుగుతుంది. అలాగే దైవరాజ్యం కూడ మొదట అల్ప సంఖ్యాకులతో ప్రారంభమై కడన మహాసమాజంగా విస్తరిల్లుతుంది. ఇపుడు గ్రామగ్రామాల్లో సంచారం చేసే క్రీస్తు పండ్రెండు మంది శిష్యులు మాత్రమే దైవరాజ్యం. కాని ఇకమీదట అపార సంఖ్యాకులు ఈ రాజ్యంలో చేరతారు. మొదట కొంచెము, కడపట ఘనము - ఇది యీ సామెత భావం.

### 2. అన్వయం

దైవరాజ్యమనేది ఎక్కడో గాదు మన హృదయంలోనే ఉంటుంది. కనుకనే ప్రభువు దైవరాజ్యం మీలోనే ఉంది అని బోధించాడు - లూకా 17,21. ఎవరి హృదయం పవిత్రంగా ఉంటుందో వాళ్ళల్లో దైవరాజ్యం నెలకొని ఉంటుంది. అందుచేత క్రైస్తవులు చేయవలసిన మొదటి పని హృదయాన్ని శుద్ధిచేసికోవడం.

## 2. పులిసిన పిండి - మత్త 13, 33

### 1. వివరణం

పై సామెత లాగే యిదికూడ దైవరాజ్య విస్తరణను గూర్చి చెప్పేదే. దానిలాగే ఇది కూడ మొదట కొంచెము - కడన గొప్ప అనే నీతినే బోధిస్తుంది. పాలస్తీనా స్త్రీలు రొట్టెల పిండిని పులియజేయడానికి పులిపిడి ద్రవ్యాన్ని వాడతారు. (మన ప్రాంతంలో మజ్జిగను పులిపిడి ద్రవ్యంగా వాడతారు.) ఈ ద్రవ్యం ఓ చిన్నముక్క. ఈ చిన్న ముక్కే మూడు కుంచాల పిండి పొంగి పెద్ద బానెడంత అయ్యేలా చేస్తుంది. ఈలాగే దైవరాజ్యం కూడ కొలదిపాటి సభ్యులతో ప్రారంభమై క్రమేణ ఖండఖండాంతరాల్లో వ్యాపిస్తుంది. ఈ రెండు సామెతల్లోను ప్రారంభానికీ అంతానికీ ఉండే తేడాను గుర్తించాలి. చిన్న విత్తు, పెద్ద చెట్టు. చిన్న ముక్క, బానెడంత పులిసిన పిండి. ఇప్పుడు కొలది మంది అనామకులైన శిష్యులు, తర్వాత ఖండఖండాల్లో వ్యాపించే క్రైస్తవ సమాజం - ఇవి ఇక్కడ పోలికలు.

## 2. అన్వయం

విజయనగర సామ్రాజ్యం, రోమను సామ్రాజ్యం మొదలైన ప్రపంచ సామ్రాజ్యాలన్నీ బాగా విస్తరిల్లి ఉన్నతస్థాయికి వచ్చి తర్వాత పతనమై పోయాయి. ఈలా ప్రపంచంలో కొన్ని కోట్ల సామ్రాజ్యాలు పుట్టాయి, పెరిగాయి, పడిపోయాయి. కాని క్రీస్తు సామ్రాజ్యం ఈలా పడిపోదు. క్రైస్తవుల్లో ఎన్ని లోపాలున్నా ఎన్ని అవకతవకలున్నా ఆ ప్రభువు రాజ్యమేమో పెరుగుతూనే ఉంటుంది. అతని శక్తి ఆ దైవరాజ్యంలో పని చేస్తూంటుంది. మన క్రైస్తవ సమాజమే ఈ దైవరాజ్యం.

# 3. విత్తేవాడు - మత్త 13, 4-9

## 1. వివరణం

పాలస్తీనా దేశంలో నవంబరు డిసెంబరు నెలల్లో విత్తనాలు విత్తుతారు. మనలాగా గొర్రితో వెదవేయరు. సేద్యగాళ్ళు మొదట దున్నని నేలమీద చేత్తోనే విత్తనాలు వెదజల్లుతారు. అటుతరువాత ఆ విత్తనాల మీద భూమిని దున్నుతారు. ఏ విత్తనాల మీదనైనా మన్ను పడకపోతే వాటిని పక్షులు తినివేస్తాయి. అలాగే రాతినేలలో గాని ముండ్ల తుప్పలు ఎదిగివున్న నేలలోగాని పడిన విత్తనాలు అట్టే పంటకు రావు. కాని మెత్తని నేలలో పడిన విత్తనాలు మాత్రం సమృద్ధిగా ఫలిస్తాయి. ఈ సామెతలో మొదట విత్తనాలను మొలిపించడం లోను పైరును ఎదిగించడం లోను ఉండే బాధా అనగా నిస్సారమైననేల, విత్తనాలను తినివేసే పక్షులూ, సూర్య తాపమూ, ముళ్ళ పొదలూ మొదలైనవీ అటుపిమ్మట పంట చేతికి వచ్చినపుడు కలిగే సంతోషమూ - ఈ రెండు దశలకు తేడా చెప్పబడింది. క్రీస్తు బోధలు ప్రారంభించిన మొదటి రోజుల్లో చాల కష్టాలు ఎదురయ్యాయి. కొందరు శ్రోతలు అతనిని వ్యతిరేకించారు. కొందరు శిష్యులు కూడ అతన్ని విడనాడి వెళ్ళిపోయారు. ఈలాంటి కష్టపు పరిస్థితుల్లో అతని బోధ కొనసాగింది. ఐనా ఈ బోధల ద్వారానే ప్రభు సామ్రాజ్యం విస్తరిల్లుతుంది. పొలంలోని అవరోధాల నెదుర్కొని పంట చేతికి వచ్చినట్లే ప్రారంభంలోని ఆటంకాల నెదుర్కొని దైవసామ్రాజ్యం వ్యాప్తిలోకి వస్తుంది - ఇది ఈ ఉపమానం భావం. ఇక్కడ పొలంలో పండిన పంటకూ వ్యాప్తిలోకి వచ్చిన దైవరాజ్యానికి పోలిక చెప్పబడింది. కష్టాలతో ప్రారంభమైన ఈ రాజ్యం చివరికి ఫలితాన్ని ఇచ్చి తీరుతుంది - ఇది నీతి.

మత్తయి 13, 18-23లో ప్రస్తుత సామెతకు వివరణం చెప్పబడివుంది. క్రీస్తు మొదట ఈ సామెత చెప్పినపుడు పొలంలో పండిన పంట దీనిలో ప్రధానాంశం. కాని రానురాను తొలినాటి క్రైస్తవ సమాజంలో ఈ సామెత భావం మారిపోయింది. ఈ పొలం నరుల హృదయమూ, ఈ విత్తనాలు క్రీస్తు బోధలూ అనే భావం ప్రచారంలోకి వచ్చింది. క్రొత్తగా క్రైస్తవ మతంలో చేరినవాళ్ళు క్రీస్తు బోధలను ఎంత చిత్తశుద్ధితో పాటిస్తున్నారో తమ హృదయాలనే పరీక్షించి చూచుకోవాలి అనే అంశం వ్యాప్తిలోకి వచ్చింది.

పై సామెత లోని నాల్గురకాల నేలలకును నాల్గు రకాల నరులతో పోలిక చెప్పారు. విత్తనాలను అపహరించే పక్షులకు దయ్యంతో పోలిక చెప్పారు. క్రీస్తు మొదట బోధించినపుడు ఈ సామెతకు ఈ భావాలు లేనేలేవు. ఇవన్నీ తొలినాటి క్రైస్తవులు చేర్చినవి. ఈలా తొలినాటి క్రైస్తవ సమాజంలో కొన్ని సామెతల భావాలు పూర్తిగా మారిపోయాయి.

### 2. అన్వయం

యెషయా 55, 10-11 ప్రభు వాక్యాన్ని వానతోను మంచుతోను పోలుస్తుంది. వానా మంచూ కురిసి నేలను పదును జేసి పైరు ఎదిగిస్తాయి. సేద్యగానికి ధాన్యం చేకూర్చి పెడతాయి. అలాగే దైవవాక్కు గూడ మన హృదయమనే పొలాన్ని పదునుజేసి దానిలో మంచి కోరికలు మొలకెత్తిస్తుంది. మనం దైవ సంకల్పం ప్రకారం జీవించేలా చేస్తుంది. కురిసిన వర్షంలాగే దైవవాక్కు కూడ వ్యర్థంగాపోదు. ఈ దైవవాక్కు మన హృదయంలో గూడ వేరుబాతుకుని చక్కగా పంటపండితే ఎంత బాగుంటుంది?

## 4. పండిన పంట - మార్కు 4, 26-29

### 1. వివరణం

దైవరాజ్యం ఏలా వ్యాప్తిలోకి వస్తుంది అని ప్రశ్నిస్తే ఈ సామెతలో జవాబు లభిస్తుంది. అది యెవరూ గమనించకుండానే, దైవశక్తి వలన దానంతట అదే వ్యాప్తిలోకి వస్తుంది. ఓ దినం ప్రజలంతా దిఢీలున ఆ రాజ్యాన్ని గుర్తిస్తారు, అంతే. ఈ సామెతలో దైవరాజ్య వ్యాప్తి దానంతట అదే పండే పంటపొలంతో పోల్చబడింది. అసలు దీనికి "ఓర్పుతో వేచివున్న సేద్యగాడు" అని పేరు పెడితే బాగుంటుంది. సేద్యగాడు విత్తనాలు వెదజల్లాడు. అటుతరువాత అతని పనిలో అతడు నిమగ్నుడై యున్నాడు. పంట కోసం మాత్రం ఓపికతో వేచిఉన్నాడు. అలా అతడు తన పనిలో నిమగ్నుడై యుండగా అతనికి తెలియకుండానే పైరు మొలచి పెరిగి వెన్ను వేసి పంట పండుతుంది. ఆ శక్తిని పైరుకు ఎవడిచ్చాడు? భగవంతుడే. భగవంతుని కరుణ వల్లనే అది పెరిగి పంట పండుతుంది.

ఆ రోజుల్లో పాలస్తీనా దేశం రోమను ప్రభుత్వం ఆధీనంలో ఉండేది. రోముతో యుద్ధం చేసి పాలస్తీనా దేశానికి స్వాతంత్ర్యం సంపాదించాలని కొందరు యూదులు తహతహ లాడుతూండేవాళ్ళు. ఈ వర్గం వారికి ఉత్సాహవాదులు అని పేరు. క్రీస్తు శిష్యుల్లో కనానీయుడగు సీమోను ఈ వర్గానికి చెందినవాడే. ఈ ముఠావాళ్ళు తిరుగుబాటుతో, హింసాకాండతో, దైవరాజ్యాన్ని నెలకొల్పాలని వాదించేవాళ్ళు. శాంతంగా ఉంటే ఆ రాజ్యం రానేరాదని వీళ్ళ భావం. కాని క్రీస్తు ఈ భావాలను అంగీకరించలేదు, పైరు ఎదిగి పంట పండినట్లుగా దైవరాజ్యం దానంతట అదే నెమ్మదిగా ఎదిగి ఫలితానికి వస్తుంది అని అతడు బోధించాడు.

యాకోబు జాబు 5,7-8 మనం ప్రభువు రెండవ రాకడ కోసం వేచి వుండడాన్ని రైతు చూపే ఓపికతో ఉపమిస్తుంది. పంట కోసం రైతు ఓపికతో వేచివుంటాడు. ఓర్పుతో తొలకరి వానల కోసం ఎదురు చూస్తూంటాడు. అలాగే మనం కూడ సహనంతో ప్రభువు రెండవ రాకడ కోసం కనిపెట్టుకొనిఉండాలి అని ఆ వాక్యం భావం. కాని యిక్కడ దానంతట అదే పండి కోతకు సిద్ధమయ్యే పంట పొలం దైవరాజ్యానికి ఉదాహరణంగా ఉంటుంది.

## 2. అన్వయం

1 కొరింతీయులు 3,6లో పౌలు "నేను విత్తనం నాటాను. అపొల్లో నీళ్ళు పోసాడు. కాని మొక్కకు పెరుగుదల నిచ్చింది మాత్రం దేవుడే" అని చెప్పాడు. మన కృషి మనం చేస్తాం. కాని మన కృషికి ఫలితమూ బహుమానమూ ఇచ్చేవాడు ప్రభువే. మన తరపున మనం ఓపికతో వేచి ఉండాలి, అంతే. ఆధ్యాత్మిక రంగానికి భౌతిక రంగానికీ గూడ ఇదే నియమం వర్తిస్తుంది.

# 5. దాచబడిన ధనమూ, ఆణిముత్యమూ - మత్త 13,44-46

## 1. వివరణం

పూర్వం మన దేశంలో లాగే పాలస్తీనా దేశంలో గూడ నగలూ నాణాలూ భూమిలో పాతిపెట్టేవాళ్ళు. పాలస్తీనా దేశం ఈజిప్టు బాబిలోనియా అనే రెండు పెద్ద సామ్రాజ్యాల మధ్య ఉన్న చిన్న దేశం. అందువల్ల ఆ దేశం ఎప్పుడు యుద్ధభూమిగా పరిణమిస్తుండేది. సామాన్య జనులు భద్రత కోసం సొమ్ములనూ డబ్బులనూ భూమిలో పాతిపెట్టేవాళ్లు. కాని ఈలా పాతిపెట్టినవాళ్ళు కొంతమంది ఆ నిధిని తీయకుండానే గతించేవాళ్ళు. కాలక్రమేణ అది మరెవరి కంటనో పడుతుండేది. యూదుల జానపద కథలు చాలవాటిల్లో దాగివున్న నిధిని గూర్చిన ప్రస్తావన వస్తుంది.

మన కథలోని నరుడు ఓ పనివాడి లాంటివాడు. అతడు ఓ భూస్వామి పొలం దున్నుతుండగా నేలలో పాతి ఉన్న కుండ టంగున మ్రోగింది. అతడు ఆతురతతో కుండను త్రవ్వి తీయగా దానిలో నాణాలూ సొమ్ములూ కన్పించాయి. ఆ పొలం అతనిది కాదు. కనుక అతడు గబగబా కుండను మళ్ళానేలలో పూడ్చి వేసాడు. ఎందుకంటే అది ఎవరి కంటా పడగూడదు. ఆ రహస్యము పొక్కగూడదు. ఆ మీదట ఇంటికి వెళ్ళి భూస్వామి వద్ద నుండి ఆ పొలాన్ని కొన్నాడు. దానితో ఆ నిధి అతనికి దక్కింది. అలా నిధి సంగతి తెలియజేయకుండా పొలం కొనడం న్యాయమా కాదా అనేది యిక్కడ ప్రశ్నకాదు. అతడు నిధిని సంపాదించడమే ఈ సామెతలోని ముఖ్యాంశం.

ఈ సామెత భావం ఏమిటి? ఈ సేద్యగాడు నిధిని చూచి ఎంతో సంతోషించాడు. ఆ నిధికి అతడు ఏంతో విలువనిచ్చాడు. చివరకు దాన్ని సొంతం చేసికొన్నాడు. అతడు

ఆ నిధికి విలువ ఇచ్చినట్లే మనం కూడ దైవరాజ్యానికి విలువనీయాలి. దాన్ని ఏలాగైనా సంపాదించుకోవాలి. నిధికీ దైవరాజ్యానికీ ఎనలేని విలువనీయడం - ఇది యీ సామెతలోని పోలిక.

పై నిధిలాంటిదే ఆణిముత్యం సామెత గూడ. ఆనాడు జూలియస్సీజరు వద్దా, క్లియోపాత్ర రాణి వద్దా కొన్ని కోట్ల రూపాయల విలువ చేసే ముత్యాలు వుండేవట. యూదులకు కూడ ముత్యాలంటే మాలావు ఇష్టం. వాటిని దండలుగా గుచ్చి మెడలో ధరించేవాళ్లు. ఇక మన కథ చెప్పడం, ఓ అతనికి మూత్యాలు కూడబెట్టడమంటే ఎంతో సరదాగా ఉండేది. అతడు ఓ మారు ఎంతో విలువైన ముత్యాన్ని చూచాడు. ఇక అతనికి నిదురపట్టలేదు. కనుక తన ఆస్తి నంతా అమ్మి ఆ ముత్యాన్ని కొనితెచ్చుకొన్నాడు. తన ముచ్చట తీర్చుకొన్నాడు. పై సేద్యగాడు నిధికి అపారమైన విలువ నిచ్చినట్లే ఇతడు కూడ ఈ ముత్యానికి అనంతమైన విలువ నిచ్చాడు. ఈ రెండు సామెతల్లో గూడ క్రీస్తు సామ్రాజ్యానికి విలువ నీయడమే ముఖ్యాంశం.

## 2. అన్వయం

నాల్గవ శతాబ్దపు భక్తుడు జెరోము ఈ సామెత మీద వ్యాఖ్య చెప్తూ క్రీస్తే మన నిధి అని వ్రాసాడు. బైబులు అనే పొలంలో దాగివున్న మహా విలువ గల నిధి క్రీస్తు. మనం ఆ గ్రంథంతో పరిచయం కలిగించుకొని ఆ నిధిని పొందాలి. అప్పుడే మనం ఉత్తమ విలువను చేపట్టినవాళ్ళం ఔతాం. పైగా క్రీస్తు బైబులు గ్రంథంలో దాగివున్న నిధి. కనుక ఆ గ్రంథం తెలియని వాళ్ళకు క్రీస్తుంటే యేమిటో తెలీదు అన్నాడు జెరోము. ఆ మహానుభావు పదహారువందల యేండ్లనాడు వ్రాసిన ఈ మాటలు ఈనాడూ మన క్యాతలిక్ సమాజానికి అక్షరాలా వర్తిస్తున్నాయి. మనవాళ్ళకు బైబులూ తెలియదు, ఆ బైబులు బోధించే క్రీస్తూ తెలియదు. ఇంతకంటె దౌర్భాగ్యం ఏముంది?

# 6. దుష్టాత్మ - మత్త 12, 43-45.

## 1. వివరణం

భక్తుల హృదయం దైవరాజ్యంతో నిండి వుండాలి గాని పిశాచ రాజ్యంతో నిండి ఉండగూడదని ఈ సామెత భావం. ఈ సామెతలో "ఇల్లు" అంటే నరుడే. యూదుల భాషలో "ఆ ఇంట్లో దయ్యం ప్రవేశించింది" అంటే ఆ నరుళ్ళో దయ్యం ప్రవేశించిది అని అర్థం. ఓ అతన్ని దయ్యం విడిచి వెళ్ళిపోయింది. కానీ అతని హృదయం ఖాళీగా ఉంది. ఆ హృదయంలో దేవుడూలేడు దయ్యమూ లేదు. అప్పుడు పిశాచం పూర్ణబలంతో తిరిగివచ్చి అతన్ని మళ్ళా ఆవేశించింది. ఇక్కడ 44వ వచనంలో ఏడు దయ్యాలు అనే మాటలో ఏడు సంఖ్య పరిపూర్ణతను సూచిస్తుంది. అనగా ఆ వ్యక్తి దయ్యానికి చిక్కి పూర్తిగా

నాశమైపోతాడని భావం. ఈలాగే మరియ మగ్దలీనకు ఏడు దయ్యాలు ఉన్నాయి అంటే ఆమె పూర్తిగా దయ్యం అధీనంలో ఉంది అని అర్థ - లూకా 8,2. ఈ దయ్యం నిర్జన ప్రదేశం వెదకి వచ్చింది. బైబుల్లో నిర్జన ప్రదేశం లేక ఎడారి దయ్యాలకు వాసస్థలం.

ఇక్కడ ఇల్లు శుభ్రంగా వుందేగాని ఖాళీగా వుండిపోయింది. అనగా పిశాచం వెళ్ళిపోయాక నరుని హృదయం శూన్యంగా ఉండగూడదని భావం. కనుక పిశాచాన్ని పారద్రోలినంత మాత్రాన్నే చాలదు. దయ్యం వెళ్ళిపోయాక మన హృదయం ఒట్టినే ఉండిపోకూడదు. ఆ హృదయంలో దేవుణ్ణి నిల్పుకోవాలి. అనగా మన హృదయంలో దైవ సామ్రాజ్యం నిండివుంటే, ఇక పిశాచ సామ్రాజ్యానికి తావుండదని భావం.

**2. అన్వయం**

మన హృదయంలో దేవుడూ దేవుని ఆత్మా ఓ దేవళంలో లాగ వశిస్తుంటారు అన్నాడు పౌలు - ఎఫె 2, 22. ఇది చాల మంచి భావం. ప్రభువునీ ఆ ప్రభు సామ్రాజ్యాన్నీ హృదయంలో నిల్పుకొన్న భక్తుడు ధన్యుడుకదా!

ఈ దైవరాజ్యపు సామెతలన్నీ ప్రకృతిమీద అల్లినవి. ప్రకృతి రహస్యాలను ఆధారంగా తీసికొని ప్రభువు దైవరాజ్య సూత్రాలను వివరించాడు. ఆలోచన కలవాళ్ళకు ప్రకృతి నిత్యజీవితంలో ఎన్నో సత్యాలను బోధిస్తుంది.

# 4. త్వరపడాలి అనే సామెతలు

ప్రభువు రక్షణాన్ని ప్రసాదించే కాలం ఆసన్నమైంది. మెస్సియా రానే వచ్చాడు. ప్రజలను దైవరాజ్యంలోకి చేర్చుకొనేది అతడే. కాని అతడు కొలది కాలంపాటు మాత్రమే ఉంటాడు. కనుక ప్రజలు అతని బోధలను సత్వరమే ఆలించాలి. శీఘ్రంగా పరివర్తనం చెంది దైవరాజ్యంలో చేరాలి. ఈ రక్షణకాలం దాటిపోతే ఇక సదవకాశం లభించదు. జాప్యం చేసేవాళ్ళు సర్వనాశమైపోతారు. శిక్షకు గురౌతారు. కనుక ప్రజలు సత్వరమే పరివర్తనం చెందాలి. ఆలస్యం చేయకూడదు - ఈలాంటి భావాలను బోధించే సామెతలు సువిశేషాల్లో ఓ పదిదాక ఉన్నాయి. వీటికి "త్వరపడాలి అనే సామెతలు" అని పేరు. ఇక ఈ వర్గం సామెతలను క్రమంగా పరిశీలిద్దాం.

## 1. విందు సామెత - లూకా 14, 15-24

**1. సందర్భం**

ఓ మారు క్రీస్తు కొందరు అతిథులతో విందారగిస్తుండగా అక్కడ ఓ అతని దైవరాజ్యంలో విందు భుజించేవాళ్ళ ఎంతటి ధన్యాత్ములోగదా అన్నాడు. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని ప్రభువు ఈ విందు సామెతను చెప్పాడు.

## 2. వివరణం

ఓ గృహస్థు విందుచేసి మిత్రులను ఆహ్వానించాడు. కాని ఆ స్నేహితులంతా రకరకాల సాకులు చెప్పి విందుకు రావడం మానేసారు. రెండవ అతని చెప్పిన సాకు, తాను ఐదు జతల ఎడ్లుకొని వాటిని పరీక్షింపబోతున్నానని. ఆ రోజుల్లో ఒక జత యెడ్లు తొమ్మిది హెక్టార్ల భూమిని సేద్యం చేసేవి. కనుక ఈ భూస్వామి 45 హెక్టార్ల పొలంగల సంపన్నుడైన రైతు అనుకోవాలి. మూడవ అతని సాకు తాను అప్పుడే పెండ్లి చేసికొన్నానని. యూదులు పురుషులను మాత్రమే విందుకు ఆహ్వానించేవాళ్లు. కనుక ఇతడు తాను నూత్నంగా పెండ్లి యాడిన వధువును ఒంటరిగా విడిచివచ్చుటకు అంగీకరించలేదు అనుకోవాలి.

ఈలా మిత్రులంతా సాకులు చెప్పి తప్పుకోగా యజమానుడు కోపించి బిచ్చగాళ్ళను విందుకు ఆహ్వానించమన్నాడు. అతనికి బిచ్చగాళ్ళమీద ప్రత్యేకమైన అభిమానమేమో ఉండి కాదు. మిత్రులమీద కోపం వలన వాళ్ళను పిలిపించాడు- అంతే. కాని భోజనశాలలో ఇంకా తావుంది. శాల క్రిక్కిరిసినట్లుగా నిండిపోతే అతనికి ఎంతో గౌరవం. కనుక ఆ ఖాళీలను నింపడానికై అతడు మరలా రెండవసారి సేవకుని పంపాడు. ఆ సేవకుడు వెళ్ళి ఈసారి ఇల్లూ వాకిలీ లేని బికారులందరినీ పిల్చుకొని వచ్చాడు. ఈలా బిచ్చగాళ్ళూ బికారులూ ప్రోగై ఆ ధనికుని విందు భుజించి పోయారు. మిత్రులు మాత్రం అతని యింటికి భోజనానికి రానేలేదు. ఇక్కడ "పిలువబడిన వాళ్ళెవరూ నా విందును రుచి చూడరు" అనే 24వ వచనాన్ని విందు నడిపే గృహస్థే పలికాడో క్రీస్తే పలికాడో నిర్ణయించడం కష్టం. ఈ వాక్యాన్ని గృహస్థే పలికినట్లయితే మిత్రులెవ్వరూ తన విందు భుజింపజాలరని భావం. క్రీస్తే పలికినట్లయితే, యూద నాయకులెవ్వరూ మెస్సియా దైవ రాజ్యంలో ప్రవేశింపరని అర్థం చేసికోవాలి. యూదుల భాషలో విందు దైవ రాజ్యాన్ని సూచిస్తుంది.

మత్తయి 22, 1-10లో కూడ ఈ సామెత కన్పిస్తుంది. కాని అక్కడ మత్తయి కొన్ని మార్పులు చేసాడు. ఇక్కడి గృహస్థు అక్కడి రాజు. ఇక్కడలేని యుద్ధప్రస్తావనం అక్కడ వస్తుంది. ఈ రెండింటిలోను లూకా సామెతే క్రీస్తు మొదట చెప్పిన సామెతకు దగ్గరగా ఉండి ఉంటుంది.

## 3. భావం

ఈ సామెత అర్థం ఏమిటి? క్రీస్తు మొదట యూదులకు ఈ సామెత చెప్పినప్పుడు దాని భావం ఇది. ప్రభువు పరిసయులు ధర్మశాస్త్ర బోధకులు మొదలైన యూదనాయకులను మెస్సియా రాజ్యంలోనికి ఆహ్వానిస్తున్నాడు. కాని వాళ్లు అంగీకరించడంలేదు. కనుక సుంకరులు పాపులు మొదలైన పేదసాదలు దైవరాజ్యంలో ప్రవేశిస్తారు. ఇది దీని మొదటి భావం.

ఇక, క్రీస్తు తర్వాత ఓ పాతిక యేండ్లకు అతని బోధలు సువిశేషాలుగా వ్రాసినపుడు లూకా మత్తయి మొదలయినవాళ్లు ఈ సామెతకు మరో భావం చూపారు. మెస్సియా యూదులను ఆహ్వానించాడుగాని వాళ్లు అతని పిలుపును తిరస్కరించారు. ఆ యూదులకు మారుగా యూదేతరులైన క్రైస్తవులు దైవ రాజ్యంలో ప్రవేశిస్తారు. ఈ సామెత అంతటా విందును దైవరాజ్యంగా అర్థం చేసికోవాలి.

### 4. అన్వయం

"ఇదే అనుకూల సమయం, ఇదే రక్షణ దినం" అన్నాడు పౌలు -2కొ 6,2. ఆనాడు యూదనాయకులను మల్లె ఈనాడు మనలనుగూడ ప్రభువు తన రక్షణాన్ని స్వీకరించమని అడుగుతున్నాడు. తన రాజ్యంలో ప్రవేశించమని కోరుతున్నాడు. అతని పిలుపును అందుకొనే పూచీ మనది. అనగా మనం హృదయం పవిత్రం చేసికొని ఆ ప్రభువు అనుచరులం కావాలి.

## 2. వివాహవస్త్రం లేని అతిథి - మత్త 22, 11-14

### 1. సందర్భం

ఈ సామెత మత్తయి సువార్తలో మాత్రమే కన్పిస్తుంది. అతడు దీన్ని పైవిందు సామెతలో రెండవ భాగంగా పేర్కొన్నాడు.

### 2. వివరణం

రాజు పేదసాదలనూ, మంచివాళ్ళనూ చెడ్డవాళ్ళనూ గూడా భోజనానికి పిలువగా వాళ్ళంతా వచ్చి విందారగిస్తూన్నారు. అప్పుడు రాజు అతిథులను చూడ్డానికి వెళ్ళాడు. యూదుల సంప్రదాయం ప్రకారం విందు నడిపించే గృహస్థు అతిథులతో కూర్చుండి భుజించడు. అతిథులు భోంచేస్తుండగా తాను వాళ్ళ దగ్గరకువచ్చి అలా పలకరించి వెళ్తాడు అంతే. ఇక్కడ రాజు అతిథుల వద్దకు వచ్చి చూడగా వాళ్ళల్లో ఓ అతనికి వివాహవస్త్రం లేదు. అతడు మురికి బట్టలు తాల్చి వచ్చాడు. ఇక్కడ వివాహవస్త్రం అంటే ఏదో ప్రత్యేకమైన వస్త్రం కాదు. శుభ్రంగావున్న మామూలు బట్ట, అంతే. ఈ యతిథి మురికి బట్టలతో ఎందుకు వచ్చాడు? అతడు విందుకు సంసిద్ధంగా లేడు. తలవని తలంపుగా పిలుపు విన్పించింది. ఆ పిలుపు విని ఉన్నవాడు ఉన్నపాటిన వచ్చాడు.

### 3. భావం

యూదుల భాషలో వస్త్రం రక్షణాన్ని సూచిస్తుంది. అందుకే యెషయా "ప్రభువు నాకు రక్షణ వస్త్రాన్ని కట్టబెట్టాడు. పుణ్యవస్త్రాన్ని తొడిగాడు" అంటాడు - 61,10. క్రీస్తు కూడ తాను కొనిరాబోయే రక్షణాన్ని వస్త్రంతో పోల్చాడు - మార్కు 2,21. కనుక ఇక్కడ

ఈ యతిథి వివాహవస్త్రం లేకుండా వచ్చాడంటే అర్థం ఏమిటి? మెస్సియా యూద నాయకులకు తన రక్షణాన్ని ఈయగోరుతున్నాడు. వాళ్లు పశ్చాత్తాపపడాలి. ఆ రక్షణాన్ని అంగీకరించాలి. అప్పుడు దైవరాజ్యంలో చేరతారు. ఐనా యూదనాయకులు అహంకారంతో క్రీస్తు రక్షణాన్ని నిరాకరించారు. ఇక్కడ ఈ మురికి బట్టతో వచ్చినవాడు క్రీస్తుని నిరాకరించే ఆ నాయకులకు చిహ్నం. ఆ నాయకులు ప్రభువుని నిరాకరించారు కనుక ప్రభువుకూడ వారిని నిరాకరిస్తాడు. వారికి మెస్సియా రాజ్యంలో స్థానంలేదు. మొదట క్రీస్తు ఈ సామెతను చెప్పినప్పుడు అతడు ఉద్దేశించిన భావం ఇది.

కాని క్రీస్తు బోధలను ఎత్తి సువిశేషంగా వ్రాసినపుడు మత్తయి ఉద్దేశించిన భావం దీనికి కొంచెం భిన్నంగా ఉంటుంది. యూదులకు మారుగా క్రైస్తవులు దైవరాజ్యంలో చేరతారు అనే భావాన్ని మీదటి సామెతలో చెప్పాం. ఈ క్రైస్తవుల్లో రకరకాల ప్రజలున్నారు. సేవకులు వెళ్ళి మంచివారినీ చెడ్డవారినీ గూడ పెండ్లి విందునకు ప్రోగుజేసికొని వచ్చారు – మత్త 22,10. అనగా జ్ఞానస్నానం పొంది క్రైస్తవ సమాజంలో చేరినవారిలో మంచివాళ్లూ ఉన్నారు. చెడ్డవాళ్ళూ వున్నారు. ఈ చెడ్డవాళ్లు క్రైస్తవ సమాజంలో చేరినంత మాత్రాన్నే సరిపోతుందా? వాళ్ళకు నైతిక బాధ్యతలు ఏమీ ఉండవా? కేవలం క్రైస్తవ మతంలో చేరినంత మాత్రాన్నే వాళ్లు రక్షణం పొందుతారా? ఈలాంటి ప్రశ్నలకు జవాబులు చెప్పడం కోసమే ఈ ప్రస్తుత సామెత ప్రచారంలోకి వచ్చింది. ప్రజలు జ్ఞానస్నానం పొంది క్రైస్తవ సమాజంలో చేరినంత మాత్రాన్నే చాలదు. వాళ్లు శుభ్రమైన రక్షణ వస్త్రాన్ని ధరించాలి. నీతి మార్గంలో నడవాలి. తమ పాపాలకు పశ్చాత్తాపపడాలి. కట్టడలను పాటించాలి. అప్పుడే వాళ్లు దైవరాజ్యంలో చేరేది. ఇది ఈ సామెత భావం. ఈలా క్రీస్తు మొదట యూదులకు చెప్పిన సామెతను మత్తయి తర్వాత క్రైస్తవ సమాజానికి అన్వయించేలా చేసాడు. ఈలాంటి మార్పులు చాల సామెతల్లో కన్పిస్తాయి.

## 4. అన్వయం

తొలి శతాబ్దంలో జీవించిన యూదుల రబ్బయి ఎలియసేరు అనే అతని "మీరు చనిపోయే దినానికి ముందటి రోజుననే పశ్చాత్తాపపడుతుండాలి" అని శిష్యులకు బోధించాడు. శిష్యులు "అయ్యా! మేము ఏ దినం చనిపోతామో ఎలా తెలుస్తుంది?" అని ప్రశ్నించారు. ఆ రబ్బయి "మనం రేపే చనిపోవచ్చు. కనుక ఈనాడే పశ్చాత్తాప పడాలి. ఈ విధంగా నరుడు జీవితంలో ప్రతిరోజూ మరుసటి రోజే తన మరణదినమేమో ననుకొని పశ్చాత్తాపపడుతూండాలి" అని జవాబు చెప్పాడు. క్రైస్తవ భక్తుడు రోజూ తన పాపాలు తలంచుకొని పశ్చాత్తాపపడుతూండాలి. రోజూ శుభ్రమైన రక్షణవస్త్రాన్ని ధరిస్తూండాలి. అనుదినమూ నీతివర్తనుడుగా మెలుగుతుండాలి. అప్పుడే కాని అతడు మెస్సీయా సిద్ధం చేసిన విందు భుజించడానికీ, దైవరాజ్యంలో ప్రవేశించడానికీ అర్హుడు కాడు.

## 3. భూస్వామి, కౌలుదార్లు - లూకా 20, 9-19.

### 1. సందర్భం

యూదనాయకులు, విశేషంగా సానేడ్రిన్ మహాసభ సభ్యులు, క్రీస్తు అధికారాన్ని సవాలు చేసారు. ప్రభువు ఆ నాయకుల నుద్దేశించి ఈ సామెత చెప్పాడు.

### 2. వివరణం

ఆ రోజుల్లో పాలస్తీనా దేశంలో కొందరు సంపన్నులు తమ పొలాన్ని సేద్యగాళ్ళకు గుత్తకిచ్చి తాము రోము మొదలైన విదేశ నగరాల్లో సుఖంగా కాలక్షేపం చేస్తుండేవాళ్ళు. ఈ కథలోని భూస్వామికూడ అలాంటివాడే ననుకోవాలి. అతడు తన ద్రాక్షతోటను గుత్తదారుల వశంలోవుంచి తానెక్కడో దూరదేశాల్లో వసిస్తూన్నాడు. ఆ యజమానుడు తన గుత్తదారుల నుండి కౌలు రాబట్టడానికి మూడుసార్లు సేవకులను పంపాడుగాని ఆ దుష్టులు సొమ్ము చెల్లింపలేదు. పైగా సేవకులను కొట్టి పంపారు. యజమానుడు విసిగిపోయి కడన సొంత కుమారుణ్ణే పంపాడు. గుత్తదారులు అతనికైనా భయపడతారేమో ననుకొన్నాడు. కాని ఆ దుష్టులు ఆ కుమారుణ్ణి పట్టుకొని చంపివేసారు. ఆ తోటకు వారసు కుమారుడే కనుక అతని ప్రాణంతీస్తే ఆ తోట తమకే దక్కుతుంది అని వాళ్ల భావం. భూస్వామి గతించినపుడు సేద్యగాళ్ళే అతని పొలాన్ని ఆక్రమించుకోవడం కద్దు.

### 3. భావం

పూర్వవేదం యిస్రాయేలు ప్రజను ద్రాక్షతోటతో ఉపమిస్తుంది. యెషయా ప్రవచనం 5, 1-7లో ఈ ఉపమానం విపులంగా కన్పిస్తుంది. "సర్వశక్తిమంతుడైన ప్రభువునకు ఇష్టమైన ద్రాక్షతోట యిస్రాయేలు ప్రజ" అంటాడు ప్రవక్త- 5,7. కనుక ఇక్కడ ద్రాక్షతోట అంటే యిస్రాయేలీయులే. ఆ ద్రాక్షతోట కాపులు యిస్రాయేలు నాయకులను సూచిస్తారు. తోట అధిపతి పరలోకంలోని తండ్రి. అతడు పంపిన సేవకులు ప్రవక్తలు. యిస్రాయేలు నాయకులు ప్రవక్తల బోధలను ఆలించలేదుగదా, వాళ్ళను హింసించారు. కడన యజమానుడు తన కుమారుణ్ణే పంపాడు అంటే, యిస్రాయేలు ప్రజలకు బోధించడానికి తండ్రి కడన కుమారుణ్ణే పంపాడు అని అర్థం. ఈ కుమారుణ్ణే యూదులు యెరూషలేము వెలుపల సిలువవేసి చంపుతారు. కాని యూదులు నిరాకరించిన రాయే తర్వాత క్రైస్తవ సమాజమనే భవనానికి మూలరాయి ఔతుంది.

ఈలా ఈ సామెత క్రీస్తు జీవితానికీ మరణానికీ వర్తిస్తుంది. ఈ సంగతిని అతని శత్రువులు కూడ గ్రహించారు. గ్రహించి అతన్ని అక్కడే పట్టి చంపబోయారు - 20, 19. ఇక్కడ క్రీస్తు తన్ను దేవుని కుమారుణ్ణిగా వర్ణించుకొన్నాడు. యూదనాయకులను దుష్టులైన కౌలుదార్లనుగా చిత్రించాడు. కనుక వాళ్ళకు అతనిమీద పట్టరాని కోపం వచ్చింది.

క్రీస్తు ఈ సామెతను ముగిస్తూ "భూస్వామి వచ్చి ఆ కౌలుదార్లను శిక్షించి తోటను ఇతరులకు గుత్తకిస్తాడు" అని పల్కాడు. యూద నాయకులు ప్రభువు రాజ్యానికి తగిన ఫలితాన్ని ఈయడంలేదు. కనుక దైవరాజ్యం ఇక వాళ్ళకు దక్కదు. తండ్రి ఆ రాజ్యాన్ని మరొక ప్రజకు - క్రైస్తవులకు ఇస్తాడు. అనగా యూదులకు మారుగా క్రైస్తవులు దైవరాజ్యాన్ని స్వీకరిస్తారు.

### 4. అన్వయం

ఈ సామెతకు యెషయా ప్రవచనం 5, 1-7 ఆధారమని చెప్పాం. ఆ భాగంలో ప్రవక్త యిస్రాయేలును మంచికాయలు కాయని ద్రాక్షతోటతో పోల్చాడు. యావే ప్రభువు యిస్రాయేలు ప్రజను ఆదరంతో ఓ తోటలాగ పెంచాడు. ఆ తోట నుండి మంచి పండ్లను ఆశించాడు. కాని ఋతువు వచ్చినపుడు ఆ తోట మంచి పండ్లు పండలేదు. అందువల్ల ప్రభువు కోపించి ఆ తోటను నాశం చేయించాడు - ఇది ప్రవక్త చెప్పిన కథ. యోగ్యమైన క్రైస్తవ జీవితం జీవించనపుడల్లా మనంకూడ ఆ కాయలు కాయని తోటలాగే తయారౌతాం. ప్రభువు శిక్షకు పాత్రుల మౌతాంగూడ.

## 4. యుక్తిగల గృహనిర్వాహకుడు - లూకా 16, 1-13

### 1. వివరణం

ఒక ధనవంతునికి ఓ గృహనిర్వాహకుడు ఉండేవాడు. యజమానుని ఇంటి విషయాలన్ని అతడే చూస్తుండేవాడు. అతడు యజమానునికి కార్యదర్శి వంటివాడు. కాని ఆ నిర్వాహకునిమీద ఫిర్యాదులు వచ్చాయి. కనుక యజమానుడు అతన్ని పనినుండి తొలగించి లెక్కలు అడగాలనుకొంటున్నాడు. నిర్వాహకుడు ఈ ప్రమాదం గుర్తించాడు. అతడు యుక్తిపరుడు. కనుక వెంటనే యజమానునికి ఋణపడి ఉన్న వాళ్ళందరినీ పిలిపించాడు. వాళ్ళు బాకీపడివున్న వస్తువులను తమ ఋణపత్రాలమీద తక్కువ మొత్తాలుగా వ్రాసికొమ్మని చెప్పాడు. ఆ బాకీదారులు సంతోషించి నూరుతూములనూ నూరు మణుగులనూ ఎనభైగా తగ్గించి వ్రాసి కొన్నారు. నిర్వాహకుడు ఉద్యోగాన్ని కోల్పోయినంక ఈ బాకీదారులు అతడు చేసిన మేలునకు అతన్ని ఆదరించారు. యజమానుడు అతని యుక్తిని మెచ్చుకొన్నాడు. కనుక యూదనాయకులు కూడ ఈ గృహనిర్వాహకునిలాగే తెలివితో మెలాగాలి.

### 2. భావం

ఈ సామెత భావం ఏమిటి? ఆ గృహనిర్వాహకుడు ఋణగ్రస్తుల బాకీలను తగ్గించి యజమానుణ్ణి మోసం చేసాడు. అలాంటివాణ్ణి చూచి యజమానుడు మెచ్చుకొన్నాడు అని చెప్పబడింది. అతని మోసాన్ని మనంకూడ అనుకరించాలి అని భావమా?

ఈ సామెత భావం అదికాదు. యజమానుడు మెచ్చుకొంది నిర్వాహకుని యుక్తినిగాని అతని మోసాన్ని కాదు. ఇక్కడ నిర్వాహకుడు అపాయస్థితిలో ఉన్నాడు. అతని ఉద్యోగం ఊడిపోబోతూంది. అలాంటి పరిస్థితుల్లో అతడు చేతులు నలుపుకొంటూ, గోళ్ళు గిల్లుకొంటూ కూర్చున్నట్లయితే నాశమై పోయేవాడే. కాని అతడు వెంటనే కార్యాచరణకు పూనుకొన్నాడు. యుక్తితో ప్రవర్తించి కొంతమంది మన్నన సంపాదించు కొన్నాడు. దానితో బ్రతికిపోయాడు. అలాగే క్రీస్తు బోధను ఆలించే యూదనాయకులు గూడ దైవరాజ్యంలో చేరకుండా వొట్టినే జాప్యంచేస్తూ వుండిపోగూడదు. వాళ్ళుగూడ యుక్తితో ప్రవర్తించాలి. శీఘ్రమే కార్యాచరణకు పూనుకోవాలి. దైవరాజ్యంలో చేరతామని నిర్ణయం చేసికోవాలి. లేకపోతే అనతికాలంలోనే నాశమైపోతారు- ఇది ఈ సామెతలో క్రీస్తు ఉద్దేశించిన భావం.

లూకా ఈ సామెతను సువార్తల్లో లిఖించేప్పటికల్లా దీని భావం కొంచెం మారింది. క్రైస్తవులు కొందరు డబ్బు కూడబెట్టుకొంటున్నారు. కాని వాళ్ళు ఆ డబ్బును సత్కార్యాలకూ దానధర్మాలకూ వినియోగించాలి. ఆ సత్కార్యాల ద్వారా వాళ్ళు మోక్షరాజ్యం చేరతారు. ద్రవ్యం చెడ్డదే ఐనా దాన్ని సత్కార్యాలకు వినియోగించినపుడు స్వర్గంలోని దేవదూతలే స్నేహితులై మనకు మోక్షప్రాప్తి కలిగిస్తారు- ఇది లూకా సూచించిన భావం - 16,9. ఈలా యూదనాయకులు శీఘ్రమే కార్యాచరణకు పూనుకోవాలి అని దీని తొలి భావం. క్రైస్తవులు తమ ధనాన్ని దానధర్మాలకు వెచ్చించాలి అని దీని రెండవ భావం.

### 3. అన్వయం

మన జీవితంలో చేసికోవలసిన నిర్ణయాలు త్వరగా చేసికోం. జాప్యం చేస్తూంటాం. దీనివల్ల పెద్ద అనర్థాలు కలుగుతూంటాయి. మనం భక్తితో ఓ వడకాన్ని చేసినపుడో ఓ ప్రసంగాన్ని విన్నపుడో జీవితంలోని ఆయా అంశాలను సవరించుకోవాలి అనిపిస్తుంది. కాని వాటిని సవరించుకోకుండా ఆలాగే జాప్యం చేస్తాం. ఇది మంచిపద్ధతి కాదు. ఈ సామెతలోని గృహనిర్వాహకుల్లాగే మనం కూడ యుక్తితో త్వరగా సత్కార్య నిర్వహణకు పూనుకోవాలి.

షరా : క్రీస్తు సామెతల్లోకల్ల ఇది కష్టమైన సామెత అని చాలమంది అభిప్రాయం. ఆ గృహనిర్వాహకుని మోసాన్ని మనమేలా అనుకరించగలమా అనేది దీనిలోని చిక్కు. కాని క్రీస్తు మనలను అనుకరించమంది ఆ నిర్వాహకుని మోసాన్నిగాదు. అతని యుక్తినీ సత్వర కార్యాచరణాన్నీనీ. ఈ యర్థాన్ని తీసికొంటే దీనిలోని క్లిష్టార్థం తొలగిపోతుంది.

## 5. అవివేకియైన ధనికుడు - లూకా 12, 13-21

### 1. సందర్భం

ఓ కుటుంబంలోని అన్నదమ్ములు తండ్రి ఆస్తి విషయమై పోట్లాడుకొన్నారు. తమ్ముడు క్రీస్తుని రాజీ కుదర్చుమని కోరాడు. క్రీస్తు వాళ్ళ ఆస్తిపాస్తుల విషయంలో జోక్యం గలిగించుకోవడానికి నిరాకరించి ఈ క్రింది సామెతను చెప్పాడు.

## 2. వివరణం

ఓ ధనవంతుడు ఉండేవాడు. అతనికి బాగా పంటలు పండాయి. ధాన్యమంతా ఇల్లు చేరుకుంది. దాన్ని చూచి అతడు పొంగిపోయాడు. విస్తారమైన ఆ ధాన్యాన్ని నిల్వచేయడానికై క్రొత్త గిడ్డంగులు కట్టిద్దామనుకొన్నాడు. కొన్ని యేండ్లపాటు తన కబ్బిన సిరిసంపదలను అనుభవిస్తూ, తిని త్రాగి తందనాలాడుతూ హాయిగా కాలక్షేపం చేయవచ్చుగదా అనుకొన్నాడు. కాని భగవంతుడు ఆ రాత్రే అతనికి కలలో ప్రత్యక్షమై "ఓరీ అవివేకీ! నీకిక నూకలు చెల్లాయి. నేను నీకిచ్చిన ప్రాణాన్ని ఈ రాత్రే మళ్ళా తీసికొని పోతాను" అన్నాడు. అలా ఆ ధనవంతుడు గతించాడు. అతని సొత్తు ఇతరుల పాలైంది.

ఈ సామెతలోని ధనికుణ్ణి దేవుడు "అవివేకి" అని సంబోధించాడు. బైబుల్లో అవివేకి లేక బుద్ధిహీనుడు అంటే దేవుడున్నాడని నమ్మినా అతన్ని లెక్కచేయకుండా జీవించే వాడు. దేవుడు లేడో అన్నట్లు అతన్ని పట్టించుకోకుండా సుఖభోగాలతో కాలక్షేపం చేసేవాడు. ఇక్కడ ఈ ధనికుడు ధాన్యమూ గిడ్డంగులూ సుఖభోగాలూ వీటితోనే సతమతమౌతున్నాడు. దేవుణ్ణి పట్టించుకోవడంలేదు. ఈలాంటి వాళ్ళను భగవంతుడు కరుణించడు.

## 3. భావం

నరులు ధనవ్యామోహంలో చిక్కిపోగూడదు. కూడూ గుడ్డా ఇల్లూ వాకిలి ప్రధానంగాదు. దైవరాజ్యానికి సిద్ధం కావాలి. తండ్రినీ ఆ తండ్రి పంపిన క్రీస్తునీ నమ్మి దైవరాజ్యంలో చేరాలి. లేకపోతే తలవని తలంపుగా ఆశాభంగానికి గురౌతాం.

## 4. అన్వయం

కీర్తన 14,1 "బుద్ధిహీనులు దేవుడు లేడులే అని తలుస్తుంటారు" అని చెప్తుంది. ఇక్కడ బుద్ధిహీనులంటే నాస్తికులు కాదు. దేవుడు ఉన్నాడని నమ్మినా అతన్ని పట్టించుకోకుండా జీవించేవాళ్ళు. దేవుడు లేడో అన్నట్లు లోకవ్యవహారాల్లోనే మునిగి తేలుతుండేవాళ్ళు. ఇది ఓ రకమైన నాస్తికత్వం. ఈ దృష్టితో జూస్తే మనమందరమూ కొద్దిగానో గొప్పగానో నాస్తికులమే ఔతాం. పై ధనికుళ్ళాగ దేవుణ్ణి పట్టించుకోకుండా కేవలం కూడూ గుడ్డా మొదలైన లోకవ్యవహారాల్లోనే మునిగిపోవడం భావ్యంకాదు.

# 6. ధనికుడూ, లాజరూ - లూకా 16, 19-31

## 1. సందర్భం

క్రీస్తు ధనంమీద మనసు పెట్టుకోవద్దని బోధిస్తూంటే ధనాసక్తిపరులైన పరిసయులు అతన్ని ఎగతాళి చేసారు. 16,14. ఆ పరిసయులను ఉద్దేశించి క్రీస్తు ఈ సామెత చెప్పాడు.

## 2. వివరణం

ఇక్కడ రెండు సామెతలున్నాయి. మొదటి సామెత పరలోకంలో మన స్థితిగతులు తారుమారౌతాయి అని చెప్తుంది.ఇది 19 నుండి 23వ వచనం వరకు. రెండవ సామెత, సుఖభోగాలతోనే కాలం వెళ్ళబుచ్చగూడదని చెప్తుంది. ఇది 24 నుండి 31వ వచనం వరకు. సువిశేషాల్లో కొన్ని చోట్ల రెండు సామెతలు ఒకే సామెతగా కలసిపోయాయి.

మొదట తొలి సామెతను చూద్దాం. ఓ ధనవంతుడు పట్టుబట్టలు తాల్చి విందులూ వినోదాలతో మజాగా జీవిస్తుండేవాడు. అతని వాకిటనే ఓ బిచ్చగాడు పడివుండేవాడు. అతడు అవిటివాడు, చర్మవ్యాధితో బాధపడుతుండేవాడు. వాడు ధనవంతుని యింటికి వచ్చిపోతుండేవాళ్ళ వద్దనుండి కాణీ దమ్మిడీ అడుక్కొంటూ ఉండేవాడు. ఒక వైపు ధనవంతుడు మజాగా విందులారగిస్తూవుంటే మరోవైపు ఈ పేదవాడికి పిడికెడు కూడు గూడ కరువైపోయింది. ధనవంతుని బల్లవద్ద అతిథులు మస్తుగా భోజనంచేసి తమ వ్రేళ్ళకు చారు అంటుకోగా వాటిని రొట్టెముక్కల మీద తుడిచి ఆ ముక్కలనుబల్ల క్రింద పడవేసేవాళ్లు. లాజరు ఆ రొట్టెముక్కలు దొరికినాచాలు వాటితోనైనా కడుపు నింపుకొంటాననుకొన్నాడుగాని వాడికి అవికూడ కరవైపోయాయి. ఊరకుక్కలు వచ్చి ఆ యవిటివాని పుండ్లు నాకి పోతుండేవి. అతనికి వాటిని అదలించే శక్తికూడ లేదు.

ఈ కథలోని ధనవంతుడు ఏ మాత్రమూ ఆలోచన లేనివాడు, భోగి. తినడమూ త్రాగడమూ సుఖభోగాలు అనుభవించడమూ ఇంతే అతనికి తెలిసింది. అతనికి దేవుని పట్ల భయభక్తులులేవు. పేదసాదల యెడల కరుణలేదు. కాని లాజరు భగవంతుని నమ్ముకొని జీవించే నిరుపేద. ఇతని పేరునకు "దైవసహాయం" అని అర్థం. క్రీస్తు సామెతల్లో ఓ సొంత పేరంటూ ఉన్న పాత్ర ఇతడొక్కడే.

ఓ దినం ఈ యిద్దరూ చనిపోయారు. ధనికుణ్ణి ఆడంబరంతో వైభవంగా పాతిపెట్టారు. లాజరుని నిరాడంబరంగా పాతిపెట్టారు. కాని మరులోకంలో వాళ్ళ పరిస్థితులు తారుమారయ్యాయి. ఇక్కడ వైభవంగా జీవించిన ధనికుణ్ణి అక్కడ పాతాళంలో పాతిపెట్టారు. యూదులు నరకాన్ని పాతళ లోకంగా భావించారు. దానికి వాళ్ళ భాషలో "షెయోల్" అని పేరు. ఇది యెక్కడో భూగర్భంలో ఉంటుందని వాళ్ళ నమ్మకం. ఇక ఆ ధనికునికి వెలుగూలేదు, భగవద్దర్శనమూ లేదు. లాజరుని మాత్రం మోక్షంలో అబ్రాహామునకు కుడిప్రక్కన విందుబల్ల వద్ద కూర్చోబెట్టారు. ఇక్కడ లాజరు అబ్రాహాము రొమ్మున ఆనుకొన్నాడు లేక అతని ఒడిలో కూర్చున్నాడు అంటే అతని సరసన విందులో పాల్గొన్నాడు అని భావం. యూదులు మోక్షాన్ని విందుగా భావించేవాళ్లు. అనగా లాజరుకు మహానందదశా, ధనవంతునికి మహాకష్టదశా సిద్ధించాయని భావం.

క్రీస్తు నాడు యూదుల్లో ఓ కథ ప్రచారంలో ఉండేది. మాయన్ అనే ధనికుడూ, ఓ పేద ధర్మశాస్త్ర బోధకుడూ ఇద్దరూ ఒకేదినం చనిపోయారు. ధనికుణ్ణి వైభవంగా భూస్థాపనం చేసారు. పేదవాడైన ధర్మశాస్త్రవేత్తను నిరాడంబరంగా పాతిపెట్టారు. కాని తర్వాత ధర్మశాస్త్రవేత్త శిష్యుడొకడు తన గురువు మోక్షపదంలో సుఖాలనుభవిస్తున్నట్లూ, ధనవంతుడు స్వర్గానికి వెలుపల బాధల ననుభవిస్తున్నట్లూ దర్శనంలో చూచాడు. అనగా పరలోకంలో మన జీవితం తారుమారౌతుంది అని భావం. ఈ కథనే ఆధారంగా తీసికొని క్రీస్తు పై లాజరు ధనవంతుల కథను అల్లి ఉండవచ్చు. ఇంతవరకూ మొదటి సామెత.

ఇక, రెండవ సామెతను పరిశీలిద్దాం. ధనవంతుడు కష్ట దశలోవుండి భాగ్యదశలోవున్న లాజరువైపు పారజూచాడు. వాళ్ళిద్దరూ ఒకరినొకరు చూడగలరుగాని ఒకరితావులోకి ఒకరు పోలేరు. ధనవంతుని బాధలు అతని విపరీతమైన దప్పిక వల్లనే అర్థం చేసుకోవాలి. లాజరు ఉన్నకాడ చల్లని నీటి పాయలు పారుతున్నాయి. యూదులు స్వర్గాన్ని సెలయేరులు పారే ఉద్యానవనంగా భావించారు. కనుక లాజరు గోటికొనతో ఒక చల్లని నీటిబొట్టును తీసి తన నాలుకమీద వదలితేచాలు ధనవంతుడు బ్రతికిపోతాడు. ధనికుడు అబ్రాహాముని "తండ్రీ" అని సంబోధించి తనకు ఈ సహాయం చేయించవలసిందని బతిమాలాడు. ఈ యబ్రాహాము తన పుణ్యాలద్వారా స్వీయ జాతికి చెందినవారందరినీ మరులోకంలో కూడ ఆదుకొంటాడని యూదుల విశ్వాసం. అందుకే ఇక్కడ ధనికుడు అతన్ని పేరెత్తి పిలిచింది. అబ్రాహాము ధనికుణ్ణి సజాతీయుణ్ణిగా అంగీకరించి "కుమారా" అని ప్రతిసంబోధనం చేసాడు. కాని దైవశాసనాన్ని అబ్రాహాముకూడా మార్చలేడు. తిరుగులేని దైవశాసనమే ఇక్కడ దాటరాని అగాధం అని చెప్పబడింది. అక్కడ కష్టాలు అనుభవించినవాళ్ళు ఇక్కడ సుఖాలూ, అక్కడ సుఖాలు అనుభవించినవాళ్లు ఇక్కడ కష్టాలు అనుభవించాలి అన్నాడు అబ్రాహాము. అనగా ఇక్కడి పేదలందరూ మోక్షానికీ, ధనికులందరూ నరకానికీ వెళ్తారని భావంకాదు. ఈ లోకంలో నిర్దయతో ప్రవర్తించి భగవంతుని లెక్కచేయకుండా జీవించినవాళ్ళకు మరులోకంలో దండనా, ఇక్కడ భయభక్తులతో వినయంతో జీవించిన పేదలకు పరలోకంలో సంభావనా లభిస్తుందని భావం - అంతే.

ధనవంతుడు ఆశించినట్లుగా అబ్రాహాము సహాయం చేయలేక పోయాడు. అప్పుడతనికి ఇంకో తలంపు వచ్చింది. ఇంటివద్ద అతనికింకా ఐదుగురు సోదరులున్నారు. వాళ్ళూ అతనిలాగే ప్రాపంచిక జీవితం జీవించే భోగపరాయణులు. వాళ్లు కూడ తనవెంట ఈ నరకానికి రావడం తథ్యం. కనుక లాజరుని పంపి వాళ్ళకు బుద్ధి చెప్పించమని ధనవంతుడు అబ్రాహాముని కోరాడు. అనగా లాజరు ఏ కలలోనో కన్పించి తన తోబుట్టువులను మందలించాలని ధనవంతుని భావం. కాని మోషే, ప్రవక్తలూ

మొదలైనవాళ్ళ బోధలున్నాయికదా! వాటిని జ్ఞప్తికి తెచ్చుకొంటే నీ సోదరులకు పరివర్తనం కలుగుతుంది అన్నాడు అబ్రాహాము. పూర్వవేదంలో మోషే, ప్రవక్తలూ దయాదాక్షిణ్యాలనూ సాంఘిక న్యాయాన్నీ బోధించారు. ఇదే రచయితలు క్రీస్తు జీవిత సారాంశాన్ని గూడ ముందుగనే వర్ణించారు - లూకా 24, 27; 44. కాని ధనవంతుడు పై రచయితల బోధలు చాలవనీ, లాజరు ఉత్థానమై భూలోకానికి వెళ్తే సోదరులకు మనసు కరుగుతుందనీ వాదించాడు. అబ్రాహాము అతని వాదాన్ని ఖండిస్తూ పూర్వవేద బోధలను లక్ష్యపెట్టనివాళ్ళు ఒకడు ఉత్థానమై కన్పిస్తే మాత్రం అతని మందలింపులను అలిస్తారా అని ప్రశ్నించాడు.

క్రీస్తునాడు సద్దూకయులలో ధనవంతులైన నాయకులుండేవాళ్లు. వాళ్లు వర్తకులు, భూస్వాములు, ప్రభుత్వోద్యోగులు మొదలైనవాళ్లు. ఈ ధనిక నాయకులు సుఖభోగాల్లో మునిగి తేలుతూ దేవుణ్ణి విస్మరిస్తూండేవాళ్లు. పై ఐదుగురు సోదరులు ఈ ధనిక వర్గానికి సంకేతం.

ఇంకా, యూదులు చాలసార్లు క్రీస్తుని అద్భుతాలు చేయమని కోరారు. కాని క్రీస్తు వాళ్ళ కోరికను తీర్చలేదు. ప్రజలు కుతూహలంతో అడిగినందుకు అతడు ఒక్క అద్భుతంకూడ చేయలేదు. ఇక్కడ లాజరు ఉత్థానం కావడం ఓ అద్భుతం లాంటిది. విశ్వాసం లేనివాళ్ళకు అలాంటి అద్భుతాల వలన ఫలితంలేదని క్రీస్తు హృదయం. యథార్థంగా క్రీస్తు ఉత్థానమైనంక మాత్రం యూదులు అతని బోధలను అంగీకరించారా? మరి నిరుపేదయైన లాజరు ఉత్థానం మాత్రం ఏం ఫలితం సాధించి పెడుతుంది?

### 3. భావం

ఈ సామెతకు "ధనవంతుడు - లాజరు" అని పేరు. దీనిలో ముఖ్యభాగం మొదటిదిగాదు, రెండవది. అసలు లాజరు దీనిలో ప్రధానపాత్ర కానేకాదు. ఈ సామెతను "ఆర్గురు ధనిక సోదరులు" అని పిలవడం మేలు. కథానాయకులు వీళ్ళు. వీళ్ళంతా దేవుణ్ణి విస్మరించి సుఖభోగాల్లో మునిగి తేలేవాళ్ళు. ధనాన్ని నమ్ముకొన్నవాళ్ళు. ఈలాంటి వాళ్లు క్రీస్తుని అద్భుతాలు చేసి చూపమని అడుగుతూంటారు. కాని వీళ్ళకు ఉత్థానమంతటి అద్భుతాన్ని చూపించినా లాభంలేదు. అసలు మనం రక్షణం పొందేది దైవవాక్యాన్ని వినడంవల్లగాని అద్భుతాలను చూడ్డంవల్ల గాదు. కనుక ప్రాపంచిక జీవితం జీవించే ధనవంతులు, యూదనాయకులు, నిద్రమత్తు వదలుకొని క్రీస్తు బోధలు ఆలించాలి. సుఖభోగాలనూ సిరిసంపదలనూ నమ్ముకొంటే వాళ్ళు తప్పకుండా నాశమైపోతారు - ఇది ఈ సామెత భావం.

### 4. అన్వయం

జలప్రళయానికి ముందు భక్తితో జీవించినవాడు నోవా ఒక్కడే. తతిమ్మా జనమంతా తింటూ త్రాగుతూ పెండ్లిజేసికొంటూ సమస్త సుఖభోగాలూ అనుభవిస్తూ

కాలం వెళ్ళబుచ్చుతున్నారు. అప్పుడు నీటి వెల్లువవచ్చి తలవని తలంపుగా జనాన్నందరినీ ముంచివేసింది - మత్త 24, 38-39. ఆ ప్రజల్లాగే మనంకూడ వట్టి ప్రాపంచిక జీవితం జీవించకూడదు. డబ్బు దానంతట అద చెడ్డదికాదు. కాని డబ్బు కూడబెట్టుకోవడమూ సుఖభోగాలు అనుభవించడమూ మాత్రమే జీవిత పరమావధి అనుకోగూడదు. అవి నరుణ్ణి మోసగిస్తాయి. పైగా ధనరీత్యా భాగ్యవంతులైయుండి దేవుని దృష్టిలో భాగ్యవంతులు కాకపోతే ఏమి లాభం? -12, 21. కనుక అవకాశ ముండగనే మెస్సీయా ప్రభువుని అంగీకరించాలి. అతని బోధలను పాటించి జీవితం ధన్యం చేసికోవాలి.

## 7. ముఖ్యాసనాలు -లూకా 14, 7-11

### 1. సందర్భం

యూదులకు తరచుగా విందులు జరుపుకొనే ఆచారం ఉంది. క్రీస్తు కూడా అప్పుడప్పుడు ఈ విందులకు వెళ్తుండే వాడు. అలా వెళ్ళినప్పుడు అతడు యూదనాయకుల్లో ఓ దుర్గుణం చూచాడు. వాళ్ళు విందుల్లో ముఖ్యాసనాల కోసం ఎగబడేవాళ్ళు - లూకా 11, 43. ఈ దురభ్యాసాన్ని మనసులో పెట్టుకొని ప్రభువు ఈ సామెత చెప్పాడు.

### 2. భావం

ఈ సామెత, విశేషంగా "తన్నుతాను తగ్గించుకొనే వాడు" అనే 11వ వచనం, వినయాన్ని బోధిస్తున్నట్లుగా కన్పిస్తుంది. కాని ఇందలి ప్రధాన భావం ఇది కాదు. యూదులు స్వర్గాన్నీ దైవరాజ్యాన్నీ విందుతో పోల్చేవాళ్ళు. ఈ దైవరాజ్యం అనే విందుకు మనలను ఆహ్వానించేవాడు ప్రభువే. మన జీవితం ఆ యాహ్వానాన్ని అందుకోవడానికి తగినట్లుగా ఉండాలి. మనం మెస్సియాను అతని బోధలను అంగీకరించి అతడు సిద్ధంచేసే విందులో పాల్గొనాలి. అంటే దైవరాజ్యంలో ప్రవేశించడానికి సిద్ధంగా ఉండాలి - ఇది ఈ సామెత భావం. తర్వాత దీనికి వినయం అనే అర్థం వచ్చేలా 11వ వచనం చేర్చారు. కాని ఈ 11వ వచనం ఇంకా ఇతర సందర్భాల్లో కూడ కన్పిస్తుంది - లూకా 18,14.మత్త 18,4.

### 3. అన్వయం

దైవరాజ్యంలో చేరాలి అంటే మన చేతగానితనాన్ని గుర్తించి ఓ చిన్నబిడ్డలాగ ఆ ప్రభువు మీద ఆధారపడాలి. అతడు ప్రసాదించే రక్షణాన్ని ఆశతో స్వీకరించాలి. ఇలాంటి వినయాత్ములను ఆ ప్రభువు తప్పక కరుణిస్తాడు. అతడు అధిపతులను ఆసనాలమీదినుండి క్రిందికి పడద్రోసేవాడూ, దీనులను దుమ్ములోనుండి పైకి లేవనెత్తేవాడూను- లూకా 1, 52.

# 8. కాపుపట్టని అంజూరం - లూకా 13, 6-9

## 1. సందర్భం

నరులకు ఎప్పటికప్పుడు హృదయ పరివర్తనం అవసరం. పరివర్తనం చెందనివాళ్ళు నాశమైపోతారు అనడానికి నిదర్శనంగా ప్రభువు ఈ ఉపమానం చెప్పాడు - 13,5.

## 2. వివరణం

యూదులు ద్రాక్షతోటల్లో పండ్ల చెట్లు కూడ నాటేవాళ్ళు. ఇవి ద్రాక్షలకు నీడనిచ్చేవి. మొక్కను నాటిన మూడేండ్ల దాకా అత్తిచెట్టు పండ్లు తినకూడదు. నాల్గవ యేడు దాని పండ్లు దేవునికి అర్పించాలి. ఐదవయేడు వాటిని భుజించవచ్చు - లేవీ 19, 23. కాని ఈ సామెతలోని యంజూరం ఆరెండ్లయినా కాయలు కాయలేదు. ఇక కాస్తుందనే ఆశ కూడ లేదు. పైగా అత్తిమ్రాను పొదలాగ గుబురుగా ఎదిగి భూమిలోని తేమనూ సారాన్ని లాగివేస్తుంది. దాని చుట్టూ వున్న ద్రాక్షలు అవిసిపోతాయి. కనుక దాన్ని నరికివేయడమే ఉచితం అనుకొన్నాడు తోటకాపు. యూదులు మామాలుగా పండ్ల చెట్లకు ఎరువు వేసేవాళ్లు కాదు. ఇక్కడ ఈ తోటమాలి ఈ యంజూరానికి ఎరువు వేస్తానన్నాడంటే అతడేదో అసాధారణమైన కార్యం చేయబూనినట్లే భావించాలి. యజమానుడు మాత్రం ఆ వెర్రి చెట్టుకు ఇంకొక యేడు గడువిచ్చాడు. మరో ఏడాది పాటు చూచి దాన్ని నరికివేద్దామనుకొన్నాడు.

## 3. భావం

పూర్వవేద రక్షణచరిత్రలో మెస్సియాకాలం కడపటిది. ఈ చివరి గడియల్లో క్రీస్తే స్వయంగా వచ్చి బోధిస్తూన్నాడు. పరివర్తనం చెంది దైవరాజ్యంలో చేరమని యూదులను ఆహ్వానిస్తున్నాడు. తన బోధను అంగీకరించక పోతే వాళ్లు సర్వనాశనమై పోతారని హెచ్చరిస్తున్నాడు. కాని వాళ్లు అతని బోధను లక్ష్యం చేయడం లేదు. ఆ వెర్రి అంజూరం లాగే వాళ్లూ పరివర్తనం అనే పండ్లు కాయడం లేదు. దానికి ఒక యేడాది గడువు లభించింది. వీళ్ళను కూడ పరలోక ప్రభువు ఇంకా కొద్దిరోజుల పాటు సహించి ఊరుకుంటాడు. తర్వాత వీళ్లు దైవకోపాగ్నికి గురౌతారు.

## 4. అన్వయం

ఈ కథలోని తోటమాలి ఒక విధంగా క్రీస్తుని సూచిస్తాడు. అతడు ఆ చెట్టు తరపున తోట యజమానుని మనవి చేసినట్లే ప్రభువు తన తరపున పరలోకంలోని తండ్రిని మనవి చేస్తూంటాడు - హెబ్రే 7,25. కాని మన తరపున మనం ఆ దేవుణ్ణి

విసిగించకూడదు. దేవుని సహనానికి కూడ హద్దులుంటాయి. కనుక మన హృదయ వృక్షం మీద ఎప్పటికప్పుడు పశ్చాత్తాపం అనే పండ్లు ఫలిస్తూండాలి. హృదయ పరివర్తనం లేనివాళ్ళకు గతులు లేవు.

## 9. మూసిన ద్వారం - లూకా 12, 24-30

### 1. వివరణం

ఓ గృహస్థు విందు చేసి అతిథులను ఆహ్వానించాడు. కాని కొందరు సకాలంలో విందుకు వెళ్ళలేదు. సోమరితనం వల్ల ఆలస్యంగా వెళ్ళారు. వాళ్ళు వెళ్ళేప్పటికే యజమానుడు తలుపు మూయించాడు. ఆలస్యంగా వచ్చినవాళ్ళు ఎంత మొత్తుకొన్నా అతడు తలుపు తీయలేదు. అబ్రాహాము మొదలైన పుణ్యపురుషులూ, అన్యజాతివాళ్ళూ కూడి అక్కడ హాయిగా విందారగిస్తున్నారు. వాళ్ళను చూచి ఈ యాలస్యంగా వచ్చినవాళ్ళు చిన్నబోయారు. ఐనా ఏమి లాభం? యజమానుడు వాళ్ళను వీధిలోకి గెంటించాడు.

### 2. భావం

యూదులు స్వర్గాన్ని లేక దైవరాజ్యాన్ని విందుగా భావించేవాళ్ళు అని చెప్పాం. క్రీస్తు ఎంతగా బతిమాలినా యూదులు అతని బోధలను ఆలించడం లేదు. దైవరాజ్యంలో చేరడం లేదు. కనుక పరలోకపు తండ్రి వాళ్ళను తన రాజ్యం నుండి గెంటివేస్తాడు. ఆ దుర్దశ రాకముందే, ఇప్పుడు వాళ్ళు ప్రభువు బోధలను ఆలిస్తే బ్రతికిపోతారు. కనుక క్రీస్తునీ అతని బోధలనూ అంగీకరించడంలో జాప్యం తగదని ఈ సామెత భావం.

### 3. అన్వయం

మనం తరచుగా ఇద్దరు యజమానులను సేవిస్తూంటాం. వాళ్ళు సృష్టికర్తా, సృష్టివస్తువులునూ. సృష్టివస్తు వ్యామోహంలో పడి సృష్టికర్తను అంగీకరించడంలో జాప్యం చేస్తూంటాం. భక్తుడైనవాడు ఏకైక దృష్టితో ఒకే యజమానుణ్ణి, అనగా దేవుణ్ణి మాత్రమే సేవించాలి - మత్త 6,24.

## 10. చిన్నపిల్లల విమర్శలు - మత్త 11,16-19

### 1. వివరణం

స్నాపక యోహాను కఠోర నియమాలతో జీవిస్తున్నాడు. కాని యూదులు అతని జీవిత విధానాన్ని మెచ్చుకోలేదు. అతనికి దయ్యం పట్టిందని హేళన చేసారు. క్రీస్తు విందుల్లో వినోదాల్లో పాల్గొంటున్నాడు. కాని అతని ఉల్లాస జీవితం కూడ యూదులకు నచ్చలేదు. అతడు తిండిపోతు అని నిందించారు. కనుక యూదులకు కఠిన జీవితమూ

నచ్చదు, ఉల్లాస జీవితమూ నచ్చదు. ఏదో నెపంతో వాళ్ళు స్నాపక యోహానునీ క్రీస్తునీ కూడ విమర్శిస్తున్నారు. వాళ్ళ విమర్శ చిన్న పిల్లల విమర్శలాగా అర్థరహితంగా ఉంది.

మగపిల్లల జట్టూ ఆడపిల్లల జట్టూ సంత వీధిలో ఆడుకొంటూ ఒకరినొకరు విమర్శించుకొంటున్నారు. మగపిల్లలు "మేము పిల్లన గ్రోవి ఊదితే మీరు నాట్యం చేయడం లేదు. ఆట చెడగొట్టివేసారు" అని ఆడపిల్లలను నిందిస్తున్నారు. అలాగే ఆడపిల్లలూ "మేము విలాపాలు ప్రారంభిస్తే మీరు రొమ్ము బాదుకోలేదు, ఆట చెడగొట్టారు" అని మగపిల్లలను నిందిస్తున్నారు. ఈ చిన్నపిల్లల్లాగే యూద నాయకులు గూడ అర్థరహితంగా యోహానునీ క్రీస్తునీ దూయబడుతున్నారు. వాళ్లు దేవుడు పంపిన బోధకుల బోధలు వినేదీలేదు, పశ్చాత్తాపపడేదీ లేదు. విజ్ఞానవంతుడైన దేవుడు తాను మెస్సియ ద్వారా చేసే అద్భుతాలను చూచైనా దైవరాజ్యం సమీపించిందని ప్రజలు ఎందుకు గుర్తించగూడదు? ఈ వృథా విమర్శల వల్ల ఏమి ఫలితం? ఇది సామెత భావం.

**2. అన్వయం**

మనకు ఇష్టం కానప్పుడు ఏదో నెపం పెట్టి ఇతరులను ఖండిస్తూంటాం. కాని ఇది పద్ధతి కాదు. మన హృదయాన్ని సరిదిద్దుకోవాలి. మన లోపాలను సవరించుకోవాలి. ఇతరులను తిడితే లాభం లేదు.

## 11. ఉపమాన వాక్యాలు

పైన పేర్కొన్నవన్నీ విస్తృతి చెందిన పెద్ద సామెతలు. ఇవికాక కేవలం ఉపమాన వాక్యాలు కూడ కొన్ని ఈ వర్గం సామెతల్లో ఉన్నాయి. ఇవి పైవాటిలాగ విస్తృతి చెందలేదు. ఐనా ఇవి కూడ సామెతలే. ప్రస్తుతానికి వీటిల్లో కొన్నింటిని మాత్రం పరిశీలిద్దాం.

1. పండ్లను బట్టి చెట్టును గుర్తించాలి - మత్త 7,16-20. ఉమ్మెత్తకాయలు కాస్తే అది వెధవచెట్టు. మామిడికాయలు కాస్తే అది మంచి చెట్టు. అలాగే నరులు చేసే పనులను బట్టి వాళ్ళెలాంటివాళ్ళో తెలిసికోవచ్చు. అందరూ మాటలు తీయగానే చెప్తారు. చేతల వల్ల గాని మన సారం తెలియదు.

2. వాతావరణ చిహ్నాలు కాలగతులను తెలియజేస్తాయి. పడమట మబ్బులేస్తే వాన వస్తుందని గుర్తు. దక్షిణం నుండి గాలివీస్తే వడగాలి వస్తుందని గుర్తు. అలాగే మెస్సియా చేసే అద్భుతాలను బట్టే మెస్సియా కాలం ఆసన్న మైందని గుర్తించాలి. కాని యూదనాయకులు అలా గుర్తించడం లేదు - లూకా 12,54-56.

3. యూదనాయకులు గ్రుడ్డివాళ్లు. గ్రుడ్డివాడు గ్రుడ్డివాణ్ణి నడిపిస్తే ఇద్దరూ గోతిలో పడతారు. అలాగే యూదనాయకులు కూడ తాము క్రీస్తుని అంగీకరింపనూ

అంగీకరింపరు, ప్రజలనూ అంగీకరింపనీయరు. వాళ్ళు తమతో పాటు ప్రజలను కూడ పెడత్రోవ పట్టిస్తున్నారు - మత్త 15,14.

4. తల్లిపక్షి రెక్కలు విప్పి తన పిల్లల మీద చాస్తుంది. శత్రుపక్షుల నుండి వాటిని కాపాడుతుంది. అలాగే మెస్సియా కూడ యూదప్రజలను కాపాడాలని కోరుకొంటున్నాడు. కాని వాళ్ళకు పోగాలం వచ్చి అతని మాట వినడం లేదు - మత్త 23,37.

5. మనలో పెద్ద లోపాలే ఉంటాయి. కాని వాటిని గమనించం. ఇతరుల లోపాలను వ్రేలెత్తి చూపబోతాం. ఇదేలా వుందంటే మన కంటిలోని దూలాన్ని గమనించకుండా ఎదుటివాడి కంటిలోని నలుసును గమనించినట్లుగా ఉంది. తప్పులెన్నువారు తమ తప్పు లెరుగరు గదా! యూద నాయకులు ప్రవర్తనం ఈలా వుంది - మత్త 7,3-5.

6. మనం ఏదో తప్పు చేస్తాం. కనుక ఇతరులు మన మీద వ్యాజ్యెం తెచ్చారు. అలాంటప్పుడు మనం శత్రువులతో వెంటనే రాజీ పడాలి. లేకపోతే కష్టాల పాలౌతాం. అలాగే ఇప్పుడు మెస్సియా వచ్చి బోధిస్తున్నాడు. అతని బోధలను వెంటనే ఆలించి పరివర్తనం చెందాలి. లేకపోతే యూదులు నాశమైపోతారు - మత్త 5,25-26.

7. పూర్వం నీనివే ప్రజలు దుష్టజీవితం జీవిస్తూంటే యోనాప్రవక్త వెళ్ళి పశ్చాత్తాపపడమని బోధించాడు. అతని బోధలు ఆలించి వాళ్ళు పశ్చాత్తాపపడ్డారు. రక్షణం పొందారు. అలాగే క్రీస్తు కూడ ఇప్పుడు ఓ యోనాలాగ బోధిస్తున్నాడు. కాని యూదులు మాత్రం ఈ ప్రవక్త బోధలను పెడచెవిని పెడుతున్నారు. మరి వీళ్ళకు రక్షణం ఏలా లభిస్తుంది? - మత్త 12, 38-41.

# 5. వేచి వుండాలి అని చెప్పే సామెతలు

క్రీస్తు సామెతల్లో కొన్ని వేచివుండాలి అనే భావాన్ని సూచిస్తాయి. దేనికోసం వేచివుండాలి? మొదటి శతాబ్దం లోని క్రైస్తవులు తమ కాలంలోనే క్రీస్తు మళ్ళా రెండవ మారు విజయం చేస్తాడని నమ్మారు. పౌలు కూడ తన జీవిత కాలంలోనే రెండవరాకడ జరుగుతుందని విశ్వసించాడు. కనుక క్రైస్తవ భక్తులు ఈ రెండవ రాకడ కొరకు భక్తి భావంతో వేచివుండాలి అనుకొన్నారు. ఈ భావాన్ని సూచించే సామెతలు ఎన్మిది దాకా ఉన్నాయి.

ఇవన్నీ కూడ మొదట క్రీస్తు యూదులకు చెప్పినప్పుడు "త్వరపడాలి" అనే వర్గానికి చెందిన సామెతలే. మెస్సియా కాలం వచ్చింది. దైవరాజ్యం ఆసన్నమయింది.

తండ్రి ప్రజలకు తీర్పు తీర్చబోతున్నాడు. కనుక యూదులు వెంటనే పరివర్తనం చెంది మెస్సియాను అంగీకరించాలి. లేకపోతే దేవుడు కఠినశిక్ష విధిస్తాడు – ఈలాంటి భావాలతో క్రీస్తు మొదట యూదులకు ఈ సామెతలు విన్పించాడు. ప్రభువు ఉత్థానానంతరం ఓ పాతిక యేండ్ల తర్వాత సువిశేష కారులు ఈ సామెతలను సువార్తల్లో లిఖించారు. ఈ గ్రంథాలు విశేషంగా క్రైస్తవుల కోసం. కనుక ఈ సామెతలను గూడ క్రైస్తవులకు అన్వయించేలాగ మార్చవలసి వచ్చింది. అప్పటి క్రైస్తవుల నమ్మిక, ప్రభువు వెంటనే రెండవమారు విజయం చేస్తాడని. అందుచేత సువిశేషకారులు ఈ వర్గం సామెతలన్నిటినీ ప్రభువు రెండవ రాకడకు వేచివుండాలి అనే భావం వచ్చేలాగ మార్చివేసారు.

ఈ మార్పు కేవలం సువిశేషకారులు చేసింది కాదు. పరిశుద్ధాత్మచే ప్రబోధితమై ఆనాటి క్రైస్తవ సమాజమే ఈ మార్పు చేసింది. సువిశేషకారులు ఈ సమాజానికి ప్రతినిధులు మాత్రమే. ఇక ఈ వర్గం సామెతలను పరిశీలిద్దాం.

## 1. అకస్మాత్తుగా వచ్చే దొంగ – మత్త 24, 43-44

### 1. వివరణం

దొంగ ఎప్పుడు వచ్చేది తెలిస్తే ఇంటి యజమానుడు నిద్రించడు, మేల్కొని ఉంటాడు. కాని దొంగ మనం ఏమరచి ఉన్నప్పుడు వస్తాడు. అలాగే మెస్సియా కూడ తలవని తలంపుగా రెండవమారు విజయం చేస్తాడు. కనుక భక్తులు ఏమరుపాటు లేక అతని కోసం వేచివుండాలి.

### 2. అన్వయం

దర్శన గ్రంథం 3, 3లో ప్రభువు "నేను దొంగలాగ వస్తాను. నేను ఎప్పుడు వచ్చేది మీరు ఊహించనైనా ఊహించలేరు" అంటాడు. కనుక మన మెప్పుడూ నిర్మల హృదయంతో ప్రభువు రాకడకు సిద్ధమై యుండాలి.

## 2. మేల్కొనివుండే సేవకులు – లూకా 12, 35-38

ఒక యజమానుడు బయటికి వెళ్ళి పొద్దుపోయాక ఆలస్యంగా తిరిగి వచ్చాడు. అతడు వచ్చేవరకు సేవకులు నిద్రపోకుండా జాగ్రత్తగా కాచుకొని ఉన్నారు. వీళ్ళ విశ్వాసాన్ని చూచి యజమానుడు ఎంతో సంతోషించాడు. తానే ఒక పరిచారకుల్లాగా వాళ్ళకు వడ్డన చేసాడు. ఈ సేవకుల్లాగే మనం కూడ ప్రభువు కోసం వేచివుండాలని భావం. ఇదే సామెత కొలది మార్పులతో మార్కు 13, 33-37లో కూడ కన్పిస్తుంది.

## 3. అధికారము గల సేవకుడు - మత్త 24, 45-51

### 1. వివరణం

ఓ యజమానుడు తన సేవలకుందరి మీద ఓ ప్రధాన సేవకుణ్ణి అధికారిగా నియమించి వెళ్ళిపోయాడు. అతడు ఎక్కడికో వెళ్ళి కొంత కాలమయ్యాక తిరిగివచ్చాడు. అలా వచ్చినపుడు అధికారంలో వున్న సేవకుడు యోగ్యంగా ప్రవర్తించి వుంటే అతనికి సంభావనం లభిస్తుంది. అతడు అయోగ్యంగా ప్రవర్తించి తన క్రింది సేవకులను బాధించి వుంటే, శిక్ష పడుతుంది.

### 2. భావం

క్రైస్తవ సమాజంలో అధికారంలో ఉన్నవాళ్ళు మరీ జాగ్రత్తగా మెలగాలి. ప్రభువు ఎప్పుడు వస్తాడో మనకు తెలియదు. కాని అతడు వచ్చినపుడు అధికారులు తమ అధికారాన్ని దుర్వినియోగం చేస్తున్నట్లయితే వాళ్ళకు కఠినశిక్ష ప్రాప్తిస్తుంది.

### 3. అన్వయం

కాపరులు మందకోసం గాని మంద కాపరుల కోసం గాదు. అందుచేత క్రైస్తవ సమాజంలో పెద్దలూ అధికారులూ ఐనవాళ్లు క్రైస్తవ ప్రజల శ్రేయస్సు కోసం పాటుపడాలి. అంతేగాని ప్రజల నుండి మాకేమి లాభం కలుగుతుందా అన్నట్లు ప్రవర్తించగూడదు.

## 4. పదిమంది కన్యలు - మత్త 25, 1-13

### 1. వివరణం

యూదుల పెండ్లి రాత్రిపూట జరిగేది. రాత్రి ప్రొద్దు పోయినంక వరుడు మిత్రులతో వధువు ఇంటికి వెళ్తాడు. అక్కడివాళ్ళంతా వరుణ్ణి ఆహ్వానిస్తారు. అతడు దివిటీలతో మేళతాళాలతో వధువుని తన యింటికి తీసికొని వస్తాడు. తన యింటనే ఆమెను రాత్రిలో పెండ్లాడతాడు.

ఈ సామెతలో పదిమంది కన్నెలు వధువు పుట్టినింటిలో వేచివున్నట్లుగా భావించుకోవాలి. వాళ్లు వధువుని వరుని పుట్టినింటికి తీసికొని వెళ్ళాలి. వారి చేతుల్లోనివి దీపాలు గాదు, కాగడాలు. ఇవి ఒకసారి నూనెపోస్తే ఇంచుమించు పదిహేను నిమిషాలపాటు వెలిగేవి.

వరుడు వధువుని తీసుకపోవడానికి ఇంకా రాలేదు. ఆలస్యం చేసాడు. జాగు దేనికంటే వరుని తరపువాళ్లు వధువుకీ ఆమె బంధువులకీ కానుకలూ కట్నాలూ ఇచ్చుకోవాలి. ఏమేమి కానుకలీయాలి అనే సమస్య అంత సులభంగా తెమలేది కాదు. కనుక యూదుల

పెండ్లిండ్లు రాత్రి ప్రొద్దు పోయిందాకా వాదవివాదాలతో సాగిపోతుండేవి. ఈ కథలో గూడ ఈలాంటి పరిస్థితినే ఊహించుకోవాలి.

సరే, వరుడు వధువు ఇంటికి రావడంలో ఆలస్యం జరిగింది. కనుక ఆ పదిమంది యువతులూ దివిటీలు ఆర్పి ప్రక్కనబెట్టి కాస్త కన్ను మూసి కునికిపాట్లు పడుతూన్నారు. అప్పుడు అర్ధరాత్రిలో అకస్మాత్తుగా పెండ్లి కుమారుడు వస్తున్నాడనే కేకలు విన్పించాయి. యువతులంతా అతనిని ఎదుర్కొని స్వాగతం చెప్పడానికి వెళ్ళారు. కాని వాళ్ళల్లో ఐదుగురు నూనెబుడ్లతో రాలేదు. ఆ రోజుల్లో దివిటీలు పట్టుకొనేవాళ్ళు నూనెను కూడ చిన్న కూజాల్లో తెచ్చుకొనేవాళ్ళు. ప్రతి పదిహేను నిమిషాల కొకసారి దివిటీల మీద చమురు పోసేవాళ్ళు.

చమురు కూజాలు లేకుండా వచ్చిన కన్నెలు చివరి గడియల్లో నూనె కోసం గాబరాపడ్డారు. తోడి యువతులను అడిగారు. కాని ఫలితం లేకపోయింది. కనుక కంగారుతో అంగడికి పరుగెత్తారు. కాని అంతలోనే పెండ్లి కుమారుడు వచ్చాడు. నూనె ఉన్న ఐదుగురు కన్నెలూ తమ దివిటీలు వెలిగించుకొని ఎదురు వెళ్ళి అతనికి స్వాగతం పలికారు. పెండ్లి కుమారుణ్ణి అతని వధువునీ అనుసరించి వరుని యింటికి వెళ్ళారు. అక్కడ పెండ్లి జరుగుతూంది.

కొంచెం సేపయ్యాక మందమతులైన కన్నెలు గూడ అంగడిలో నూనె కొనుక్కొని, దివిటీలు వెలిగించుకొని పెండ్లి కుమారుని యింటికి వచ్చి చేరారు. ఆ యింటి తలుపు తట్టారు. కాని అప్పటికే వివాహశాలను మూసివేసారు. కనుక వాళ్ళకు ప్రవేశం లభించలేదు. పెండ్లి కుమారుడు కూడ మీతో నాకు ఏమీ సంబంధం లేదు పొండని వాళ్ళకు ప్రవేశం నిరాకరించాడు.

## 2. భావం

ఇక్కడ ఈ యైదుగురు మందమతులైన కన్నెల తప్పు నిద్రపోవడం గాదు. వివేకవతులైన కన్నెలు గూడ నిద్రపోయారు గదా! మరి మిగులునూనె లేకుండా రావడం వీళ్ళ తప్పు. ఈ కన్నెల్లాగాకుండా క్రైస్తవ శిష్యులు ప్రభువు రెండవ రాకడకు సిద్ధంగా ఉండాలి. ఆ ప్రభువు ఎప్పుడు విజయం చేస్తాడో మనకు తెలియదు. అతడు ఎప్పుడో హఠాత్తుగా వస్తాడు. అలాంటి రాకడకు మనం తయారుగా ఉండాలి – ఇది భావం.

క్రీస్తునాడు క్రైస్తవులు లేరు. అతడు మొదట సామెతలను విన్పించింది క్రైస్తవులకు గాదు, యూదులకు. కనుక మొదట ఈ సామెత చెప్పినప్పుడు క్రీస్తు ఉద్దేశించిన భావం ఇది. పరలోక ప్రభువు అకస్మాత్తుగా తీర్పు తీరుస్తాడు. కనుక యూదులు ఆ తీర్పునకు సిద్ధం కావాలి. మెస్సీయా బోధలను అంగీకరించి రక్షణం పొందాలి. ఈలాంటి భావాలు గల సామెతను తరువాత ఓ పాతికేళ్ళకు సువిశేషకారుడు గ్రంథస్థం చేసినపుడు అతని శ్రోతలు యూదులుగాదు, క్రైస్తవులు. కనుక అతడు క్రీస్తు మొదట ఉద్దేశించిన అర్థాన్ని

కొద్దిగా మార్చి క్రైస్తవులకు అన్వయించే అర్థాన్ని చేర్చాడు. క్రైస్తవ భక్తులు రెండ రాకడకు సిద్ధంగా ఉండాలని సూచించాడు. చాల సామెతల్లో ఈలాంటి మార్పులు జరిగాయని ముందే చెప్పాం.

### 3. అన్వయం

ప్రభువు రెండవ రాకడ లోకాంతంలో జరుగుతుంది. కాని లోకాంతం వరకు మనమంతా బ్రతికివుండం. అలాంటప్పుడు మనకు రెండవ రాకడతో సంబంధం ఏమిటి? ఎవరి మరణమే వారికి రెండవ రాకడ ఔతుంది. మరణించగానే మనం ప్రభువుని కలిసికొంటాం గదా! ఆ కలయికే మనకు రెండవ రాకడగా పరిణమిస్తుంది. ఇక, ఈ మరణమనేది ఎప్పుడు వస్తుందో మనకు తెలియదు. కనుక మనం సిద్ధంగా ఉండాలి. ప్రభువు రాకడకు రోజురోజు పూర్తిగా తయారై యుండాలి.

## 5. ముగ్గురు సేవకులు - మత్త 25, 14-30

### 1. వివరణం

ఓ యజమానునికి ముగ్గురు సేవకులు ఉండేవాళ్ళు. ఇద్దరు జాగ్రత్తగా మెలిగేవాళ్ళు, ఒకడు సోమరిపోతూను. యజమానుడు దూరదేశం వెళ్తూ ఒకడికి ఐదు లక్షలూ, ఒకడికి రెండు లక్షలూ, ఒకడికి ఒక లక్షా మూలధనం ఇచ్చిపోయాడు. అతినికి తన మూలధనం మీద ఆదాయం సేకరించాలనే కోరికా ఉంది. సేవకులను పరీక్షించాలనే ఉద్దేశమూ ఉంది.

సరే, మొదటి సేవకుడు ఐదు లక్షలతో వ్యాపారం చేసి పది లక్షలు గడించాడు. అలాగే రెండోవాడు కూడ తన డబ్బును ఇబ్బడి చేసాడు. యజమానుడు తిరిగివచ్చి లెక్కలు చూచి వాళ్ళిద్దరినీ మెచ్చుకొన్నాడు. ఇద్దరినీ బహూకరించి వాళ్ళకు పెద్ద ఉద్యోగాలు ఒప్పజెప్పాడు.

కాని ఈ కథలో ముఖ్యమైనవాడు మూడవ సేవకుడు. ఇతడు కష్టపడి పనిచేయడానికి ఒప్పుకోని సోమరిపోతు. కనుక ధనాన్ని పదిలంగా నేలలో పాతిపెట్టాడు. భద్రంగా ఉంచగోరిన డబ్బును భూమిలో పాతిపెట్టడం పూర్వకాలపు పాలస్తీనా ప్రజల ఆచారం. యజమానుడు ఈ మూడవవాణ్ణి కూడ లెక్క అడిగాడు. అతని సాకులు ఉండనే ఉన్నాయి. యజమానుడు చండశాసనుడనీ, వ్యాపారంలో నష్టం వస్తే తన కుత్తిక పట్టుకొంటాడేమోనని దడిసి ఆ సొమ్ము భద్రంగా ఉంచాననీ సాకులు చెప్పి తప్పుకోజూచాడు. కాని యజమానుడు అతన్ని క్షమించలేదు. ఆ సొమ్మును వడ్డీకి ఇచ్చినాగాని కొంత ఆదాయం వచ్చేది గదా! ఇతడు ఆపాటి తేలిక పనికి గూడ పూనుకోలేదు. కనుకనే ఇతడు శిక్ష పొందాడు.

## 2. భావం

యజమానుని ధనాన్ని నిరర్థకంగా ఉంచివేసిన ఈ మూడవ సేవకుడు ఎవరు? క్రీస్తు ఈ సామెతను చెప్పినప్పుడు యూద నాయకులను మనస్సులో ఉంచుకొని మాట్లాడాడు. పరలోకంలోని తండ్రి ఆ నాయకులకు మోషే ధర్మశాస్త్రాన్ని ప్రసాదించాడు. అది దేవుని వాక్కు. దేవుని సందేశం. కాని యూదనాయకులు దుష్టులై ఆ సందేశాన్ని ప్రజలకు అందీయడం లేదు. దాన్ని వ్యర్థం చేస్తూన్నారు. కనుక వాళ్ళు ఈ సోమరిపోతులాగే శిక్షకు పాత్రులౌతారు. ఇది క్రీస్తు ఉద్దేశించిన భావం.

ఈ సామెతను మత్తయి లిఖించినపుడు అతడు దీన్ని ఆనాటి క్రైస్తవ సమాజానికి అన్వయింపజేసాడు. కనుక దీనిలో కొలదిగా మార్పు వచ్చింది. క్రైస్తవ నాయకులు దైవవాక్కును ప్రజలకు విన్పించకుండా సోమరులై పోతున్నారు. ఆ యజమానుళ్ళాగే ప్రభువు కూడ మళ్ళా రెండవ మారు విజయం చేస్తాడు. లెక్క అడుగుతాడు. అప్పుడు సోమరిపోతులైన నాయకులు శిక్షకు గురౌతారు. కనుక నాయకులు సరిగా వేదబోధ చేస్తూ ప్రభువు రాకడకు సిద్ధంగా ఉండాలి - ఇది సువిశేషకారుడు ఉద్దేశించిన భావం.

## 3. అన్వయం

ప్రభువు మన కందరికీ ఏవో కొన్ని శక్తిసామర్థ్యాలు ఇస్తూంటాడు. కొందరికి ఎక్కువా కొందరికి తక్కువా ఉంటాయి గాని, శక్తిసామర్థ్యాలేమో అందరికి ఉంటాయి. మనం వీటిని సద్వినియోగం చేసికోవాలి. సోమరితనంగా ఉండిపోతే ప్రభు శిక్షకు పాత్రులమౌతాం. కష్టపడి పనిచేసేవాడు దేవుని యెదుటా నరుల యెదుటా కూడ మన్నన పొందుతాడు. ఈ దృష్టితో చూస్తే క్రీస్తు చెప్పిన అతిశ్రేష్ఠమైన సామెతల్లో ఇదీ వొకటి అనాలి. మన యువతకు నాయక లక్షణాలను బోధించడానికి ఇది చక్కగా ఉపయోగపడుతుంది.

# 6. రాజ్యం సంపాదించుకోగోరినవాడు - లూకా 19, 12-27.

## 1. సందర్భం

పై ముగ్గురు సేవకుల సామెతనే లూకా కొంచెం మార్పులతో చెప్పాడు. ఈ మార్పు ఎందుకు వచ్చిందంటే అతడు రెండు వేరువేరు సామెతలను ఒక్కటిగా కలిపివేసాడు. కొన్ని సామెతల్లో ఈలా జరిగింది. పై ముగ్గురు సేవకులు సామెతలో లూకా కలిపివేసిన క్రొత్త సామెతను మాత్రం ఇక్కడ పరిశీలిద్దాం.

## 2. వివరణం

ఒకడు తన జన్మదేశం నుండి బయలు దేరి మరో దేశంలో వున్న ఓ పెద్దరాజు వద్దకు వెళ్ళాడు. ఆ రాజు సహాయంతో తాను జన్మదేశానికి రాజు కావాలని అతని

కోరిక. కాని స్వదేశీయులు అతడు తమకు రాజు కాగూడదని పై రాజుకి రాయబారం పంపారు. ఐనా ఆ రాజు అనుగ్రహం వల్ల అతనికి రాజ్యం లభించింది. అతడు రాజైన వెంటనే తనకు వ్యతిరేకంగా రాయబారమంపినవారిని పట్టి చిత్రవధ చేసాడు.

క్రీస్తు చెప్పిన ఈ సామెతకు ఒక చారిత్రక సంఘటనం ఆధారం. క్రీస్తు పూర్వం నాల్గవయేడు పెద్ద హేరోదు రాజు చనిపోయాడు. వెంటనే అతని కుమారుడు అర్కెలావుస్ సీజరు అనుగ్రహాన్ని పొంది తండ్రికి మారుగా తాను పాలస్తీనాకు రాజు కావడానికై రోము వెళ్ళాడు. కాని అతడు తమకు రాజు కాగూడదని యాభైమంది యూదనాయకులు రోముకు రాయబారమంపారు. అర్కెలావుసు రాజపదవిని పొంది తిరిగి వచ్చాక ఈ యాభైమందిని పట్టి ముక్కముక్కలుగా తరిగించాడు. పై సామెతను చెప్పినపుడు ఈ సంఘటనం క్రీస్తు మనస్సులో వుంది.

### 3. భావం

ఆ రాజు తలవని తలంపుగా తిరిగివచ్చి తనకు విరోధులైన వాళ్ళను పట్టి శిక్షించాడు. అలాగే దేవుడు కూడ న్యాయనిర్ణయం జరిగించడానికి హఠాత్తుగా వేంచేస్తాడు. కనుక ప్రజలు సిద్ధంగా ఉండాలి. క్రీస్తు బోధలను ఆలించి దైవరాజ్యాన్ని అంగీకరించాలి. లేకపోతే శిక్షకు పాత్రులౌతారు. ఇది క్రీస్తు ఉద్దేశించిన భావం.

## 7. వల - మత్త 13, 47-50

## 8. గోదుమలు, కలుపు - మత్త 13, 24-30

### 1. సందర్భం

దేవుడు కడపటి దినాన తీర్పు జరిపి మంచివాళ్ళనూ, చెడ్డవాళ్ళనూ వేరుపరుస్తాడు. ఈ రెండింటి భావం ఒకటే గనుక రెండిటికీ కలిపే వ్యాఖ్య చెప్పవచ్చు.

### 2. వివరణం

పాలస్తీనా దేశానికి ముఖ్యమైన బ్రతుకు తెరువు గలిలయ సరస్సు. చాలామంది యూదులు దానిలో చేపలు పట్టుకొని బ్రతికేవాళ్ళు. తరచుగా రెండూమూడు పడవల వాళ్ళు కలసి చేపలు పడుతుండేవాళ్ళు. ఈ కథలో రెండు పడవలవాళ్ళు కలసి ఓ పెద్ద లాగుడు వలను ఉపయోగించారు. ఓ పెద్ద వలను విసరి దాన్ని రెండు వైపుల నుండి ఒడ్డుకి లాగుకొని వస్తారు. అది రకరకాల జల ప్రాణాలను ఈడ్చుకొని వస్తుంది. క్రీస్తునాడు ఆ సరస్సులో 24 రకాల చేపలు దొరికేవట. కాని ఇవన్నీ తినదగినవి కావు - లేవి 11, 10-11. కావున చేపలు పట్టేవాళ్ళు మంచివాటిని ఏరి బుట్టల్లో వేసికొంటారు. పాడు

వాటిని అవతల పారవేస్తారు. ఈలా ఈ సామెతలో మంచి చేపలకీ పాడు చేపలకీ వేర్పాటు జరిగింది.

ఓ రైతు పొలంలో గోదుమలు చల్లగా అతని శత్రువులు వచ్చి కలుపు గింజలు కూడా చల్లిపోయారు. కనుక రెండూ మొలచి ఎదిగాయి. మొదట ఈ రెండు పైర్లు ఒకటిగానే కన్పిస్తాయి. క్రమేణ కలుపును గుర్తించవచ్చు. అలా గుర్తు పట్టగానే సేవకులు దాన్ని పెరికి వేద్దామనుకొన్నారు. కాని యజమానుడు వారించాడు. అప్పటికే దాని వ్రేళ్లు గోదుమ వ్రేళ్లతో పెనవేసికొని ఉంటాయి. దాన్ని పీకితే గోదుమ కూడ లేచి వస్తుంది. కనుక పంట పండిందాకా కలుపును సహించి ఊరుకోవలసిందే. తర్వాత కోత కోసేపుడు మొదట గోదుమ వెన్నులను కోసి కట్టలు కడతారు. అటుపిమ్మట కలుపును కోసి పొయ్యిలోకి వంటచెరకుగా వాడుకొంటారు. ఈ విధంగా ఈ సామెతలో ఈ రెండు పైర్లను వేరుచేయడం జరిగింది.

### 3. భావం

ఈ రెండు సామెతల్లోను ప్రధానమైన విషయం వేరుపాటు అని చెప్పాం. మంచి చేపల నుండి చెడ్డవాటినీ, మంచి పైరునుండి చెడ్డపైరునీ వేరుచేస్తారు. అలాగే న్యాయనిర్ణయ కాలంలో గూడ జరుగుతుంది. ప్రభువు మంచివాళ్ళ నుండి చెడ్డవాళ్ళను వేరుజేస్తాడు. పాపాత్ములకు శిక్షా, పుణ్యాత్ములకు సంభావనా లభిస్తుంది.

### 4. అన్వయం

ప్రజల మంచిచెడ్డలను ఎంచేవాడు దేవుడు, మనం కాదు. కాని ఆ ప్రభువు కూడ చివరి గడియ దాకా ప్రజలను ఓర్పుతో క్షమిస్తాడు. అతడు వెర్రి అంజూరానికి గూడ ఒక యేడు గడువిచ్చిన వాడు - లూకా 13,8. అందుచేత మనం పాపాత్ములను జూచి సహనం కోల్పోగూడదు. వాళ్ళకు శిక్ష రావాలని అసలే కోరుకోగూడదు. వాళ్లు పరివర్తనం చెందాలని ఆశించాలి. వాళ్ళపట్ల ఓర్పు చూపాలి. పన్నెండు మంది శిష్యుల్లో ఒకడు దుష్టుడున్నా గానీ ప్రభువు సహించి ఊరుకోలేదా?

## 9. ఉపమాన వాక్యం

ఈ వర్గం సామెతల్లో ఒక ఉపమాన వాక్యం గూడ ఉంది. అది శవం ఉన్న కాడ రాబందులు చేరతాయి అనే వాక్యం - మత్త 17,37. ఇక్కడ శవం అంటే మెస్సీయా. రాబందులు అంటే శిష్యకోటి. కడపటి రోజుల్లో దేవునిపట్ల విశ్వాసయోగ్యంగా ప్రవర్తించేవాళ్లు కొద్దిమంది. వీళ్ళకే పూర్వవేదంలో "శేషప్రజలు" అని పేరు. ఈ శేషప్రజలు మెస్సియా చుట్టూ ప్రోగై అతని బోధలు ఆలిస్తారు. ఇక్కడ రాబందులు అంటే ఈ శేషప్రజలే.

# 6. మెస్సీయాను గూర్చిన సామెతలు

క్రీస్తు సామెతల్లో కొన్ని మెస్సీయాను గూర్చినవి. ఇవి ఆ మెస్సీయా రాకడనూ, అతని కాలాన్నీ, అతని పనినీ, అతిని బోధలనూ వివరిస్తూంటాయి. ఈలాంటి ఉపమానాలు ఇంచుమించు తొమ్మిదున్నాయి. ఇవి కథలుగా అల్లబడిన పెద్ద సామెతలు కావు. చిన్న చిన్న ఉపమాన వాక్యాలు.

ఓమారు యోహాను తన శిష్యులను ప్రభువు వద్దకు పంపాడు. క్రీస్తుని గూర్చిన భోగట్టా సేకరించండని చెప్పాడు. వాళ్ళు క్రీస్తు వద్దకు వచ్చి "రానున్నవాడవు నీవేనా" అని అడిగారు. ఆ రోజుల్లో మెస్సీయా కోసం యూద ప్రజలంతా కాచుకొని ఉన్నారు. అతనికి రానున్నవాడని బిరుదం. ప్రభువు తాను చేసే పనులను యోహాను శిష్యులకు ఎరుకపరచాడు. గ్రుడ్డివాళ్లు చూపు పొందుతున్నారు. కుంటివాళ్లు నడుస్తున్నారు. చెవిటివాళ్లు వింటున్నారు. రోగులు స్వస్థులౌతున్నారు. మృతులు సజీవులౌతున్నారు. పేదలకు సువార్త బోధింపబడుతుంది. మెస్సీయా వచ్చినపుడు ఈలాంటి మహత్తర కార్యాలు చేస్తాడని యెషయా ముందుగనే ప్రవచించాడు - 35,5. కనుక ఈ కార్యాలను బట్టి తానే మెస్సీయా అని యెహాను గుర్తించాలని క్రీస్తు భావం - లూకా 6,20-23. ఈ మెస్సీయాను వర్ణించేవే మెస్సీయా సామెతలు. ఇక ఈ క్రింద ఈ వర్గం సామెతలను పరిశీలిద్దాం.

## 1. పెండ్లి కుమారుడు - మత్త 9,15

ఓమారు యోహాను శిష్యులు క్రీస్తు వద్దకు వచ్చి మేము ఉపవాసం చేస్తుంటే మీ శిష్యులు చేయడం లేదేమి అని ప్రశ్నించారు. వారికి సమాధానంగా ప్రభువు పెండ్లి కుమారుడు తమతో ఉన్నంతకాలమూ పెండ్లికి వచ్చిన వాళ్లు ఉపవాసం చేయరుగదా అన్నాడు. ఇక్కడ పెండ్లికుమారుడు క్రీస్తే. పెండ్లి విందుకు వచ్చినవాళ్ళు అతని శిష్యులు. కనుక క్రీస్తు తమతో ఉన్నంతకాలం శిష్యులు ఉపవాసం చేయనక్కర లేదు. యూదుల భావం ప్రకారం వివాహం ఆనందాన్నీ రక్షణనూ సూచిస్తుంది - దర్శ 19,7. మెస్సీయాయైన క్రీస్తు రక్షణను గొనివచ్చాడు. ఆ రక్షణం ఓ వివాహం లాంటిది. పెండ్లికుమారుడైన క్రీస్తు తమతో ఉన్నంతకాలమూ శిష్యులు సంతోషించాలే గాని విచారంతో ఉపవాసం చేయకూడదు.

పూర్వవేదం యావే ప్రభువును భర్తతోను యిస్రాయేలు ప్రజలను భార్యతోను పోలుస్తుంది. "నిన్ను సృజించిన ప్రభువే నీ భర్త" అంటాడు యెషయా - 54,5. నూత్నవేదంలో కూడ ఈ భావం సకృత్తుగా కన్పిస్తుంది. ప్రస్తుత సామెత ఈ సందర్భానికి

చెందిందే. ఇక్కడే దేవుడు భర్త అంటే అతడు తన ప్రజలను గాఢంగా ప్రేమించేవాడు అని భావం. బైబులు భగవంతునికి ప్రజల మీద గల ఆదరణనూ ప్రేమనూ అర్థం చేసికోవడానికి ఈ ఉపమానం ఉపయోగపడుతుంది.

## 2. క్రొత్త బట్టలూ, కొత్త ద్రాక్షసారాయమూ - మత్త 9, 16-17.

బైబుల్లో బట్టలు, దుప్పట్లు, డేరాగుడ్డలు ప్రపంచాన్నీ యుగాన్నీ సూచిస్తాయి. ప్రాతబట్టను తొలగించి క్రొత్త బట్టను ధరించినట్లుగా భగవంతుడు ఈ ప్రపంచాన్ని నాశం చేసి మరో క్రొత్త ప్రపంచాన్ని సృజిస్తాడు - కీర్త 102,26. ఈ సామెతలో ప్రాత గుడ్డ పూర్వ వేదాన్ని క్రొత్త గుడ్డ నూత్న వేదాన్ని సూచిస్తుంది. మెస్సీయా రాకడతో నూత్నయుగం, క్రొత్తశకం ప్రారంభమైంది. ఇక పూర్వవేదమూ మోషే ధర్మశాస్త్రమూ చాలవు. ప్రజలు ఇక మీదట ప్రభు బోధలను పాటించాలి.

బట్టల్లాగే ద్రాక్షసారాయం కూడ బైబుల్లో క్రొత్తతనానికి సంకేతం. జళ ప్రళయం తర్వాత క్రొత్త ప్రపంచంలో నోవా మొదటిసారిగా ద్రాక్షతోట పెంచాడు - ఆది 9,20. కనుక ఇక్కడ క్రొత్త ద్రాక్ష సారాయమంటే, క్రీస్తుతో ప్రారంభమైన క్రొత్తయుగం అని భావం.

మనలో ప్రాతతనం పోయి క్రొత్తతనం నెలకొనాలి. బైబుల్లో ప్రాతతనం పాపానికీ క్రొత్తతనం పుణ్యానికీ చిహ్నం. ఇక మనకు క్రొత్తతనాన్ని ఇచ్చేవాడు ప్రభువే. అతడు అన్నిటినీ క్రొత్తవాటిని చేసేవాడూ, నూత్న ప్రపంచాన్ని సృజించేవాడూను - ప్రక 21,5.

## 3. కోత - మత్త 9, 37.

బైబుల్లో కోత న్యాయనిర్ణయ దినాన్ని సూచిస్తుంది - మత్త 3,12. కోతతో ప్రాతయుగం ముగిసి క్రొత్త యుగం ప్రారంభమౌతుంది. పంటను కోసి ధాన్యాన్ని సేకరించినట్లే మెస్సియా వచ్చినపుడు నీతిమంతులను సేకరిస్తాడు.

పౌలు గలలీయులకు వ్రాస్తూ నరుడు తాను వేసిన పైరునే కోసికొంటాడు అని చెప్పాడు - 6,7. అనగా మనం ఏలాంటి జీవితం జీవిస్తే అలాంటి బహుమానం పొందుతాం. నరులు దేవుణ్ణి మోసం చేయలేరు గదా! మరి ఇక్కడ పాడు జీవితం జీవించి అక్కడ మోక్ష బహుమానం కోరుకొనేవాళ్ళు తమ్ముతాము మోసగించుకొంటున్నారనే చెప్పాలి.

## 4. అంజూరపు చెట్టు - మత్త 24, 32-35.

పాలస్తీనా దేశంలో అత్తిచెట్టు వేసవిలో చిగిర్చి పూలు పూస్తుంది. మే, జూను నెలల్లో దీని పండ్లు లభిస్తాయి. కనుక చిగిర్చి పూలు పూసే అంజూరం వేసవిని సూచిస్తుంది.

అలాగే మెస్సియా రాకడకూడ రక్షణ కాలాన్ని సూచిస్తుంది. అతని రాకడతో ప్రజలకు రక్షణం లభించినట్లే.

ఆనాడు ప్రభువు శారీరకంగా వచ్చి ప్రజలకు రక్షణం ప్రసాదించాడు. ఈనాడు కూడ అతడు ఆధ్యాత్మికంగా వచ్చి రక్షణ ఇస్తూంటాడు. అతడు మన హృదయమనే తలుపు వద్దకు వచ్చి మెల్లగా తడతాడు. కాని హృదయ కవాటం విప్పి ఆ ప్రభువుని అంతరంగంలో ప్రవేశపెట్టుకొనే బాధ్యత మనది - ప్రక 3,20.

## 5. పిశాచ పతనం - లూకా 10,18.

ప్రభువు డెబ్బది ఇద్దరు శిష్యులను ప్రేషిత ఉద్యమం మీద పంపాడు. వాళ్ళు తిరిగివచ్చి మేము పిశాచాలను పారద్రోలామని చెప్పారు. అందుకు ప్రభువు సంతసించి పిశాచం ఆకాశం నుండి మెరుపు తీగలా పడిపోతుంటే నేను చూచాను అన్నాడు. అనగా క్రీస్తూ అతని శిష్యులూ చేసే బోధల వల్లా అద్భుతాల వల్లా పిశాచమూ దాని సామ్రాజ్యమూ కూలిపోయి దైవరాజ్యం వ్యాప్తిలోకి వచ్చింది అని భావం. మెస్సీయా వచ్చిందాకా పిశాచం ఈలోకానికి అధిపతి. ఆ దుష్టశక్తి ఈ ప్రపంచంలోని జనాన్ని పాపానికి పురికొల్పింది. కాని ప్రభువు విజయం చేసాక ఆ నాయకుడు పదవీభ్రష్టుడయ్యాడు. వానికి మారుగా ప్రభువు ఈ లోక నాయకుడయ్యాడు - యోహా 12,31.

మన హృదయ సామ్రాజ్యంలో ప్రభువుకి ఓడిపోయిన పిశాచం గాదు, ఆ పిశాచాన్ని జయించిన ప్రభువు నివసిస్తూండాలి.

## 6. బలవంతుని జయించిన బలవంతుడు - లూకా 11,21-22

ఓ బలాఢ్యుడు ఉన్నాడు. అతడు తనకంటె బలవంతుడు లేడని విర్రవీగుతున్నాడు. ఓ దినం అతని కంటె బలాఢ్యుడు వచ్చి అతనితో పోరాడాడు. ఈ రెండవ బలాఢ్యుడు ఆ మొదటివాణ్ణి జయించి వాని పెడరెక్కలు విరిచికట్టాడు. వాని యిల్లు దోచుకొన్నాడు. ఇక్కడ మొదటి బలవంతుడు పిశాచమే. అతన్ని జయించిన రెండవ బలవంతుడు క్రీస్తు. పిశాచం క్రీస్తుకు ఓడిపోయి పూరిమేసింది.

క్రీస్తుతో దైవసామ్రాజ్యం ప్రారంభమై పిశాచ సామ్రాజ్యం పడిపోయిందని చెప్పాం. ఐనా పిశాచ రాజ్యం పూర్తిగా అంతరించలేదు. ఈనాడు కూడ మనం పాపం చేసినపుడు పిశాచం మన హృదయంలో సామ్రాజ్యం నిర్మించుకొంటుంది. పాపం చేసినప్పుడల్లా మనం పిశాచంతో నీ రాజ్యమే వచ్చునుగాక అని చెప్పినట్లవుతుంది.

## 7. ఇంటి యజమానుడు - మత్త 13, 52

ఓ గృహస్థు ఉన్నాడు. అతని కోశాగారంలో విలువ గల పాత వస్తువులూ క్రొత్త వస్తువులు గూడ ఉన్నాయి. అతడు వాటినన్నిటిని వెలుపలికి తీసుకొని వచ్చి ప్రేక్షకులకు

చూపించాడు. ఈలా పాత వస్తువులనూ క్రొత్త వస్తువులను గూడ వెలుపలికి తీసుకొని వచ్చిన యజమానుడు క్రీస్తే. అతడు పూర్వ వేదంలోని ప్రాతబోధలతో పాటు తన క్రొత్త బోధలు కూడా విన్పించేవాడు.

ఇంతవరకు ఏ బోధకుడూ క్రీస్తులా మాట్లాడి యెరుగడు - యోహా 7,46. ఆ ప్రభువు శిష్యులై అతని బోధలను ఆలించి పాటించేవాళ్లు ధన్యులు.

### 8. పందుల ముందు ముత్యాలు - మత్త 7,6

మెస్సియా బోధలు విలువ గలవే. కాని అల్పులు వాటి విలువను గుర్తించలేరు. కనుక శిష్యులు ఎవరికి బడితే వాళ్ళకు మెస్సియా బోధలను విన్పించగూడదు. యోగ్యత లేనివాళ్ళకు ప్రభువు సూక్తులను బోధిస్తే లాభం లేదు. పైగా అవహేళనం పాలౌతాం. పవిత్ర వస్తువులను కుక్కలకు వేయం. వెలగల ముత్యాలను పందుల ముందు పోయం. అలాగే ప్రభువు బోధించే పరమ సత్యాలను కూడాను. అవి యోగ్యులకే గాని అల్పులకు గాదు.

ఒకవైపు మనకు ప్రభుబోధలను ఇతరులకు విన్పించే బాధ్యత వున్నా, అర్హతలేని దుష్టులకు ఆ బోధలు విన్పించగూడదు. అలా చేస్తే ఇతరులకు మేలు చేయడానికి మారుగా మనకు మనమే కీడు తెచ్చిపెట్టుకొంటాం.

## 7. నాటనాత్మకమైన సామెతలు

పూర్వవేదంలో ప్రవక్తలు నోటితో మాత్రమే గాక, క్రియల ద్వారా గూడ బోధించారు. అనగా తమ బోధలను నటించి చూపించారు - యిర్మీ 19,10-11. అ.చ.21,10-11. క్రీస్తు గూడ ఈలా తన బోధలను నటించి చూపించిన సందర్భాలు కొన్ని ఉన్నాయి. వీటికే నటనాత్మకమైన సామెతలు అని పేరు. ఈలాంటి వాటిని కొన్నిటిని ఈ క్రింద సంగ్రహంగా పరిశీలించి చూద్దాం.

### 1. దేవాలయాన్ని శుద్ధి చేయడం - మత్త 21, 12-13

దేవాలయం ప్రార్థనా స్థానం. కాని యూదులు దాన్ని క్రమేణ వ్యాపార స్థానంగా మార్చారు. కనుక ప్రభువు దేవాలయంలోకి వెళ్ళి కోపావేశంతో అక్కడవున్న బేరగాళ్ళను తరిమివేసాడు. వాళ్ళ అంగళ్ళను కూలద్రోసాడు. ఈలా దేవాలయాన్ని శుద్ధి చేయడం ప్రజలను శుద్ధి చేయడానికి గురుతు. ప్రజల పాపాల వల్ల దేవాలయం అపవిత్రమై పోయింది. ఆ దేవాలయాన్ని శుద్ధి చేయడం ద్వారా సాంకేతికంగా ప్రజలను శుద్ధి

చేసినట్లవుతుంది. ఇంకా ఈ దేవాలయపు శుద్ధి క్రొత్తయుగాన్ని కూడ సూచిస్తుంది. ప్రభువుతోనే ఈ క్రొత్తయుగం ప్రారంభమైంది. ఈ భావాలన్నిటిని సూచిస్తూ ప్రభువు ఇక్కడ నటనపూర్వకంగా దేవాలయ శుద్ధికి పూనుకొన్నాడు.

## 2. పసిబిడ్డడు - మత్త 18, 1-4

రెండుమూడేండ్లు క్రీస్తు వెంట తిరగగానే శిష్యులకు తలమీద కొమ్ములు మొలిచాయి. వాళ్లు తమలో ఎవడు గొప్పవాడని వాదోపవాదాలు చేయడం మొదలెట్టారు. ప్రభువు వాళ్ళకు వినయాన్ని బోధించడం కోసం ఓ చిన్న నటన చేసి చూపించాడు. ఓ చిన్నబిడ్డను గొనివచ్చి వాళ్ళ మధ్యలో నిల్పి మీరు ఈ చిన్నబిడ్డలా కావాలని చెప్పాడు. బిడ్డగుణం తల్లిదండ్రుల మీద ఆధారపడ్డం. అలాగే శిష్యులు గూడ మేము గొప్పవాళ్ళం అని తలంచడం మానుకొని నమ్మికతో పరలోకం లోని తండ్రి మీద ఆధారపడాలి. శిష్యుల కుండవలసిన లక్షణం దేవుని మీద నమ్మిక గాని అహంభావం గాదు - ఇది యీ నటనం భావం.

## 3. జక్కయను దర్శించడం - లూకా 19, 5-10

ప్రభువు జక్కయ యింటికి వెళ్ళాడు. అతని పాపాలను క్షమించాడు. ఆ యింటికి రక్షణం వచ్చింది అని చెప్పాడు. ఇక్కడ క్రీస్తు జక్కయ పాపాలను పరిహరించడం ద్వారా జనులందరి పాపాలను మన్నించడానికి మెస్సీయా విజయం చేసాడని సూచించాడు. పాపక్షమాపణను ప్రసాదించే మెస్సియా కాలం రానే వచ్చిందని తెలియజేసాడు. కనుక ప్రభువు జక్కయను సందర్శించడం గూడ ఓ నటనాత్మకమైన సామెతే.

## 4. యెరూషలేమును గూర్చి విలపించడం - లూకా 19, 41-44

ప్రభువు యెరూషలేమును చూచి విలపించాడు. శత్రువులు నీలో రాతిమీద రాతిని నిలువనీయరని పల్కాడు. నిన్ను నేలమట్టం చేసి నీ సంతానాన్ని సంహరిస్తారని నుడివాడు. క్రీస్తు చనిపోయాక ఓ పాతికేళ్ళకు, 74లో, టైటస్ అనే రోమను సైన్యాధిపతి వచ్చి యెరూషలేమును సర్వనాశం చేసాడు. కనుక యిక్కడ ప్రభువిలాపం యెరూషలేమునకు రానున్న దుర్గతిని సూచిస్తుంది. ఈ దుర్గతినే క్రీస్తు ఇక్కడ విలాప నటన ద్వారా సూచించాడు.

## 5. అంజూరపు చెట్టును శపించడం - మత్త 21, 18-20

ఓమారు యేసు బెతానియా గ్రామం నుండి యెరూషలేముకు వస్తూ ఆకలిగొని పండ్లేమైనా దొరుకుతాయేమోనని అంజూరం దగ్గరికి వెళ్ళాడు. కాని దాని మీద ఆకులు మాత్రం ఉన్నాయి. ప్రభువు ఇక నీవెన్నటికిని ఫలింపకుందువు గాక అని శపింపగా అది

నిలువున ఎండిపోయింది. ఇక్కడ క్రీస్తు ఉద్దేశం ఈ యంజూరం ఎండిపోవాలని మాత్రమే గాదు. ఈ చెట్టు యూదప్రజలకు సంకేతం. దాని మీద పండ్లులేవు. అలాగే యిస్రాయేలు ప్రజల్లో గూడ పశ్చాత్తాపఫలాలు లేవు. క్రీస్తు ఎంత బోధించినా వాళ్ళకు పరివర్తనం కలగడం లేదు. ఆ ప్రజలు తండ్రి శాపానికి చిక్కి మ్రగ్గిపోనున్నారు. ఈ యెండిపోయిన చెట్టులాగే వాళ్లు కూడ నాశమై పోతారు - ఇది భావం. కనుక యేసు ఇక్కడ ఈ వృక్ష శాపరూపంలో యూదుల వినాశాన్ని నటన చేసి చూపించాడు.

ఈలాంటి నటనాత్మకమైన సామెతలు క్రీస్తు జీవితంలో ఇంకా కొన్ని ఉన్నాయి. ఈ సామెతలన్నీ గూడ దైవరాజ్యం సమీపించిందని తెలియచేస్తాయి. ఇక్కడ క్రీస్తు దైవరాజ్యాన్ని గూర్చి కొన్ని సామెతల ద్వారా బోధించడం మాత్రమే గాదు, తన జీవితం ద్వారా గూడ బోధించాడు. అసలు అతడే దైవరాజ్యం.

## 8. క్రీస్తు శ్రమలను గూర్చిన సామెతలు

క్రీస్తు సామెతల్లో కొన్ని ఆ ప్రభువు సిలువ మరణాన్ని సూచిస్తాయి. అతని పాటులను తలపింపజేస్తాయి. ఈ వర్గం సామెతలన్నీ విస్తృతి చెందక కేవలం ఉపమాన వాక్యాల్లా నిల్చిపోయాయి. ఈలాంటివాటిని ఓ నాల్గింటిని మాత్రం ఇక్కడ పరిశీలిద్దాం.

1. నక్కలకు బొరియలూ ఆకాశపక్షులకు గూళ్ళూ ఉన్నాయి గాని మనుష్య కుమారునికి తలవాల్చుకొనే తావైనా లేదు - మత్త 8,20. వన్య మృగాలకూ పక్షులకూ స్థిరనివాసాలున్నాయి గాని క్రీస్తుకి స్థిరనివాసమంటూ లేదు. అతడు ఎప్పుడూ దేశ ద్రిమ్మరిగా తిరిగేవాడు. అనగా మెస్సీయా సుఖాలనుభవించే వాడు కాదు. కష్టాలూ శ్రమలూ అతని పాలు అని భావం.

2. క్రీస్తు సిలువ మోసుకొని వెళ్తూంటూ యెరూషలేము పుణ్యస్త్రీలు అతని కెదురువచ్చి సంతాపం తెలియజేసారు. ఆ సందర్భంలో ప్రభువు వచ్చి మ్రానికే ఈలాంటి గతి పట్టినపుడు ఇక ఎండుమ్రానికి ఏలాంటి గతి పడుతుందో ఊహించండి అన్నాడు - లూకా 23,31.

ఇక్కడ పచ్చి మ్రాను అంటే నిర్దోషియైన క్రీస్తు. ఎండుమ్రాను అంటే పాపపు యూదజాతి. నిర్దోషియైన క్రీస్తుకే ఈలాంటి ఘోర శ్రమలు ప్రాప్తించాయి. ఇక దుర్మార్గులైన యూదప్రజలలకు ఏలాంటి విపత్తులు సంభవిస్తాయో ఊహించండి అని భావం. క్రీస్తు తర్వాత 70వ సంవత్సరంలో టైటస్ అనే రోమను సైన్యాధిపతి యెరుషలేమును ముట్టడించి సర్వనాశం చేసాడు. రోమను సైన్యం పురజనులను కూరగాయల్లాగ తరిగివేసింది. అప్పుడు ఈ వాక్యం అక్షరాల నెరవేరింది.

3. జబెదయి కుమారులైన యాకోబు యోహానులు క్రీస్తు సింహాసనానికి కుడియెడమలందు కూర్చుండే భాగ్యాన్ని తమకు ప్రసాదించమని వేడుకొన్నారు. ప్రభువు నేను త్రాగే పాత్రను మీరు త్రాగగలరా అని ప్రశ్నించాడు - మార్కు 10, 38. ఇక్కడ ప్రభువు త్రాగే పాత్రం అతని సిలువపాట్లే. యాకోబు యోహానులు తమకు పెద్ద పదవులు కావాలని కోరారు. కాని క్రీస్తు తన శ్రమల్లో పాల్గొనేవాళ్ళేగాని తనకు శిష్యులు కాలేరు అని వక్కాణించాడు.

4. ఇదే వాక్యంలో ప్రభువు నేనుపొందే జ్ఞానాస్నానాన్ని మీరు పొందగలరా అని ప్రశ్నించాడు. ఇక్కడ జ్ఞానస్నానం అన్నా ప్రభుశ్రమలే. గ్రీకు భాషలో 'బాప్టిజో" అంటే నీటిలో ముంచడం. కనుక నీటిలో మునిగినట్లుగా అతడు శ్రమల్లో మునిగి తేలుతాడు. క్రీస్తులాగే అతని శిష్యులుకూడ శ్రమల్లో పాలుపొందాలి అని భావం. ఈలా ఈ ఉపమాన వాక్యాలన్నీగూడ ప్రభు శ్రమలను సూచిస్తాయి.

# ప్రశ్నలు

## అధ్యాయం -1

1. తప్పిపోయిన గొర్రెసామెతలో సుంకరులకు "పాపాత్ములు" అని పేరెందుకు వచ్చింది? ఆనాటి యూద సమాజంలో వాళ్ళకు ఏలాంటి స్థానం ఉండేది?
2. తప్పిపోయిన కుమారుని సామెతను "కరుణాళువైన తండ్రి సామెత అనడం మేలు" - ఎందుకు?
3. పాపాన్ని గూర్చి పశ్చాత్తాపాన్ని గూర్చి బోధించడానికి తప్పిపోయిన కుమారుని సామెత ఏలా ఉపయోగపడుతుంది?
4. పరిసయుడు సుంకరి అనే సామెతకు సందర్భం ఏమిటి?
5. ద్రాక్షతోట యజమానుని సామెతను కారుణ్యపు సామెతల్లో ఎందుకు చేర్చాలి?
6. "భగవంతునిలో వుందీ నరునిలో లేందీ దయాగుణం" - ఈ భావాన్ని బోధించడానికి క్షమింపనొల్లని సేవకుని సామెత ఏలా ఉపయోగపడుతుంది?
7. కారుణ్యపు సామెతలను ఆధారంగా తీసికొని పల్లెటూరి జనులకు బైబులు భగవంతుని కరుణా హృదయాన్ని ఏలా వివరించి చెప్పగలవు?

## అధ్యాయం - 2

1. మంచి సమరయుని కథను ఆధారంగా తీసికొని చిన్న పిల్లలకు అక్కరలో ఉన్న వాళ్ళను ఆదుకోవాలని ఏలా బోధిస్తావు?
2. పొలంలోని యిల్లూ యుద్ధమూ - ఈ సామెత భావం ఏమిటి?
3. నడిరేయి వచ్చిన స్నేహితుడు అనే సామెతలో ముఖ్య పాత్ర యెవరు? ఎందుకు?

4. న్యాయాధిపతి వితంతువు అనే సామెత దేవుడు అధార్మికుడైన న్యాయాధిపతి లాంటివాడు అని చెప్తుందా?
5. "తండ్రీ కుమారుడు అనే సామెతలో బైబుల్లోని సారమంతా యిమిడి ఉంది" - ఏలాగ?
6. మేకలు గొర్రెలు అనే సామెతద్వారా క్రీస్తు తోడి జనంలో నెలకొని వుంటాడు అనే భావాన్ని ఏలా బోధిస్తావు?
7. శిష్యులకు కన్ను, ఉప్పు, దీపం, కొండమీది నగరం ఉపమానాలు - ఏలాగ?

## అధ్యాయం -3

1. మొదట కొంచెము కడపట ఘనం అనే భావం ఆవగింజ సామెతకు ఏలా వర్తిస్తుంది?
2. విత్తేవాడు అనే సామెతలో మొదట క్రీస్తు ఉద్దేశించిన భావం ఏమిటి? తర్వాత ప్రచారంలోకి వచ్చిన భావం ఏమిటి?
3. దానంతట అదే పండిన పంట అనే సామెతలో క్రీస్తు ఆనాటి ఉత్సాహవాదుల భావాలను అంగీకరించాడా?
4. బైబులు అన్న పొలంలో దాగివున్న నిధి క్రీస్తు అనే జెరోము భావాన్ని ఏ సామెత ద్వారా, ఏ విధంగా బోధిస్తావు?
5. దైవరాజ్యపు సామెతలను ఆధారంగా తీసికొని హైస్కూలు విద్యార్థులకు దేవుని రాజ్యం మన హృదయంలోనే ఏలా నెలకొని ఉంటుందో వివరించి చెప్పండి.

## అధ్యాయం - 4

1. వివాహవస్త్రంలేని అతిథి అనే సామెతలో మొదట క్రీస్తు ఉద్దేశించిన భావం ఏమిటి? తర్వాత ఆ సామెతను లిఖించిన మత్తయి ఉద్దేశించిన భావం ఏమిటి?
2. భూస్వామి కౌలుదార్లు అనే సామెత క్రీస్తుకి యూదనాయకులకీ ఏలా వర్తిస్తుంది?
3. యజమానుడు యుక్తిగల గృహనిర్వాహకుణ్ణి మెచ్చుకొంది అతనిలోని ఏ గుణాన్ని చూచి?
4. అవివేకియైన ధనికుడు అనే సామెతను తీసికొని "మనమందరమూ కొద్దిగానో గొప్పగానో నాస్తికులమే" అనే భావాన్ని నగరవాసులకు ఏలా బోధిస్తావు?
5. "ధనవంతుడు లాజరు అనే సామెతను ఆర్గురు ధనిక సోదరులు అని పిలవడం మేలు" - ఎందుకు ?
6. కాపుపట్టని అంజూరం అనే సామెత సహాయంతో నరుడు పరివర్తనం చెందాలి అనే భావాన్ని ఏలా బోధిస్తావు?
7. త్వరపడాలి అనే సామెతల్లో మనం దేనికొరకు త్వరపడాలి? ఎందుకు త్వరపడాలి?

## అధ్యాయం - 5

1. పదిమంది కన్నెలు అనే సామెతలో మొదట క్రీస్తు ఉద్దేశించిన భావమూ, తరువాత మత్తయి ప్రవేశపెట్టిన భావమూ, ఈనాడు ఆ సామెతను వాడుకొనే మనకు అన్వయించే భావమూ తెలియజేయండి.
2. ముగ్గురు సేవకులు అనే సామెతను ఒక విద్యార్థి సమాజానికో లేక ఉపదేశుల సమాజానికో అన్వయించేలా వివరించి చెప్పండి.
3. గోదుమలు కలుపు అనే సామెతను తీసికొని మనం పాపాత్ములపట్ల సహనం చూపాలి అనే భావాన్ని ఏలా బోధిస్తావో చెప్పు.
4. శవం ఉన్న కాడ రాబందులు చేరతాయి అనే ఉపమానవాక్యం భావం ఏమిటి?

## అధ్యాయం - 6,7,8

1. క్రొత్త బట్టలూ క్రొత్త ద్రాక్ష సారాయం అనే ఉపమాన వాక్యాల అర్థం ఏమిటి?
2. పిశాచం ఆకాశం నుండి మెరుపులా పడ్డం నేను చూచాను అనడంలో క్రీస్తు భావం ఏమిటి?
3. తన కోశాగారం నుండి ప్రాత వస్తువులనూ క్రొత్త వస్తువులనూ వెలికి తెచ్చిన యింటి యజమానునికీ క్రీస్తుకీ ఏమి పోలిక?
4. చిన్న బిడ్డను శిష్యులమధ్య నిల్పి మీరు ఈ బిడ్డలాగా తయారు కావాలి అనడంలో క్రీస్తు ఉద్దేశం ఏమిటి?
5. అంజూరపు చెట్టును శపించడంలో క్రీస్తు ఉద్దేశమేమిటి? నూత్నవేదంలో అంజూరాన్ని గూర్చిన సామెతలు మొత్తం ఎన్ని?
6. నక్కలకు బొరియలూ ఆకాశపక్షులకు గూళ్లు ఉన్నాయి కాని మనుష్య కుమారునికి తలవాల్చుకొనే తావైనా లేదు అంటే యేమిటి?
7. పచ్చిమ్రానికే ఈలా జరిగితే ఎండుమ్రానికి ఇంకా యేమి జరుగదు అనే వాక్యం భావం ఏమిటి?

## అధ్యాయం - 9

### సాధారణ ప్రశ్నలు

1. మీ అనుభవం ప్రకారం మన ప్రజలకు సామెతలూ వాటి అర్థమూ ఎంతవరకు తెలుసు?
2. వ్యక్తిగతంగా నీకు అధికంగా నచ్చిన సామెతలు ఏవేవి? ఎందుకు?
3. క్రీస్తు సామెతలకు మన దేశంలో విన్పించే ఏ వర్గం కథలతో నైనా పోలిక ఉందా?
4. నీతికథకూ, నీతిపద్యానికీ, ఈ సామెతలకూ తేడా ఏమిటి? వీటన్నిటిలోను శ్రోతల మనసును ఆకట్టుకొనే గుణం ఏమిటి?
5. కథల ద్వారా బోధచేసిన క్రీస్తుని చూచి ఈనాడు మనం మన బోధలను ఏలా మలచుకోవాలి?

# 11. ఉపమానాలు సందేశం

బైబులు భాష్యం - 155-156

విషయసూచిక

## 1. మత్తయి ఉపమానాలు



## 2. లూకా ఉపమానాలు

## 3. మార్కు ఉపమానాలు



# 1. మత్తయి ఉపమానాలు

(ఈ సంచిక క్రీస్తు సామెతల గ్రంథానికి అనుబంధం)

## 1. నిధీ, ఆణిముత్యం - మత్త 13,44-46

1. ఈ రెండుపమానాలు కవలపిల్లల్లాంటివి. వీటి భావం ఒకటే. జీతగాడు, వ్యాపారి నిధినీ ఆణిముత్యాన్నీ సంపాదించుకోవడానికి తమకున్న వన్నీ వదలుకొని వెంటనే పనికి పూనుకొన్నారు. ఈలాగే మనం కూడ దైవరాజ్యాన్ని సంపాదించుకోడానికి ఎంత త్యాగమైన చేసి వెంటనే కార్యానికి పూనుకోవాలి.

2. ఈ రెండు కథల్లో జీతగాడు వ్యాపారి నిధికీ ముత్యానికీ యిచ్చిన విలువ, వాటి కొరకు వాళ్ళు చేసిన త్యాగం, వాటిని సంపాదించడంలో వాళ్ళనుభవించిన ఆనందం ముఖ్యాంశాలు. ఈలాగే మనం కూడ దైవరాజ్యానికి గొప్ప విలువనీయాలి. దాని కొరకు సమస్తం త్యజించాలి. దాన్ని సాధించినపుడు మనకు పరమానందం కలుగుతుంది.

3. ఈ రెండు కథల్లోని నరులు నిధినీ ముత్యాన్నీ కనుగొన్నాక ఇక జాగు చేయలేదు. వెంటనే అన్నీ వదలుకొని వాటిని సంపాదించుకొన్నారు. మనం కూడ ఆలస్యం చేయకుండా దైవరాజ్యాన్ని శీఘ్రమే సంపాదించుకోవాలి.

4. ఈ కథలు పేర్కొనే దైవరాజ్యం ఏమిటి? క్రీస్తే. అతడే మన నిధి, ఆణిముత్యం. ఆ ప్రభువుని దక్కించుకోవడం మన ప్రధాన ధ్యేయం. అతడుంటే చాలు, మనకు అన్నీ వున్నట్లే. అతని కొరకు అన్ని వస్తువులు త్యాగం చేయాలి. ఏ వస్తువు కొరకు కూడ అతన్ని త్యాగం చేయకూడదు.

5. ఈ కథలో ఈ యిద్దరు నరులు నిధి ఆణిముత్యం కొరకు తమకున్నదంతా అమ్మివేయడం ప్రమాదం కాదా? తర్వాత వాళ్లు నష్టపోరా? పోరు. ఆ నిధి ఆణిముత్యాల వల్ల వాళ్ళకు తాము పోగొట్టుకొన్న దానికంటె ఎక్కువ లాభాలే వస్తాయి. అవి అంత ఖరీదు గల వస్తువులు. నేడు మనకు కూడ దైవరాజ్యం వల్ల మనం పోగొట్టుకున్న దానికంటె ఎక్కువ లాభాలు చేకూరుతాయి.

6. కొందరు కొన్నాళ్ళు పాప జీవితం గడిపి ఆ పిమ్మట పరివర్తనం జెంది క్రీస్తు దగ్గరికి వచ్చారు. వాళ్ళకు ప్రభువు అమూల్యమైన నిధి అయ్యాడు. ఇంకా పునీతులు అన్నీ వదలి క్రీస్తుని స్వాధీనం చేసికొన్నారు. వీళ్ళకు ప్రభువు అన్ని విలువలకంటె పై విలువ అయ్యాడు. కాని పుట్టు క్రైస్తవులమైన మనకు క్రీస్తు విలువ తెలియదు. మనం అతన్ని అంతగా పట్టించుకోం. అతని కోసం మనం ఏనాడు, ఏ త్యాగం చేయలేదు. ప్రభువు కొరకు తమకు ప్రీతికరమైన వస్తువులను వదలుకొన్నవారికే గాని అతడు అనుభవానికి రాడు.

7. ఈ యిద్దరు నరులు తమకున్నదంతా అమ్మిన పిదపనే గాని తాము కోరిన గొప్ప వస్తువులను స్వాధీనం చేసికోలేదు. ఈలాగే మన స్వార్థాన్ని జయిస్తేనే గాని మనకు దేవుడు దక్కడు. నా భద్రత, నా లాభం, నా పేరు, నా సుఖం, నా కీర్తి మొదలైనవన్నీ వదులుకొంటేనే గాని దేవుణ్ణి పొందలేం. ఆధ్యాత్మిక జీవితం యుద్ధరంగం లాంటిది. రోజూ మన స్వార్థానికి వ్యతిరేకంగా పోరాడవలసిందే. ఈ స్వార్థాన్ని ఒక్కరోజు లోనే, ఒక్కసారే త్యజించలేం. దానికి జీవిత కాలమంతా పోరాడవలసిందే.

8. జీతగాడు పొలం దున్నుతుండగా తలవని తలంపుగా నిధి దొరికింది. మోషే, పేత్రు, మత్తయి, పౌలు మొదలౌన వ్యక్తుల జీవితాల్లో గూడ అనుకోకుండా ప్రభువు దర్శనమిచ్చాడు. ఇప్పుడు మన రోజువారి పనుల్లో గూడ ప్రభువు దిడీలున ప్రత్యక్షమౌతుంటాడు. అలా ప్రత్యక్షమైనపుడు మహా భాగ్యమనుకొని మనం అతన్ని స్వీకరించాలి.

9. దైవరాజ్యాన్ని సంపాదించుకోవడానికి మనకున్నది వదలివేస్తే చాలు. ఆ వున్నది ఒక్కో వ్యక్తిని బట్టి ఎక్కువా కావచ్చు, తక్కువా కావచ్చు. ఇంకా ప్రతివాడికి దైవరాజ్యాన్ని సంపాదించుకొనేంత సొమ్ము వుంటుంది. ఎవరూ నేను దాన్ని కొనుక్కోలేను అనలేరు. అసలు దైవరాజ్యానికి కచ్చితమైన వెల లేదు. ప్రతివాడు తనకున్నది వదలుకొని దాన్ని కొనాలి.

10. మనకున్నది దైవరాజ్యం కొరకు త్యాగం చేస్తే దేవుడు మనకు అధికంగానే యిస్తాడు. అతని ఔదార్యం గొప్పది- మార్కు 10,29-30.

## 2. ఆవగింజ- 13,31-32

1. ఆవగింజ చాల చిన్నది. ఐనా అది పెద్ద మొక్కగా పెరుగుతుంది. అలాగే దైవరాజ్యం మొదట చాల చిన్నది. అది మొదటలో క్రీస్తు, అతని శిష్యులు మాత్రమే. ఐనా అది మహారాజ్యంగా విస్తరిల్లి లోకంలోని నరులందరికీ ఆశ్రయమిస్తుంది. పెరుగుదల ఇక్కడ ముఖ్యాంశం.

క్రీస్తుకి తన జీవిత కాలంలో గుర్తింపు లేదు. అతని శిష్యులు అనామకులు. ఐనా ఈ చిన్న బృందం ప్రారంభించిన దైవ రాజ్యం 300 ఏండ్లల్లోనే మహా శక్తిమంతమైన రోమను సామ్రాజ్యాన్ని లొంగదీసికొంది. ఆ పిమ్మట ప్రపంచమంతటా వ్యాపించింది. ఇంకా, క్రైస్తవ మతంలో చేరకపోయినా క్రీస్తు రాజ్యానికి చెందిన భక్తులు ఇతర మతాల్లో కూడ వున్నారు. వీళ్ళతో కలుపుకొంటే దైవరాజ్యం ఇంకా పెద్దది. క్రీస్తు రాజ్యం ప్రారంభంలో చిన్నది, అంతంలో గొప్పది.

2. దేవుని కార్యాలు కూడ ప్రారంభంలో చిన్నవి. కాని అవి తర్వాత కొండంతలుగా పెరిగిపోయాయి. అబ్రాహాము సారాలకు జన్మించిన ఈసాకు నుండి యిస్రాయేలు మహాజాతి ఆవిర్భవించింది. సమూవేలు నుండి అభిషేకం పొందిన దావీదు యువకుని నుండి యిస్రాయేలు రాజ్యం పుట్టింది. పండ్రెండు మంది బెస్తల నుండి పుట్టుక వచ్చిన చిన్న తిరుసభే ఖండాంతరాల వరకు వ్యాపించింది. మన కాలంలోనే మదర్ తెరీసా ఉద్యమం చిన్న కార్యాలతోనే ప్రారంభమై విశ్వమంతటా వ్యాపించింది కదా! కనుక మనం కూడ మొదటలో చిన్నవిగా కన్పించే మంచి కార్యాలను ప్రారంభించడానికి వెనుకాడకూడదు. దేవుని దీవెన వల్ల అవే తర్వాత మహాకార్యాలు కావచ్చు. గొప్ప ఉద్యమాలన్నీ మొదటలో చిన్న పనులే కదా!

3. ఆధ్యాత్మిక జీవితంలో కూడ ఈ పెంపు కన్పిస్తుంది. చిన్నబిడ్డలు జ్ఞాన స్నాన సమయంలో విశ్వాసాన్ని స్వీకరిస్తారు. ఈ విశ్వాసం వారిలో క్రమంగా పెరిగి వారిని దైవభక్తులనుగా మార్చివేస్తుంది. చిన్న ప్రాయంలోనే చాలమంది దైవభక్తులుగా మరణించారు కూడ. మరియ గొరెట్టి, డోమినిక్ సావియో, స్టనిస్లాస్, బర్కుమెన్స్ మొదలైనవాళ్ళు ఈలాంటివాళ్ళు. వీళ్ళు కొద్ది కాలంలోనే సిద్ధిని పొంది దీర్ఘకాలం జీవించిన వాళ్ళయ్యారు - సొలో. జ్ఞాన - 4,13. మన భక్తి జీవితం గూడ ఈ యావగింజలాగ ప్రారంభమై పెద్ద మొక్కలాగ ఎదగాలి.

4. పాలస్తీనా దేశపు ఆవచెట్టు ఏడడుగుల వరకూ పెరుగుతుంది. పక్షులు దాని కొమ్మలను ఆశ్రయిస్తాయి. మన భక్తి విశ్వాసాలే ఓ చెట్టు అనుకొందాం. మన మంచి ఆదర్శం వల్ల, మన సేవల వల్ల ప్రభావితులైనవాళ్ళు కొందరు వచ్చి ఈ చెట్టు

కొమ్మల్లో ఆశ్రయం పొందుతారు. వీళ్ళు మనలను చూచి భక్తిని అలవరచుకొంటారు. ఇక, మన తరపున మనంకూడ పునీతులనే చెట్ల కొమ్మల్లో ఆశ్రయం పొందాలి.

## 3. పులిపిడి ద్రవ్యం - 13,33.

1. పులిపిడి ద్రవ్యం రొట్టెల పిండితో కలసినపుడు ఆ పిండిలో మార్పు తెస్తుంది. అది పులిసి పొంగేలా చేస్తుంది. అలాగే దైవరాజ్యం లోకంలోకి ప్రవేశించినపుడు ఆ లోకంలో మార్పు తెస్తుంది. నరుల హృదయాలు మారేలా చేస్తుంది. క్రీస్తు సందేశం ఎప్పుడూ నరుల హృదయాలను కదిలిస్తుంది. ప్రజలు అతన్ని అంగీకరించైనా అంగీకరిస్తారు, లేక నిరాకరించనైనా నిరాకరిస్తారు. క్రీస్తు సందేశాన్ని అంగీకరింపని వాళ్ళు కూడ అతని వల్ల కొంతవరకు ప్రభావితులౌతారు. కనుక మార్పు ఈ కథలో ముఖ్యాంశం.

2. పులిపిడి ద్రవ్యాన్ని ఏ కప్పులోనో పెట్టి ఓ మూలన వుంచితే అది యేమీ చేయదు. దాన్ని పిండిలో కలపాలి. అప్పుడే ఆ పిండి పులిసి పొంగేది. అలాగే క్రీస్తు బోధలను బైబుల్లోనే వుంచితే చాలదు. వాటిని ప్రజలకు ప్రకటించాలి. క్రీస్తు జీవితాన్ని తెలిసికొని అతని సందేశాన్ని విన్నపుడు ప్రజల హృదయాలు మారతాయి. కనుక మన తరపున మనం భక్తితో జీవిస్తేనే చాలదు. బోధకులుగా గూడ మెలగాలి.

3. పులిపిడి ద్రవ్యం కలియకపోతే పిండి పులియదు, పొంగదు, రొట్టెకాదు. దాని తరపున అది ముద్దగా ఉండిపోతుంది. అలాగే క్రీస్తు శక్తి సోకకపోతే మన హృదయాలు మారవు. నేను లేక మీరేమి చేయలేరు అన్నాడు ప్రభువు - యోహా 15,5.

4. పరిమాణంలో పులిపిడి ద్రవ్యం చిన్నది. పిండి పెద్దది. ఐనా చిన్నదైన పులిపిడి ద్రవ్యం అంతర్గత శక్తితో తనకంటె పెద్దదైన పిండిని లొంగదీసికొంటుంది. మనదేశంలో క్రైస్తవులు అల్ప సంఖ్యాకులు. అన్య మతస్థులు అధిక సంఖ్యాకులు. ఇంకా దేశంలో దేవుణ్ణి పట్టించుకోనివాళ్ళు, నాస్తికులు కూడ వున్నారు. ఐనా క్రీస్తు శక్తితో అల్ప సంఖ్యాకులైన క్రైస్తవులే అధిక సంఖ్యాకుల హృదయాలను మార్చివేయగలరు. కనుక మనం మైనారిటీ వర్గానిమి అనే భయం అక్కరలేదు. క్రీస్తు బలం మనకు చాలు. మీరు ధైర్యం తెచ్చుకోండి నేను లోకాన్ని జయించాను అన్నాడు ప్రభువు- యోహా 16,33.

## 4. విత్తేవాడు - 13,1-9. 18-23

1. ఈ వుపమానంలో రెండంశాలు గుర్తించాలి. క్రీస్తు మొదట ఈ సామెతను చెప్పినపుడు అతని వుద్దేశం ఇది. రైతుకి పంటను చేకూర్చుకోవడంలో మొదట చాల ఆటంకాలు ఎదురయ్యాయి. మూడు రకాల నేలలు పండలేదు. కాని కడన ఫలితం దక్కింది. అలాగే దైవ రాజ్య స్థాపనలో క్రీస్తుకి మొదట చాల ఆటంకాలు ఎదురయ్యాయి. కాని కడన విజయం లభించింది.

ఇక మత్తయి ఈ సామెతను లిఖించినపుడు అతని ఉద్దేశం ఇది. నాల్గు రకాల నేలలు నాలుగు రకాల ఫలితాన్నిచ్చాయి. అలాగే దైవవాక్యాన్ని వినేవాళ్ళ మనస్తత్వాలను బట్టి ఫలితాలు భిన్నంగా ఉంటాయి.

2. ఈ కథలోని రైతుకి మూడు రకాల నేలలు ఫలింపలేదు. నాల్గవ రకం నేల మాత్రం పండింది. ఈలాగే మన ఆధ్యాత్మిక జీవితంలో గూడ చాలసార్లు అపజయం పొందుతాం. కాని కడన విజయం లభిస్తుంది. దైవకృప వల్ల ఈ విజయం సిద్ధిస్తుంది - రోమా 5,21. కనుక మన తరపున మనకు ఆశావాదం అవసరం.

3. ఈ కథ చెప్పిన క్రీస్తులోని ఆశావాదాన్ని కూడ మననం జేసికోవాలి. అతనికి నరుల బలహీనతలు తెలుసు - యోహా 2,24-25. వారి హృదయాలు దుష్టమైనవనీ తెలుసు- మార్కు 7,21-22. ఐనా అతడు శిష్యులను నమ్మి వారిమీద ఆధారపడ్డాడు. తర్వాత వాళ్ళు దైవరాజ్యాన్ని వ్యాప్తి చేసారు. దైవశక్తి వాళ్ళను బలపరచింది -1 కొరి 3,6. ఆ దివ్యశక్తి నేడు మనకు కూడ తోడుగా ఉంటుంది. కనుక మనమెప్పుడూ ఆశావాదులంగా మెలగాలి.

4. ఈ కథలో మొదటి మూడు రకాల నేలలు, లేక మొదటి మూడు వర్గాల ప్రజలు ఫలితాన్ని ఈయలేదు. వారిలో తొలివర్గం ప్రజలు వాక్యాన్ని విని కూడ గ్రహించలేదు - 19. ఎందుకు? వీరి హృదయం నైతికంగా సిద్ధంగా లేదు. వీళ్ళు తమ దుష్టవర్తనాన్ని సవరించుకోవడానికి గాని, క్రీస్తుని అంగీకరించడానికి గాని తయారుగా లేరు. ఈలాంటి వాళ్ళ మీద దైవ వాక్యం పనిచేయదు.

5. రెండవ రకం నరులు నేలలోనికి వేరుపాతుకోని మొక్కల్లాంటి వాళ్లు-21. ఈలాంటివాళ్ళు ఆధ్యాత్మిక జీవితంలో ఎదురయ్యే కష్టనష్టాలనూ, శ్రమలకూ తట్టుకోలేక ఎండిపోతారు. గట్టి విశ్వాసం లేని క్రైస్తవులు నిలువరు. భక్తుడు క్రీస్తులోకి లోతుగా వేరుపాతుకోవాలి.

6. మూడవ వర్గంవాళ్ళకు లోక వ్యామోహాలు ధనాశ మెండు. కాని మన సంపద క్రీస్తే. ఆ సొత్తును గాక మరో సొత్తును ఆశించేవాడు గట్టెక్కడు.

7. విత్తనానికి కొదవలేదు. బైబులు గ్రంథమంతా విత్తనమే. విత్తనాన్ని వెదజల్లే బోధకులకూ కొదువలేదు. చాలమంది కాకపోయినా కొంతమంది బోధకులు ఉన్నారు కదా! మరి దేనికి కొదవ? మంచి నేలకు. నాల్గునేలల్లో ఒక్క నేల మాత్రమే ఫలించింది. మన హృదయం ఈ మంచి నేలలాగ ఉంటుందా? దైవవాక్యమనే విత్తనం మన హృదయంలో పడి ఫలిస్తుందా?

## 5. గోదుమ, కలుపు 13,24-30. 36-43

1. క్రీస్తు ఈ వుపమానాన్ని చెప్పినపుడు అతని భావం ఇది. పైరు కలుపు కలసివున్న పొలంలో కలుపును పీకివేయకూడదు. పీకివేస్తే పైరు కూడ పెల్లగిల్లుతుంది.

ఈలాగే న్యాయనిర్ణయ దినందాక దుష్టులను గూడ మంచివారితో కలసి జీవించనీయాలి. ఇక, మత్తయి ఈ సామెతను లిఖించినపుడు అతని భావం ఇది. కోతకాలంలో మొదట కలుపు మొక్కలను వేరుజేసి కాల్చివేస్తారు. అలాగే న్యాయనిర్ణయ దినాన మొదట క్రైస్తవ సమాజంలోని దుష్టులను మంచివారి నుండి వేరేజేసి శిక్షకు గురి చేస్తారు.

2. ఈ సామెత లోని పొలంలో కలుపూ, గోదుమా కలసి పెరుగుతున్నాయి. లోకంలో ఎప్పుడూ మంచీ చెడ్డా కలసి ఉంటాయి. స్వచ్ఛమైన నీరు ఎక్కడా దొరకదు. మనం మంచివాళ్ళం అనుకొన్నపుడు గూడ మనలో ఎంత దుష్టత్వం ఉండదు? మనం చెడ్డవాళ్ళు అనుకొనేవాళ్ళల్లో గూడ ఎంత మంచితనం ఉండదు? దేవుడు నరులందరికీ కొంతకాలం పాటు పరివర్తనావకాశం దయచేస్తాడు. పైరులోని ప్రతి మొక్క బాగా ఉండాలని అతని కోరిక.

3. ఈ సామెత పేర్కొనే పొలం మన హృదయం కూడ. దానిలో కలుపూ గోదుమా రెండూ పెరుగుతూంటాయి. దుష్టత్వమూ మంచితనమూ రెండూ వృద్ధిజెందుతూంటాయి. దైవరాజ్యం పిశాచ రాజ్యం రెండూ వ్యాపిస్తుంటాయి. కాని మన తరపున మనం మన హృదయంలోని కలుపును పెరికి వేసుకొంటూండాలి.

4. కలుపును గోదుమ నుండి వేరుచేద్దాం, దుష్టులను మంచివారి నుండి తొలగిద్దాం అనే తహతహ పనికి రాదు. ఈ దుష్టులు కూడ తర్వాత పరివర్తనం చెందవచ్చు కదా! క్రీస్తును అభిషేకించిన మరియ, అగస్టీను మొదలైన భక్తులు మొదట పాపులేకదా! కనుక పాపులను తొలగిస్తే పరివర్తనం చెందేవారిని గూడ పెల్లగించినట్లవుతుంది. ఇంకా, తిరుసభలోని జనమంతా మంచివాళ్ళే ఐతే, మనలాంటి పాపులకు అసలు దానిలో స్థానముంటుందా?

5. పరిసయులు యూద సమాజం నుండి పాపులను తొలగించాలనుకొన్నారు. పవిత్రులకు మాత్రమే దానిలో స్థానముండాలి అనుకొన్నారు. కాని క్రీస్తు ఈలా భావించలేదు. అతడు పాపుల పరివర్తనాన్ని కోరాడు. నేను రోగుల కొరకు వచ్చిన వైద్యుణ్ణి అన్నాడు - మత్త 9,12. పాపులను ఎంతో కరుణతో ఆదరించాడు. కనుక మనం పాపుల పట్ల కటువుగా గాక మృదువుగా ప్రవర్తించాలి. పాపులను సంస్కరించాలి అనే భావం మితిమీరి పోకూడదు. దేవుడే పాపులను సహిస్తున్నాడు కదా! మరి మనం అసహనం చూపితే ఏలా? అతడు యిస్రాయేలు పాపాలనూ, తిరుసభ పాపాలనూ సహించాడు. మన సొంత పాపాలను గూడ సహిస్తున్నాడు. కనుక ఇతరుల తప్పిదాలను చూచి మనం సహనం కోల్పోగూడదు.

6. ఈ సామెతలో ముఖ్యమైంది కలుపుగాదు, గోదుమ. అది పండింది. లోకంలో బలమైందీ, విజయాన్ని సాధించేదీ పిశాచ రాజ్యం గాదు, క్రీస్తు రాజ్యం. క్రీస్తు అల్ఫా, ఓమెగా - ఆది, అంతం. అన్నిటికీ ఆధారం, అన్నిటినీ విజయవంతం చేసేవాడు- దర్శ 22,13. మనం ఈ యాశాభావంతో జీవించాలి.

## 6. లాగుడు వల 13,47-50

1. ఇది కూడ ముందటి సామెత లాంటిదే. క్రీస్తు ఈ సామెతను చెప్పినపుడు అతని భావం ఇది. బెస్తలు లాగుడు వలతో అన్ని రకాల చేపలు పడతారు. ఆ పిమ్మట చెడ్డవాటిని తొలగించి మంచివాటిని ప్రోగుజేసికొంటారు. అలాగే దైవ రాజ్యంలో గూడ మొదట అన్నిరకాల నరులు చేరుతారు. లోకాంతంలో చెడ్డవారిని వేరుపరుస్తారు.

ఇక మత్తయి దీన్ని లిఖించినపుడు అతని భావం ఇది. బెస్తలు తాము పట్టిన చేపల్లో చెడ్డవాటిని తొలగించి మంచివాటిని ప్రోగుజేసికొంటారు. అలాగే లోకాంతంలో సన్మనస్కులు దుష్టులను మంచివారి నుండి వేరుపరచి శిక్షకు గురిచేస్తారు.

2. తిరుసభలో మంచివాళ్ళూ చెడ్డవాళ్ళూ కూడ ఉంటారు. ఎవరు ఏలాంటివాళ్ళో మనకు రూఢిగా తెలియదు. లోకాంతంలో దేవుడు చెడ్డవారిని వేరుపరుస్తాడు. తిరుసభ మాత్రం అందరికీ రక్షణావకాశం కలిగిస్తుంది. ఐనా అందరూ ఆ యవకాశాన్ని వినియోగించుకోరు. మన తరపున మనం చెడ్డవారిని జూచి ఆశ్చర్యపడకూడదు. వారిని విమర్శించకూడదు. ఓర్పుతో దేవుని తీర్పు కొరకు వేచి వుండాలి. పాపుల మనసు మార్చుమని దేవుణ్ణి వేడుకోవాలి. ఇంకా, తిరుసభలో అందరూ మంచివాళ్ళే ఐతే మనకు దానిలో చేరే అవకాశం లభించి వుండకపోవచ్చు.

3. బెస్తలు చెడ్డ చేపలను వేరుజేసి తొలగిస్తారు. వాటి సంఖ్య తక్కువ. అనగా రక్షణం పొందనివాళ్ళు తక్కువ, పొందేవాళ్ళు ఎక్కువ. కనుక మనం ఆశాభావంతో జీవించాలి. కాని మన దుర్బుద్ధి వల్ల మనం ఆ తక్కువమందిలోనే చేరవచ్చు. కనుక భయభక్తులతో మన రక్షణం కొరకు కృషిచేయాలి - ఫిలి 2,12.

4. పెద్ద ఆస్పత్రిలో అన్నిరకాల రోగులు కన్పిస్తారు. అలాగే తిరుసభలో అన్నిరకాల పాపులు ఉంటారు. వారికి వైద్యం జేసి వారి రోగాలు తొలగించే పరమ వైద్యుడు క్రీస్తే - మత్త 9,12. మనం ఆ వైద్యుని సమీపించి మన పాపరోగాన్ని వదిలించుకోవాలి. ఆ జబ్బుని అలాగే వుంచుకోగూడదు.

## 7. రాతి పునాది, ఇసుక పునాది 7,24-27

1. బుద్ధిమంతుడు రాతి పునాది మీద ఇల్లు కట్టాడు. అది వానకూ వరదకూ తట్టుకొని నిల్చింది. మందమతి ఇసుక పునాది మీద ఇల్లు కట్టాడు. అది వానకూ వరదకూ తట్టుకోలేక కూలిపోయింది. ఈలాగే క్రీస్తు బోధల ప్రకారం జీవించే శిష్యుడు జీవితంలో ఎదురయ్యే కష్టాలకు తట్టుకొని నిలుస్తాడు. అతని బోధలు పాటించని వాడు కూలిపోతాడు. ఇక్కడ ఉపమానం రెండు ఇండ్లతో గాదు, ఇద్దరు గృహనిర్మాతలతో.

2. జీవితంలో జ్ఞానం కంటె ఆచరణ ముఖ్యం. కొందరు క్రీస్తు బోధలన్నీ తెలిసినా వాటిని పాటించరు. సోమరితనమో, స్వార్థమో, అహంకారమో అడ్డు తగులుతుంది. ఈలాంటివాళ్ళకు రక్షణ లేదు- మత్త 7,21.

3. మనలను రక్షించేది ప్రధానంగా జ్ఞానం కాదు, ఆచరణం. నరుడు తనకున్న స్వేచ్ఛ వలన మంచినైనా ఎన్నుకోవచ్చు, చెడ్డనైనా ఎన్నుకోవచ్చు. కొందరు పునీతులు గొప్ప జ్ఞానులేమీ కాదు. ఐనా తమకు తెలిసింది ఆచరించి రక్షణం పొందారు. కొందరు జ్ఞానులై కూడ తమ స్వేచ్ఛను దుర్వినియోగం జేసికొని మంచిని విడనాడి నాశమయ్యారు. కనుక క్రీస్తు ఉపదేశాలు పాటించడం ముఖ్యం. పరిసయులకు ధర్మశాస్త్రం తెలుసు. దాని మీద వ్యాఖ్య తెలుసు. ఐనా వాళ్ళు ధర్మశాస్త్రాన్ని ఇతరులకు బోధించారే గాని తాము ఆచరించలేదు - మత్త23,3. అలాగే బైబులూ ధర్మశాస్త్రమూ క్షుణ్ణంగా తెలిసిన గురువులూ మఠకన్యలూ ఆచరణం లేక చేటు దెచ్చుకోవచ్చు. ఏ శాస్త్రమూ తెలియని సామాన్య క్రైస్తవులు ఆచరణం వల్ల రక్షణం పొందవచ్చు.

4. మనం క్రీస్తు బోధల ప్రకారం జీవించాలి. కాని అతని బోధలు కష్టమైనవి. అవి చాల ఉన్నాయి కూడ. కాని వాటి నన్నిటినీ ఒక్క రోజులోనే పాటించం. కొన్ని సార్లు ఆచరణలో విఫలులమై పడిపోతాం గూడ. ఐనా క్రీస్తు వరప్రసాద బలంతో మనకు చేతనైనంతవరకూ రోజూ వాటిని పాటిస్తూనే వుండాలి. ఆధ్యాత్మిక రంగంలో పరుగెత్తనక్కరలేదు. స్థిరంగా నడిస్తే చాలు.

5. క్రీస్తు ఆజ్ఞలను పాటించడంలో కాలయాపనం చేయకూడదు. చాలసార్లు క్రీస్తు వరప్రసాదం నీవు ఈ తప్పును సవరించుకో, ఈ మంచి కార్యం చేయి అని మనలను ప్రేరేపిస్తుంది. కాని మనం ఆ కార్యం రేపు చేయవచ్చులే అనుకొంటాం. కాని రేపటికల్లా ఆ వుత్సాహం నశిస్తుంది. జాప్యం వల్ల ఆధ్యాత్మిక జీవితం దెబ్బతింటుంది. వరప్రసాదం గాలివాటు లాంటిది. ఒకసారి పోతే మళ్ళా రాదు. కనుక అది మనలను ప్రేరేపించగానే పనికి పూనుకోవాలి. లేకపోతే నష్టపోతాం. దైవసేవలో మంచి కోరికలూ ఆలోచనలూ చాలవు. మంచి క్రియలు కావాలి. క్రియారూపం దాల్చని కోరిక తల్లి కడుపులోనే చనిపోయిన పిండం లాంటిది.

6. క్రీస్తు ఉపదేశం ప్రకారం జీవిస్తే బ్రతుకుతాం, లేకపోతే చస్తాం. అతడు తన ఆజ్ఞలను పాటించమని ఖండితంగా చెప్పాడు. దానికిక తిరుగులేదు. సువిశేష బోధలు మనకు నిత్యజీవమిస్తాయి - యోహా 6,68. రోజువారి జీవితంలో ఈ బోధలను పాటించి జీవాన్ని పొందేవాళ్ళెవరో, పాటించక చావును తెచ్చుకొనేవాళ్ళెవరో మనం గమనిస్తూనే ఉంటాం.

7. క్రీస్తు బోధల ప్రకారం జీవించినంత మాత్రాన్నే అన్ని కష్టాలు తొలగిపోవు. ఈ సామెతలో రెండు యిండ్లూ వరదకూ పెనుగాలికీ గురయ్యాయి కదా! ఐనా రాతిపై నిల్చిన యిల్లు పడలేదు. మన పునాదిరాయి క్రీస్తు - యెష 26,4. అతని మీద నిల్చినవాడు కష్టనష్టాలకు తట్టుకొని నిలుస్తాడు. ఎంతటి శ్రమలైనా సరే అతన్ని క్రుంగదీయలేవు. అతని మీద నిలువనివాడు కుప్పకూలిపోతాడు.

## 8. ఇద్దరు కుమారులు 21, 28-32

1. క్రీస్తు ఈ సామెత చెప్పినపుడు అతని భావం ఇది. పెద్ద కుమారుడు మొదట తండ్రి ఆజ్ఞ వినలేదు. తర్వాత విన్నాడు. అలాగే సుంకరులూ, వేశ్యలూ మొదట దేవుని మాట వినలేదు. కాని తర్వాత క్రీస్తు పశ్చాత్తాప బోధ విని దేవునికి విధేయులయ్యారు. చిన్న కుమారుడు మొదట తండ్రి మాట విన్నట్లే కన్పించి తర్వాత మీరాడు. అలాగే యూదనాయకులు మొదట దేవునికి విధేయులైనట్లే నటించి తర్వాత క్రీస్తు పశ్చాత్తాప బోధను నిరాకరించారు. ఇక, మత్తయి ఈ సామెతను లిఖించినపుడు క్రీస్తు పేరుకి బదులుగా స్నాపక యోహాను పేరు చేర్చాడు.

2. చిన్నపిల్లలు మొదట తల్లిదండ్రుల మాట వినరు. తర్వాత అనిష్టంగా వింటారు. పెద్దవాళ్ళమైన మనలో కూడ ఈ మనస్తత్వం వుంటుంది. నియమాలు అనగానే ఎదురు తిరుగుతాం. దేవుని ఆజ్ఞలు కూడ మీరుతాం. మన అహంకారమే దీనికి కారణం. ఆదాము సంతతికి దేవుని ఆజ్ఞలు పాటించటం కష్టంగా వుంటుంది.

3. చిన్న కుమారుడు తండ్రి మాట విన్నట్లే నటించి తర్వాత మీరాడు. ఈ వాలకం మనలో గూడ వుంటుంది. కనుక మనం గుడికి వెళ్తాం. బైబులు చదువుతాం. జపదండ చెప్తాం. కాని మనం చేసే కుంభకోణాలు చేస్తూనే వుంటాం. పెద్దపెద్ద పాపాలకు వొడిగడతాం. కనుక మన కపటాన్ని గుర్తించి పశ్చాత్తాపపడదాం.

4. ఈ కథలోని ఇద్దరు కుమారులు ఒకటి చెప్పి మరొకటి చేసేవాళ్ళు. మొదటి వానిలో అమర్యాద వుంది. రెండవవాడు కపటాత్ముడు. ఇద్దరూ తండ్రికి మనస్తాపం కలిగించారు. కాని దేవుని కుమారుడైన క్రీస్తు తండ్రికి పరిపూర్ణంగా లొంగినవాడు. అతడెప్పుడూ ఔననేవాడేగాని కాదనేవాడు కాదు- 2 కొరి 1,19. మనం గూడ క్రీస్తు లాగే మాటల్లోను చేతల్లోను దేవునికి విధేయులం గావాలి.

5. క్రైస్తవ మతానికి మొదటి నుండి "మార్గం" అని పేరు- అ.చ.9,2. మనం ఆ మార్గంలో నడవాలి. అనగా మనకు ఆచరణం ముఖ్యం. క్రీస్తు ఆజ్ఞలు పాటించేవాడే క్రైస్తవుడు.

6. నాస్తికులు కొన్ని కారణాల వల్ల దేవుణ్ణి నిరాకరిస్తారు. కాని స్వార్థాన్ని వదలుకొని పేదసాదలకు సేవలు చేస్తారు. వీళ్ళు బయటికి భక్తిమంతుల్లా కన్పించే వాళ్ళకంటె దేవునికి ఎక్కువ ప్రీతి కలిగించవచ్చు.

7. సుంకరులు, పాపులు పరిసయుల కంటె ముందుగా దేవుని రాజ్యంలో ప్రవేశిస్తారు. ఎందుకు? వారిలో కపటం లేదు. నిజాయితీతో తాము పాపులమని వొప్పుకొన్నారు. అలాగే ఈనాడు కొందరు మతాధికారుల కంటె ముందుగా పాపులు దైవరాజ్యంలో ప్రవేశిస్తే ఆశ్చర్యపడనక్కర లేదు.

## 9. దొంగ 24, 43-44

1. ఇంటి యజమానుడు దొంగ వస్తాడని తెలిస్తే రాత్రంతా మేల్కొని వుంటాడు. దొంగ ఏ గంటలో వస్తాడో అతనికి తెలియదు కదా! అలాగే క్రైస్తవ భక్తుడు మనుష్య కుమారుని రాకకు ఎప్పుడూ సిద్ధంగా వుండాలి. అతడు వస్తాడని మనకు రూఢిగా తెలుసుగాని, ఎప్పుడు వస్తాడో తెలియదు కదా!

2. ప్రాచీన కాలంలో మహా సముద్రాల్లో ప్రయాణం జేసే వోడల్లో ఒకడెప్పుడూ దూరాన వుండే నేలవైపు చూస్తుండేవాడు. నేల కన్పించగానే నావికులకు తెలియజేసేవాడు. మన జీవిత నావ ఎప్పుడూ పరలోకం వైపు ప్రయాణం చేస్తుంటుంది. ఈ జీవిత యాత్రలో మన మెప్పుడూ ఆశాభావంతో ఆ దివ్యలోకం వైపు చూస్తుండాలి.

3. మనుష్య కుమారుడు దొంగలాగ తలవని తలంపుగా రెండవమారు వేంచేసి వస్తాడు. అతడు న్యాయాధిపతిగా వచ్చి మనకు శిక్షో బహుమానమో విధిస్తాడు. ఈ యంశం మనకు భయాన్ని కలిగించవచ్చు. కాని మనం ఆజ్ఞలు పాటిస్తూ భక్తిగా జీవిస్తే ఆ న్యాయాధిపతి రాకకు దడియనక్కరలేదు.

4. మామూలుగా ప్రభువు లోకాంతంలో దిడీలున వస్తాడు అనుకొంటాం. కాని మన మరణమే మనకు లోకాంతమౌతుంది. ఈ లోకంలో ప్రయాణం, ఇల్లు మారడం, పెండ్లి, ఉద్యోగ విరమణం మొదలైన కార్యాలకు జాగ్రత్తగా సిద్ధమౌతాం. కాని మరణమనే మహాకార్యానికి ముందుగానే సిద్ధమయ్యేవాళ్లు ఎంతమంది?

5. ప్రకృతి బీభత్సాలు, యుద్ధాలు, కరువుకాటకాలు, ప్రమాదాల వల్ల కలిగే చావులు మొదలైనవన్నీ ఈ లోకం అనిత్యమని చాటి చెప్తుంటాయి. మనం లోక వ్యామోహాన్ని విడనాడి మనసు పరలోకం వైపు త్రిప్పుకోవడానికి ఈలాంటి సంఘటనలు ఉపయోగపడతాయి.

## 10. క్షమింపనొల్లని సేవకుడు 18,21- 35

1. రాజు మొదటి సేవకునికి పెద్ద అప్పు మన్నించాడు. కాని అతడు తోడి సేవకునికి చిన్న అప్పు మన్నించినందున రాజు అతన్ని కఠినంగా శిక్షించాడు. మనం తోడి వారి అపరాధాలను మన్నించకపోతే దేవుడు మనలను కూడ ఈలాగే శిక్షిస్తాడు.

2. పగదీర్చుకోవాలనే కోరిక నరుల్లో విపరీతంగా వుంటుంది. అగ్నిశేషం, ఋణశేషం, శత్రుశేషం మిగల్చరాదు అనేది ఈ దేశంలో రాజనీతి. కాని మనం ఈ కోర్కెను అణచుకోవాలి. ఈ కథలోని రాజు దేవుణ్ణే సూచిస్తాడు. అతడు మన అపరాధాలను మన్నిస్తాడు. మనం కూడ తోడివారి తప్పులను మన్నించాలని కోరుకొంటాడు.

3. పూర్వవేదంలో యావే యిస్రాయేలు అపరాధాలు మన్నించాడు. నూత్నవేదంలో క్రీస్తు నరులందరి తప్పులు క్షమించాడు. తండ్రి క్రీస్తు ద్వారా లోకాన్ని తనతో సమాధాన పరచుకొన్నాడు - 2 కొరి 5,19. ఈ తండ్రీ కుమారుల్లాగే మనంకూడ తోడివారి నేరాలు క్షమించాలి.

4. ఈ కథలోని సేవకుడు రాజుకి పది కోట్ల దీనారాలు అప్పు పడ్డాడు. ఇది చాల పెద్ద మొత్తం. మన పాపాల ద్వారా మనం కూడ దేవునికి పెద్ద అపరాధమే చేస్తాం. ప్రభువు మంచితనాన్నీ,దయనూ లెక్కలోకి తీసికొంటే మన అపరాధం ఇంకా పెద్దదౌతుంది. తరచుగా మనం పాపాన్ని తక్కువగా అంచనా వేస్తాం. ఇది పెద్ద పొరపాటు.

5. ఈ సామెత ప్రకారం మనం దేవునికి పదికోట్ల దీనారాలు అప్పు పడ్డాం. తోడివాడు మనకు వంద దీనారాలే అప్పు పడ్డాడు. ఐనా మనం అతన్ని మన్నించం. ఇతరుని క్షమించ బుద్ధి పుట్టదు. మనలోని రాతి గుండెను తొలగించమని దేవునికి ప్రార్థన చేసికోవాలి - యెహె 36,26. ప్రార్థనం మన హృదయాలను మారుస్తుంది. ఇంకా, సిలువ మిద వేలాడుతూ శత్రువులను క్షమించిన క్రీస్తుని కూడ ఆదర్శంగా తీసికోవాలి - లూకా 23,34.

6. ఈ కథలోని 35వ వాక్యాన్ని బట్టి శత్రువుని క్షమించనివాడు దైవ రాజ్యంలో చేరడు. దేవుడు అతన్ని శాశ్వత హింసకు - అనగా నరకానికి గురి చేస్తాడు. శత్రు క్షమాపణం క్రీస్తు ప్రధాన బోధల్లో వొకటి.

## 11. ద్రాక్షతోట కూలీలు 20, 1-16

1. ఈ కథ చెప్పినపుడు క్రీస్తు ఉద్దేశించిన భావం ఇది. ద్రాక్షతోట యజమానుడు చివరి జట్టు కూలీలకు గూడ పూర్తి వేతనం చెల్లించి తన ఔదార్యాన్ని నిరూపించుకొన్నాడు. అలాగే దేవుడు క్రీస్తు బోధల ద్వారా పరివర్తనం చెంది చివరన దైవరాజ్యంలో చేరిన సుంకరులకూ పాపులకూ పూర్తి బహుమానాన్ని దయచేస్తాడు.

ఇక, మత్తయి ఈ సామెతను లిఖించినపుడు ఓ నూత్న భావాన్ని చేర్చాడు. చివరన దైవరాజ్యంలో చేరిన క్రైస్తవులకు కూడ దేవుడు యిస్రాయేలీయులతో పాటు పూర్తి బహుమానాన్ని యిస్తాడు-16.

2. ఈ సామెతలోని యజమానుడు దేవునికి ప్రతిబింబం. మనం మామూలుగా దేవుడు న్యాయం తప్పని న్యాయాధిపతి, పాపులకు నరక శిక్షా, పుణ్యాత్ములకు మోక్ష

బహుమానమూ దయచేస్తాడు అనుకొంటాం. కాని అతడు కరుణ గలవాడు కూడ. అతడు మన తప్పిదాలను మన్నించి మనలను గూడ దైవరాజ్యంలో చేర్చుకొంటాడు. చివరి జట్టువాళ్ళకు కూడ పూర్తి వేతనం చెల్లిస్తాడు.

3. ఈ కథలో మొదటి జట్టు కూలీలు ద్రాక్ష తోటలో 12 గంటలు పనిజేసినందుకు బాధపడ్డారు. మనం కూడ మేము దేవుని సేవలో అంతపని చేయాలి కదా, ఇంతపని చేయాలికదా అని సుమ్మర్లు పడతాం. కాని దేవునికి సేవ చేయడం మహాభాగ్యం. "దొరకు నా యిటువంటి సేవ" అన్నాడు భక్తుడు త్యాగరాజు. దేవుణ్ణి గాఢంగా ప్రేమిస్తే మన శ్రమలోని కష్టాన్ని మరచిపోతాం. అగస్టీను భక్తుడు చెప్పినట్లు "ప్రేమ వున్నచోట శ్రమ అన్పించదు. ఒకవేళ శ్రమ అన్పిస్తే, ఆ శ్రమను గూడ ఇష్టపడతాం."

4. కూలీలు ద్రాక్షతోటలో పనిజేసారు. ఈ పని దేవుని సేవే. మనం ఈ లోకంలో శ్రమ జేసాక కడన మోక్షం లభిస్తుంది అనుకొంటాం. కాని ఇది సరికాదు. మోక్ష జీవితం ఈ లోకంలోనే ప్రారంభమై పరలోకంలో పరిపూర్ణమౌతుంది. ఏకైక దేవుణ్ణి తెలిసికొని ప్రేమించడమే నిత్యజీవం - యోహా 17,3. ఈ లోకంలో విశ్వాసంతో మాత్రమే దర్శించే దేవుణ్ణి పరలోకంలో ప్రత్యక్షంగా దర్శిస్తాం. అంతే తేడా.

5. యజమానుని కరుణ వల్ల చివరి జట్టువాళ్ళకు కూడ కుటుంబ ఖర్చులకు సరిపోయే ఒక దీనారం లభించింది. దేవుడు న్యాయవంతుడు మాత్రమే కాదు. దయాపరుడు కూడ. పాపులందరికీ, మనకు కూడ అతని దయే దిక్కు.

6. మొదటి జట్టువాళ్ళు చివరి జట్టువాళ్ళను చూచి అసూయ చెందారు. అసూయ ఈ లోకంలోనే గాని మోక్షంలో వుండదు. ఇక్కడ పాపులుగా జీవించి పరివర్తనం జెంది మోక్షానికి పోయినవాళ్ళు అక్కడ పుణ్యాత్ములుగా జీవించి వచ్చినవాళ్ళను జూచి అసూయపడరు. ఇక్కడ పుణ్యాత్ములుగా జీవించి మోక్షానికి పోయినవాళ్ళు అక్కడ పాపులుగా జీవించి వచ్చిన వాళ్ళను జూచి అసూయపడరు. అందరూ దేవుని ప్రసాదమే మనల నందరినీ రక్షించిందనుకొని ఆనందిస్తారు.

## 12. భూస్వామి, కౌలుదార్లు 21,33-43

1. యజమానుడు ద్రాక్షతోటను తనకు ఫలాలనీయని కౌలుదార్ల నుండి తొలగించి తగిన ఫలాల నిచ్చే కౌలుదార్లకిచ్చాడు. అలాగే దేవుడు దైవరాజ్యాన్ని తనకు ఫలితాన్నీయని యిస్రాయేలు నుండి తొలగించి మంచి ఫలితాన్నిచ్చే ఇంకో ప్రజలకు అప్పగిస్తాడు. ఆప్రజ క్రైస్తవులే.

2. మంచి ఫలితాన్ని ఈయనందున దైవ రాజ్యం యిస్రాయేలు నుండి తొలగించబడింది. మనం నూత్న యిస్రాయేలుమి. మనం దేవునికి మంచి ఫలితాన్నీయాలి. ఈ ఫలితం మన భక్తిప్రపత్తులు, పుణ్యక్రియలు మొదలైనవి.

3. ప్రభువు యిస్రాయేలును ఓ జాతిగా తీర్చిదిద్దాడు. వారికి కనాను దేశాన్నిచ్చాడు. వారిని ఈజిప్టు దాస్యం నుండి విడిపించాడు. వారి చెంతకు ప్రవక్తలనూ, తన కుమారుని గూడ పంపాడు. ఐనా వాళ్ళు దేవుని మాట వినలేదు. అతడు నూత్న వేదంలో మనలను జ్ఞానస్నానం ద్వారా తన ప్రజలను చేసికొన్నాడు. మనకు వ్యక్తిగతమైన లాభాలు, విజయాలు దయచేసాడు. కాని మనం దేవుని మాట వింటున్నామా? దైవ ప్రేమను సోదర ప్రేమను పాటిస్తున్నామా? నేను అనే ద్రాక్షతోట దేవునికి మంచి ఫలాలనిస్తుందా?

4. ఈ కథలోని కౌలుదార్లు తోటను తమ సొంతం జేసికోవాలనుకొన్నారు. అది వారి స్వార్థం. మనం దేవునికి సేవ చేసినట్లే నటించి మన స్వార్థ లాభాన్ని చూచుకోవడం లేదా? మనకు దైవ సేవలో కూడ మన పేరు, మన లాభం, మన ప్రాముఖ్యం, మన కీర్తి ముఖ్యం కాదా? మనం దేవుని సొమ్మును మన స్వప్రయోజనానికి వాడుకోవడం లేదా?

5. ఈ కథలోని ద్రాక్షతోట దైవరాజ్యం. యూదులు తగిన ఫలాన్ని ఈయకపోతే దేవుడు దాన్ని క్రైస్తవులకు ఇచ్చాడు. ఒకడు దేవుని వరప్రసాదాన్ని నిరాకరిస్తే మరొకడు దాన్ని స్వీకరిస్తాడు. నామట్టుకు నేను దేవుని వరప్రసాదాన్నీ, ఆహ్వానాన్నీ అంగీకరిస్తున్నానా లేక నిరాకరిస్తున్నానా?

6. ఈ కథలోని యజమానుడు వాళ్ళు నా కుమారుని గౌరవిస్తారు అనుకొని పుత్రుణ్ణి పంపాడు. ఈ పుత్రుడు క్రీస్తే. అతడు కడన విజయాన్ని సాధిస్తాడు. తండ్రి అతన్ని సమస్తానికి వారసుని చేసాడు - హెబ్రే 1,2. ఇప్పుడు నేను ఆ క్రీస్తుని నా సర్వస్వంగా భావిస్తున్నానా?

## 13. వివాహ విందు 22,1-14

1. క్రీస్తు ఈ సామెతను చెప్పినపుడు అతని భావం ఇది. ఆహ్వానింపబడిన గొప్ప అతిథులు విందును నిరాకరించారు. వారికి బదులుగా సామాన్యులను విందుకు పిలిచారు. ఈలాగే యూదనాయకులకు బదులుగా సుంకరులు, పాపులు దైవ రాజ్యంలో భాగస్థులౌతారు.

ఇక మత్తయి ఈ సామెతను లిఖించినపుడు అతని భావం ఇది. విందుకు రాని గొప్ప అతిథులకు బదులుగా సామాన్యులు విందులో పాల్గొన్నారు. వీరిలో విందు వస్త్రం లేనివాణ్ణి గెంటివేసారు. అలాగే యూదులు నిరాకరించిన దైవరాజ్యం అన్యజాతి వారికి - అనగా క్రైస్తవులకు దక్కుతుంది. కాని వీరిలో పుణ్యక్రియలు లేనివారిని రాజ్యం నుండి గెంటివేస్తారు.

2. రాజు అతిథులను కుమారుని పెండ్లి విందుకి ఆహ్వానించాడు. ఈ రాజు దేవుణ్ణీ, అతనికుమారుడు మెస్సీయానూ సూచిస్తారు. యూదుల భావాల ప్రకారం దేవుని విందులో పాల్గొనడమంటే ఆ ప్రభువుతో పరిచయం, సఖ్యత పెంపొందించుకోవడం. అనగా దైవానుభూతిని కలిగించుకోవడం. మన తరపున మనం భక్తితో దేవుని చెంతకు రావాలి.

3. గొప్ప అతిథులు దేవుని ఆహ్వానాన్ని నిరాకరించారు. బైబులు వాక్యాలు, ఆంతరంగికమైన ప్రేరణలు, తోడిజనుల భక్తికృత్యాలు, జీవితంలోని మంచిచెడ్డలు మొదలైనవన్నీ నిరంతరం మనలను దేవుని చెంతకు రమ్మని పిలుస్తూనే వుంటాయి. కాని మనం భక్తి లేక ప్రభువు చెంతకు పోము. అతని ఆహ్వానాన్ని తిరస్కరిస్తాం.

4. పిలువబడిన అతిథులు రాకపోయినా ఇతరులు వచ్చి విందుశాలను నింపారు. యూదులకు మారుగా క్రైస్తవులు దైవ రాజ్యాన్ని పొందారు. దేవుని రక్షణ ప్రణాళిక వ్యర్థం గాదు. అతని రక్షణాన్ని నేను గాకపోతే మరొకడు అందుకొంటాడు. కాని అతని రక్షణాన్ని పొందకపోతే నాకే నష్టం.

5. రాజు తన ఆహ్వానాన్ని తిరస్కరించినవారి పట్టణాన్ని తగలబెట్టాడు. ఇది 70లో రోమనులు యెరూషలేమును ధ్వంసం చేయడాన్ని సూచిస్తుంది. దేవుడు తన్ను తిరస్కరించేవాళ్ళను నాశం చేస్తాడు. మనం అతన్ని వెక్కిరించలేం - గల 6,7.

6. రాజసేవకులు మంచివాళ్ళనూ చెడ్డవాళ్ళనూ గడ విందుకు తీసికొని వచ్చారు. తిరుసభలో సజ్జనులకూ దుర్జనులకూ గూడ స్థానం వుంది. అందరూ అదే జ్ఞానస్నానం పొంది తిరుసభలో చేరతారు. ప్రభువు మంచివాళ్ళకూ చెడ్డవాళ్ళకూ గూడ సూర్యరశ్మినీ, వర్షాన్నీ దయచేస్తాడు. అది అతని కరుణ - మత్త 5,45.

7. విందు వస్త్రం లేనివాణ్ణి భోజనశాల నుండి గెంటివేసారు. జ్ఞానస్నానం పొంది తిరుసభలో చేరినంత మాత్రాన్నే రక్షణం లేదు. దేవుని ఆజ్ఞలు పాటించాలి. పాపాన్ని విడనాడి పుణ్యజీవితం గడపాలి. లేకపోతే మోక్ష బహిష్కరణం తప్పదు.

8. ఇప్పుడు మన దివ్యసత్ప్రసాద విందు ఆ మోక్ష విందుకి సూచనంగా వుంటుంది. అది మెస్సీయా విందు. కనుక దానిలో భక్తితో పాల్గొందాం.

## 14. పదిమంది కన్నెలు - మత్త 25-1-13

1. అవివేకవతులైన కన్నెలు నూనెతో సిద్ధంగా లేరు గనుక వివాహోత్సవంలో ప్రవేశించలేక పోయారు. అలాగే క్రీస్తు రెండవ రాకడ కొరకు సిద్ధంగా లేని క్రైస్తవులకు పరలోక విందులో పాల్గొనే భాగ్యం లేదు.

2. వివేకవతులైన కన్నెలకూ అవివేకవతులకూ తేడాయిది. తొలి ఐదుగురు కాగడాలకు నూనె తెచ్చుకొన్నారు. అది వారి కవసరం. వధువునీ వరుణ్ణి కాగడాలతో

వరుని యింటికి తీసికొని పోవడం వాళ్ళ పూచీ. నూనె లేకపోతే వాళ్ళు తమ ముఖ్యకార్యాన్ని నిర్వర్తించలేరు. అవివేకవతులైన కన్నెలు ఈ ముఖ్య వస్తువునే మర్చిపోయారు. అది వాళ్ళలోపం. క్రైస్తవ జీవితంలో ప్రేమ, విశ్వాసం, నిరీక్షణం, ముఖ్యమైనవి. ఇవి లేందే మనకు రక్షణం లేదు.

3. అర్ధరాత్రిలో ఇదిగో పెండ్లికుమారుడు! ఇతనికి స్వాగతం చెప్పడానికి రండి అనే కేక వినిపించింది. ప్రభువు రెండవమారు వేంచేసి రావడం తథ్యం. కాని అతడు ఎప్పుడు వస్తాడో తెలియదు. కనుక మన తరపున మనం ఎప్పుడూ ఓపికతో, భక్తితో వేచివుండవలసిందే.

## 15. ముగ్గురు సేవకులు - మత్త 25, 14-30

1. క్రీస్తు ఈ సామెత చెప్పినపుడు అతని ఉద్దేశం ఇది. యజమానుడు తన సొమ్మని వృద్ధి చేసిన సేవలకును బహూకరించి వృద్ధి చేయని సేవకుని దండించాడు. అలాగే దేవుడు తన వాక్యాన్ని (ధర్మశాస్త్రాన్ని) ఇతరులకు బోధించే యూద నాయకులను బహూకరించి అలా చేయని నాయకులను దండిస్తాడు.

ఇక మత్తయి ఈ సామెతను లిఖించినపుడు అతని భావం ఇది. యజమానుడు తన సొమ్మను వృద్ధి చేసిన వారికి బహూమానము, అలా చేయని వారికి శిక్షా విధించాడు. అలాగే రెండవసారి విజయం చేసే క్రీస్తు తానిచ్చిన ఆధ్యాత్మిక వరాలను వాడుకొని వృద్ధి చేసికొన్నవాళ్ళను బహూకరిస్తాడు. అలా చేయనివాళ్ళను శిక్షిస్తాడు.

2. పూర్వం యూద నాయకులు యూదులకు అన్య జాతులకూ ధర్మశాస్త్రాన్ని శ్రద్ధతో బోధించలేదు. అలాగే ఇప్పుడు తిరుసభ అధికారులు క్రైస్తవులకూ అన్యులకూ సువిశేష సందేశాన్ని విన్పించడంలో అశ్రద్ధ చేస్తున్నారు.

3. యజమానుడు సేవకులను నమ్మి వారికి తమ ధనాన్ని అప్పగించాడు. క్రీస్తు మనలను నమ్మి దైవరాజ్య విస్తరణ పూచీని మనకు అప్పగించాడు. మనం విశ్వసనీయులంగా ఈ కార్యాన్ని నిర్వర్తించాలి.

4. యజమానుడు సేవకులకు స్వేచ్ఛ నిచ్చాడు. వాళ్లు డబ్బును తమ యిష్టం వచ్చినట్లుగా వినియోగించి దాన్ని వృద్ధి చేయాలి. అలాగే దేవసేవలో మనకు స్వేచ్ఛ వుంది. ఎవరి శక్తికీ అభిరుచికీ తగ్గట్టుగా వాళ్ళు పని చేయవచ్చు. అందరూ ఒకే రకమైన పని చేయనక్కరలేదు. ఒక్కొక్కరి శక్తిలో తేడా వుంటుంది కూడ. అందుకే యజమానుడు ఎవరి శక్తికి తగ్గట్టుగా వారికి ధనమిచ్చాడు - 15. ఇక, దేవుడు మనకిచ్చిన ధనం మన శక్తిసామర్థ్యాలే. వీటిని దైవ సేవకు వాడాలి. ఐతే, మన శక్తికి తగ్గట్టుగా మనం పనిచేస్తే చాలు.

5. పూర్వం మహా సేవకులు దేవుణ్ణి ప్రేమించి అతనికి గొప్ప సేవలు చేసారు. అబ్రాహాము, మోషే, యేలీయా, దావీదు, పౌలు, డోమినిక్, ఫ్రాన్సిస్ జేవియర్, మదర్ తెరీసా ఈలాంటివాళ్ళు. ఈ భక్తులు మనకు ఆదర్శం కావాలి.

6. మూడవ సేవకుడు డబ్బును వృద్ధి చేయని సోమరి. పైగా యజమానుణ్ణి తప్పుపట్టాడు. మనం దైవ రాజ్యాన్ని వ్యాప్తి చేయని సోమరులం. పైగా మనలను మనం సమర్థించుకొంటూ దేవునిపై నిందలు మోపుతాం.

7. ఐదు లక్షలు పెంచినవాడికీ, రెండు లక్షలుపెంచినవాడికీ కూడ యజమానుడు అదే బహుమతి యిచ్చాడు. ఇంకొకరితో పోల్చుకోకుండా మన శక్తి కొలది మనం పనిజేస్తే చాలు, దేవుడు మెచ్చుకొంటాడు. దేవుడు మనం ఎంత సాధించామా అని చూడడు. ఎంత ఆసక్తితో, ఎంత ప్రేమభావంతో సేవ చేసామా అనిచూస్తాడు.

## 16. తుది తీర్పు - మత్త 25,31-46

1. కాపరి రాత్రి గొర్రెలనూ, మేకలనూ వేరుపరుస్తాడు. అలాగే క్రీస్తు న్యాయ నిర్ణయ దివాన అక్కరలో వున్నవారిని ఆదుకొన్నారా లేదా అన్నదాన్ని బట్టి నరులను వేరుపరుస్తాడు.

2. ఈ కథ తుదితీర్పును గూర్చి. మనం పాపపుణ్యాలను లెక్కచేయం. న్యాయనిర్ణయ దినాన్ని పట్టించుకోం. విచ్చలవిడిగా తిరుగుతాం. దేవుడు న్యాయవంతుడైతే మన పాపపుణ్యాలకు తీర్పు విధించితీరుతాడు. కనుక దైవభీతితో జీవించాలి.

3. చాలామంది దేవుణ్ణి చూడాలని కోరుకుంటారు. దైవదర్శనం కొరకు దూరప్రాంతాల్లోని పుణ్యక్షేత్రాలకు వెళ్తారు. అతడు మన మధ్యలోనే మారువేషంలో సంచరిస్తుంటాడు. అతడు పేదసాదల్లో, ఆర్తుల్లో దర్శనమిస్తాడు. కనుక వారిని ఆదుకొంటే అతన్ని ఆదుకొన్నట్లే. క్రీస్తు బాధార్తులను ఆదుకొమ్మని చెప్పిన సూక్తులన్నింటిలో ఈ సామెత అతి బలీయమైంది.

4. బైబుల్లో దేవుడు తన్ను గూర్చి తాను పట్టించుకొన్నదాని కంటె నరులను గూర్చి ఎక్కువగా పట్టించుకొంటాడు. విశేషంగా ఆపదల్లో, అక్కరల్లో వున్న నరులంటే అతనికి ప్రీతి. ఈ దీనులను క్రీస్తు ఇక్కడ "నా సోదరులు" అని పేర్కొన్నాడు. కనుక మనం వీరిని తప్పక పట్టించుకోవాలి.

5. ఈ కథలో వచ్చే సహాయాలన్నీ భౌతిక వస్తువులను ఈయడమే. ఆకలిదప్పులు తీర్చడం, ఇల్లు బట్టలు మందులు ఈయడం, పరామర్శించడం మొదలైనవి. ఇండియా లాంటి పేదదేశంలో ఈ సహాయాలు ఎప్పుడూ అవసరమే. పైగా ఇవన్నీ చిన్నచిన్న కార్యాలు. ఎవరైనా చేయవచ్చు. కనుక మనం ఈ పనులు తప్పక చేయాలి.

6. ఈ సామెత మత్తయి గ్రంథంలో క్రీస్తు తుది సందేశం. దీని తర్వాత క్రీస్తు ఇక మాట్లాడడు. అతని శ్రమల ఘట్టం వస్తుంది. క్రీస్తు అంతిమ సందేశాన్ని అతని శిష్యులమైన మనం పాటించకపోతే ఎలా?

# 2. లూకా ఉపమానాలు

## 17. మేల్కొనివుండే సేవకులు - లూకా 12, 35-30

1. రాత్రి ఆలస్యంగా తిరిగివచ్చే యజమానుని కొరకు వేచివుండే సేవకులను ఆ యజమానుడు బహూకరించాడు. అలాగే ప్రభువు రెండవరాకడకు విశ్వాసంతో వేచివుండే శిష్యులను క్రీస్తు బహూకరిస్తాడు.

2. వేచి వుండాలంటే విసుగు పుడుతుంది. కాని మనకిష్టమైనవారి కొరకు వేచివుండటం సంతోషాన్నే కలిగిస్తుంది. క్రైస్తవ జీవితమంతా యజమానుడైన క్రీస్తు కొరకు కాచుకొని వుండడమే. మన ఆశలూ, కోరికలూ అన్నీ తీర్చేది అతడే.

3. గొప్పవాళ్ళ కొరకు వేచివుండేవాళ్ళు అన్ని విధాల తయారై గూడ వుంటారు. మనం ప్రభువు రెండవ రాకడకు వేచివుండే సేవకులం. మన తరఫున మనం ప్రార్థనతో తయారై యుండాలి.

4. యజమానుడు సేవకుల విశ్వాసాన్ని మెచ్చుకొని తినేవారికి భోజనం వడ్డించాడు. అనగా వారిని యజమానులను చేసి తాను సేవకుడయ్యాడు. ఇలా ప్రభువు మన సేవలను బహూకరిస్తాడు. పైగా ఇక్కడ "భోజనం వడ్డించడం" అంటే పరలోక విందులో పాల్గొనేలా చేయడం. మన సేవలకు మోక్ష బహుమానం లభిస్తుందని భావం.

5. క్రీస్తు శిష్యులను సేవకులు అని కాక స్నేహితులు అని పిల్చాడు. యోహా 15.15. దైవసేవ వలన మనకు అపారమైన విలువ వస్తుంది.

## 18. అధికారం గల సేవకుడు - లూకా 12,41-46

1. యజమానుడు ఇంట లేనపుడు తన బాధ్యతలను సక్రమంగా నిర్వహించిన దాసుని యజమానుడు బహూకరిస్తాడు. అలా చేయనివాణ్ణి శిక్షిస్తాడు. అలాగే క్రైస్తవ సమాజంలోని అధికారులు తమ బాధ్యతలను చక్కగా నిర్వహిస్తే క్రీస్తు వారిని బహూకరిస్తాడు. లేకపోతే శిక్ష పడుతుంది.

2. ఈ కథలోని యజమానుడు కొంతకాలం కనుమరుగయ్యాడు. ఉత్థానక్రీస్తు మనతో వుంటాడు. ఐనా మన కంటికి కన్పించడు. అతడు మనకు కనుమరుగైనట్లే గదా! కనుకనే చాలామంది క్రైస్తవులకు అతని పట్ల భక్తివిశ్వాసాలు వుండవు. కాని చూడక విశ్వసించేవాళ్ళు ధన్యులు - యోహా 20,29.

3. ఈ కథలోని యజమానుడు కొంతకాలం పాటు కనుమరుగై ప్రధాన సేవకులకు పూర్తి స్వేచ్ఛనిచ్చాడు. నేడు క్రీస్తు గాని, తిరుసభ గాని మన జీవితంలోని ప్రతి విషయంలోను జోక్యం చేసికోరు. చాల విషయాల్లో మనకు స్వేచ్ఛ వుంటుంది. బైబులు ప్రతివిషయంలోను ఆజ్ఞలు విధించదు. కాని మనం తగిన నిర్ణయాలు చేసికొని, ఉచితరీతిని ప్రవర్తించాలి. దేవుని సేవించడం పరిపాలనం చేయడంతో సమానం. అనగా మనం స్వేచ్ఛగా ప్రవర్తిస్తామని భావం.

4. ఈ సామెత లోని ముఖ్య సేవకుడు ఇతర సేవకుల మీద అధికారి. ఐతే క్రైస్తవ సమాజంలో అధికారిగా వుండడమంటే నిరంకుశంగా పెత్తనం చలాయించడం గాదు. తోడివారికి సేవలు చేయడం - మార్కు 10,42-45. ఈ కథలోని సేవకుడు అలాంటివాడు. అతడు తన లాభం చూచుకోక ఇతరుల మేలెంచాడు. మన పెద్దలు ఈలాగుండాలి.

5. తోడివారి మీద పెత్తనం చలాయించి వారిని బాధించేవారిని క్రీస్తు దండిస్తాడు. అతడు పీడితుల కోపు తీసికొనేవాడు. కనుక అధికారులు పరపీడనానికి గాక పరుల సేవకు పూనుకోవాలి.

## 19. మూసిన ద్వారం - లూకా 13,22-30

1. ఇంటి యజమానుడు తలుపులు మూసివేసి అన్యులను లోనికి రానీయడు. అలాగే క్రీస్తు అంత్యకాలంలో దైవరాజ్యపు తలుపులు మూసివేసి దుష్టులను లోనికి రానీయడు.

2. పూర్వం చాలమంది, రక్షణం పొందేవాళ్లు కొద్ది మందేనేమోనని భయపడేవాళ్ళు. ఇప్పుడు చాలమందికి అసలు నరకభీతే లేదు. కొందరు నరకమే లేదనీ, ఉన్నా అది శాశ్వతం కాదనీ భావిస్తున్నారు. ఇక్కడ క్రీస్తు దుష్టులకు దైవరాజ్య ప్రాప్తి లేదని రూఢిగా చెప్తున్నాడు. కనుక పాపభీతితో జీవిద్దాం.

3. రక్షణం పొందేవాళ్ళు కొద్దిమందేనా అని అడగ్గా క్రీస్తు ఔననలేదు, కాదనలేదు. ఔనంటే మనకు నిరుత్సాహం కలుగుతుంది. కాదంటే ఆధ్యాత్మిక జీవితాన్ని చులకన చేస్తాం. క్రీస్తు శ్రమపడి ఇరుకైన ద్వారం గుండ దైవరాజ్యంలో ప్రవేశించబడి అన్నాడు- 24. ఎంతమంది రక్షణం పొందుతారు అన్నది ముఖ్యం కాదు. రక్షణాన్ని పొందడానికి మనమెంతగా శ్రమపడుతున్నాం అన్నది ముఖ్యం. కావున మన పాపాలకు పశ్చాత్తాపపడి దేవుని చిత్తప్రకారం జీవించాలి.

4. దైవరాజ్య ద్వారం ఇరుకైనది. మనం దాని గుండా ప్రవేశించాలి. అనగా సువిశేష నియమాలు ఖండితంగా పాటించాలి. స్వార్థాన్ని అణచుకోవాలి. శ్రమలు అనుభవించాలి. విచ్చలవిడిగా జీవిస్తే కుదరదు.

5. అన్యజాతులవాళ్ళు దైవరాజ్యంలో ప్రవేశిస్తుంటే యూదులు వెలుపల ఉండిపోవలసి వచ్చింది. ఇప్పుడు కూడ క్రైస్తవేతరులు మోక్షానికి పోతూంటే క్రైస్తవులు వెలుపల ఉండవలసి వస్తుంది. కేవలం మతమే మనలను రక్షించదు. వ్యక్తిగతమైన భక్తి విశ్వాసాలు కూడ కావాలి.

## 20. కాపుపట్టని అంజూరం - లూకా 13,1-9

1. కాపుపట్టని అంజూరానికి ఇంకొకయేడు గడువిచ్చారు. తోటమాలి పరామర్శ వలన కూడ అది కాపు పట్టకపోతే నరికినేస్తారు. అలాగే చాలయేండ్ల నుండి పరివర్తనం చెందని యిస్రాయేలుకి, క్రీస్తు బోధల ద్వారా పశ్చాత్తాపం చెందడానికి కొంతకాలం గడువిచ్చారు. ఇప్పుడు పశ్చాత్తాపపడకపోతే నాశమైపోతారు.

2. అంజూరం సకాలంలో కాపుకి రాలేదు. ఎన్ని యేండ్లయినా యిస్రాయేలు ప్రజల్లో పశ్చాత్తాప ఫలాలు లేవు. చివరి కాలంలో క్రీస్తు బోధలు వినికూడ వాళ్ళు పరివర్తనం చెందడం లేదు. కనుక వారికి వినాశం తప్పదు. నేడు మనకూ అంతే. చివరిదాకా మనసు మార్చుకోనివాళ్ళు చివరన మార్చుకొంటారా? కనుక సత్వరమే పశ్చాత్తాప పడాలి.

3. అంజూరం తప్పేమిటి? సకాలంలో కాపుకి రాలేదు. అది తాను చేయవలసిన పని చేయలేదు. చేయగూడని చెడ్డపని చేస్తేనే గాదు, చేయవలసిన మంచిపని వదలివేసినా పాపమే. క్రీస్తు మంచిని చేస్తూ సంచరించాడు - అ.చ.10,33. అతడు మంచిని చేయడంలో మనకు ఆదర్శం.

4. తోటమాలి అంజూరానికి గడువిప్పించాడు. నేను దాన్ని పరామర్శిస్తానన్నాడు. క్రీస్తే మన తోటమాలి. అతడు శ్రమజేసి మనచే పశ్చాత్తాప ఫలాలు కాయిస్తాడు. అతని సహనానికి హద్దులు లేవు. ఓపికతో మన పరివర్తనం కొరకు వేచివుంటాడు. ఆ ప్రభువుకి లొంగుదాం.

## 21. ముఖ్యాసనాలు - లూకా 14,7-11

1. విందుల్లో అతిథులు ఎన్నుకొన్న ఆసనాలను యజమానుడు మార్చవచ్చు. అలాగే పరలోక విందులో మనం ఎన్నుకొన్న స్థానాలను దేవుడు మార్చుతాడు. అక్కడ గొప్ప స్థానాలు దేవుడిచ్చేవి కాని మనం ఎన్నుకొనేవి కావు. కనుక మనం అతనిపై ఆధారపడాలి.

2. మనకున్నవన్నీ దేవుడిచ్చినవే. అసలు మన పుట్టుక కూడా అతని నుండే. కనుక దేవుని ముందట మనకు వినయం తగుతుంది.

3. క్రీస్తు దేవుని కుమారుడై గూడ తన్ను తాను రిక్తుని జేసికొని సేవక రూపాన్ని దాల్చి నరుడుగా జన్మించాడు - ఫిలి 2,7. ఇతరుల మేలుకొరకు తన్ను తాను తగ్గించుకొన్నాడు. ఈ వినయం మనలోను వుండాలి.

4. ఇతరులను మనకంటె యోగ్యులనగా గణించాలి అన్నాడు పౌలు- ఫిలి 2,3. ఇది వినయం. మామూలుగా మనం అన్యులను మనకంటె హీనులనుగా గణిస్తాం. ఇది పొగరు.

## 22. పొలంలోని యిల్లు, యుద్ధము - లూకా 14,28-33

1. శక్తి వుంటేనే గాని ఒక కార్యానికి పూనుకోగూడదు. అలాగే నిరంతరం తనకున్నవి వదలుకొంటూంటేగాని క్రీస్తుని అనుసరించలేం. ఇది యిక్కడ ఉపమానం.

2. ఇద్దరు యజమానులను సేవించకూడదు. క్రీస్తు శిష్యుడయ్యాక మళ్ళా లోక సుఖాల వెంట పోకూడదు. నిరంతం స్వార్థత్యాగంతో జీవించాలి. పని ప్రారంభించి మధ్యలో వదలివేసినవాణ్ణి లోకం మెచ్చుకోదు. అలాగే కొంతకాలం క్రీస్తుని అనుసరించి మళ్లా లోక వ్యామోహాల్లో పడిపోతే ఎవరు మెచ్చుకొంటారు? నాగటి మీద చేయిపెట్టి మళ్ళా వెనక్కి చూడకూడదు - లూకా 9,62.

3. పిశాచం మన హృదయం లోక వస్తువుల మీదికి పోయేలా చేస్తుంది. ఇక దేవునిమీద ఆసక్తి పోతుంది. కనుక నిరంతరం మన మమకారాలను అణచుకొని మనసును దేవునివైపు త్రిప్పుకొంటూండాలి.

4. లోక వస్తువులు చెడ్డవికాదు, మంచివే. కాని వాటికంటె క్రీస్తు అధికుడు. కనుక లోక వస్తువులు క్రీస్తుని చేరడానికి సాధనాలు కావాలికాని, ఆటంకాలు కాకూడదు.

## 23. అవివేకియైన ధనికుడు -లూకా 12, 13-21.

1. దేవునితో సంబంధం లేకుండ ధనికుడు సుఖజీవనానికి పథకాలు వేసికొంటే అతని ఆకస్మిక మరణం వల్ల అవి భగ్నమయ్యాయి. ఆలాగే మనం దేవునితో సంబంధంలేని పథకాలు వేసికొంటే అవి ఫలించవు. మన సంపదలు మనకు ఆయుస్సు నీయలేవు.

2. ఈ కథలో తమ్ముడు అన్ననుండి ఆస్తిలో తన భాగాన్ని రాబట్టుకోగోరాడు. అదీ తనకనుకూలంగాను, క్రీస్తు మధ్యవర్తిత్వం ద్వారాను. తన స్వార్థం ముఖ్యం. మన ప్రార్థనలో మన చిత్తంకాదు, దేవుని చిత్తం నెరవేరాలని కోరుకోవాలి.

3. క్రీస్తు ఈ కథలోని తమ్మునితో దురాశను అణచుకొమ్మని చెప్పాడు. ఆశకు లొంగితే లోక సంపదలే దేవుడౌతాయి. ఇక దేవుణ్ణి పట్టించుకోం.

4. ఈ కథలోని ధనికుడు తన సంపదలతో హాయిగా జీవిస్తాననుకొన్నాడు. కాని అకాలమృత్యువు వాతపడ్డాడు. సంపదలు ఆయుస్సుని ఈయలేవు. జీవాన్నిచ్చేది దేవుడొక్కడే. కనుక అతని ప్రమేయంలేని పథకాలు చెల్లవు.

5. ఈ ధనికుడు అవివేకి. అనగా దేవుణ్ణి పట్టించుకోనివాడు. అతడు సంపదలతోనే అన్నీ చేకూరుతాయి అనుకొన్నాడు. కాలమూ, భవిష్యత్తూ మన అధీనంలో వుంటాయనుకొన్నాడు. కాని దేవుడు చావుని ఎప్పుడైనా పంపవచ్చు. ధనికుడు అది

గమనించలేదు. మన పథకాలను దేవుడు దీవించాలని వేడుకొందాం. లేకపోతే వాటిని పూర్తిచేయలేం.

6. అందరికీ భద్రత కావాలి. ఉద్యోగ భద్రత, ఆరోగ్య భద్రత, ప్రాణ భద్రత - ఈలా ప్రతి రంగంలోను భద్రత అవసరమే. కాని మృత్యువు మన భద్రతలన్నిటినీ నాశం జేస్తుంది. చావునుండి మనకు భద్రతనిచ్చేవాడు దేవుడొక్కడే. కనుక అతన్ని మన ప్రధాన భద్రతగా ఎంచాలి.

7. దేవునితో సంబంధం లేకుండా ఏ లోక వస్తువునీ వినియోగించకూడదు. అన్ని వస్తువులూ నాశమౌతాయి. అనశ్వరుడు భగవంతుడొక్కడే!

8. ఈ ధనికుడు తలవని తలంపుగా చచ్చాడు. దేవుణ్ణి పట్టించుకోనివాడు ఎప్పుడో, ఎక్కడో అనుకోకుండా కన్నుమూస్తాడు.

9. మనకు అనంతమైన సంపద క్రీస్తే - 2 కొ 8,9. మన అభద్రతలన్నీ తొలగించేది ఆ ప్రభువే. కనుక వివేకి అతనిపై ఆధారపడాలి.

## 24. నడిరేయి వచ్చిన స్నేహితుడు - లూకా 11,5 -13

1. అర్ధరాత్రిలో అతిథి వచ్చినపుడు మిత్రుని దగ్గరికి వెళ్ళి రొట్టెలు బదులీయమని అడిగితే అతడు తప్పక ఇస్తాడని నమ్ముతాం. ఆలాగే మనం పరలోకంలోని తండ్రిని మనవులడిగితే అతడు తప్పకుండ ఇస్తాడని నమ్మాలి.

2. ఈ కథ మనవి ప్రార్థనను గూర్చి. దేవుణ్ణి నమ్మకంతో అడగాలి. వెంటనే ఈయకపోయినా మనం అడిగినట్లే ఈయకపోయినా, అతడు ఈయడం మాత్రం ఖాయం.

3. దేవుడు మనం అడిగినదానికంటే ఎక్కువగానే ఈయాలని కోరుకొంటాడు. మనం తెలియక తక్కువగా అడుగుతాం - ఎఫే 3,20.

4. కొందరు స్తుతిప్రార్థనం గొప్పదనీ, మనవి ప్రార్థనం అల్పమైందనీ భావిస్తారు. కాని మనవి ప్రార్థనం కూడమనవకవసరం. పరలోక జపంలోని చివరి నాల్గు విన్నపాలు మనవులేకదా!

5. ఈ కథలోని గృహస్థు నిజమైన అక్కరతో స్నేహితుని దగ్గరికి వెళ్ళాడు. తన అక్కర తీర్చుమని నిండు హృదయంతో అడిగాడు. మనం దేవుణ్ణికూడ పూర్ణ హృదయంతో అడగాలి. పట్టీపట్టనట్లుగా ప్రార్థన చేయకూడదు.

## 25. ఇద్దరు బాకీదారులు - లూకా 7,36

1. ఎక్కువ అప్పు మన్నింపబడినవాడు యజమానునిపట్ల ఎక్కువ కృతజ్ఞత చూపుతాడు. ఆలాగే ఎక్కువ పాపాలు మన్నింపబడిన వ్యక్తి దేవునిపట్ల ఎక్కువ కృతజ్ఞత చూపుతాడు.

2. సీమోను క్రీస్తుని ఆహ్వానించాడేగాని అతనికి తగిన మర్యాద చూపలేదు. ఇప్పుడు మనం క్రీస్తుని అంగీకరిస్తాం. కాని అతన్ని పూర్ణహృదయంతో పూజించం. అతడు మననుండి త్యాగాలు కోరతాడేమోనని భయపడతాం.

3. ఈ కథలోని స్త్రీ క్రీస్తు దగ్గరికి వచ్చేటప్పటికే పాపపరిహారం పొందింది. కాని సీమోను ఆమెను ఇంకా పాపాత్మురాలినిగానే భావించి చిన్నచూపు చూచాడు. తరచుగా ఇతరులను గూర్చి చెడ్డగా భావిస్తాం. చెడ్డగా మాట్లాడుతాం. కాని ఇది తప్పు - మత్త 7,1.

4. ఈ స్త్రీ పూర్వం పాపాత్మురాలు. కాని ఇప్పుడు ఆ పాపాలను వదలించుకొని క్రీస్తుపట్ల కృతజ్ఞత, భక్తి ప్రేమ చూపింది. ఆమె హృదయభారం తొలగిపోయింది. పాప పరిహారం వలన బరువు తొలగిపోతుంది. ఉత్సాహం, ఆనందం కలుగుతాయి.

5. పరిసయులు క్రీస్తుని "పాపులకు మిత్రుడు" అని నిందించారు -లూకా 7,34. ఇక్కడ ఇస్త్రీకి సీమోను శత్రువు. క్రీస్తు మిత్రుడు. పాపులమైన మనకు క్రీస్తు అనే మిత్రుడు ఉన్నాడనే భావం ఊరటను కలిగించాలి.

6. దేవుడు ఈ స్త్రీ చేసిన అధిక పాపాలు మన్నించగా, ఆమె అధికంగా కృతజ్ఞత చూపింది. అలాగే ప్రభువు మనం చేసిన పాపాలు మన్నించాడు. కాని మనం అతనిపట్ల అధిక కృతజ్ఞత చూపుతున్నామా?

7. సీమోను ఈ స్త్రీ పాపాలు గణించాడు. కాని ఆమె అతని పాపాలు గణించలేదు. ఇతరుల పాపాలను గమనిస్తే మన పరివర్తనం ఆగిపోతుంది. మనమొక్కరమే పాపులమా అనే భావం కలుగుతుంది. పాప పరిహారం ద్వారా దేవుని ప్రేమను చవిజూచినవాళ్ళు ఇతరుల తప్పులను గణించరు. తమ తప్పులకు తాము బాధపడతారు.

## 26. మంచి సమరయుడు - లూకా 10, 29-37.

1. సమరయుడు ఇతరాలోచనలేవి లేకుండ అక్కరలోవున్న వారిపట్ల పొరుగువాడుగా ప్రవర్తించాడు. అలాగ మనంకూడ జాతి, మత, కుల భేదాలు పాటించకుండ అవసరంలో వున్నవారికి సాయంజేయాలి.

2. క్రీస్తు వాక్యాలను బట్టి దేవుణ్ణీ తోడినరుణ్ణీ ప్రేమించేవాడు జీవిస్తాడు - 28. జీవితంలో ముఖ్యమైంది ప్రేమే. దేవుడు ఈ ప్రేమ శాసనాన్ని మన హృదయం మీదనే వ్రాసివుంచాడు. ప్రేమించేవాడు జీవవృక్ష ఫలాన్ని భక్షించినట్లే.

3. కాని ఇతరులను ప్రేమించడం ఎంతమాత్రం సులభంకాదు. మన స్వార్థం అడ్డుదగులుతుంది. కనుక ఆత్మ తన ప్రేమను మన హృదయాల్లో కుమ్మరించి మనచే ప్రేమకార్యాలు చేయిస్తుంది - రోమా 5,5.

4. ధర్మశాస్త్ర బోధకుడు నాకు పొరుగువాడెవడు అని ప్రశ్నించాడు. అనగా నేనెవరిని ప్రేమించాలి అని భావం. రోజువారి జీవితంలో మనకిష్టమైన వాళ్ళను పట్టించుకొని ఇష్టంగాని వాళ్ళను వదలివేస్తాం. ఎన్నిసార్లు ఇతరులడిగినా నేను సహాయం

చేయగలిగిగూడ నిరాకరించలేదు? ఎన్నిసార్లు నేను ఆ లేవీయుడూ యాజకుడూ లాగ ప్రవర్తించలేదు? ఐనా అవసరంలో వున్నవాణ్ణి ఎవనినైనా సరే పట్టించుకోవలసిందేనని క్రీస్తు ఆజ్ఞ.

5. ఈ కథలోని పాత్రలు నల్గురికీ పేర్లు లేవు. కనుక వాళ్ళు ఎవరినైనా సూచించవచ్చు. నన్నుగూడ సూచించవచ్చు. బాటసారికిలాగ నాకు ఇతరుల సాయం అవసరం కావచ్చు. సమరయునిలాగ నేనితరులకు సాయం చేయవలసిన గడియ రావచ్చు. నేను దీనికి సిద్ధంగా వుండాలి.

6. బాటసారి ప్రమాదాన్ని చూచి సమరయుడు తన ప్రయాణాన్నీ కార్యక్రమాన్ని మార్చుకొన్నాడు. జీవితంలో కొన్నిసార్లు ఇతరుల అవసరాలను బట్టి మన ప్రణాళికలూ పనులూ మార్చుకోవలసి వస్తుంది. అలాంటప్పుడు మనం విసుగుకోగూడదు.

7. సమరయుడు తన ప్రేమను మాటల్లోగాక చేతల్లో చూపించాడు. తాను దిగి గాయపడినవాణ్ణి వాహన మెక్కించాడు. అతనిమీద డబ్బు ఖర్చుపెట్టాడు. అసలు మన మంచి సమరయుడు క్రీస్తే. అతడు నెత్తురోడ్చి, ప్రాణాలర్పించి మన పాపాలకు పరిహారం చేసాడు. మన ప్రేమకూడ ఈలాగే క్రియాపూర్వకంగా వుండాలి.

8. సమరయునికి బాధితుని చూడగానే జాతి కలిగింది - 33. అతడు జాతి, కుల, మత భేదాలు పట్టించుకోకుండ సాయంజేసాడు. కాని మనదేశంలో ఈ భేదాలు చాలమంది పాటిస్తారు. వీటిని పట్టించుకోకుండ సాయంజేయడం శిష్యధర్మం.

## 27. తప్పిపోయిన గొర్రె, జారిపోయిన నాణెం - లూకా 5,4 -10

1. తప్పిపోయిన గొర్రె, జారిపోయిన నాణెం దొరికినపుడు కాపరి, గృహిణి సంతోషించారు. ఆలాగే పాపులు పరివర్తనం చెందినపుడు దేవుడు సంతోషిస్తాడు.

2. కాపరి గొర్రెను వెదుక్కొంటూ పోయాడు. బైబులు మతంలో దేవుడు నరులను వెదుక్కొంటూ వస్తాడు. అన్యమతాల్లో నరులు దేవుణ్ణి వెదకుతారు. ఇది పెద్ద భేదం. భగవంతుడు మొదట మనలను ప్రేమించందే మనం అతన్ని ప్రేమించలేం - 1 యోహా 4,19.

3. గొర్రె తప్పిపోయింది. మనం చాలసార్లు దేవునినుండి తప్పిపోతాం. లోక వస్తువుల్లో చిక్కుకొంటాం. ఐనా అతడు మనలను వెదుక్కొంటూ వస్తాడు. మనం అతన్ని పోగొట్టుకొన్నా అతడు మనలను పోగొట్టుకోడు.

4. పోగొట్టుకొన్న వస్తువుమీద మనకు మమకారం పెరుగుతుంది. దేవుడు ఒక్క పాపిని పోగొట్టుకొంటే అతన్ని అమిత విలువతో జూస్తాడు. ప్రేమతో అతని కొరకు గాలిస్తాడు. తల్లి జబ్బుపడిన బిడ్డణ్ణిలాగ అతన్ని పరామర్శిస్తాడు.

5. 99 మంది నీతిమంతుల కంటె ఒక్క పాపి పరివర్తనం చెందినపుడు దేవునికి ఎక్కువ సంతోషం కలుగుతుంది. దేవుడు పుణ్యాత్ములను పట్టించుకోడని కాదు. పాపులపట్ల అధికప్రీతి చూపుతాడని భావం. వైద్యుడు ఆస్పత్రిలోని తీవ్రరోగిపట్ల ఎక్కువ శ్రద్ధ చూపడా?

6. మంచి కాపరి తప్పిపోయిన గొర్రెను తిరిగి మందలోనికి చేర్చుతాడు. మనంకూడ పాపులను దేవుని దగ్గరికి రాబట్టాలి. అపమార్గం పట్టినవారికొరకు ప్రార్థించడం, వారితో స్నేహంగా, మృదువుగా మెలగడం ఇందుకు కొన్ని మార్గాలు.

## 28. తప్పిపోయిన కుమారుడు - లూకా 15,11-32

1. ప్రేమగలతండ్రి చిన్న కుమారుడు ఆస్తిని దుర్వ్యయం చేసి తిరిగి వచ్చినా అతన్ని ఆనందంతో ఆహ్వానించాడు. పెద్దకొడుకుని కూడ తనతోపాటు ఆనందించమన్నాడు. ఆలాగే దేవుడుకూడ పశ్చాత్తాపపడే పాపులను క్రీస్తుద్వారా ఆనందంతో ఆహ్వానిస్తాడు. ఇతరులను గూడ తనతోపాటు ఆనందించమంటాడు.

2. ఈ కథలోని తండ్రి దేవుణ్ణి సూచిస్తాడు. అతడు పశ్చాత్తాపపడే పాపులను కరుణతో, ప్రేమతో అంగీకరిస్తాడు. క్రీస్తుకూడ ఈ తండ్రిలాగే చేస్తాడు. అతడు పాపులకు మిత్రుడు - లూకా 7, 34.

3. చిన్నవాడు తిరిగి వచ్చి తండ్రీ! నీకు ద్రోహంగా పాపంజేసాను అన్నాడు. నిజాయితీతో మన పాపాన్ని ఒప్పుకొంటే దేవుడు మనలను క్షమిస్తాడు. రోగి రోగం తెలియజేస్తే వైద్యుడు నయంజేస్తాడు కదా!

4. ఈ కథలోని తండ్రి కుమారుని స్వేచ్ఛకు అడ్డురాలేదు. ఆస్తిని పంచుకోవడం, దూరదేశానికి వెళ్లడం అక్కడ దాన్ని ఖర్చుచేయడం అన్నీ కుమారుని స్వేచ్ఛ ప్రకారం జరిగాయి. దేవుడు ఇప్పుడు మన స్వేచ్ఛకు అడ్డురాడు. మనం పాపం చేయాలనుకొంటే చేయనిస్తాడు.

5. చిన్నవాడు తండ్రిని విడనాడి దూరదేశాలకు వెళ్ళిపోయాడు. పాపమంటే దేవునికి దూరంగా వెళ్ళిపోవడం. ప్రేమగల తండ్రిని విడనాడి లోక వస్తువుల్లోకి వెళ్ళి పోవడం.

6. చిన్నవాడు నా స్వేచ్ఛను నా యిష్టమొచ్చినట్లుగా వినియోగించుకొంటాను అనుకొన్నాడు. చివరకు పరాయి యజమానునికి బానిస అయ్యాడు. మన స్వేచ్ఛను మన యిష్టమొచ్చినట్లుగా ఉపయోగించుకొంటే చాలసార్లు దాన్ని చెడగొడతాం. కాని దాన్ని దేవునికి అప్పగిస్తే బానిసలంగాము, స్వతంత్రులమౌతాం - రోమా 3,11.

7. చిన్నవాడు తండ్రిపట్లగల ప్రేమచే తిరిగి రాలేదు. ఆకలికి తట్టుకోలేక తిరిగివచ్చాడు. అతనిదంతా స్వార్థం. ఐనా తండ్రి అతన్ని అంగీకరించాడు. అతని ప్రేమ అంత గొప్పది. తరచుగా మనం నరకానికి పోతామేమోనని భయపడి మన పాపాలకు

పశ్చాత్తాపపడతాం. దేవునిపట్ల ప్రేమవలన కాదు. ఇది అసంపూర్ణ పశ్చాత్తాపం. ఐనా మన రక్షణకు ఇది చాలు. దేవునికి మన బలహీనతలు తెలుసు.

8. చిన్నవాడు తండ్రి వద్దకు తిరిగివచ్చాడు. పాపం తండ్రి నుండి వెళ్ళిపోవడమైతే, పశ్చాత్తాపం ఆ తండ్రి చెంతకు తిరిగిరావడం.

9. తండ్రి చిన్నవాడి తప్పును మన్నించినా పెద్ద కుమారుడు తమ్ముని తప్పును మన్నించలేదు. దేవుడు తన ఎండనూ వాననూ మంచివాళ్ళకూ చెడ్డవాళ్ళకూ సమానంగా ఇస్తాడు - మత్త 5,45. దేవునికి శత్రువులుండరు, అందరూ అతని బిడ్డలు. పాపులపట్ల అతని కరుణ అంత గొప్పది. కనుక మనం ఇతరుల తప్పులను అతిగా విమర్శించకూడదు.

## 29. యుక్తిగల గృహనిర్వాహకుడు - లూకా 16,1-13

1. గృహనిర్వాహకుడు ఉద్యోగాన్ని పోగొట్టుకోవలసి వచ్చినపుడు తెలివితోను త్వరగాను కార్యం నడిపి లాభాన్ని పొందాడు. ఆలాగే దేవుని తీర్పు సమీపిస్తున్నపుడు మనంకూడ తెలివితోను శీఘ్రంగాను పనిచేసి ఆధ్యాత్మిక లాభాన్ని పొందాలి.

2. ఈ కథ దుర్మార్గుని గూర్చి. క్రీస్తు దుష్టులను గూర్చికూడ సామెతలు చెప్పాడు. నరుల బలహీనతలు అతనికి బాగా తెలుసు - యోహా 2,25. అతడు పాపులను అసహ్యించుకోడు. వారిని రక్షించడానికి వచ్చాడు.

3. ఈ కథలోని ఉద్యోగి తన ఉద్యోగం ఊడిపోతున్నపుడు త్వరగా కార్యానికి పూనుకొని లబ్ధిని పొందాడు. అతని గొప్పతనం అది. ఆధ్యాత్మిక విషయాల్లో మనం కూడ త్వరగా పనికి పూనుకోవాలి. జాప్యం చేస్తే ఇప్పుడు మనలను ప్రేరేపించిన వరప్రసాదం నిలవకపోవచ్చు.

4. నరులు ఈలోక విషయాల్లో చాల శ్రద్ధ తెలివి చూపిస్తారు. కాని పరలోక విషయాల్లో ఈ శ్రద్ధ చూపించరు. ఇది మనందరి బలహీనతే - 8.

5. ధనానికి హృదయాన్ని అర్పించుకొన్నవాడు దేవుణ్ణి సేవించడు. డబ్బు మంచిదే. కాని అదే మనకు దేవుడు కాకూడదు - 13.

6. దైవరాజ్యంతో పోలిస్తే ధనం అల్పవస్తువే. కాని దాన్ని వాడే తీరులోనే మన శీలం తెలిసిపోతుంది. అల్ప వస్తువైన ధనాన్ని నిజాయితీతో వినియోగించేవాడు ముఖ్యవస్తువైన దైవరాజ్యాన్ని సంపాదిస్తాడు. మనం మోక్షానికి పోతామా లేదా అన్నది మనం వాడుకొనే జపపుస్తకం గాదు, బ్యాంకు పుస్తకం నిర్ణయిస్తుంది- 10,11.

## 30. ధనికుడూ లాజరూ - లూకా 16,19-31.

1. పేద లాజరూ, లేఖనాల బోధలను పట్టించుకోని ధనికుడూ చనిపోయాక వారి స్థితిగతులు తారుమారయ్యాయి. ఈలాగే మనం చనిపోయాక మన పరిస్థితులు

కూడ మారతాయి. ఇంకా, అద్భుతాల కోసం ఎదురుచూస్తూ, పేదలను ఆదుకొమ్మని చెప్పే లేఖనాలను పట్టించుకోకుండ, సుఖభోగాల్లో మునిగితేలేవాళ్ళకు శిక్ష తప్పదు. కాని దేవునిపై ఆధారపడి జీవించేవాళ్ళకు బహుమతి లభిస్తుంది.

2. ఈ కథలోని ప్రధాన పాత్రలు ఆర్గురు ధనిక సోదరులు. వాళ్ళు లేఖనాలు చెప్పినట్లుగా పేదలను పట్టించుకోక సుఖభోగాల్లో మునిగితేలుతూ శిక్షను పొందారు. పేదసాదలను ఆదరించడం మన ధర్మం.

3. పేదసాదలను ఆదుకొమ్మని మోషే, ప్రవక్తలూ ప్రాచీనకాలంలోనే ధనికులను హెచ్చరించారు. కాని 3000 ఏండ్లు కడచినా పరిస్థితులేమీ మారలేదు. ఇప్పుడూ ధనికులు పేదలను పీడించి ఇంకా ధనికులౌతున్నారు. మన తరపున మనం పేదలకు సాయం జేయమని చెప్పే బైబులు బోధలను జాగ్రత్తగా మననం చేసికోవాలి.

4. ధనికుని తప్పు ఏమిటి? అతడు లాజరుకి కీడు చేయలేదుకదా! అక్కరలో వున్నవాణ్ణి ఆదుకోగలిగి కూడ ఆదుకోకపోవడమే అతని తప్పు. చేయగూడనివి చేసినపుడేకాదు, చేయవలసినవి చేయనపుడు కూడ పాపమే. తుదితీర్పు సామెత సందేశం ఇదే కదా!

5. ధనికుడు అద్భుతాన్ని కోరాడు. చనిపోయి ఉత్థానమైనవాణ్ణి తన సోదరుల దగ్గరికి పంపమని అబ్రాహాముని వేడాడు. కాని తర్వాత బెతానియా లాజరు ఉత్థానమైతే యూదులు నమ్మారా? అసలు క్రీస్తు ఉత్థానమైతే అతన్ని నమ్మారా? బైబులు బోధలు నమ్మనివాళ్లు అద్భుతాలు కూడ నమ్మరు. వాటి విలువ తక్కువ. ఐనా నేడు మన జనం అద్భుతాలకు ఎగబడుతున్నారు. అద్భుతాలు చూడ్డంకాదు, మన పాపాలకు చిత్త శుద్ధితో పశ్చాత్తాపపడ్డం ముఖ్యం.

6. ఈ సామెత ధనికులకు ఉపయోగపడుతుంది. కాని పేదలకేలా ఉపయోగ పడుతుంది? దరిద్రులు కొన్ని విషయాల్లో ధనికులే. వాళ్ళకు విద్య, స్నేహితులు, మంచి ఆరోగ్యం ఉండవచ్చు. ఇవిలేక బాధపడేవాళ్ళు లేరా? పేదలకు కూడ ఎవరో "లాజర్లు" తగులుతూనే వుంటారు. వాళ్ళు వారిని పట్టించుకోవాలి.

7. పేదలకు ధనికులు అవసరం. కాని ధనికులకు కూడ పేదలు అవసరం. ఏలాగ? పేదవాడికి ప్రేమతో సహాయం చేసినపుడు సంపన్నుని జీవితం సార్థకమౌతుంది అతనిలోని స్వార్థం నశించి ఆధ్యాత్మిక మానవుడు వికసిస్తాడు. సోదరప్రేమద్వారా అతనికి మోక్షప్రాప్తి కలుగుతుంది. ఈ పద్ధతిలో పేదలు ధనికులను నిజంగా ధనికులను చేస్తారు.

## 31. వితంతువు న్యాయాధిపతి - లూకా 18, 1-8.

1. అధార్మికుడైన న్యాయాధిపతి చాలకాలం వితంతువు మనవిని పట్టించుకోలేదు. కాని ఆమె పదేపదే విన్నవించుకోవడంవలన కడన ఆమె మనవిని విన్నాడు. ఐతే కరుణగల

4. కొన్నిసార్లు జీవితంలో పెద్ద కష్టాలొస్తాయి. అప్పుడు నేనింత మంచివాణ్ణి, ఇతరుల్లాగ పాడుపనులు చేయను, దేవుడు నాకు ఈ కష్టాలు ఎందుకు పంపాడు అనుకొంటాం. ఇంకా కొన్నిసార్లు మనకు అతినమ్మకం కలిగినపుడు మనలను మనమే పొగిడేసుకొంటాం. ఈ సందర్భాల్లో అచ్చంగా ఆ పరిసయునిలాగే ప్రవర్తిస్తున్నాం అనుకోవాలి.

5. పరిసయుడు సుంకరిని ఖండించాడు. నరుల తప్పులను ఖండించినా నరులను తేలికగా ఖండించకూడదు. వాళ్ళు ఏ పరిస్థితుల్లో ఆ తప్పులను చేస్తున్నారో మనకు తెలియదు, దేవునికి తెలుసు.

6. ఈ కథలోని ప్రధానాంశం దేవుని కరుణ. సుంకరి నిజంగా పాపే. కాని అతని పశ్చాత్తాపాన్ని చూచి దేవుడు అతన్ని కరుణతో ఆదరించాడు. దేవుని జాలిగుండె వలన మనం పాపక్షమాపణ పొంది బ్రతికిపోతున్నాం. మంచి పశ్చాత్తాపం అవసరం.

# 3. మార్కు ఉపమానాలు

## 33. తనంతట తానే పండిన పంట - మార్కు 4,26-29

1. భూమి రైతు జోక్యం లేకుండ తనంతట తానే పైరును క్రమేణ పంటకు తెస్తుంది. ఆలాగే దేవుడు తన సొంతశక్తితోనే, తానుకోరుకొన్న కాలంలోనే, నరుని జోక్యం లేకుండానే, దైవరాజ్యాన్ని నెలకొల్పుతాడు.

2. క్రీస్తు నాడు "ఉత్సాహవాదులు" హింసకు పూనుకొని రోముపై తిరుగుబాటుచేసి దైవరాజ్యాన్ని స్థాపించాలి అనుకొంటున్నారు. "దర్శనవాదులు" దైవరాజ్యం ఎప్పుడు, ఎక్కడ నెలకొనేది లెక్కలు వేసి చెప్తున్నారు. పరిసయులు ధర్మశాస్త్రన్ని నిష్ఠతో పాటిస్తే దైవరాజ్యం వస్తుంది అంటున్నారు. క్రీస్తు దృష్టిలో మాత్రం దైవరాజ్యాన్ని స్థాపించడం మనపనికాదు, దేవునిపని. మనం విత్తనం మొలకెత్తి పంట పండిందాకా ఓపికతో వేచివుండవలసిందే.

3. ఆధునిక మానవుడు అంతా తానే చేయాలి, తానే ఫలితాలు సాధించాలి, తానే అన్నిటినీ అదుపులో పెట్టుకోవాలి అనుకొంటాడు. తొందరపడతాడు. విశ్రాంతి లేకుండ పనిచేస్తాడు. కాని ప్రణాళికలు వేసేవాడు, ఫలితాలు సాధించేవాడు దేవుడే అన్న సంగతి మరచిపోతాడు. క్రీస్తు లోకాన్ని రక్షించడానికి వచ్చినా అన్ని కార్యాలు తండ్రికి వదలివేసి తాను నెమ్మదిగా కదిలాడు. చిన్నపిల్లలను ఆహ్వానించడం, ప్రకృతిని పరిశీలించడం, ప్రార్థన చేసికోవడం, వివాహాలకూ విందులకూ హాజరు కావడం మొదలైన

కార్యాలు చేసాడు. ఎప్పుడూ ప్రశాంతంగా నిమ్మళంగా వుండిపోయాడు. మనంగూడ దేవుణ్ణి నమ్మి నిదానంగా పనిజేయాలి. అవసరమైనపుడు విశ్రాంతి తీసికోవాలి. తొందరపాటు పనికిరాదు.

4. ఆధ్యాత్మిక రంగంలోగాని లౌకిక రంగంలోగాని పెరుగుదల నిదానంగా జరుగుతుంది. కనుక పుణ్యార్జనంలో గూడ నిదానం ప్రధానం. కొద్దిరోజుల్లోనే అర్చ్యశిష్టులమై పోం. పడుతూ లేస్తూ వరప్రసాద జీవితంలో నిదానంగా ముందుకు పోతాం. దేవుడు నరుణ్ణి నిదానంగా మారుస్తాడు. అతడు నిదానంగా బండి తోలేవాడు.

5. పెరుగుదలలో గొప్ప శక్తివుంది. ఎవరూ దాన్ని ఆపలేరు. మొక్క పెరుగుదలను ఎవరాపుతారు? అలాగే దైవరాజ్యంగూడ మన హృదయాల్లోను లోకంలోను నిదానంగా పెరుగుతూనే వుంటుంది. విశ్వాస నేత్రాలతో దాని పెంపుని చూస్తాం.

## 34. ద్వారపాలకుడు- మార్కు 13, 34-37

1. యజమానుడు రాత్రి ఎప్పుడు తిరిగివస్తాడో తెలియదు. కనుక ద్వారపాలకుడు మెలకువతో వేచివుండాలి. ఆలాగే క్రీస్తు రెండవసారి ఎప్పుడు తిరిగివస్తాడో తెలియదు. కనుక క్రైస్తవులు మెలకువతో కాచుకొని వుండాలి.

2. ద్వారపాలకుడు నిద్రలో పడిపోయి ప్రమత్తుడు కాకూడదు. ఆలాగే మనం లోక వ్యామోహాల్లో పడిపోయి క్రీస్తు రెండవరాకడను విస్మరించకూడదు. ప్రార్థన. వాక్యపఠనం, సేవ, నిగ్రహం మొదలైన భక్తికృత్యాలతో మెలకువగా వుండాలి.

3. క్రీస్తు లోకాంతంలోనే కాదు, ఇప్పుడుకూడ ఎన్నోసార్లు మన హృదయాల్లోకి వేంచేస్తాడు. మన జీవితంలోని శుభాశుభాలు, ముఖ్యసంఘటనలు, మన మరణంకూడ అతని రాకడలే. కనుక మనం వీటినన్నిటినీ పరిశీలిస్తుండాలి.

4. లోకాంతం ఒక సంఘటనంకాదు. ఒక వ్యక్తిని, అనగా క్రీస్తుని కలసికోవడం. అతడే మనకు ఆదీ అంతమూ - దర్శ 22,13. అతని శత్రువునిలా కాదు, మిత్రునిలా కలసికొంటాం. కనుక తొలినాటి క్రైస్తవుల్లాగ మనంకూడ ప్రేమభావంతో "ప్రభువా! వేంచేసిరా" అంటూ అతనికొరకు వేచివుండాలి - 1 కొరి 16,22.

***

తండ్రిలాంటివాడైన దేవుడు నరులు తనకు ఎడతెగక మొరపెట్టినపుడు వారి వేడికోలు తప్పక వింటాడు.

2. పట్టువీడక ప్రార్థన చేయాలనేది ఈ సామెతలోని ముఖ్యాంశం. ప్రార్థనను ప్రారంభిస్తేనే చాలదు. దాన్ని కొనసాగించుకొనిపోవాలి. చాలసార్లు దాన్ని మధ్యలోనే ఆపివేస్తాం. మన చిత్తచాంచల్యం దీనికి కారణం. ఈలాగైతే దేవుని వరాలు పొందలేం. వితంతువు న్యాయాధిపతివలన విసిగిపోయి అతన్ని అడగడం మానివేస్తే ఏమయ్యేది?

3. ఈ వితంతువు శ్రమ అనుకోకుండ తేపతేపకు న్యాయాధిపతికి మనవి చేసేది. చివరకు అతడు ఆమె కోరిక తీర్చాడు. ప్రార్థనలో మన చిత్తం దేవుని చిత్తంతో ఘర్షణ పడుతుంది. ఈ దృష్టిలో మన ప్రార్థనం పోరాటం. జపంలో మనం శ్రమపడాలి. ఒలీవ తోపులో ప్రార్థన చేసినపుడు క్రీస్తు శ్రమపడ్డాడు - మార్కు 14, 36.

4. ఈ స్త్రీ న్యాయాధిపతికి నేరుగా, సరళంగా మనవి చేసింది. నాకు న్యాయం తీర్చు అని అడిగింది. ఈలాగే మన అవసరాల్లో మనం నేరుగా, సూటిగా దేవుణ్ణి అడగాలి. అదే మనవి ప్రార్థనం. "మీ విన్నపాలను దేవునికి తెలియజేయండి" అన్నాడు పౌలు - ఫిలి 4,6.

5. కొన్నిసార్లు దేవుడు మన ప్రార్థనను వెంటనే వినడు. దీనికి అనేక కారణాలు వుండవచ్చు. మనమడిగింది మనకు హానిచేయవచ్చు. లేదా మనచేత మళ్లామళ్లా అడిగించుకొని మన ఆశను పెంచడానికి కావచ్చు. పైగా, సులువుగా లభించిన దాన్ని విలువతో చూడం. కష్టంతో సాధించిన దానికి విలువనిస్తాం. ఇందుకు కావచ్చు.

## 32. సుంకరి పరిసయుడు - లూకా 18,9-14

1. తన పాపాలకు పశ్చాత్తాపపడే పాపిని దేవుడు క్షమిస్తాడు. నేను పుణ్యాత్మణ్ణి అనుకొని తనమీద తానే ఆధారపడేవాడి తప్పులను మన్నించడు.

2. పరిసయుని గర్వం ఏమిటి? అతడు ఇతరులతో పోల్చుకొని నేను మంచివాణ్ణి ఇతరులు దుర్మార్గులు అనుకొన్నాడు. ఈ యహంభావం పనికిరాదు. సుంకరుని వినయం ఏమిటి? అతడు ఇతరులతో పోల్చుకోలేదు. పవిత్రుడైన దేవునివైపు చూచి నేను పాపిని అనుకొన్నాడు. నన్ను క్షమించు అని వేడుకొన్నాడు. ఇతరులతో నాకెందుకు, నా తప్పు నేనొప్పుకొంటాను అనుకోవడం వినయం.

3. నేను నీతిమంతుణ్ణి అనుకొన్న పరిసయుణ్ణి దేవుడు అవినీతిమంతునిగా గణించాడు. నేను పాపిని అనుకొన్న సుంకరుని నీతిమంతుని జేసాడు. నాకు నేను పుణ్యాత్మణ్ణి అనుకొంటే చాలదు. దేవుడు నన్ను పుణ్యాత్మణ్ణిగా లెక్కించాలి. మన మనో భావాలు (Feelings) మనలను అపమార్గం పట్టించవచ్చు.



**ఫాదర్ పూదోట జోజయ్య, S.J. గారు,** పూదోట మరయ్య, చిన్నమ్మ దంపతులకు 1931వ సం॥ ఫిబ్రవరి 15న, గుంటూరు జిల్లాలోని కనపర్రు గ్రామంలో జన్మించారు. ఈయన ప్రాథమిక విద్యను కనపర్రులో, ఉన్నతవిద్యను ఫిరంగిపురంలో అభ్యసించారు. మద్రాసు లొయోలాలో కళాశాల విద్యను పూర్తిచేసి, ఆంధ్రవిశ్వవిద్యాలయంలో **M.A.** (సాహిత్యం) లో పట్టా పుచ్చుకున్నారు.

1955లో తమిళనాడులోని దిండిగల్ నందు యేసుసభలో చేరిన జోజయ్యగారు, అటుపిమ్మట కొడైకెనాల్‌లో తత్వశాస్త్రాన్ని, కర్సియాంగ్‌లో వేదాంతశాస్త్రాన్ని నిశిత పరిశీలనా దృష్టితో క్షుణ్ణంగా అధ్యయనం గావించారు. 1965, మార్చి 27న బిషప్ ముమ్మడి ఇగ్నేషియస్ గారి చేతుల మీదుగా ఫిరంగిపురంలో గురుపట్టం పొందారు.

రోమునగరంలోని బిబ్లికల్ ఇన్‌స్టిట్యూట్‌లో బైబులు విద్యనభ్యసించిన జోజయ్యగారు ఆ తర్వాత తనదైన విశిష్టశైలిలో బైబులు సాహిత్యానికి ఎనలేని సేవ చేసారు. లొయోలా కళాశాలలో 2 సంవత్సరములు ఉపన్యాసకునిగా విద్యార్థులకు చక్కని శిక్షణను అందించారు. పుస్తకరచన, బైబులుబోధ, విద్యార్థులకు నాయకత్వ శిక్షణ వీరి ముఖ్య కార్యక్రమాలు.

**సాహిత్యరంగంలో వీరు నిర్వహించిన కొన్ని బృహత్తర కార్యక్రమాల వివరాలు :**

1. అనువాదకునిగా : అకుంఠిత దీక్షతో 17 సం॥లు అవిరళకృషిసల్పి క్యాథలిక్ బైబులులోని పూర్వవేదాన్ని జనరంజకంగా తెలుగులోనికి అనువదించారు.
2. ఆధ్యాత్మికవేత్తగా : ఆధ్యాత్మిక చింతనకు పెద్దపీట వేస్తూ ఆయన నడిపే బైబులు భాష్యం పత్రిక, బైబులు గ్రంథమాల ఆయన ఆధ్యాత్మికరంగంలో నిత్యకృషీవలుడని చెప్పకనే చెబుతాయి.
3. విద్యార్థి బాంధవునిగా : విద్యార్థిలోకాన్ని ఉత్తేజపరచడానికి, వారిలో నవచైతన్యం నింపడానికి ఆయన నడిపే చైతన్యవాణి పత్రిక, విద్యార్థిహిత గ్రంథమాల, విద్యార్థిలోకానికే నిర్దేశకాలు.
4. వక్తగా : ఆంధ్రరాష్ట్రమంతటా తిరిగి విద్యార్థులకు,ఉపాధ్యాయులకు, ఉపదేశకులకు సామాన్యప్రజానీకానికి వందలకొలది సదస్సులు నిర్వహించి, వారిలో నవ్యోత్సాహాలను నింపారు.

## 8. శిష్యులది సేవాజీవితం

పిలుపు సేవ కొరకు. ప్రభువు శిష్యులతో "మీరు నన్ను వెంబడించండి. నేను మిమ్ము మనుష్యులను పట్టేవాళ్ళనుగా చేస్తాను" అన్నాడు- మార్కు 1,17. అనగా వాళ్లు ఇంతకుముందు చేపలను పట్టినట్లే ఇకమీదట మనుష్యులను పట్టాలి. ఈలా మనుష్యులను పట్టడమే వాళ్ళసేవ. కాని యిక్కడ మనుష్యులను పట్టడమంటే యేమిటి? క్రీస్తు దైవ రాజ్యాన్ని స్థాపించబోతున్నాడు. శిష్యులువెళ్ళి ఆ రాజ్యంలో చేరడానికి నరులను ప్రోగుజేసికొనిరావాలి. ఏలా? అతని సువార్తను విన్పించడం ద్వారా, అతడు ఆదేశించిన పరిచర్యలను చేయడంద్వారా. ఇదంతా ఓ పెద్ద సేవా కార్యక్రమం. సువిశేషంలోని ముగ్గురు సేవకుల సామెత ఈ సేవాభావాన్నే సూచిస్తుంది - మత్త 25, 14-30. సేవాభావం శిష్యుల ప్రధానలక్షణాల్లో ఒకటి.

## 9. శిష్యులు క్రీస్తుకి సాక్షులు

రబ్బయిల శిష్యులూ గ్రీకు తాత్వికుల శిష్యులూ తమ గురువుల బోధలను జాగ్రత్తగా ప్రచారం చేసారు. వాటిని తమ శిష్యులకు అందించి పోయారు. పౌలు గమలియేలు అనే రబ్బయి శిష్యుడు. క్రైస్తవుడు కాకమునుపు అతడు ఆ గురువు బోధలను జాగ్రత్తగా ప్రచారం చేస్తూండేవాడు - అచ 22,3. ఈలాగే పూర్వం మనదేశంలోగూడ శిష్యులు తమ గురువుల బోధలను కంఠస్థంచేసి ఒక్కమాటగూడ తప్పిపోనీకుండా పునశ్చరణం చేసేవాళ్ళు. ఈవిధంగా ఒక్కోగురువు బోధలు చాలకాలం వరకు ప్రచారమయ్యేవి. అతనికి శిష్యులూ ప్రశిష్యులూ తయారయ్యేవాళ్లు. ఈ శిష్యపరంపరకు ఆ గురువు కులపతి. వాళ్ళ బోధలు అతనివి. వాళ్ళు అతని సంప్రదాయాన్ని అనుసరించేవాళ్ళు. కాని క్రీస్తు శిష్యులు ఈలా చేయలేదు. వాళ్లు ప్రభువు జీవితగాథనీ అతనివ్యక్తిత్వాన్నీ ప్రచారంజేసారుగాని కేవలం అతని బోధలనుగాదు. శిష్యులు క్రీస్తు సంప్రదాయాన్ని మాత్రమే గౌరవించలేదు. అతన్ని దేవునిగా భావించి పూజించారు.

క్రీస్తు గొప్ప బోధకుడు. అతడు పరలోక రాజ్యాన్ని గూర్చీ తండ్రినిగూర్చీ చెప్పాడు. శిష్యులు తమతరపున తాము బోధకు పూనుకొన్నపుడు ఆ బోధకుని బోధలను బోధింపలేదు. మరి ఆ బోధకుణ్ణే బోధించారు. బోధచేసిపోయిన క్రీస్తే శిష్యుల బోధల్లో బోధనాంశం అయ్యాడు.

వాళ్ళు ప్రభువు ఉపదేశాలను చెప్పడంగాదు, ఆ ప్రభువు మరణోత్థానాలకు సాక్ష్యంగా ఉండడం ముఖ్యం అనుకొన్నారు. యూదా స్థానాన్ని పూరించే పండ్రెండవ శిష్యుడు మత్తీయ క్రీస్తు పునరుత్థానానికి సాక్ష్యంగా వుండాలి - అకా 1, 21-22. ఇతర శిష్యులుకూడ భూదిగంతాలవరకూ ఉత్థాన క్రీస్తుకి సాక్షులై వుండాలి- అకా 1,8.

4. మోషే మనం వేసిన ఒట్టు నిలబెట్టుకోవాలి అన్నాడు. కాని క్రీస్తు అసలు ఒట్టు పెట్టుకొనేగూడదు అన్నాడు. శిష్యుడు ఓమారు మాట అంటే దాన్ని పాటించాలి. ఔనంటే ఔను, కాదంటే కాదు అన్నట్లుగా వుండాలి. చిత్తశుద్ధితో జీవించాలి. కనుక అతనికి ఏవొట్టూ అక్కరలేదు - 5, 34-37.

5. ధర్మశాస్త్రం పగతీర్చుకొమ్మంది. మన కన్ను పోగొట్టినవాని కన్నూ మన పన్ను రాలగొట్టినవాని పన్నూ ఎగరగొట్టవచ్చు అంది. కాని ఈ ప్రతీకారచర్యను క్రీస్తు అంగీకరించలేదు. దానికి మారుగా క్షమాగుణం బోధించాడు. కనుక శిష్యుడు కీడుకు కీడు చేసి పగతీర్చుకోగూడదు, ఓర్పుతో పగవాణ్ణి క్షమించాలి - 5, 38-42.

6. ధర్మశాస్త్రం మిత్రుని ప్రేమించి శత్రువుని ద్వేషించమంది. కాని క్రీస్తు ఇది పద్ధతి కాదు అన్నాడు. శత్రువుని గూడ ప్రేమించాలి అన్నాడు. పరలోకంలోని తండ్రి విశ్వమానవ ప్రేమ చూపేవాడు. సజ్జనులకూ దుర్జనులకూ తన వర్షాన్నీ సూర్యరశ్మినీ ప్రసాదించేవాడు. ఆ తండ్రి లాగే శిష్యుడుకూడ మంచివాళ్ళనీ చెడ్డవాళ్ళనీ అందరినీ ప్రేమించడం నేర్చుకోవాలి -5, 43-48.

ఈలా హత్య, వ్యభిచారం, విడాకులు, ఒట్లు, పగతీర్చుకోవడం, సోదరప్రేమ అనే ఆరంశాల్లోను శిష్యుడు పూర్వవేదపు యూదులు పాటించిన నీతికంటె గొప్ప నీతిని పాటించాలి. వాళ్ళకంటె తాను ఎక్కువ చిత్తశుద్ధితో జీవించగలివుండాలి. ఇది క్రీస్తుకోరిన శిష్యధర్మం - మత్త 5,20.

## 4. చిత్తశుద్ధి

యూదులు ఘనంగా యెంచే ధర్మకార్యాలు మూడున్నాయి. అవి దానమూ, ప్రార్థనా, ఉపవాసమూ. కాని యూదులు వీటిని ప్రజల మెప్పుకోసం చేయడం మొదలెట్టారు. పదిమంది కంటబడేలా వీధుల్లో ప్రార్థనాదులు చేయడం వాళ్లకు పరిపాటి ఐపోయింది. కనుక వాళ్ళకు లభించిన ప్రతిఫలం ప్రజల మెప్పేగాని దేవుని మెప్పుకాదు. యూదులు ఈ పుణ్యక్రియలను వట్టి డంబాచారాలనుగా మార్చారు. చిత్తశుద్ధి లేకుండా ప్రవర్తించారు. కాని శిష్యులు ఈలా ప్రవర్తించ గూడదు. ఏ పుణ్యకార్యం జేసినా మనం దేవుని మెప్పుగోరాలి గాని ప్రజల మెప్పు కోరగూడదు. మనం దేవునికి బానిసలంగాదు. అతనికి చాకిరి చేసిపెట్టి కూలిని పుచ్చుకోం. మనం అతనికి పుత్రులం. ఆ తండ్రి మన పుణ్యకార్యాలకు మనలను బహూకరిస్తాడు. కనుక పుణ్యకార్యాలుజేసే శిష్యుడు చిత్తశుద్ధితో ప్రవర్తించి దేవునికి ప్రీతి కలిగించాలి - మత్త 6, 1-18.